సమత: తెలుసమ్మా! నాన్నగారేం అప్పుడు మంత్రాలు చదివేవారు, చివరేం ఎప్పుడూ "ఓం శాంతి శ్శాంతి శ్శాంతి" అనేవారు. ఏంటి నాన్నా శాంతమంటే అని అడిగాను. చెప్పారు. నాకు బాగా తెలుసు.

భూదేవి: చెప్పు. .శాంతమంటే ఏంటి?

సమత: శాంతమంటే . మరి. .శాంతమంటే అందరూ బాగా హాయిగా వుండటం. కదమ్మా?

భూదేవి: (ప్రేమగా దగ్గరి చేర్చుకొని) అంతే తల్లీ!

సమత: మరి యిప్పుడు చెప్పమ్మా యుద్ధమంటే ఏంటి?

భూదేవి: యుద్ధమంటే శాంతిగా లేకపోవడం. అంటే ఏంటి చెప్పు!

సమత: అంటే అందరూ బాగా హాయిగా లేకపోవడం. అంతేగదమ్మా.

భూదేవి: అందరూ కాదమ్మా, కొందరు - కాదు - చాలామంది.

సమత: అయితే యుద్ధంలో కొందరు బాగా హాయిగా వుంటారమ్మా?

భూదేవి: ఆఁ ___

సమత: ఆళ్ళెవరూ?

భూదేవి: అదంతా నీ కెందుకు లేమ్మా. నీ కర్థం కాదులే.

సమత: ఏంటోమ్మా వెధవయుద్ధం!

భూదేవి: యుద్ధం ఎప్పుడూ వెధవదే తల్లీ!

సమత: ఉండమ్మా రాసుకుంటా - యుద్ధం ఎప్పుడూ వెధవదే (రాసుకొంటూంది.)

భూదేవి: రాయకు తల్లీ రాయకు. పెద్దదానివై బాగా చదువుకొంటే నీకే తెలుస్తుంది. ఇంతలో బహుశా నీ కళ్ళెదటే ఇంకో యుద్ధం నువ్వు చూస్తావు!

సమత: యుద్ధం వస్తుందా?

భూదేవి: వస్తుందట తల్లీ! పెద్దవాళ్ళందరూ వస్తుందంటున్నారు. కనీసం పెద్దవాళ్ళందరూ కలసి తప్పిస్తారు.

సమత: పెద్దవాళ్ళంటే ఎవరమ్మా?

భూదేవి: మీ పెద్దన్నయ్యలాంటివాళ్ళు. మీ పెద్దన్నయ్య యీ వూరికి పెద్ద. ఇలాంటి వాళ్ళూ, అంతకు మించినవాళ్ళూ చాలామంది ఉన్నారు. ప్రపంచంలో వాళ్ళందరూ కలిసి యుద్ధాన్ని తప్పక తప్పిస్తారులే....

సమత: బలే.....ఇంకేం....యుద్ధాన్ని చూస్తూ రాసేస్తా. ఫస్టు మార్కులు దంచేస్తా....

భూదేవి: (బాధగా నవ్వి) పిచ్చితల్లీ! (గ్లోబును అప్రయత్నంగా త్రిప్పుతూ) యుద్ధాన్ని గురించి నువ్వు నిజం రాయలేవు. రాస్తే మీ పంతులు మార్కు ఇవ్వడు. యుద్ధాన్ని గురించి ఇంతవరకూ ఎవరూ నిజం రాయలేదు.

సమత: నేను రాసేస్తా. నిజం రాసేస్తాచెప్పమ్మా. మార్కు ఇవ్వకపోతే మాస్టారుతో పోట్లాడుతా —

భూదేవి: వినమ్మా! ప్రపంచం పుట్టిననాటినుండి నేటిదాకా యుద్ధాలు ఎక్కడో ఒక చోట, దేనికో ఒకదానికి, ఎవరో ఒకరు, ఏదో ఒక విధంగా చేస్తూనే వున్నారు; ప్రతి యుద్ధం శాంతి ఒడంబడికలతోనే ముగిసింది. ముగిసిందని అనుకున్నాం. కానీ ఆగలేదు. యుద్ధం ఒక విచిత్రమైన పుండు.

సమత: ఉండమ్మా . .మెల్లగా చెప్పు....యుద్ధం ఒక విచిత్రమైన పుండు. (రాసుకోబోతుంది)

భూదేవి: రాయకమ్మా! విను. ఈ పుండు పైకి మానిపోయినట్లే అగుపించేది. కాని లోలోపలే పురుగులా తొలుచుకొనిపోయి, ఎక్కడో మళ్ళా పైకి లేచేది. ప్రతి యుద్ధం అంతకుపూర్వపు యుద్ధంకన్నా భయంకరంగా, బాధగా, బీభత్సంగా తయారయ్యేది. ఎందరో జయించారు. ఎందరో ఓడారు. ఎందరో చచ్చారు. ఎందరో చచ్చీచావకుండా బైటపడ్డారు. అయినా యుద్ధాలు ఆగలేదు, జరుగుతూనే వున్నాయి.

సమత: ఉండమ్మా రాసుకుంటా. బాగా చెప్తున్నావు.

భూదేవి: రాసుకోకు. ఇదంతా రాస్తే నీకు మార్కులురావు. విను. ఈ భూమిమీద ప్రాణం ఎప్పుడు మెదిలిందో ఎవ్వరూ ఎరగరు. కానీ ఆనాటినుంచి, ప్రాణం మెదిలిన నాటినుంచి, యుద్ధం జరుగుతూందట. తిండికోసం యుద్ధం, వుండటానికి నీడకోసం యుద్ధం, ఆడదాని కోసం యుద్ధం....ఆస్తికోసం - పిల్లల కోసం - ప్రేమకోసం - డబ్బుకోసం - కీర్తికోసం - యుద్ధం! యుద్ధం! వేదాంతులు చెప్తారు. జీవితానికి మృత్యువుకూ ఎప్పుడూ యుద్ధం జరుగుతూందని. చివరికి మృత్యువే గెలుస్తుందట. దాంతో యుద్ధం ఆగిపోతుందట.

సమత: అమ్మా ఏంటమ్మా! ఏదో గొడవగా చెప్తున్నావు?

భూదేవి: లేదు. వినమ్మా! (ఆవేశంతో) పెళ్లాంకోసం ఏమీ జోక్యంలేని కొన్ని వేలమంది అమాయకుల్ని బలిచేసిన రాముడు, ఒక్క ఆడదాని కోసం తన ప్రజల్ని నాశనం జేసిన రావణుడు శూరులు. ఇంటిగొడవలేవో పెంచుకొని, ఏ జోలీ శొంటీ ఎరగని జనాన్ని యుద్ధం పేరిట, ధర్మం పేరిట కురుక్షేత్రంలో

బలిపెట్టిన పాండవులూ. కౌరవులూ మనకు వీరాధివీరులు. కీర్తికోసం రాజ్యాలను జయిస్తూ అందువల్ల ఏ లాభమూ పొందని జనాన్ని లక్షలు లక్షలుగా మారణహోమం చేసిన సీజరు, అలెగ్జాండరు, గజనీ అందరూ మనకు పూజ్యులు. వాళ్ళని. ఆ నరహంతకుల్ని కన్నవాళ్ళందరూ వీర మాతలు. దేశానికి వాళ్ళు దివ్యపురుషులు (ఆవేశం అధికమైంది) రాజభక్తి. దేశభక్తి, దైవభక్తి, ఇవన్నీ మనకుండాల్సిన గొప్ప గుణాలు. ఈ గొప్ప గుణాలతోనే మనం యుద్ధాలు చేసాం. రక్త నదులు పారించాం భూమాతను నెత్తురుతో అభిషేకం చేసాం. (బలహీనంగా నవ్వి) మొదట - మొదట అవినీతికి కొంత నీతిని. అక్రమానికి కొంత క్రమాన్ని, అధర్మానికి కొంత ధర్మాన్ని ఏర్పరచుకొన్నాం. కుళ్ళిన వ్రణానికి సెంటు పూసుకున్నట్లు యుద్ధాలకు కొన్ని నియమాలను నియమించుకున్నాం. పిల్లల్ని. ఆడవాళ్ళని, ముసలీ ముతకనీ చంపకూడదన్నాం. రాత్రిపూట యుద్ధం కూడదన్నాం. ముందుగా చెప్పికానీ పైబడకూడదన్నాం. అంతా పోయింది.. లీగ్ ఆఫ్ నేషన్స్ అన్నాం. భద్రతా సంఘం - యు.ఎన్.ఓ. అన్నాం. అంతర్జాతీయ యుద్ధ సూత్రాలన్నాం. పోయింది ..సివిలియన్స్‌ను చంపకూడదన్నాం. తప్పాం. ఆటంబాంబు వేయకూడదంటున్నాం.... వేసేస్తాం... మనం ఇప్పుడు కేవలం బోనులోపడ్డ ఎలుకలం. మృత్యువు ఏ రూపంలో, ఎప్పుడు వస్తుందో ఎరగం. మనం మనుష్యులం - నాగరికులం. ..మనం ఎందుకు పోతున్నాం...

ఇక మాట్లాడలేక కూలబడింది. గ్లోబ్ తిరుగుతూనే వుంది.

సమత: (ఇంతవరకూ తెల్లముఖంవేసి వింటూంది. రాతిబొమ్మలా నిలబడిపోయింది. మెల్లగా అమ్మ దగ్గరకుపోయి చాలా మెల్లగా) అమ్మా!

భూదేవి: తల్లీ! (కన్నీళ్ళు తుడుచుకొంది.)

సమత: ఎందుకమ్మా ఏడుస్తున్నావు?

భూదేవి: ఏమీలేదు ...ఏమీలేదు. లేదమ్మా ఇం కెప్పుడూ యుద్ధాన్ని గురించి నన్నడక్కు...

సమత: లేదమ్మా.

సిపాయి తాత; పేరు అమరయ్య - వచ్చాడు. సన్నగా పొడుగ్గా వున్నాడు.
కళ్ళకు జోళ్ళు. ఎంతో అనుభవంకల ముఖంలా అగుపిస్తూంది.
గడ్డం కొద్దిగా ఎదిగుంది. వాకిలి దగ్గర ఆగి

అమరయ్య: నమస్కారం అమ్మా!

భూదేవి: అమరయ్యా! కూచో ...వస్తా....(వెంటనే లోపలి కెళ్ళింది.)

అమరయ్య: (కాస్త విస్తుపోయి, ఆమెవంక చూచాడు. ఆమె వెంబడే వెళ్తూన్న సమతనుచూచి) సామ్రాజ్యమ్మా!

సమత: ఏంటి సిపాయితాతా! నన్నా పేరుతో పిలవొద్దు.

అమరయ్య: ఏంమ్మా ఏం?

సమత: అది మా పెద్దన్నయ్య పెట్టిన పేరు. ఏం బాగోలా!

అమరయ్య: మరి ఏమని పిలవమన్నావు?

సమత: మా చిన్నన్నయ్య, అమ్మా పిలిచేటట్టు ''సమూ'' అని పిలు.

అమరయ్య: ''సమూ'' అంటే?

సమత: మా చిన్నన్నయ్య పెట్టాడు, ''సమత'' అని. ఎంతో బాగుంది.

అమరయ్య: ''సమత? సమత!'' (నవ్వి) బాగానే వుంది. అయినా మీ చిన్నన్నయ్యకు ఇట్లాంటిపేర్లే దొరుకుతుంటాయి. మొన్న మావూళ్ళో ఆ చివర ఓ చైనా అమ్మాయి వుంది చూచావ్?

సమత: ఆఁ ఆఁ తెల్లగా - ఇట్టా వుంటుందే.

అమరయ్య: ఆఁ, అ అమ్మాయికి పిల్లపుడితే ''అభ్యుదయం'' అని పెట్టాడు పేరు-వాళ్లు నోరుతిరక్క అల్లాడిపోతున్నారు. (పెద్దగా నవ్వాడు. సముకూడా నవ్వింది) అదిసరేగానీమ్మా - అమ్మేంటి అలా వెళ్ళారు? నన్నుచూచీ చూడకుండా వెళ్లారు? సిపాయిమీద భూదేవమ్మకు కోపం రాలేదుగదా?

సమత: నీమీదేంలేదు తాతా! నావల్లే అమ్మకు...

అమరయ్య: ఏం చేసావేం? ఇంట్లో వున్న దూరానారా డబ్బూ దస్కం అందరికి పంచిపెట్టేశావా?

సమత: అట్లాచేస్తే అమ్మ కెప్పుడూ కోపం రాదు తాతా.

అమరయ్య: మరి!

సమత: మరి—ఈ రోజు మా మాస్టరుగారు యుద్ధాన్ని గురించి కాంపోజిషన్ రాసుకు రమ్మన్నారు.

అమరయ్య: కాంపోజిషన్! అంటే ఏంటమ్మా!

సమత: కాంపోజిషన్ తెలీదు? యుద్ధమంటే ఏమిటి? యుద్ధం ఎప్పుడు? ఏలా పుట్టింది? యుద్ధంవల్ల లాభమా, నష్టమా? యుద్ధం వుండాలా? వుండకూడదా? ఇదంతా రాయాలి!

అమరయ్య: ఆఁహాఁ!

సమత: అమ్మ నడిగాను. ఏంచేంటో చెప్పి ఏడుస్తూ కూచున్నారు.

అమరయ్య: పిచ్చితల్లీ! అమ్మ నడిగావా యుద్ధాన్ని గురించి?

సమత: తెలీక అడిగా తాతా!

అమరయ్య: పోనీలే! నీకు యుద్ధాన్ని గురించి నే చెప్తానమ్మా! ఎన్ని పుస్తకాలు రావాలన్నా రాసుకో!

సమత: నిజంగానా తాతా?

అమరయ్య: అవునమ్మా! అసలు సిపాయితాతని నాకు పేరెందు కొచ్చిందో తెలుసా?

సమత: ఎందుకు?

అమరయ్య: నేను రెండు యుద్ధాలు చూచాను. చూట్టం కాదు యుద్ధాలలో పనిచేశాను. ఎన్నో దేశాలు చూచాను. ఎన్నో ఏంటి! అన్ని దేశాలూ చూచాను. అన్ని దేశాల మనుష్యులూ పుట్టటం-చావటం-నవ్వటం-ఏడవటం-అన్నీ చూచాను. నా కిప్పుడు డెబ్బై ఏళ్లు పైబడింది!

సమత: డెబ్బై ఏళ్ళే!

అమరయ్య: అవునమ్మా-డెబ్బై ఏళ్లు! ఇన్ని ఏళ్ళకి, ఇన్ని దేశాలు తిరిగి రెండు యుద్ధాలలో పనిచేసి, చావకుండా బైటపడి, నేను నేర్చుకున్నది ఒక్కటే విషయం తల్లీ, ఒక్కటే ఒకటి! చెప్పమన్నావా?

సమత: ఏమిటి తాతా అంత గొప్ప విషయం?

అమరయ్య: ఏమిటంటే....మనుష్యులందరూ ఒక్కటే అని అన్నిదేశాల్లో చూచాను. అందరూ మనలాగే నవ్వుతారు, ఏడుస్తారు, మనలాగే తింటారు. అందరికీ సుఖం దుఃఖం ఆకలి అన్నీ ఒకటే. అందరికీ ప్రాణాలంటే తీపివుంది. అందరికీ సుఖంగా బతకాలని వుంది. కూడూ గుడ్డా అందరికీ కావాలి. రంగులు తేడా, మాటలు తేడా, ఆహారాలు, అలవాట్లు తేడా అంతే. అందరూ యీ బ్రతుకును హాయిగా చేసుకోవాలనే ప్రయత్నిస్తున్నారు. ఎట్లా ఆలోచించినా, ఎట్లా చూచినా, చివరికి అందరూ ఒకటే అనిపిస్తుందమ్మా.

సమత: (నవ్వి) ఓ—ఇంతేనా? బుద్ధుడు, ఏసుక్రీస్తు చెప్పారట- మా పుస్తకాల్లో వుంది.

అమరయ్య: పుస్తకాల్లో వుందేమోకానీ ఇదేరకంగా అన్ని దేశాల్లో అందరూ, నాతో పనిచేసిన వాళ్ళందరూ అనుకొంటున్నారు. ఏ పుస్తకాలు చదవకుండానే మాలోమాకే వచ్చేసిందీ తీర్మానం. పెద్దాళ్ళల్లో ఎట్లా వుంటుందో నాకు తెలీదు

కానీ మాబోటి వాళ్ళందరిలో ఇదే ఇది వుంది. నాకు చూడబోతే లోకమంతా ఒకనాటికి ఒకటైపోతుందనిపిస్తుందమ్మా!

సమత: పో తాతా! యుద్ధాన్ని గురించి చెప్పమంటే ఇదా నువ్వు చెప్పేది?

అమరయ్య: చెప్తా. చెప్పటం కాదు యుద్ధమంటే! ఏంటో నీ కళ్ళకు కట్టినట్లు చూపిస్తా. తొందరపడకు. పెద్దాణ్ణికదూ? ఏదో చెప్పబో... ఏదో చెప్తూంటా!

సమత: యుద్ధం చూపిస్తావా?

అమరయ్య: యుద్ధంలో మంచి మంచి కథ లున్నాయి. చెప్తా. ముందు యుద్ధమంటే ఏంటో చిన్న చిట్కాలో చెప్పనా? చూడమ్మా - ఇది నాకాలు - ఇది నాచేయి - ఇది నా కన్ను — (ఒక కన్ను - కాలు - చేయి తీసి బల్లమీద పెడ్తాడు.)

సమత: (దెయ్యాన్ని చూచినట్టు) తాతా! (కళ్ళు మూసుకుంది.)

అమరయ్య: భయపడకమ్మా! ఏమీలేదు. యుద్ధంలో ఇది నూరోవంతు లేదు. ఈలా రోజుకు కొన్ని వందలు. వేలు పోతుంటాయి. ఈ మాత్రానికే భయపడితే ఎట్లా!

సమత: (ఇంతవరకు కళ్లు గట్టిగా మూసుకున్నది. మెల్లగా కళ్లుతెరచి ఆ కాలు, ఆ చేయి, కన్ను ఒకటొకటిగా తీసి చూస్తూంది. ఆమె ముఖంలో భయమూ దుఃఖమూ అధికమవుతున్నాయి. తన కాలు, కన్ను, చేయి చూచుకొంది)

అమరయ్య: (బల్లమీద ఆనుకొని సుమువంక చిరునవ్వుతో చూస్తున్నాడు.)

సమత: (అతిదీనంగా తాతవైపు చూచి) తాతా!

అమరయ్య: ఏంమ్మా!

సమత: ఇంకా చెప్తావా తాతా!

అమరయ్య: వద్దా తల్లీ?

సమత: (ఇటటు తిరిగి) చెప్పు తాతా! ఇంకా చెప్పు.

అమరయ్య: మరి యిట్లా భయపడితే ఎట్లా?

సమత: భయపడనులే తాతా! చెప్పు. యింకా ఎంతసేపు చెప్తావు?

అమరయ్య: గంటన్నర —

సమత: సరే చెప్పు తాతా.

అమరయ్య: ఆలాగే ఉండు తల్లీ! ఇవన్నీ తొడుక్కోనీ....అప్పుడు కానీ నీకు యుద్ధం చూపించలేను (అవన్నీ తొడుక్కొంటున్నాడు. బయట కారు ఆగిన చప్పుడు) పెద్దన్నయ్య వచ్చారేమో!

సమత: వస్తే ఏం?

అమరయ్య: ఏంలేదు తల్లీ!

పెద్దాడు టకటక వచ్చాడు. మంచి ఒడ్డూ పొడుగు — మనిషి చాలా గంభీ రంగా వున్నాడు. కమ్మగా నవ్వుతాడు,

పెద్దాడు: ఏంటోయ్ ఏవో కబుర్లు చెప్తున్నావు మా సామ్రాజ్యానికి?

సమత: అన్నయ్యా? నీ కెన్నిసార్లు చెప్పాను నన్ను సమత అని పిలవాలని.

పెద్దాడు: సమతలేదు వంకాయ్‌లేదు! పూర్కో! వెధవపేరు.

సమత: ఊఁ - అయితే నే మాట్లాడను.

పెద్దాడు: ఊఁ - ఏంటోయ్ కబుర్లు?

అమరయ్య: ఏంలేదు బాబూ అమ్మాయిగారు యుద్ధాన్ని గురించి అడిగితే నాకు తెలిసింది చెప్తున్నా.

పెద్దాడు: యుద్ధాన్ని గురించి యీ కాలంలో ఒకరు చెప్పడ మేమిటి? ఏం సామ్రాజ్యం! నీకు తెలీదూ? ఛీ! ఏం పిల్లవి? పేపరు చదివితేనా! మొన్న ఓ యుద్ధం అయిపోయింది.

అమరయ్య: ఎక్కడైపోయింది బాబూ? ఏదో మూల జరుగుతూనే వుంది.

పెద్దాడు: అప్పుడే ఇప్పుడు కొరియాలో జరుగుతూంది. ఇంకా దేవుడు మేలుచేస్తే రేపు మళ్ళా ఓ ప్రపంచయుద్ధం వస్తుంది.

సమత: ప్రపంచయుద్ధమే?

అమరయ్య: అవునమ్మా! అన్నయ్య చాలారోజుల నుంచి చెప్తూనే వున్నారు.

పెద్దాడు: చెప్పడమేంటోయ్! తప్పదు. ఇంతలో (చిన్నాడు వస్తూ)

చిన్నాడు: తప్పదు కాదోయ్ పెద్దన్నయ్య తప్పక రప్పిస్తాడోయ్ —

పెద్దాడు: నేను రప్పించేదేంటి నీ ముఖం?

చిన్నాడు: మరి తప్పదు అని అంత గట్టిగా చెప్తూంటే ఏమనుకోవాల?

పెద్దాడు: ఆఁ. - లేకుంటే వచ్చేదాన్ని వీడు ఆపేస్తాడు. రామమూర్తి కాండో రైలాపినట్లు........

ఇంతలో స్వాములవారు వస్తూ

స్వాములవారు: అదంతా మాయ! వచ్చేదాన్ని ఎవ్వరూ ఆపలేరు, రానిదాన్ని ఎవ్వరూ రప్పించలేరు! ఆపటానికి, రప్పించడానికి నువ్వెవరు నే నెవరు? కేవలం నిమిత్తమాత్రులం. వచ్చేదెటూ వస్తుంది. రానిదెటూ రాదు!

చిన్నాడు: ఓహోహో! అలాగా! మా అన్నయ్య ఈరోజు కొట్టుతాళం తెరవకపోనీండి. మీకు భిక్ష తానే నడిచొస్తుందేమో చూద్దాం.

స్వాములవారు: అలా అనుకోటమే నాయనా అహం. ..మాయ....

చిన్నాడు: నాకేం మాయలేదు. పుట్టిన వెంటనే తీసేశారు. (వెళ్ళాడు)

స్వాములవారు: (నవ్వి) పసితనం!

పెద్దాడు: పసితనం కాదు. అలా అనుకునే వూరుకున్నాం ఇంతకాలం. కాని వీడు ఏకుమేకై పోతున్నాడు.

స్వాములవారు: కాస్త దుడుకు!

పెద్దాడు: పనూళ్ళో కుర్రకారంతా వీడి వెంబడి పడుతూన్నట్లున్నారు.

చాలా సీరియస్ అయ్యాడు. సిగరెట్ తీసి వెలిగిస్తూ కుర్చీనుంచి ఇటటు పచారు చేస్తున్నాడు. అందరూ సీరియస్‌గానే వున్నారు. భూదేవి వచ్చింది.

భూదేవి: ఏంరా పెద్దాడా! ఇంత పొద్దెక్కేవరకు నిద్రపోతే ఎట్లా?

పెద్దాడు: ఏం? ఏం కొంపమునిగింది?

భూదేవి: కొంపలు మునిగితేనా? అన్ని గదుల తాళంచెవులూ నీ దగ్గరే వుండిపోయాయి. ఆ సామాన్లగది తాళంచెవులైనా నా దగ్గర పడేసిపోకూడదూ?

పెద్దాడు: ఇప్పుడేం కావాలి?

భూదేవి: బియ్యం అయిపోయింది. వంటచేసి దానికంత పెట్టి స్కూలుకు పంపాలా?

పెద్దాడు: ఏం మునిగిపోలా? స్కూలు తాళంచెవులు కూడా నా దగ్గరే వున్నాయి.

చిన్నాడు: (వస్తూ) అవునమ్మా! ఇప్పుడు మనింటికేకాదు - మనూరికే - ఆహార శాఖామంత్రి, విద్యాశాఖామంత్రి, ఆర్థికశాఖామంత్రీ అన్నీ మన పెద్దన్నయ్యే అయిపోయాడు. జనం గడ్డిమేసి పోతున్నారు.

పెద్దాడు: నుయ్ నోరు.

భూదేవి: ఎందుకురా వాడిమీద విరుచుకుపడతావు?

పెద్దాడు: నువ్వెందుకు వాణ్ణి పైవేసుకొస్తావు?

భూదేవి: ఇప్పుడు వాడేమన్నాడని? వున్నవిషయం చెప్పాడు.

పెద్దాడు: వున్నవిషయం కాదు. నన్ను చూస్తే వాడికి కన్నుకుట్టు.

చిన్నాడు: నన్ను చూస్తే నీకు కడుపుమంట.

పెద్దాడు: ఆఁ నీ ఘనతను నీ ఐశ్వర్యాన్ని చూచి నేనే కడుపుమంట పడాలి?

చిన్నాడు: అవేవీ లేకున్నా వూళ్ళో నలుగురిలో మంచిపేరుందని....

పెద్దాడు: ఏంటి నీ పెంచిపేరు? నీ పట్టుబడి? పైసాకు కొరగాని వికారముంటుందా వాళ్ళను నలుగుర్ని వెంటేసుకొని తిరిగితే సరిపోతుందా.

చిన్నాడు: నన్ను తిడితే తిట్టావుగానీ వాళ్ళను తిట్టకు.

పెద్దాడు: (రెచ్చిపోయి) ఏం? ఏంచేస్తార్రోయ్ తిడితే?

చిన్నాడు: (మరీ రెచ్చిపోయి) గూబపగల తన్నారు. (పైకి చూశాడు)

పెద్దాడు: (సర్రుమని పిస్టల్ లాగి గురిపెట్టాడు.)

భూదేవి: ఒరే! చిన్నాడా!

సమత: అన్నయ్యా! (పెద్దాడిచెయ్యి పట్టుకొంది.)

పెద్దాడు: పో! అవతలికి? దరిద్రపుముండ! (సమూను విసిరికొట్టాడు. సమ పడబోయింది. చిన్నాడు కాపాడాడు. పెద్దాడు తల్లి మీదికి పోతూ) నువ్వే వాణ్ణింత దూరం తెచ్చింది.

భూదేవి: (విసురుగానే) నేనేం కాదు. నువ్వే చిన్నప్పటినుంచి వాణ్ణి చూసేంచుకు తింటూంటే వాడిట్లా అయ్యాడు.

పెద్దాడు: చిన్నప్పుడే సన్నిపాతజ్వరం వచ్చింది. పస్తాడనుకున్నా చావలా. దరిద్రుడు చచ్చుంటే పీడా వదిలేది.

భూదేవి: (కోపంగా) పెద్దాడా!

పెద్దాడు: (ఒక్క క్షణకాలం ఆమెవంక అలాగే చూశాడు. వెళ్ళబోతున్నాడు.)

చిన్నాడు: (పెద్దాడి నుద్దేశించి) ఇదిగో ఇంకోసారి చెప్తున్నా. ..

భూదేవి: నువ్వూరుకో!

చిన్నాడు: నువ్వుండమ్మా! నువ్వెన్నిసార్లు కోరుకున్నా, దేవుడికి కొబ్బరికాయలు కొట్టుకున్నా, తిండి లేకుండా మాడ్చినా నేను చావను! చావను! చావను! తెలిసిందా!. ..ఇకవెళ్ళు! (ఒక్కక్షణం ఇద్దరూ అలాగే చూచుకొన్నారు. పెద్దవాడు సర్రున వెళ్ళాడు.)

ఒక్క క్షణకాలం అంతా నిశ్శబ్దం, సమ వెక్కి వెక్కి ఏడవటం మాత్రం అర్ధరాత్రిలో గడియారం మోతలా వినిపిస్తూంది. స్వాములవా రింతవరకు కంగారుపడుతూనే వున్నాడు. ఈ గొడవలు తీరి ఇతరులు తన్ను చూచే సమయం వచ్చేటప్పటికల్లా ప్రశాంతంగా కళ్లు మూసుకొని కూర్చున్నాడు.

చిన్నాడు: సమూ! ఏడవకమ్మా ఏడవకు! పిచ్చిదానా!

భూదేవి: ఏంరా చిన్నాడా? మీ తగవు లెప్పటికీ తీరవా?

చిన్నాడు: మా తగవులు కావమ్మా ఇవి!

భూదేవి: కాక ప్రపంచం తగవులా?

చిన్నాడు: నిజం చెప్పావమ్మా! ఇవి కేవలం నీ చిన్నకొడుక్కీ పెద్దకొడుక్కీ మధ్య తగవులు కావమ్మా! రెండు సిద్ధాంతాల సంఘర్షణ - రెండు వర్గాల పోరాట మమ్మా అది నీ యింట్లోనేకాదు - ఈ వూళ్ళో - పట్నంలో, హిందూదేశ ములో, యూరప్‌లో, ప్రపంచమంతా వుందమ్మా. ప్రపంచం యీనాడు రెండు పాయలుగా చీలిపోతూంది. ఆ రెండు పాయల్లో మేమూ రెండు ముక్కలం అంతేమ్మా!

అపరయ్య: చినబాబు చెప్పేది అక్షరాల నిజం తల్లీ!

భూదేవి: ఏం నిజమో! వీళ్ళిద్దరూ ఉప్పూ నిప్పూ అయిపోతున్నారు.

చిన్నాడు: కాక ఇంకేమవుతామమ్మా! రెండూ రెండు ధ్రువాలు. నా యింట్లోనే దేశం వుంది అంటా డన్నయ్య. దేశంలో మన యిల్లుందంటాను నేను. చెప్పమ్మా సమూ! ఏది నిజం?

సమత: నువ్వు చెప్పిందే నిజం అన్నయ్యా!

చిన్నాడు: (నవ్వాడు)

భూదేవి: ఊఁ - ఈ కొంపలో ఏనాడు శాంతి ఏర్పడుతుంది?

సమత: అమ్మా! ఆకలే!

చిన్నాడు: (ఒక్కక్షణం సార్థకంగా సమువంక చూచి) ఆకలి....ప్రపంచమంతటా ఇదే వ్యాధి....ఆకలి ...ఆకలి. .సమూ! ఇంకాసేపు అమ్మ అన్నం పెట్టకుంటే ఏం చేస్తావు?

సమత: ఏడుస్తా.

చిన్నాడు: అప్పుడూ పెట్టకుంటే.

సమత: అప్పుడూ పెట్టకుంటే....

భూదేవి: ఏంచేస్తుంది గిచ్చుతుంది —— రక్కుతుంది —— కొడుతుంది.

సమత: అప్పుడూ పెట్టకుంటే నేనే వెళ్ళి వంటిల్లు తెరిచి అన్నం తినేస్తా....

చిన్నాడు: వంటిల్లు తాళంవేస్తే!

సమత: తాళం పగలగొట్టేస్తా....

భూదేవి: ఆఁ - ఓసి....తాళం పగలగొట్టేస్తావూ!

సమత: ఆకలి కదమ్మా మరి.

చిన్నాడు: (నవ్వి) ఆకలి అంతేనమ్మా! నను చెప్పిన సమాధానం ప్రపంచానికంతా వర్తిస్తుంది. ఆకలిమంటలో శాంతి ఎక్కడిదమ్మా?

స్వాములవారు: ఒక్కమాట నన్ను మాట్లాడనిస్తారా?

చిన్నాడు: ధారాళంగా.

స్వాములవారు: శాంతి లోపలినుంచి రావలసిన ఒక మహత్తర యోగఫలం!

సమత: ఆకలిమాత్రం లోపలినుంచి కాదూ వచ్చేది?

అమరయ్య: (నవ్వి) వయసులో చిన్నైనా మంచిమాట అడిగావు తల్లీ.. .మీకేం తెలుస్తుంది బాబూ ఆకలిబాధ!

స్వాములవారు: (చిరునవ్వుతో) ఆకలి - అన్నం - బాధ - సుఖం - అన్నీ మనసులో వున్నాయి.

సమత: ఆకలి మనసులో కాదు కడుపులో వుంటుంది.

అమరయ్య: (నవ్వాడు)

చిన్నాడు: అన్నం మా పెద్దన్నయ్య చేతుల్లో వుంటుంది.

అమరయ్య: బాధ మాది - సుఖం వాళ్ళది. ..

స్వాములవారు: తిండికోసం పశువుకూడా తాపత్రయ పడుతుంది. మానవునిలో గొప్పతనం ఏమిటి?

చిన్నాడు: పశువు తన కడుపు నిండిన తర్వాతైనా ఇంకో పశువుని తిననిస్తుంది, మానవుడు అదీ చేయటంలేదు. ఇంకొకడి ఆకలితో తన కడుపు నింపుకుంటున్నాడు.

స్వాములవారు: మానవుడు జానెడు పొట్టకాదు.

చిన్నాడు: మానవుడు రూపాయిబిళ్ళకూడా కాదు.

స్వాములవారు: ఆధ్యాత్మిక దృష్టి క్షీణించిపోవడమే యింత అనర్థానికి కారణం. భౌతికవాదం మానవుణ్ణి దురాశాపూరితుణ్ణి చేస్తుంది.

చిన్నాడు: కాదు. ఆధ్యాత్మికదృష్టి అధికమై యీ అనర్థం తెచ్చింది. కర్మవాదం దోపిడివర్గానికి మంచి శ్రీరామరక్ష అయింది.

స్వాములవారు: అజ్ఞానులు ....

చిన్నాడు: అజ్ఞానుల్ని మోసంచేసి పొట్టబోసుకొంటూన్న దగాకోర్లు మీరు!

స్వాములవారు: సరే........నాకెందుకీ వాగ్వివాదం........వెళ్ళొస్తా........నాకు భిక్ష యిస్తావా తల్లీ?

సమత: ఇంత మాట్లాడి భిక్ష ఇవ్వమంటారేమమ్మా స్వామి?

స్వాములవారు: అందులో పరమార్థం నీకిప్పుడు తెలీదులేమ్మా...

అందరూ నవ్వారు

భూదేవి: లోపలికి దయచేయండి.

స్వామి ముందు వెళ్తున్నాడు. అతని వెంబడే భూదేవి వెళ్తూ

భూదేవి: రామ్మా! సమూ! అన్నం పెడతా!

సమత: (అమ్మ వెంబడే వెళ్తూ తిరిగి) తాతా! భోజనాని కొస్తావా?

అమరయ్య: నాకైందిలేమ్మా - వెళ్ళిరా!

సమత: అంటే వుండు. ఇప్పుడే వస్తా...(వెళ్ళింది)

చిన్నాడు: అమరయ్యా!

అమరయ్య: బాబూ!

చిన్నాడు: అమ్మతో చెప్పావా విషయం?

అమరయ్య: లేదు బాబూ! చెబుతామనుకుంటుండగా పెద్దబాబు వచ్చేశారు.

చిన్నాడు: మనవాళ్ళందర్నీ రమ్మన్నావా?

అమరయ్య: ఏర్పాటు చేశా బాబూ! ఇంకో పదినిముషాల్లో వచ్చేస్తారు.

చిన్నాడు: ఇదిగో మనం గొడవేం చేయొద్దు న్యాయంగా అడిగిచూద్దాం కాదంటే ఊళ్ళో నలుగురు పెద్దమనుషుల ఎదటా పెడదాం.

అమరయ్య: పెద్దమనుషులెవరు బాబూ! అందరూ పెద్దబాబుగారి మద్దద్దార్లేగా. పంచాయితీలోనూ ఆయన మోచేతినీళ్ళు తాగేవారే. పెద్దమనుషులే గన కుంటే పెదబాబు ఆటలీలాసాగుతాయా. ఏనాడో ఈ వూరు బాగుపడేది. మొన్న రహస్యంగా కొన్ని పుట్లు ధాన్యం కాల్చేయించారట - విన్నారా బాబూ!

చిన్నాడు: (నవ్వాడు)

అమరయ్య: ఉత్తదేనా?

చిన్నాడు: అమెరికాలో కొన్ని వేలపుట్లు గోధుమలు కాల్చేశారు.

అమరయ్య: అడిగితే — "నా పంటనిచ్చి ప్రపంచాన్ని మేపాల్సిన అవసరం నాకేంలేదు" అన్నాట్ట పెదబాబు.

చిన్నాడు: జనం తిండితిన్నా చస్తారు; తినకున్నా చస్తారు. తినకుండానే చావనీ అని.

శాస్త్రి వచ్చాడు. 50-60 ప్రాంతం వయసు. బక్కపల్చగా ఉన్నాడు. ప్యాంటు, షర్ట్‌తో ఉంటాడెప్పుడూ. అరుదుగా ఒక ఓవరాల్‌లాంటి లాంగ్‌కోటు తొడుగు

ఉంటాడు. కళ్ళు లోతుకుపోయి, చాలా తీక్షణంగా ఉన్నాయి. విశాలమైన నుదురు. బాగా ముడుతలు పడిఉంది. కాళ్ళకు సాదా స్లిప్పర్లు - చాలా పాతవి - తొడిగున్నాడు. కుడికాలు బొటనవేలు మొదలు పాదం కొంత భాగంపై వరకు కట్టుకట్టి ఉన్నాడు. కొద్దిగా కుంటుతూ నడుస్తున్నాడు. కుంటుతున్నా, నడకలో వేగం, ఆవేశం, అత్యుత్సాహం కనుపిస్తాయి. తల ఎప్పుడూ ఎదిగి చిందర వందరగా ఉంటుంది. మనిషితో పరిచయం లేనివాళ్ళకు అతని మాట కాస్త కటువుగా, ప్రవర్తన వింతగా, చూపు క్రూరంగా ఉంటుంది. లోపలికి వచ్చిన వాడు ఎదటే ఉన్న చిన్నవాడిని అమరయ్యను గమనించకుండానే సీదా మేడ మెట్లవైపు వెళ్తున్నాడు.

చిన్నాడు: నమస్కారం శాస్త్రిగారూ!

శాస్త్రి: (తలెత్తి చూచాడు. కాని, ఎక్కడో పరధ్యానంలో ఉన్నందువల్ల వెంటనే ఎదుటున్న మనిషిని గుర్తించలేకున్నాడు. ఒక్కక్షణం అలాగే చూస్తున్నాడు. తరువాత ఏమీ పట్టించుకోనట్లు) నమస్తే! (అంటూ మేడమెట్లు ఒకటి రెండు ఎక్కి ఆగి) మిస్టర్....(పేరు గుర్తుకు రానట్లుంది.)

చిన్నాడు: విశ్వమండి నా పేరు.

శాస్త్రి: ఆఁ ఆఁ....మిస్టర్ విశ్వం - మీ బ్రదరున్నారా!

చిన్నాడు: వున్నారండి.

శాస్త్రి: పైనేనా?

చిన్నాడు: పైనే (నెత్తిమీద అన్నట్లు చెప్పాడు.)

శాస్త్రి: వెళ్ళొచ్చా!

చిన్నాడు: అందరూ పైకెళ్ళే అవకాశం లేదండి ఇప్పట్లో.

శాస్త్రి: (అర్థం ఏదో స్ఫురించినట్లు నవ్వాడు.)

చిన్నాడు: కూచోండి వస్తారు.

శాస్త్రి: కాస్త ఇన్ఫారమ్ చేయి (అంటూ బల్లదగ్గర కొచ్చాడు)

సుబ్బయ్య బంట్రోతు గట్టి శరీరం భారీ మనిషి ఇంట్లోనుంచి మేడమీదికి వెళ్తున్నాడు ఏదో పనిగా.

చిన్నాడు: సుబ్బయ్యా! అయ్యగారితో శాస్త్రి వచ్చాడని మనవిచేయి.

సుబ్బయ్య: అట్టాగేయ్యా - (వెళ్లాడు)

చిన్నాడు: అమరయ్యా! శాస్త్రిగారి నెరగవూ నువ్వు?

అమరయ్య: ఆయ న్నెనెరుగుదును గానీ, నన్నే ఆయ నెరగరయ్యా.

చిన్నాడు: (శాస్త్రిగారి పక్కన కుర్చీలో కూచుంటూ) అలాగా. .శాస్త్రిగారూ - ఇతను అమరయ్యని పాత పందికొక్కు సిపాయి. రెండు యుద్ధాల్లో పని చేశాడు. చాలా అనుభవం కలవాడు.

శాస్త్రి: (వింటున్నట్టున్నాడు.)

చిన్నాడు: అన్ని దేశాలు చూచాడు. మూడవ ప్రపంచయుద్ధంవస్తే రావాలంటే తానొక్కడే ఒక్క చేయిమీద నడపగలడు ..

అమరయ్య: అంతేకదండి. ఉన్నదొక్క చెయ్యేగా....

చిన్నాడు: (నవ్వాడు)

శాస్త్రి: సిపాయివా . .రెండు యుద్ధాల్లో పనిచేశావా ...

అమరయ్య: చిత్తమండి.

శాస్త్రి: గడచిన యుద్ధంగురించి నీ అభిప్రాయ మేమిటి?

అమరయ్య: ఏ యుద్ధాన్ని గురించైనా నా అభిప్రాయం ఒక్కటేనండి. . .

శాస్త్రి: (ఏమిటన్నట్లు చూచాడు.)

అమరయ్య: (ఏదో చెప్పబోయాడు.) యుద్ధం.... ...

చిన్నాడు: (అడ్డుపడి)ఆఁ.........అతని అభిప్రాయాలతో మనకేమిటి శాస్త్రిగారూ.... మీరు చెప్పండి.........యింకో యుద్ధం వస్తుందంటారా.......

శాస్త్రి: వచ్చేదేమిటి? ఎక్కడనుంచి రావాలేం యుద్ధం - ప్రతిదేశం బహిరంగంగానో, రహస్యంగానో యుద్ధానికే తయారవుతూంది. కాకుంటే ఏదో ఒక కారణం దొరకాలి బైటపడి అది మూడవ ప్రపంచ యుద్ధంగా మారటానికి. అంతే....

చిన్నాడు: మా అన్నయ్య ఏదో పెద్ద ఫ్యాక్టరీ కట్టాలనుకొంటున్నాడట. ఏం ఫ్యాక్టరీ అండీ అది.......

శాస్త్రి: పోర్సిలిన్ .......

చిన్నాడు: మీరేదో కొత్త పరిశోధనలు చేస్తున్నారట....

శాస్త్రి: యస్....బ్రహ్మాండమైన పరిశోధన చేశాను. ఇన్నాళ్ళూ మీదాపున్నే అంతటి విలువైన వస్తువుంచుకొని మీరు తెల్సుకోలేక పోయారు.

చిన్నాడు: ఆఁ....మేమేం సైంటిస్టులమా పాడా....

శాస్త్రి: అదెలా జరిగిందంటే....ఒకరోజు మన ఏటివడ్డున్నే నడిచిపోతున్నాను. .. పరధ్యానంగా వున్నాను....

చిన్నాడు: ఎప్పుడూ వుండేదేగా ..

శాస్త్రి: అలా నడుస్తూంటే ఒక రాయికి కాలు బలంగా కొట్టుకుంది....ఏదోలే అనుకొని వెళ్లాను....ఇంటికి వెళ్ళిన కాస్సేపటికంతా ...గాయం తగిలినచోట....(వున్నట్టుండి ఆగాడు తప్పుచేసినట్లు గుర్తించాడు. కాస్త కంగారుపడి తెప్పరిల్లి) కాదు... కాదు. ..ఏదో చెప్పబోయి ఏదో చెప్తున్నా....కాలికి దెబ్బతగిలింది. ..ఎందుకో ఆ రాయిని పరధ్యానంగా చేతికి తీసుకొని ఇంటికొచ్చాను. రాయి చాలా అందంగా వుంది. టేబిల్‌మీద పేపర్ వెయిట్‌లా పెట్టాను....ఒకరోజు. .

చిన్నాడు: ఏలాగైతే ఏం అందులోంచి పింగాణి తయారుచేయొచ్చని కనిపెట్టారు అంతేగా....

శాస్త్రి: అవును....అవును. .కానీ, ఆ కనిపెట్టడమే చాలా విచిత్రం....ఏలా జరిగిందంటే....ఒక ఫోటో తగిలించటానికి మేకు దించాల్సి వచ్చింది. ఆ రాయి తీసుకొని మేకు దింపుతున్నాను.. .

సుబ్బయ్య వచ్చాడు. శాస్త్రి మాటలు ఆపాడు.

సుబ్బయ్య: రమ్మంటున్నారయ్యా....

శాస్త్రి: (పెద్ద రిలీఫ్ ఫీలవుతూ) వస్తా....(వెళ్లాడు.)

చిన్నాడు: అమరయ్యా....చూచావా సైంటిస్టును....

అమరయ్య: ఊఁ....

చిన్నాడు: ఈ పింగాణీ ఫ్యాక్టరీ కథంతా కట్టుకథలా అనిపిస్తుందమరయ్యా ఎంచేతనో—

అమరయ్య: శాస్త్రిగారుకూడా ఏదో కాస్త కంగారుపడ్డాడు చిన్నయ్యా—

చిన్నాడు: ఊఁ—ఏ ఫ్యాక్టరీ అయితే ఏం - మనం ఆ స్థలం యివ్వటం వీలుపడదు. అది ఖచ్చితమేనా!

అమరయ్య: ఇంకా సందేహమా —

చిన్నాడు: మొత్తంమీద ఏదో పిత్తలాటం ఉందనిపిస్తుంది నాకు—

అమరయ్య: చూద్దాంగా —

ఇంతలో మాస్టరు వచ్చాడు. ముదురుమనిషి. పంచి, షర్టు, కళ్ళజోడు, చేతిలో పేపరు, పుస్తకాలు.

మాస్టరు: నమస్కారం చినబాబు!

చిన్నాడు: నమస్కారం మాస్టరుగారూ! రాండి — కూచోండి.

మాష్టరు: పెదబాబుగారు ——

చిన్నాడు: గారెందుకులెండి, వున్నాడు.

మాష్టరు: ఊఁ. ఏఁ అమరయ్యా మళ్ళా ఛాన్సు కొట్టేట్టున్నావే?

అమరయ్య: ఏం ఛాన్సు బాబూ?

మాష్టరు: ఏముంది? యింకో యుద్ధం నీ చేతులమీదుగా జరిపించిగాని పోయేట్టులేవు నీవు!

అమరయ్య: అవును బాబూ! యింకా ఒకచెయ్యి, ఒకకాలు, ఒక కన్ను మిగిలి వున్నాయి.

మాష్టరు: అయితే అమరయ్యా! యింకో ప్రపంచయుద్ధం తప్పనట్లేనా?

అమరయ్య: ఏమోబాబూ! మీరే చెప్పాలి.

మాష్టరు: ఆఁ——నాకేం తెలుస్తయి యీ రాజకీయాలన్నీ.

చిన్నాడు: తెలియక్కాదులెండి మాష్టరుగారూ! అసలు తెలుసుకోవాలన్న అక్కర లేదనండి బాగుంటుంది.

మాష్టరు: అదీ నిజమే. ఎంచేతంటే మాబోటివాళ్ళకి యుద్ధమైనా శాంతయినా ఒకటే. రాముడేలినా రావణుడేలినా ఒకటే. యుద్ధంవల్ల ఒరిగేదీలేదు, శాంతివచ్చి సింహాసనం ఎక్కేదీలేదు.

చిన్నాడు: కాని మీ అయ్యగారు ఏదో ఫ్యాక్టరీ కడతారటగా. దాంతో మీ నెత్తికి కిరీటా లొస్తాయి కదండీ?

మాష్టరు: అదీలేదు.

చిన్నాడు: మరి ప్లాను గీయించటం, రాయబారా లెళ్ళటం, యీ హడావుడిలో పడ్డారేం, పిల్లలకి చదువుచెప్పటం మానేసి?

మాష్టరు: చినబాబూ! ఒకమాట. మేము దాసానుదాసులం. పెదబాబు మా అధికారి. ఆయన నందంటే నందంటాం, పందంటే పందంటాం. అంతే.

అమరయ్య: అదేంటి పంతులుగారూ! మరీ అంత అన్యాయం చేసుకోకండి. సొంత బుద్ధి పూర్తిగా వదులుకుంటే ఎట్టా?

మాష్టరు: అమరయ్యా! సొంతం లేదు, బుద్ధీలేదు. వ్యక్తిత్వం వెలగబెట్టాలనుకున్న వాడెవ్వడూ తిన్నగా బతకలేడు తెలుసా!

అమరయ్య: అది కాస్తా చంపుకున్న తరవాత మనిషే కాడు!

మాష్టరు: మనిషో మాకో బతకాలి నాయనా, బతకాలి. అంతే.

అమరయ్య: బతికి చేసేపని?

మాష్టరు: ఆఁ—ఏవనేముంది! మనం ఏం హిట్లర్లా, పరమహంసలమా - రెండూ కాము....బతకటం .బ్రతికి బ్రతికి చావటం అంతే - ఎందుకులేవయ్యా, వెధవయుద్ధం గొడవలు. శాంతిగోలలు. ఏదైనా మంచి సినిమా విషయం మాట్లాడండి.

చిన్నాడు: పంతులుగారూ! ఇవి ప్లానులే అనుకొంటా.

మాష్టరు: అవునవును మరచిపోయా! అన్నగారున్నారా?

చిన్నాడు: ఉన్నారు. వస్తారుకానీ. మేం కాస్త దర్శించుకోవచ్చా యీ ప్లాను!

మాష్టరు: నా అభ్యంతరం ఉండదు కానీండి .

చిన్నాడు: ఫర్వాలేదు. మేమూ సంతోషిస్తాం (మాష్టరు చేతిలోని ప్లాన్లు తీసుకొని. వాటిని విప్పి గోడకు, లేక బ్లాకుబోర్డుకి తగిలించి) మన వూరు రాను రాను ఒక పెద్ద పారిశ్రామిక కేంద్రం అవుతూంది. ఎన్ని పరిశ్రమలు వెలుస్తున్నాయి! న్యూయార్కు పట్టణమైపోతూంది. ఇక కొద్ది రోజుల్లో.

మాష్టరు: అవునవును. ఈ కొత్త ఫ్యాక్టరీ నిర్మాణంతో మనూరికే ఒక హూందా కలుగుతుంది.

అమరయ్య: చచ్చేంత హూందా అవుతేనూ!

చిన్నాడు: మాష్టరుగారూ! - ఏదీ యీ ప్లాను కాస్త విశదీకరించండి. ఇది మనూరి నది....

మాష్టరు: ఇది మనూరు. .ఇది ఇప్పుడున్న సిమెంటు ఫ్యాక్టరీ. ఇటువైపు గ్లాసు ఫ్యాక్టరీ.. .ఇలా నదిఒడ్డునే రెండు మూడు ఫర్లాంగులు వెళ్తే - ఈ జండాలు పాతియున్నచోటే కొత్త ఫ్యాక్టరీ స్థలం.

చిన్నాడు: అంతా ఎన్నెకరా లుంటాయండీ?

మాష్టరు: మూడువంద లెకరాలు.

అమరయ్య: ఇక్కడేం దొరుకుతుందండీ?

మాష్టరు: ఆఁ - వల్లకాడు! ఆ శాస్త్రిగారేదో కొత్తరకం రాయి కనిపెట్టారట. అందు లోంచి పింగాణీ తయారుచేయొచ్చట....

అమరయ్య: బతకటానిక్కావలసిన తిండిగింజలు కూడా యిక్కడే పండుతాయి కదండీ?

మాష్టరు: పండకేం, బంగారంటి భూమి అయితే.

చిన్నాడు: రైతులు యిక్కడ ఆనకట్ట కట్టించాలనుకున్నారు. తెలుసా, పంతులుగారూ?

మాష్టరు: అవునవును ప్రభుత్వంతో రాయబారాలు సాగిస్తున్నారుగా.

అమరయ్య: ఈ ఫ్యాక్టరీ కడితే అదేం సాగుతుంది? ఇక్కడ తప్పితే ఆనకట్ట కట్ట డానికి వేరేస్థలం లేదు. ఈ దెబ్బన ఇరవై మూడు గ్రామాల నోట మన్ను. ఇదెప్పుడైనా ఆలోచించారా మీరు?

మాష్టరు: నా ఆలోచనలతో ఏమి తెగుతుంది అమరయ్యా.

చిన్నాడు: పోనీండి, జనసామాన్యం బతకడానికి కావల్సిన తిండిగింజలు పండించడం మంచిదంటారా? ఏదో కొందరికి అవసరమైన పింగాణీ తయారుచేయటం మంచిదంటారా?

మాష్టరు: నేననటం అనకపోవటంతో ఒకటి ఆగుతుందా? ఏమిటో పెద్దవాళ్ళు, చేస్తున్నారు, చేయనీ....

పెద్దవాడు, శాస్త్రి వస్తున్న చప్పుడు. మాష్టరు కంగారుగా ప్లానులన్నీ గబగబా తీసి పుంచాడు. పెద్దాడు, సైంటిస్టూ వచ్చారు. పెద్దాడు అందరినీ పరకాయించి చూచాడు.

మాష్టరు: నమస్కారం.

పెద్దాడు: (ఊర్కే తలవూపి, కుర్చీలాగి దూరంగా వేసుకు కూర్చున్నాడు) ఊఁ ఏమిటి పంతులుగారూ! ఏమయింది?

మాష్టరు: తీసుకొచ్చా బాబూ! (ప్లాను ముందు పెడతాడు)

పెద్దాడు: ఊఁ....(ప్లాను విప్పి కొద్దిగా చూచి) శాస్త్రిగారూ! మీరు రాత్రి 8 గంటల కంతా వస్తారుకదూ....వాళ్ళందర్నీ రమ్మంటాను....

శాస్త్రి: ఆలాగే....(వెళ్తున్నాడు, భూదేవి వచ్చింది. శాస్త్రిగారు వెళ్ళటం చూచి)

భూదేవి: శాస్త్రిగారూ! వెళ్తున్నారా?

శాస్త్రి: (ఆగి) నమస్కారమమ్మా....

భూదేవి: కనబడకుండా వెళ్తున్నారే....

చిన్నాడు: అంతేలేమ్మా! వాళ్ళు కనబడకుండానే పోతారు....

పెద్దాడు: (గుర్రుగా చూచాడు)

భూదేవి: ఏమండీ మీ ఆవిడగారు అసలు కనపట్టంలేదు....ఒకసారి రమ్మనండి....

శాస్త్రి: ఈ రోజు బయల్దేరుతున్నారే అమ్మా కూతురూ....ఇంకా రాలేదూ? ఈ పాటికి వస్తుంటారనుకుంటా....

చిన్నాడు: శాంతికూడా వస్తుందా?

శాస్త్రి: ఆఁ....

పెద్దాడు: (కాస్త వులికిపడి తెప్పరిల్లి) శాస్త్రిగారూ మీ అమ్మాయి పేరేంటి?

శాస్త్రి: శాంతి....

పెద్దాడు: అబ్బ! ఏంపేరు పెట్టారండీ వెతికి వెతికి ...మార్చేయండి ...

భూదేవి: ఆ పేరుకేం కమ్మగా వుంటుంది ...

చిన్నాడు: పెద్దన్నయ్యకు కర్ణకఠోరంగా వుంటుంది.



పెద్దాడు: (కోరంగా చూచి) శాస్త్రిగారూ ఇక మీరు వెళ్ళిరాండి...

శాస్త్రి: ఆఁ — వస్తా తల్లీ...

భూదేవి: శాంతినైనా రమ్మనండి తప్పక.

శాస్త్రి: అలాగే (వెళ్లాడు. భూదేవి కూడా వెళ్ళింది.)

పెద్దాడు: మాష్టరుగారూ....రాత్రి 8 గంటలకల్లా - సిమెంటు అట్లయ్యను, గుడి కొండయ్యను, సత్తెయ్యను రమ్మని చెప్పండి .. (మేడమీదికి వెళ్ళబోతూండగా బయట జనంచేరిన సందడి ...ఏదో గోల. వెళ్తున్నవాడల్లా ఆగి తిరిగి) ఎవరు వాళ్ళు?

మాష్టరు: (అమరయ్యవైపు చూచాడు)

అమరయ్య: (చిన్నాడివైపు చూచాడు)

చిన్నాడు: (ఊఁ కానీమని సైగచేశాడు)



పెద్దాడు: ఎవరని అడుగుతూంటే అలా ముఖాలు చూసుకొంటారేం?

అమరయ్య: తమ కోసమే వచ్చారయ్యా!

పెద్దాడు: ఏమో?

అమరయ్య: ఏముంది బాబూ! ఆ ఫ్యాక్టరీ గురించి మాట్లాడాలని.

పెద్దాడు: మాట్లాడే దేముంది? ప్లానులన్నీ తయారయి పోయినయ్. కొద్దిరోజుల్లో పని ప్రారంభమవుతుంది.

అమరయ్య: అదే బాబూ! అక్కడ ఫ్యాక్టరీ కట్టటానికి వీల్లేదని చెప్పటానికే వచ్చారు.

పెద్దాడు: ఆజ్ఞాపిస్తున్నారా?

అమరయ్య: లేదు. మనవి బాబూ.

పెద్దాడు: అమరయ్యా ఇన్ని దేశాలు తిరిగొచ్చినవాడివి నువ్వే ఇలా మాట్లాడితే ఏమనాలి? చూడు - మనదేశం పారిశ్రామికంగా చాలా వెనుకబడింది. పరిశ్రమలు దేశ సౌభాగ్యం. పాశ్చాత్య దేశాలన్నీ ఈనాడు పరిశ్రమలధికంగా ఉండటంవల్ల మన నెత్తిని ఎక్కి కూర్చుంటున్నాయి. మనదేశంలో కావలసినంత వస్తుసంపద ఖనిజసంపద వుంది.

అవన్నీ వృధా పోకుండా వుపయోగించుకొని ఆర్థికంగా బలపర్చుకోవా లంటావా కాదా?

మాష్టరు: నిజమేకదూ అమరయ్యా?

అమరయ్య: కాదని ఎవరంటారు బాబూ! ఇదివరకు సిమెంటు ఫ్యాక్టరీ. గ్లాసు ఫ్యాక్టరీ. ఇన్నీ పెడితే సంతోషించావాంగా.

పెద్దాడు: మరి యీ ఫ్యాక్టరీ చేసుకున్న పాపమేమిటో?

అమరయ్య: పాపంలేదయ్యా! ఫ్యాక్టరీమీద మాకే కోపమూలేదు. పైగా ఫ్యాక్టరీ పెడితే పదిమందికి పనులు దొరుకుతాయని కూడా తెలుసు.. .కానీ.. .మీరే ఆలోచించండి! రిజర్వాయరు కట్టడానికి అక్కడతప్ప వేరే స్థలమేలేదు. మహామహా ఇంజనీర్లు చూచిపోయారు. .ఇప్పుడా రిజర్వాయరు మానుకొని కొన్ని వేల ఎకరాలు బీడుచేసుకొని తిండి పోగొట్టుకోటం మంచిదా .. లేకపోతే ఫ్యాక్టరీ మానుకోటం మంచిదా? ఆలోచించండి. ..

పెద్దాడు: ఆలోచించేదేమీ లేదు. అన్నీ సిద్ధమై పోయినయి. మీరు నయంగా భూము లిచ్చారాసరి. లేదా ఎలా తీసుకోవాలో మాకు తెలుసు...

అమరయ్య: ఎలా ఇవ్వకుండా ఉండాలో మాకూ తెలుసు.

పెద్దాడు: బెదిరిస్తున్నారా?

చిన్నాడు: ఫ్యాక్టరీ కట్టడానికి వీల్లేదంటున్నాం.

పెద్దాడు: ఏమిటి మీ ఆజ్ఞ! భూములున్నవాళ్ళు ఇవ్వటానికి ఒప్పుకుంటున్నారు, కడు తున్నాం మీ కెవరు కాదనటానికి.

(బయట) భూమిని సాగుచేసేవాళ్ళం మేము తరతరాలుగా కౌలుకు చేస్తున్నాం ఈ ఫ్యాక్టరీ కడితే మా నోటికాడకూడు పోతుంది.

మాష్టరు: మీ కందరికీ ఫ్యాక్టరీలో పను లిస్తారని అయ్యగారు అంటున్నారుగా. అయ్యగారు మిమ్మల్నంతా అలా వదిలేస్తారా? వెళ్ళండి వెళ్ళండి.

పెద్దాడు: అమరయ్యా! కాస్త తాపీగా ఆలోచించు. మీరేకాదు వ్యవసాయం లేక, కూలీనాలీ కూడా లేక, అల్లాడే జనం వున్నారు వాళ్ళందరికీ ఈ ఫ్యాక్టరీలో జీవనాధారం ఏర్పడుతుంది.

(బయట) అయ్యోపాపం! ఎంతదయా! మాకేం అక్కర్లేదు. ఫ్యాక్టరీ మానేయండి. (కేకలు)

మాష్టరు: అదికాదు గానీ, మీ రెవరో నలుగురొచ్చి కాదంటే మానేస్తారా? మీ ఇరుగుపొరుగు రైతులంతా ఒప్పుకున్నారు. గా: సొంత భూమివ్వడానికి కూడా ఒప్పుకున్నారు మరి దీనికేమంటారు?

చిన్నాడు: మోసంతో, దౌర్జన్యంతో ఒప్పుజెప్పారు.

పెద్దాడు: చుట్టుప్రక్కల గ్రామాలవాళ్ళంతా ఏమయ్యాడు?

అమరయ్య: మాతో నేలని పక్షంలో వాళ్ళూ తయారుగా వున్నారు.

పెద్దాడు: ఆఁ - ఇదంతా మీరిద్దరూ నడిపిస్తున్న నాటకం.

చిన్నాడు: నాటకం ఏమీకాదు. ఉన్నట్లుండి మీకిప్పుడు పుట్టిందీ ఫ్యాక్టరీ తెగులు. కాని. మీకంటే పూర్వం రైతులందరూ కలసి అక్కడ ఆనకట్ట కట్టాలని ప్రభుత్వంతో సంప్రదింపులు జరుపుతున్నారు. ఆనకట్ట కట్టడానికి అక్కడ తప్ప వేరె స్థలంలేదు. అందువల్ల కొన్ని వేల ఎకరాలు పంట పండుతుంది. మీరీనాడు తాతాలు బిర్లాలతో, అమెరికన్ పెట్టుబడిదార్లతో కలసి మీ లాభాల కోసం ఈ ప్లాన్ వేశారు. మనుష్యులను బతికించే తిండి పండించాలంటాం మేము.

పెద్దాడు: అవున్లేవోయ్, మీరే మహాబతికించేవాళ్ళు. మేమంతా చంపుకు తినేవాళ్ళం.

చిన్నాడు: అక్షరాలా.

పెద్దాడు: ఆఁ - (ఇటు అటు బుసలుకొడుతూ చూచాడు. తన బలం తక్కువని గ్రహించాడు. తగ్గటం ఇష్టంలేదు. తప్పించుకోవాలి ఈ సమయానికి) ఇదిగో ముందు వాళ్ళను వెళ్ళమను.

అమరయ్య: అదేదో చెలండే?

పెద్దాడు: తేలమంటాదు. ఇంతసేపు కాకిమూకలా కేకలేస్తే తలలు పేల్తాయి.

అమరయ్య: ఎవరివి? మీవా?

పెద్దాడు: ఏమ్ స్కౌండ్రల్ (పిస్టోలు లాగాడు.)

అమరయ్య: ఊఁ కానీ —— పేల్చు చూద్దాం దమ్ముంటే పేల్చు.

పెద్దాడు: (తగ్గాడు ఒక్కక్షణం) ఇదిగో చివరి ఛాన్సు ఇస్తున్నా. బాగా ఆలోచించుకొని చెప్పండి. (వెళ్లాడు.)

భూదేవి వస్తుంది

భూదేవి: ఏంటమయ్యా! మూడవ ప్రపంచ యుద్ధం మనింట్లోనే మొదలెట్టేట్టుంది.

చిన్నాడు: యుద్ధానికి కారుదువ్వుతుంది మీ జ్యేష్ఠ కుమార రత్నం అమ్మా.

భూదేవి: ఏమో; ఈ కొంపలో శాంతెప్పుడు కుదురుతుందో.

మాష్టరు: ఊ... వస్తాబాబు. వస్తానమ్మా. (వెళ్తాడు)

చిన్నాడు: అమరయ్యా! రా! వాళ్ళనిళ్ళకు పంపిద్దాం....

అమరయ్య: వస్తానమ్మా. (ఇద్దరూ వెళుతున్నారు.)

సమత: తాతా! యుద్ధం చూపించకుండానే వెళుతున్నావు కదూ?

అమరయ్య: మనింట్లో ఇంతసేపు చూచావు కదమ్మా!

సమత: అదికాదు పెద్ద యుద్ధం.

అమరయ్య: ఉండమ్మా! ఇప్పుడే వస్తా. (వెళ్తాడు)

సమత: అమ్మా! ఈరోజు స్కూలుకు సెలవు పెడతానమ్మా!

భూదేవి: ఏం! ఎందుకు?

సమత: తాత మంచి యుద్ధం కథ చెపుతానన్నాడమ్మా.

భూదేవి: సరేలే (వెళ్ళింది)

సమత: (వంటరిగా) యుద్ధం విచిత్రమైన ప్రుంపు. యుద్ధం ఎప్పుడూ వెధవదే. మనుష్యులంతా ఒకటే...

బయటనుంచి ఒక తెల్లటి పావురాయి హాల్లోకి ఎగిరొచ్చింది. హాల్లోవున్న సమత పావురాయిని చూచి ఆలోచనలో నుంచి ఉలిక్కిపడింది. ఇంతలో పావురాయి తిన్నగా లోపలికి ఎగిరిపోయింది.

సమత:: (బయట ద్వారంవేపు చూచి) ఏయ్! దొంగా! రామ్మా రా! నువ్వొచ్చావని తెలుసులే! రా!

శాంతి కిలకిల నవ్వుకొంటూ పరుగెత్తికొచ్చి సమను ఎత్తుకుంది.

శాంతి—చాలా అందమైన అమ్మాయి. అతి నవ్యనాగరికతా లక్షణాలేమీ లేవు. చక్కగా తలదువ్వుకుని జడ వేసుకుంది. ఎప్పుడూ నవ్వుతూ హాయిగా వుంటుంది. సామాన్యంగా తెల్లటి చీర, అంచులు కలది వాడుతుంది. తలలో మల్లెపూలుతప్ప ఇంకేమీ వాడదు. నుదుట ఎర్రనిబొట్టు ఆభరణాలేమీలేవు. చెవులకు చాలా సామాన్యమైన ఆభరణం వుంటుంది. కాళ్ళకు ఆకుపచ్చరంగు జోళ్ళు.

శాంతి: నేనొచ్చానని నీకెలా తెలుసు?

సమత: నీ తెల్ల పావురాయి వస్తే నువ్వు వచ్చినట్టే కదా! నాకు తెలీదనుకున్నావామ్మా?

శాంతి: మీ అన్నయ్య వున్నారా?

సమత: చిన్నన్నయ్యా? పెద్దన్నయ్యా?

శాంతి: ఎవరైనా?

సమత: కాదులే దొంగ! నువ్వు చిన్నన్నయ్యనే అడగటం.

శాంతి: (నవ్వింది వయ్యారంగా) ఊఁ — (బల్లవైపు చూచింది. మర ఫిరంగులు మొదలయిన బొమ్మలు కనుపించాయి. తటాలున ఆగి, సపును దింపి బల్ల దగ్గర కెళ్ళి వాటిని నిదానించి చూచి) సమూ! ఎవరు తెచ్చారివన్నీ?

సమత: మా పెద్దన్నయ్య, అమెరికానుంచి తెచ్చాడు. ఇంకా పెద్ద పెద్ద టాంకులు బాంబర్లు ఉన్నాయి.

శాంతి: నీ కీ బొమ్మలంటే చాల యిష్టమా?

సమత: ఉహూ! - అన్నీ తీసి మూలపడేస్తే, ఇది మాత్రం పెద్దన్నయ్య తీసి వుంచాడు. ఆయన కివి అందంగా ఉన్నాయట.

శాంతి: ఉహూ?

సమత: అదికా దొదినా —

శాంతి: వొది నేమిటి?

సమత: మరి వొదినెవు కావేం? వూళ్ళో అందరూ అంటూంటే! బావుందమ్మా!

శాంతి: ఏమని?

సమత: విశ్వం పెళ్ళాం శాంతి అని.

శాంతి: ఏయ్! తన్నా.

సమత: ఏయ్! ఏయ్! విశ్వంశాంతి! విశ్వం, శాంతి!

చప్పట్లు కొడుతూ గెంతుతుంది.

భూదేవి: ఏమిటే అల్లరి?

సమత: చూడమ్మా; తన్ను వొదినా అనుకూడదట?

భూదేవి: ఏఁ (నవ్వుతూ) ఏమమ్మా! శాంతీ! అపురూపమైపోయావే? మీ అమ్మ రాలా?

శాంతి: అమ్మెక్కడొస్తుంది? తెల్లజుట్టు నల్లబడితేనా!

భూదేవి: అదేమిటి?

శాంతి: మీకు తెలీదేం? అమ్మ తలలో నాలుగు వెంట్రుకలు నెరసినవట! ముసలిదై పోతుందనే భయం పట్టుకుంది. అప్పట్నుంచి నాన్నతో ఒకటే పోరు. "ఇంత పెద్ద సైంటిష్టువి. ఇవి నల్లబడటాని కేదన్నా కనిపెడ్తావా? లేదా" అని.

సమత: (నవ్వింది)

భూదేవి: అవి నల్లబడందే బైటపడిరాదా ఏం?

శాంతి: ఉహూ!

భూదేవి: మీ నాన్నేమంటారు?

శాంతి: "నీ అందంచూచి ఆనందిచాల్సినవాణ్ణి నేనే కదా? నాకేం ఫర్వాలేదు తెల్ల వెంట్రుకలుంటే" అంటారు. పైగా - అమ్మకంటే పెద్దవయస్సట మీకు, మీకొక్క వెంట్రుకైనా నెరవలేదాయె. ఎట్లా వస్తారు?

అందరూ నవ్వుతూండగా చిన్నవాడు వచ్చాడు.

సమత: అన్నయ్యా! నీకోసం శాంతి వచ్చింది.

చిన్నాడు: నాకోసం కాదులే. సమత ఉంటే శాంతి వస్తుంది.

సమత: పోనీ మనిద్దరికోసం. సరేనా?

శాంతి: నే నెవరికోసంరాలా - నాకోసమే వచ్చా.

భూదేవి: (చిరునవ్వు నవ్వి వెళ్ళింది)

చిన్నాడు: ఎవరికోసం వచ్చినా నీతో చాలా పనుంది. కూర్చో - చెప్తా.

శాంతి: నిలుచుంటే చెప్పకూడదా?

చిన్నాడు: తెలిపేలే-సరేగాని-మీ నాన్నగారేదో పెద్ద పరిశోధనలు చేస్తున్నారట? ఏమిటో నీకేమన్నా తెలుసా?

శాంతి: ఏవో రాళ్ళూ రప్పలూ.

చిన్నాడు: అంత తేలిగ్గా తీసేయకు. దయచేసి వాటిని గురించి వివరాలేమన్నా తెలిసుంటే శలవియ్యండి.

శాంతి: చాలా సీరియస్సా?

చిన్నాడు: సీరియస్ కనకనే?

శాంతి: (కాస్త ఆలోచించి) ఏమైందంటే ఒకరోజు....

చిన్నాడు: కాలికి దెబ్బతగిలింది - తరువాత?

శాంతి: ఇంటికొచ్చాడు. వచ్చిన అయిదు నిమిషాలకంతా వాచువాచి, నల్లగా రంగు మారి - బొబ్బలు బొబ్బలుగా ఏమో వచ్చేసినయి.

చిన్నాడు: ఆఁ!

శాంతి: మేమంతా చాలా కంగారుపడ్డాం. కాని, ఆయనమాత్రం వెంటనే గబగబా పరుగెత్తిపోయి, రాళ్ళుకొన్ని మూటకట్టుకొచ్చుకున్నాడు. అంతే - ఆ తర వాత మూడు నెలలదాకా మా నాన్నను నేను చూడలా.

చిన్నాడు: ఎక్కడి కెళ్ళారు?

శాంతి: ఎక్కడికెళ్ళలా. గదిలో తలుపు లేసుకొని కూచున్నారు. మూడుగెల్ల తర్వాత బైటకొచ్చిన ఆయన్నుచూస్తే అబ్బ - భయంకరంగా___

చిన్నాడు: (చాలా దీర్ఘాలోచనలో వున్నాడు.)

శాంతి: ఏమిటా ఆలోచన?

చిన్నాడు: ఇలారా - చెప్తా (వెళ్ళాడు)

శాంతి: సమతా! మళ్లా వస్తా. అమ్మతో చెప్పు. (వెళ్ళింది)

సమత: (కొంచెం ఆగి లోపల కెళ్ళింది)

ఒక్కక్షణం - పెద్దాడు, శాస్త్రి వచ్చారు. పెద్దాడు నిప్పులు చెరుగుతున్నాడు. శాస్త్రి చాలా దీర్ఘాలోచనలో ఉన్నాడు.

శాస్త్రి: ఇక వాళ్ళను బెదరించి లాభంలేదు.

పెద్దాడు: అయితే వదులుకుంటామా? ఈ పీకలో ప్రాణం వుండగా...

శాస్త్రి: అలాటి చెన్నడూ జరుగకూడదు.

పెద్దాడు: (బుసలుకొడుతూ. ఇటూ అటూ తిరిగి) ఆలోచించండి___వేరేమార్గం. ఈ వెధవలను లొంగదీయకుంటే మనం బ్రతికేం లాభం?

శాస్త్రి: ఆలోచించి ఎప్పుడో అయిపోయింది. ఇక ఆచరణే.

పెద్దాడు: ఏమిటి?

శాస్త్రి: ఒక్క ముఖ్యసూత్రం గుర్తించుకోండి. అమెరికా కెళ్ళొచ్చిన మీకిది తెలిసే వుంటుందనుకోండి. .___అయినా

పెద్దాడు: సరే, చెప్పవయ్యా ___

శాస్త్రి: ఆకలి - ఆశ - ఇవిరెండే మానవ జీవితాన్ని నడుపుతూన్న శక్తులు. ఈ ముక్కు త్రాళ్ళకు ఎంతటి వాళ్ళైనా లొంగుతారు.

పెద్దాడు: అయితే ___

శాస్త్రి: మన రెండు ఫ్యాక్టరీలు బంద్ చేయించండి.

పెద్దాడు: ఎలా?

శాస్త్రి: అదెంత చాలా సులభం.

పెద్దాడు: చేస్తే!

శాస్త్రి: నిరుద్యోగం డబ్బుకు లొబ్బుంది.

పెద్దాడు: ఆఁ .......

శాస్త్రి: వెంటనే ధాన్యంధర పెంచండి. ఆశకొద్ది అమ్మేస్తారు. స్టాక్ చేయండి. ఇక వున్నపైరులా? చాలా సులభంగా నాశనం చేయొచ్చు—ఫలితం—కరువు. ఎంతకాలం ఆగుతారు—దిగుతారు—చచ్చినట్లు, మనకాళ్ళ దగ్గరకొస్తారు.

పెద్దాడు: (కాస్త ఆలోచించి) భేష్!....బలేప్లాను....మీరొట్టి సైంటిస్టే అనుకున్నా.

శాస్త్రి: ఎకనామిష్టు — ఇంకా ఏన్నో ఇష్టలున్నాయి లెండి.

పెద్దాడు: (శాస్త్రిని వీపుతట్టి) కరువు, కాటకం, ఇన్నాళ్ళు ఇవి దేవుడు కల్పించేవనుకున్నా. ఇప్పుడు తెలిసిందోయ్ — మనమూ సృష్టించవచ్చని. ..

పెద్దగా నవ్వాడు - తెర పడింది.

— తెరపడిన వెంటనే

— ఒక కంఠం

శాస్త్రిసలహా అక్షరాలా ఆచరించాడు పెద్దాడు. ఉన్న గింజలు రాస్తా ఆశకొద్దీ అమ్ముకున్నారు. ప్రకృతికూడా పెద్దవాడికే సహాయం చేసింది. మొదట అనావృష్టి, తరువాత అనవసరవృష్టి పైరుల్ని నాశనం చేశాయి. అరగొరగా పండుతుందనుకున్న పంటలను కూడా పాడుచేయించాడు పెద్దాడు. ఫలితం కరువు కాటకం. మనుష్యులు, మాకులు, పశువులు, పక్షులు మలమల మాడి పలపల రాలిపోతున్నాయి. నీటి చుక్కకూడా కరువైపోయింది ఆకలి, దాహం - ఆర్తారావం! ఎవరో కొద్దిమంది పూటతిండి తింటున్నారు. భూదేవి గుండెలు బీటలు వారిపోయింది. మనుష్యులు తిండిలేక చావటం ఆమెకు అమానుషంగా వుంది. ఆమె హృదయం తల్లడిల్లిపోతూంది.

తెర విడిపోయింది.



## రెండవ రంగం

భూదేవి ఇల్లు. మొదటిరంగంలో హాలే. అన్నీ పూర్వంలాగే వున్నాయి. భూదేవి మాత్రం చాలా నీరసంగా వుంది. ముఖంలో అతి విషాద ఛాయ లగుపిస్తున్నాయి. తల కాస్త రేగుంది.

అమరయ్య ఆమె యెదుట నిలబడి వున్నాడు. అతనూ కళ్ళల్లో ప్రాణాలు నిలుపుకొని వున్నాడు. అందరి ముఖాల్లో కరువు ప్రతిబింబిస్తూంది.

భూదేవి అలా ప్రూన్పడి కూర్చుంది.

అమరయ్య: కాస్త ఎంగిలిపడమ్మా!

భూదేవి: ఫర్వాలేదులే అమరయ్యా! ఇందరు - తిండి లేకుండా మాడి చస్తూంటే ఏమైంది! నేను పస్తుంటే మాత్రం ఏమవుతుంది? నా బిడ్డలతోపాటే నేనూ!

దొడ్డిలోంచి కాబోలు పశువుల ఆర్తారవం అంబా అని వినిపించింది.

భూదేవి: (తటాలున ఎలక్ట్రిక్ షాక్ తిన్నదానిలా అయింది.) అమరయ్యా! (కళ్ళ నీళ్ళు బొటబొట రాలిపోతున్నాయి) నోరులేని జీవాలమరయ్యా! నేను బతికుండగానే, నా కళ్ళ ఎదటే ఎంతటి ఘోరం చూడాల్సొచ్చింది. ఇంత కన్నా...

అమరయ్య: తల్లీ! ఏం చేస్తామ్మా! గడ్డిపోచ లేదెక్కడా! మనం చచ్చినా....పశువులు....(అమరయ్య, ఇక మాట్లాడలేకపోయాడు.)

ఒక్క క్షణం నిశ్శబ్దం.

అమరయ్య: (ఏదో ఆలోచన తట్టింది) ఇప్పుడే వస్తా తల్లీ! (బయల్దేరి పోతున్నాడు. కొద్దిదూరం వెళ్ళేప్పటికి తూలి పడబోయి, ద్వారం పట్టుకొని నిలబడ్డాడు. భూదేవి చూచింది.)

భూదేవి: అమరయ్యా! ఎక్కడికెళ్తావు నాయనా! తూలిపడుతున్నావు. వెళ్ళకు.

అమరయ్య: (తమాయించుకొని) ఫర్వాలేదులేమ్మా! (వెళ్తాడు)

ఒక్క నిమిషం భూదేవి నిశ్శబ్దంగా వుంది. ఇంతలో సమత అరుస్తూ పరుగెత్తు కొచ్చింది. సమత పాలిపోయింది. ఆమె ముఖంలోకూడా కరువు తాండవిస్తూంది.

సమత: అమ్మా! అమ్మా! (పరుగెత్తుకొచ్చి భూదేవిమీద పడి ఏడుస్తూంది)

భూదేవి: ఏమమ్మా? ఎందుకు!

సమత: వెంకయ్యతాత పాప - పాపమ్మా, పాప....

భూదేవి: ఏమైందమ్మా!

సమత: పాలు లేవట - అన్నం లేదట - నీళ్ళు లేవట. (బోరున ఏడుస్తూ) చచ్చిపోతుందమ్మా!

భూదేవి: ఆఁ .(అలాగే లేచి తడబడుతూ) వుండమ్మా! మన గోమాతేమన్నా రాస్త పాలిస్తుందేమో అడిగిచూస్తా! (లోపలి కెళ్ళింది)

సమత: (కంగారుపడుతూ, కన్నీళ్ళు తుడుచుకుంటూ, దుఃఖాన్ని దిగమింగుతూ చేతులు జోడించి) తల్లీ! గోమాతా! ఇన్నాళ్ళూ పాలిచ్చి కాపాడావు. ఈ రోజుకి, చిట్టెడు పాలీమ్మా! నీకు దండంపెడతా! (చాలా ఆదుర్దాగా ఎదురు చూస్తుంది. ధ్యానంలో లీనమై అలాగే కూచుంది)

భూదేవి: (వచ్చింది.)

సమత: వున్నాయమ్మా!

భూదేవి: మంచినీళ్ళు కూడా లేవే పశువులకి! ఏమని ఇస్తాయమ్మా పాలు..

సమత: (కంగారుపడుతూ) అమ్మా! అన్నయ్య మేడమీద బిస్కెట్లు దాచుంటాడు. (పైకి పరుగెత్తింది. భూదేవి సంతోషంగా చూస్తుంది. కొద్దిసేపటికి సమ ఒక చేతిలో బిస్కెట్లు, ఇంకో చేతిలో మంచినీళ్ళసీసా పట్టుకొని దిగి వచ్చింది. బయటికి పరుగెత్తుతూ) వున్నాయమ్మా! నీళ్ళు కూడా వున్నాయి!

పెద్దాడు: (ఎదురుగా వచ్చాడు) ఏయ్! ఎక్కడి కెడుతున్నావు! (సముని పట్టుకున్నాడు.)

సమత: (ఇటటు చూచి పెద్దవాడి చేయి కొరికింది. అతను వదిలేడు. పారిపోయింది.)

పెద్దాడు: (అదే దర్జాలో వున్నాడు. తాంబూలం నములుతూ, సిగరెట్టు పీలుస్తున్నాడు. ఒక్కక్షణం పారిపోయిన సముపంక, తరువాత భూదేవివంక ఎర్రగా చూచాడు. ఏం తోచిందో సర్దుకొని) తిన్నావా?

భూదేవి: పూరంతా తినలేదు. నా బిడ్డలతోపాటు నేనూ!

పెద్దాడు: (నవ్వి) నీ బిడ్డలు! కన్నావు పట్టి అప్రయోజకుల్ని! సరే! చావండి అందరూకలిసి....(అంటూ పైకి వెళ్ళాడు)

భూదేవి అలాగే కూలబడి వుంది. చిన్నాడు వచ్చాడు.

చిన్నాడు: (వచ్చి భూదేవిని చూచాడు. కళ్ళనీళ్ళు తిరిగినవి) అమ్మా?

భూదేవి: (తిరిగిచూచింది.)

చిన్నాడు: (వెళ్ళి ప్రక్కన కూర్చొని) అమ్మా! కాస్త అన్నం తినమ్మా! అరవై మైళ్ళ దూరంనుంచి మంచినీళ్ళు తీసుకొచ్చి పోయటానికి లారీ ఏర్పాటు చేశాను. మంచినీళ్ళయినా తాగి ఈ పూట బతుకుతారు!

భూదేవి: మంచినీళ్ళు తాగి ఎంతకాలం ప్రాణాలు నిలుపుకుంటార్రా!

చిన్నాడు: జరగనీ చూద్దాం.

భూదేవి: ప్రభుత్వం ఏంచేస్తూందిరా?

చిన్నాడు: ఆలోచిస్తుందమ్మా!

ఇంతలో బయటనుంచి కరువుగీతం వినిపిస్తుంది. పాడుతూ శాంతి వస్తుంది.

చిన్నాడు: శాంతీ!

శాంతి: నన్నా పేరుతో పిలవక. వూరంతా ఇట్లా అశాంతితో వుడికిపోతూంటే నా పేరు నాకే వెక్కిరింతగా వుంది. పద! వూరూరూ పోదాం, బిచ్చం ఎత్తుదాం. ఈ జీవాలను నిలుపుదాం! పద విశ్వం...

చిన్నాడు: పద....

ఇద్దరూ పాడుతూ వెళ్తున్నారు. స్వాములవారు వచ్చాడు. భూదేవి అతన్ని చూచి, భోరుమని వస్తున్న దుఃఖాన్నాపుకొని తటాలున ఆయన కాళ్ళమీద పడ్డది.

స్వాములవారు: తల్లీ! తల్లీ! లేమ్మా!

భూదేవి: స్వామీ! ఈ కరువునుంచి బైటపడే దారి లేదా! ఈ చచ్చిపోతూన్న జనం కోసం మీరేమీ చేయలేరా? రక్షించండి స్వామీ!

స్వాములవారు: మనం ఏంచేస్తామమ్మా? అంతా దైవలీల! భూభారాన్ని తగ్గించటానికి, పాపపంకిలాన్ని కడిగేయటానికి భగవానుడు ఈలా చేస్తుంటాడు. యుద్ధాలు-కరువులు మొదలైనవాటి పరమార్థం అదే. తెలియనివాళ్ళు అంతా తామే చేస్తున్నామనుకొంటారు! పిచ్చి! సర్వం భగవానుని లీల.

భూదేవి: ఆపండి! భగవానుడు! లీల!....ఎక్కడున్నాడు ఆ భగవానుడు.... చూపండి!....

స్వాములవారు: ఇందుగల డందులేడని సందేహము వలదు....

భూదేవి: అడగండి....ఆ భగవానుణ్ణి అడగండి....తాగటానికి నీళ్ళయినా యివ్వమని అడగండి....

స్వాములవారు: అడిగితే తప్పక ఇస్తాడు. అందుకే క్రతువులు, యజ్ఞాలు. అన్నారు.
విరాటపర్వం చదివి స్తే వెంటనే కుంభవర్షం కురవదూ...

భూదేవి: కురుస్తుందా?

స్వాములవారు: కురిసి తీరాలి....

భూదేవి: అయితే చదవండి....స్వామీ! ఈ జనాన్ని కాపాడండి....

స్వాములవారు: ఖర్చులవుతవి మరి....కాంచనం కర్మవిమోచనం....అన్నారు ..

భూదేవి: (కంగారుపడుతూ) డబ్బు! దేవుడికీ డబ్బే కావాలి....

సుబ్బయ్య వచ్చాడు పైనుంచి.

భూదేవి: సుబ్బయ్యా! పెద్దవాడేం చేస్తున్నాడు?

సుబ్బయ్య: నిద్రపోతున్నారమ్మా.

భూదేవి: తాళంచెవు లెక్కడుంటాయి?

సుబ్బయ్య: అయ్యగారి తలగడకిందేమ్మా.

భూదేవి: (అటు యిటు చూచి, మెల్లగా మేడమీద కెళ్ళింది.)

స్వాములవారు: (బుద్ధావతారంలా కూచున్నాడు.)

సుబ్బయ్య: స్వామీ! ఒక్క సందేహం!

స్వాములవారు: ఏమిటోయ్?

సుబ్బయ్య: ఇంతవూరూ ఇట్టా మలమల మాడిపోతావుంటే, మీరు మాత్రం నిగనిగా
నిమ్మపండులా వుండారే - ఏంటి స్వామి అందులో కిటుకు?

స్వాములవారు: అది కేవలం తపోబలం లేవోయ్!

సుబ్బయ్య: అట్టాగా!

ఇంతలో భూదేవి గబగబా దిగివచ్చింది. దొంగలా వచ్చి స్వాముల వారిని సమీపించి

భూదేవి: ఇదిగో స్వామీ వందరూపాయలు - విరాటపర్వం చదివించండి....
(పైనుంచి పెద్దవాడి కేక) ఆగు. ..

పెద్దాడు: (గబగబ వచ్చి భూదేవిని పట్టుకున్నాడు.)

భూదేవి: (వణికిపోతూంది.)

పెద్దాడు: దొంగిలించావా! ఛీ!

స్వాములవారు: దొంగిలించిన సొమ్మా ఇది....పాపం! మా హస్తాలు అపవిత్రమై
పోయినయి....ఇదిగో పుచ్చుకోండి....

పెద్దాడు: ఫర్వాలేదు వుంచుకోండి.

స్వాములవారు: అవును. మీరు తలపెట్టిన కార్యం నిర్విఘ్నంగా సాగటానికి శ్రీ ఆంజనేయ కవచం ఇస్తానన్నానుగా. అందులోకి జమ కట్టుకుంటాను.
భూదేవి: (తెల్లబోయింది)
స్వాములవారు: వస్తా (వెళ్తున్నాడు)
సమత: (పరుగెత్తు కొచ్చింది) అమ్మా! అమ్మా! పాప....పాప ఏడుస్తూ చచ్చి పోయిందే....
భూదేవి: ఆఁ ..

ఇంతలో అమరయ్య ఒక మోపు చివికి ఎండినగడ్డితో వచ్చాడు.

అమరయ్య: ఇదిగో తల్లీ మన పశువులకు వేయించండి.
భూదేవి: ఎక్కడిది నాయనా?
అమరయ్య: నా గుడిసెమీద కప్పివుంటే వూడబీకి తీసుకొచ్చా....
పెద్దాడు: (నవ్వాడు) త్యాగపురుషుడు....
అమరయ్య: లేకుంటే నీలాగా....నీళ్ళుబోయటానికొచ్చిన లారీకి నిప్పుపెట్టి కాల్చి స్తానా రాక్షసుడా!
భూదేవి: ఆఁ....అవునా!
అమరయ్య: ఛీ! నీ బతుకుచెడ....
పెద్దాడు: ఏమన్నావురా!
భూదేవి: ఒరే....
పెద్దాడు: సుబ్బయ్యా! రెక్కలు విరిచికట్టి ఆ గదిలో తోయరా మీ అమ్మగారిని....
సుబ్బయ్య: (తల వంచి వూరుకున్నాడు)
పెద్దాడు: మీరందరూ ఒకటే....నేనే తోస్తాను . . రా . . (భూదేవిని పట్టి లాగాడు.)
సమత: అమ్మా! అమ్మా! అన్నయ్యా!
పెద్దాడు: ఛో అవతలకి . . (విసిరికొట్టాడు. సమత పడింది)
అమరయ్య: ఆగు . . (పైకిపోయాడు)
పెద్దాడు: (ఒక్కతోపు తోశాడు. అమరయ్య కూలిపోయాడు)
భూదేవి: (కొయ్యబొమ్మలా వుంది)
పెద్దాడు: (ఆమెను లాక్కెళ్ళాడు)
శాస్త్రి: (వచ్చాడు గబ గబా; కిందపడున్న ఎవ్వరినీ, చూడలేదు. మేడ మీదికి వెళ్తున్నాడు)

పెద్దాడు: (వచ్చాడు)
శాస్త్రి: విజయం మనదే . . రాండి — పైకి రాండి . . అందరూ వలస వెళ్తున్నారు. ఇప్పుడు తిండి చూపించారంటే కుక్కల్లా ఒప్పుకుంటారు ... రాండి (ఇద్దరూ పైకి వెళ్ళారు)
(పైనుంచి పెద్దాడి కంఠం)
పెద్దాడు: (వీధిలో వాళ్ళతో బాల్కనీనుంచి మాట్లాడుతూన్నట్టు) ఆగండి. ఆగండి. ఎక్కడికెళ్తారు? ఆ భూములివ్వటానికి ఒప్పుకుంటారా ఇప్పటికైనా. మీకు ఈ రోజు ఈ క్షణం తిండి, పని - అన్నీ ఇస్తాను. ఎక్కడికెళ్ళినా మీగతి ఇంతే. ఎవరుకాని ఎంతకాలం పోషిస్తారు. ఒప్పుకోండి . .
అమరయ్య: (లేస్తూ) వద్దు. ఒప్పుకోకండి. మనం చచ్చినా మన ముందు తరం వాళ్ళు సుఖపడతారు. ఒప్పుకోకండి. భూము లివ్వకండి.
(లోపలినుంచి భూదేవి కంఠం) ఒప్పుకోకండి. నామాట వినండి. నేను ఏలాగైనా మిమ్మల్ని నా కడుపులో దాచుకొని కాపాడుతా.... ఒప్పుకోకండి.
పెద్దాడు: ఏం? వొప్పుకోండి . . ఊఁ అనండి . . ఇప్పుడు పెడతా తిండి.

ఒక్కక్షణం నిశ్శబ్దం
పెద్దవాడు, శాస్త్రి చాలా హుషారుగా దిగివస్తూ

పెద్దాడు: ఒప్పుకోక ఏంచేస్తారు?
శాస్త్రి: నేను చెప్పానుగా తప్పదని....
అమరయ్య: ఒప్పుకున్నారా?
పెద్దాడు: (పెద్దగా నవ్వాడు)



# మూడవ రంగం

తెర వెనుకనుంచి ఒక కంఠం:

రైతులు భూములివ్వడానికి ఒప్పుకున్నారు. రిజర్వాయరు కట్టాలను కొన్న స్థలంలో ఫ్యాక్టరీ నిర్మాణం చకచక సాగింది. వూళ్ళో చాలామందికి ఫ్యాక్టరీలో కూలిపని దొరికింది. ఆ పరిస్థితుల్లో చాలా తక్కువ కూలికి కూడా ఒప్పుకున్నారు. పెద్దవాడింతవరకు దాచిన ధాన్యాన్నే కొద్ది కొద్దిగా విడుదల చేసి, చాలా ప్రియంగా అమ్మటం మొదలెట్టాడు. ఇచ్చేకూలీ వద్దైదురోజుల తిండికి కూడా చాలని విధంగా సమాళించాడు. సాధ్యమైనంతవరకు జనాన్ని సగం కడుపుకూటితో వుంచాడు. జనం కూడా మెల్లమెల్లగా అలవాటుపడి పోయారు. ఇలా ఫ్యాక్టరీపని సాగిపోతోంది. కొంతకాలం వరకు ఫ్యాక్టరీలో ఏం తయారవుతుందో ఎవరికీ తెలియదు. ఆ తరువాత పింగాణీతోపాటు ఇంకా ఏదో తయారుచేయటానికి ప్రయత్నాలు సాగుతున్నాయని కొందరికి తెలిసింది. వూరంతా పాకింది. కాని అదేమిటో తెలుసుకోవాల్సిన అవసరం ఎవరికీ కలగలేదు. ఎవరూ పట్టించుకోలేదు. జనం ఆకలికి చాకిరికి అలవాటు పడిపోయారు.

తెర విడిపోయింది.

భూదేవి యిల్లు. యథాప్రకారముంది. మంచంమీద సమత పడుకోనుంది. సుస్తీగా వుంది. తెరయెత్తిన కాస్సేపటికంతా మంచంమీదలేచి కూచొని, నీరసంగా "అమ్మా, అమ్మా" అని పిలిచింది. భూదేవి వచ్చింది.

భూదేవి: (సముప్రక్కన కూర్చొని) ఏమమ్మా! నిద్రరాలే!

సమత: ఎప్పుడమ్మా నేను మళ్ళా బడికిపోయేది . . ఆడుకునేది?

భూదేవి: సుస్తీనయమైందే పోదువులే తల్లీ.

సమత: నాకు సుస్తీ యేంటమ్మా? నేను బాగానే ఉన్నాను....

భూదేవి: సరేలే! రేపు పోదువుగాని. పడుకో....

సమత: అమ్మా! చిన్నన్నయ్య చెప్తాడు —— ''మళ్ళా యుద్ధం వచ్చేటట్టుంది, మనమంతా శాంతికోసం పాటుపడాలి'' అని - యుద్ధం వస్తుందా అమ్మా!

భూదేవి: వచ్చినా మనవూరికి రాలేదులే అమ్మా.

సమత: అమ్మా! శాంతొదిన రాలా . . రమ్మనమ్మా . . కథలు, పాటలు చెప్తుంది.

భూదేవి: పిలిపిస్తాలే . . నువ్వు కాసేపు కళ్ళుమూసుకొని పడుకో . . ఉఁ.

సమత: (పడుకుంటుంది)

భూదేవి: (వెళ్ళింది.)

సమత: (తనలోతాను) యుద్ధం విచిత్రమైన వుండు. యుద్ధం ఎప్పుడూ వెధవదే. మనుషులందరూ ఒకటే. (చిన్నాడు వచ్చాడు. సము మాటలు విన్నాడు. దగ్గరకెళ్ళి)

చిన్నాడు: సమూ! సమూ! ఏమిటమ్మా?

సమత: ఏమీలేదన్నయ్యా. ఒది సెక్కడ?

చిన్నాడు: వస్తూందమ్మా....గంజి తాగావా?

సమత: గంజి ఎందుకన్నయ్యా? మళ్ళా కరువొచ్చిందా?

చిన్నాడు: (నవ్వి) కాదమ్మా! జ్వరం వచ్చినా గంజి తాగాలి. అమ్మేక్కడ?

సమత: లోపలున్నారు . . నాకేదో భయంగా ఉందన్నయ్యా.

చిన్నాడు: కళ్ళు మూసుకొని పడుకోమ్మా ... ఏం భయం లేదు .... (లోపలి కెళ్ళాడు)

సమత: (లేచి కూర్చొని బల్లమీద ఉన్న మరఫిరంగులు, ఏరోప్లేను అలాగే కళ్ళప్పగించి చూస్తూంది. మనిషి ఏదో కదలిపోతూంది. ఆమెలో ఏదో భయోత్పాతం కలుగుతూంది. ఫిరంగులు తనవైపుకు తిరిగి ప్రేలినట్లు, ఏరోప్లేను తన తలమీదుగా వచ్చి బాంబులు వేసినట్లు ఊహించుకొంటుంది. పిచ్చిగా కేకలుపెట్టి అరచింది.) అమ్మా! అమ్మా! అన్నయ్యా!

ఆ కేకలు విని, చిన్నాడు, భూదేవి పరుగెత్తుకొచ్చారు.

చిన్నాడు: సమూ! సమూ! ఏంటమ్మా?

సమత: అన్నయ్యా! ఫిరంగులు, ఫిరంగులన్నయ్యా! తిరిగి నా వైపు పేల్తున్నాయి.... అదిగో విమానం....తల మీద బాంబులు వేస్తున్నది....(అరచింది ఏడుస్తూంది)

**చిన్నాడు, భూదేవి వాటివంక చూచారు. భూదేవి చర చర బల్లదగ్గర కెళ్ళి వాటినితీసి కిటికీనుంచి అవతల పారేసింది. చిన్నాడు సమును ఓదారుస్తున్నాడు.**

చిన్నాడు: లేదమ్మా! ఏంలేదు....చూడు....నేనిక్కడే ఉన్నానుగా....పిచ్చిపిల్లా.... ఆఁ....అదిగో, పోయిందిలే....అవన్నీ తీసిపారేసిందిగా అమ్మ....ఇంకేం పడుకో....

సమత: (మెల్లగా సర్దుకొని పడుకుంది. ఇంతలో అమరయ్యా, ఒక కార్మికుడు వచ్చారు)

చిన్నాడు: (అమరయ్యను జూచి) అమరయ్యా! శాంతి రాలేదూ?

అమరయ్య: రాలేదుబాబూ!

చిన్నాడు: ఏం?

అమరయ్య: మాతోపాటు వస్తూంటే. వాళ్ళ నాన్నగారు చూచి నానామాటలన్నారండీ.

భూదేవి: ఎవర్నీ?

అమరయ్య. నన్ను, ఆమెను, మిమ్మల్ని, అందర్ని కలిపి. శాంతిని మనం పాడు చేస్తున్నామట. నన్నింకా అనరాని మాటలన్నీ అన్నారు.

చిన్నాడు: శాంతి పూర్కొందా?

అమరయ్య: నాన్నగార్ని ఎదిరించింది. దాంతో ఆయన మరీ రెచ్చిపోయారు.

భూదేవి: శాంతిమీద చేయిజేసుకున్నార్రా?

అమరయ్య: ఆకాడికొచ్చారమ్మా. కానీ, తమాయించుకొని ఆమెను బలవంతాన లాక్కెళ్ళారు. మనింటికే వెళ్ళకూడదన్నారు. (భూదేవి బాధగా వెళ్ళింది)

చిన్నాడు: (ఒక క్షణంసేపు ఆలోచించి) ఊం....పోనీలే....

సమత: అన్నయ్యా! శాంతొదిన రాదూ అయితే?

చిన్నాడు: వస్తుందమ్మా. ఎక్కడ పోతుంది రాకుండా? అంతగా అయితే నువ్వూ, నేను, అమ్మా, తాత, అందరం కలిసివెళ్ళి తీసుకొద్దాంలే....ఏం అమరయ్యా! ఎన్ని సంతకాలైనయ్!

అమరయ్య: ఫ్యాక్టరీకెళ్లా బాబూ.

చిన్నాడు: ఊం ——

అమరయ్య: ఒకరైనా సంతకం చెయ్యలా.

చిన్నాడు: ఏం?

ఇంతవరకు ఊర్కొన్న కార్మికుడు తటాలున ఉద్రేకంతో

కార్మికుడు: ఏమంటే! కడుపుమంట....అందరు నాలాంటి ఎదవలు రావద్దూ, మీరు శెప్పినట్టనటానికి? చేయించారులేవయ్యా,మా లావుసంతకాలు....శాంతంట... యుద్ధమంట ఏదెట్టాపోతే మాకేమో....రేపటినుంచి నాపెళ్ళాం బిడ్డలు కడుపులో కాళ్ళెటుకొని తొంగోవాల....ఓరు పెడతారుకూడు ...ఎదవ సంతకం ఎంత

పనిచేసింది.. ఇది తెలిసుంటే సస్తే శేశేవోణ్ణిగాను. (ఒక్కగుక్కసు దమ్ము పట్టి అనేశాడు. చిన్నాడు విస్తుపోయి వింటున్నాడు. భూదేవి కూడా లోపట్నుంచి ద్వారందాకావచ్చి నిలబడి వింటూంది.)

చిన్నాడు: (కాస్త ఆలోచించి) ఊఁ— ఇప్పు డేమంటావ్!

భూదేవి: అసలేమిట్రా చిన్నాదా! ఇదంతా?

అమరయ్య: ఏం లేదమ్మా.. పెద్దయ్యగారి కొత్త ఫ్యాక్టరీలో పనిచేస్తున్నాడు. మొన్న చిన్నయ్యగారు వెళ్ళి శాంతి పత్రంమీద సంతకం చేయమని అడిగారు. చిన్నయ్యగారు చెప్పిందంతా విని ఒప్పుకొని, ఎచ్చిన తరువాతే చేయమన్రే శాడు. ఈ సంగతి తెలిసి, పెద్దయ్యగారు వీణ్ణి నౌకరీనుంచి బర్తరఫ్ చేశాడు. ఇప్పుడేడుస్తున్నాడు. మేం వాణ్ణి మోసం చేశామని ...

చిన్నాడు: ఏం వీరాయ్...

వీరాయ్: మీరు మోసంచేశారో, ఏం చేశారో, ఆ మాటలు నేననలా....నా నోటికాడ కూడుపోయింది. అంతే.

భూదేవి: నిజమేటియా పాపం! గంపెడు పిల్లలూ వాడు, ఏంజేస్తాడు?

అమరయ్య: కాదమ్మా! ముందు సుఖపడాలంటే, ఇపుడుకొన్ని కష్టాలు పడాలి తప్పకుండా.

వీరాయ్: కలిగినోళ్ళు పడొచ్చునయ్యా. ఎన్ని కష్టాలైనా. ఏనుగు పడుకున్నా గుఱ్ఱ మెత్తు. మాదేంది బికారోళ్ళం. కడుపులో చల్లకదలని మారాజులు ఎన్నైనా శెప్తారు కబుర్లు.

భూదేవి: వీరాయ్! నువ్వూ. పిల్లలు అందరూ ఇప్పట్నుంచి ఇక్కడే ఉండండిరా. మళ్ళానౌకరిదొరికేదాక నాకున్న అంబలో గంజోపోసి మిమ్మల్ని కాపాడుతాను. చిన్నాడు చేసింది పొరబాటే.

వీరాయ్: (సిగ్గుతో తలవంచాడు.)

చిన్నాడు: (నవ్వి) అదికాదమ్మా! నీ పిచ్చిగాకుంటే ఎందర్నని నువ్వు పోషిస్తావ్? సమిష్ఠి సమస్యల వ్యష్ఠిగా ఎట్లా పరిష్కరిస్తావ్?

భూదేవి: నాకీ రాజకీయాలన్నీ తెలియవురా. వాళ్ళను నే నాకలితో చూడలేను. అంతే....

చిన్నాడు: వీరయ్యా! శాంతి పత్రంలో సంతకం చేయడం నీ సొంత వ్యవహారం. మిల్లుకూ దానికి ఏమీ సంబంధంలేదు. నిన్ను బర్తరఫ్ చెయ్యడం దౌర్జన్యం. దీన్ని కూలీలందరూ కలిసి ఎదుర్కోవాలి.

వీరయ్య: ఒక్కనాయాయీ పలకలే. ఓరికేం పట్టిందయ్యా? ఎవరి బదుకు వాళ్ళదై తేనూ!

చిన్నాదు: భయపడకు వీరాయ్. మళ్ళా నీ నౌకరి నీ కొస్తుందిలే. (అతని వీపుతట్టి) వెళ్ళి భోంచెయ్. (అమరయ్యతో) రా తాతా పోదాం! (అమరయ్య, చిన్నాదు వెళ్ళారు.)

భూదేవి: రా నాయనా నీవు తిని, పిల్లలకు తీసుకుపోదువులే.

వీరయ్య: ఈ పూటకు ఫర్వాలేదమ్మా.

భూదేవి: అట్లాకాదు రాచెప్తా.... రా...

వీరాయి - భూదేవి వెంబడే నడిచాడు. లోపలి కెళ్లారు. వాళ్ళు అలా వెళ్ళగానే శాంతి బయటనుంచి వచ్చింది. చాల దీర్ఘాలోచనలోవుంది. తలవంచుకొనివచ్చి హాల్లో ఆగింది. ఒక్క క్షణం తలెత్తిచూచింది. సము ప్రక్కమీద కన్పించింది. మెల్లగా దగ్గరకెళ్ళి సము నిద్రపోతూందని తెలిసి ప్రక్కన్నే కూర్చుంది. లోపలినుంచి భూదేవి వీరాయి మాట్లాడడం వినపడ్తుంది.

భూదేవి: కడుపునిండా తిన్నా.... అన్నం ఉందిలే ఎందుకురా ఏడుస్తున్నావ్?

వీరాయ్: ఎన్నాళ్ళయిందమ్మా! మీ చేతుల్తో మీరు నద్దికలిపి పోస్తే తాగి....చిన్న తనంలో మా నాన్నతోపాటు మనింటికొచ్చేవాణ్ణి....చిన్నయ్యగారు, పెద్దయ్య గారు అందరితోపాటు నాకు కలిపేసేవారు.... ఆ కాలం మళ్ళా వస్తదాతల్లీ!

భూదేవి: ఎందుకు రాదురా! నేను ఆ కాలంకోసమే ఎదురుచూస్తూ బ్రతికున్నాను.

వీరాయ్: ప్చ్! ఇంకేదొస్తుందమ్మా! ఆ మనుషులు, ఆ కాలం ఏరే! ఇప్పుడందరికీ తలలు శెడినయ్ - మనసులు శెడినయ్, బంగారంటి భూములు దారబోసి ఇట్టా చెడ్డాం, లేకుంటే యీ యెదవబతుకేంటి? దర్జాగా ఆపొలాల్లో, గనిమలమీద, తాటిమానులమీద, బండివాడిమీద కూకుంటే మనిల్నిమించిన రాజులెవరని మీసం తిప్పేవోళ్ళం. ఏంటో బానిసబతుకు ఎప్పుడెందుకు వూడబెరుకుతారో ఎరుకలా. రూకలుంటే నూకలొస్తాయనుకున్నాం. పండించేవోళ్ళు లేకుంటే ఎండేడనుంచి వస్తది?

భూదేవి: వీరాయ్! నా మాట ఒక్కటి వింటావా?

వీరాయ్: ఏంటమ్మా?

భూదేవి: చేసిన సంతకం కాగితం మాత్రం తిప్పితీసుకోకు....

వీరాయ్: ఏం తల్లీ!

భూదేవి: శాంతి రావాలి నాయనా? శాంతివస్తే మనకీ బాధలు. భేదాలూ ఏమీ వుండవురా. నామాట నమ్మవ్!

వీరాయ్: అమ్మా, మన్నించండమ్మా! తెలవని ఎదవను....ఏదో కూసాను. మన్నించండమ్మా!

శాంతి ఈ మాటలు వింటూ మెల్లగా సన్నగా పాట మొదలెట్టింది. చల్లగా శాంతిగీతం పాడుతూంది.

ఒక్కనిమిషం తర్వాత వీరాయ్ ఒక పాత్రలో అన్నం పెట్టుకొని వచ్చాడు. శాంతి పాట ఆగింది. భూదేవి వెనకాలే వస్తూ

భూదేవి: వీరాయ్! రాత్రికి అన్నానికిరా.

వీరాయ్: (ఏమి బదులు చెప్పకుండా వెళ్తున్నాడు)

కారుహారన్ వినబడ్డది. పెద్దవాడు వస్తున్నా సవ్వడి. మొదట ఒక బంట్రోతు చిన్నపెట్టె మోసుకొచ్చాడు. పెద్దవాడొస్తున్నదనగానే శాంతి కొంచం కంగారుగా వీరయ్యవైపు వెళ్ళి

శాంతి: వీరయ్యా! నువ్వీదారినవెళ్ళు....ఊఁ....

భూదేవి: ఎందుకమ్మా!

శాంతి: ఆయనొస్తే అన్నం దక్కుతుందా? నా మాటవిను. నువ్వెళ్లు చెప్తా...
(కంగారుగా వాడిని దొడ్డిదారిని పంపటానికి ప్రయత్నిస్తూంది.)

పెద్దాడు: (నిశ్శబ్దంగా వచ్చి వాకిట నిలబడ్డాడు. జరుగుతూన్న దృశ్యం చిరునవ్వుతో చూస్తున్నాడు)

భూదేవి: ఏం ఫర్వాలేదులే. దొడ్డిదారిని పోవాల్సిన కర్మేమొచ్చింది. వాడేం దొంగిలించాడా? దోచాడా? చూస్తే ఏమంటాడు! అన్నంపెట్టకుండా చంపమంటాడా మనుష్యుల్ని? నువ్వీదారినే వెళ్ళరా?

శాంతి: అత్తయ్యా! ఇప్పట్లో మనం కూడా కొత్త ఎత్తుకు ఎత్తుగా పోవాలి. వుత్త అమాయకులుగా వుంటే ప్రమాదం....

భూదేవి: ప్రమాదాలేమీ లేవు. నిజానికి ప్రమాదం ఎన్నడూ లేదు. పదరా నువ్వు....

పెద్దాడు: (సౌమ్యంగా) ఒరే వీరాయ్....

అందరూ వులిక్కిపడి ఇటు తిరిగారు. పెద్దాణ్ణిచూచి తెల్లబోయారు.

పెద్దాడు: పోరా.... ఇటేపో... ఏం ఫర్వాలేదులే! నేనూ మనిషినే! పోరా! అన్నం తీసుకు నేపో!

వీరయ్య మెల్లగా అడుగులో అడుగేస్తూ నడుస్తున్నాడు.

పెద్దాడు: మిమ్మల్ని అన్నం తినొద్దన్నానట్రా నేను మాత్రం? బాగా తినండి ...బాగా పనిచేయండి....హాయిగా నిద్రపోండి. మీ రక్కడితో ఆగితే ఇంకేం? ఏ రష్యావాడో అన్నాడని ఎవరో వెధవలు మీ చెవుల్లో వూదుతారు. దాంతో మీరూ నాలుగు ఎంగిలి ముక్కలు ఏరుకొని. వాళ్ళు చూపించే అరచేతి వైకుంఠాన్ని నమ్ముకొని తలలిరికిస్తారు. అక్కడే తంటా. అది కాదురా ఇప్పుడు శాంతి లేకుండా మీ నెత్తినే పడుతున్నాయా యుద్ధాలు. ..ఏంరా? పోండిరా పిచ్చి వెధవల్లారా! పోండి! గుట్టుగా కూలిరాళ్ళు తెచ్చి వేసుకొని. పెళ్ళాం బిడ్డలకంత పూడుపెట్టి మీరంత తిని. కృష్ణా రామా అనుకోండి.. . పో. ..పో...

వీరయ్య ఈ మాటలు వింటూ మెల్లగా జారుకొన్నాడు.

పెద్దాడు: (భూదేవి, శాంతిపంక చూచి) చూడండి...మీరందరూ నన్నొక రాక్షసుడిలా ఎందుకు చూస్తున్నారో నా కర్థంకాదు. నేనేం మనుషుల్ని పీక్కుతినే జంతువునా! ఈ ఆస్తి పాస్తినంతా నేనేం నెత్తిని కట్టుకపోతానా? మీకు నా కష్టాలేమీ అర్థంకావు. ఇన్ని ఫ్యాక్టరీలు, ఇందరికి జీతాలివ్వటం. యీ ఇన్‌కం టాక్స్ బాధలు. ఇన్నీ నేనెందుకు కట్టుకేడవాలి! ఏం కర్మని! ఏదో నలుగురు బతుకుతారని కాకుంటే....(దూరంగా నిలబడివున్న బంట్రోతుని చూచి) ఒరే! అన్నీతీసి టేబిల్ మీద పెట్టరా. అమ్మా! నీ దృష్టిలో చిన్నకొముకెంత బంగారు కొండైనా, పెద్దవాడెంత వెధవైనా....ఇదిగో వాడు తయారు చేయించింది. శాంతీ! చూడు, నీకు అందమైన వస్తువులంటే చాలా ఇష్టంకదూ! (బంట్రోతు పెట్టెలోంచి చాలా అందమైన పింగాణి సామాగ్రితీసి బల్లమీద వుంచాడు) ఇవన్నీ మనూళ్ళో, మన ఫ్యాక్టరీలో, మన జనం తయారుచేసింది....రైతుల దగ్గర భూమిలాక్కొని నేనేం బావుకున్నానో ఆలోచించండి. ఈ సామాన్లు పరదేశాలకు వెళ్తే మన దేశం ఆర్థికంగా ఎంత అభివృద్ధి పొందుతుందో మన కెంత గౌరవం ఏర్పడుతుందో మీ రిప్పు డూహించుకోలేరు. అమెరికాలో (అంటూ బల్లవైపు తిరిగి) అరె! ఇక్కడున్న మరఫిరంగులు, విమానం ఎక్కడ!

భూదేవి: నేనే తీసి పారేశాను.

పెద్దాడు: ఏం? మీ శాంతి వుద్యమానికి అడ్డు తగులుతుందా?

భూదేవి: ఎందుకా వెధవ బొమ్మలు? కసాయి దుకాణంలా వుంది ఇల్లు.

పెద్దాడు: (నవ్వి) మీ కంతా పిచ్చిపడుతూందమ్మా! ప్రపంచంలో యెక్కడన్నా యుద్ధంరావచ్చు - మన దేశంలో మాత్రంరాదు. మనది తటస్థ దేశం కాకుంటే మనం యుద్ధాన్ని అవకాశంగా తీసుకొని మన దేశాన్ని ఆర్థికంగా బలపరచు కోవాలి. ప్రపంచ వ్యాపారంలో మనమూ ఒక స్థానాన్ని పొందాలి.

శాంతి: అదేగా మీరు చేస్తూ వున్నది. అమెరికాకు తొత్తులై...

పెద్దాడు: శాంతీ!

శాంతి: (ఆవేశంతో) నాకంతా తెలుసు. మీ ఫ్యాక్టరీ గుట్టంతా. మీరింక ప్రజల్ని మోసం చేయటానికి వీల్లేదు.

పెద్దాడు: శాంతీ!

భూదేవి: శాంతీ! ఏమిటమ్మా! ఎందుకలా వణికిపోతున్నావు? ఏం జరిగింది?

శాంతి: యుద్ధోన్మాదులు....హంతకులు రాక్షసులు....అత్తయ్యా! ఫ్యాక్టరీలో రహస్యంగా....

పెద్దాడు: శాంతీ! (లాగి లెంపకాయ యిచ్చాడు)

భూదేవి: పెద్దాడా! ఏమిట్రా! (సమత మేల్కొంది)

పెద్దాడు: శాంతీ! నీ ఆటలింకనైనా కట్టిపెట్టు. నీ తెల్ల పావురాయి యీ పాటికి చచ్చి పడుంటుంది - తెలిసిందా? (నవ్వాడు)

శాంతి: ఆఁ....

పెద్దాడు: నువ్వు రాసిపంపిన కబురు విశ్వానికి అందుతుందనుకున్నావు పాపం! పిచ్చిపిల్లా ఒకవేళ అందినా మీ శాంతి వుద్యమం వట్టి సంతకాలతో తృప్తి పడాల్సిందే! ఆటంబాంబులను సంతకాలు వేలిముద్రలా ఆపేది! (నవ్వుతూ వెళ్లాడు)

శాంతి: (తెల్లబోయి నిలబడ్డది)

భూదేవి: (కంగారుపడుతూంది)

శాంతి: పావురాయి చచ్చిపోయిందా! అత్తయ్యా, నా శాంతిని చంపేశారా! (ఏడుస్తుంది)

ఇంతలో చిన్నాడు గబగబా వచ్చాడు. చేతిలో పావురాయి వుంది.

చిన్నాడు: శాంతీ!

శాంతి: విశ్వం....పావురాయి కులాసాగా వుందా! (ఆత్రంతో చేతిలో తీసుకొని చూచింది.)

చిన్నాడు: తుపాకీతో కాల్చాలని చూచారు. కొద్దిలో తప్పింది.

**శాంతి:** కబురందిందా?

చిన్నాడు: అందింది. కాని ఏమీ లాభంలేదు. ప్రజలు పట్టి మీటింగులతో వుపన్యాసాలతో శాంతి కాముకులుకారు. వాళ్ళకు యుద్ధంయొక్క భయంకర రూపం కనపడాలి. అంతే...మనం కాస్త గట్టిగా పనిచేయాలి. యుద్ధోన్మాదులు చల్లే మత్తుమందు చాలా బలంగా వుంది....

శాంతి. ఇక నే నింటికి వెళ్ళను.

చిన్నాడు: ఏం! మీ నాన్నేమన్నా అన్నారా!

**శాంతి:** నాన్న! నాకు నాన్నా అమ్మా ఎవ్వరూ లేరు...

**భూదేవి:** వూర్కోమ్మా! నే నున్నాగా!

**సమత:** ఒదినా! వెళ్ళొద్దొదినా! ఇక్కడే వుండు....నాతో నే వుండొదినా....

శాంతి: (సము నెత్తుకుంది)

తెర



# నాలుగవ రంగం

ఓ చిన్న ఓపన్ ఏర్ థియేటర్. వూళ్లో జనమంతా నాటకం చూట్టానికి వచ్చారు. ముందువరుసలో స్వాములవారు, భూదేవి కూచున్నారు. గమనింపు: అసలు రంగస్థలాన్నే ఓపన్ ఏర్ థియేటరుగాను, అప్పటి ప్రేక్షకులనే వూళ్లో జనంగాను భావించుకోవచ్చు. ప్రేక్షకులనుంచి వినిపించాల్సిన మాటలకు కొందరు నటుల్ని ప్రేక్షకుల మధ్య కూర్చోపెట్టవచ్చు. తెర ఎత్తకపూర్వం ప్రేక్షకులలోనుంచి స్వాములవారు రంగస్థలంమీదికొచ్చి

స్వాములవారు: తోబుట్టులకు ఆశీస్సులు. ఇప్పుడు మన దొరగారి సోదరుడు విశ్వం, శాస్త్రిగారి కుమార్తె శాంతి మనకు ''యుద్ధం'' అనే చిన్న నాటకాన్ని ఆడి చూపుతారు. మీరందరూ చూచి ఆనందించి, వారి నాశీర్వదించండి.

దిగి వెళ్ళి కూచున్నాడు.

తెర లేచింది.

సమత: (ఇటు అటు పచారుచేస్తూంది) యుద్ధం విచిత్రమైన పుండు. యుద్ధం ఎప్పుడూ వెధవదే! మనుషులందరూ ఒకటే....

అమరయ్య వచ్చాడు.

సమత: తాతా! వచ్చావా! చెప్పు తాతా! యుద్ధాన్ని గురించి.

అమరయ్య: ఆఁ. అనగనగా ఒక దేశంలో...ఒక వూళ్ళో....

సమత: ఏ దేశంలో - ఏ వూళ్ళో?

అమరయ్య: మనదేశం కాకుండా ఇంకేదో ఒక దేశం. ఏ దేశమయినా ఫర్వాలేదు. ఎంచేతంటే యుద్ధంవల్ల నేరుగా దెబ్బతిన్న దేశాలన్నిటిలోను - జర్మనీ, జపాను, ఇంగ్లాండు, ఇటలీ....యిలాంటి అన్ని దేశాలలో యీలాంటి కథలు జరిగినయి. కనుక అందులో ఏదో ఒక దేశం - ఏదో వూరు. ఆ వూళ్ళో ఒక అబ్బాయి ఒక అమ్మాయి వుండేవాళ్ళు. ఎవరుండేవాళ్ళు?

సమత: ఒక అబ్బాయి, ఒక అమ్మాయి.

అమరయ్య: ఆఁ. వాళ్ళిద్దరూ ఎంతో అందంగా ఉండేవాళ్ళు. వాళ్ళిద్దరూ ప్రేమించుకున్నారు. చిలకా గోరువంకల్లా ఎంతో ముద్దుగా ఉండేది వాళ్ళజంట. పెళ్ళి చేసుకోవాలని ముహూర్తం కూడా నిశ్చయించుకున్నారు. రేపు పెళ్ళనగా

యీ రోజు కార్లో అలా బీచివైపు - షికార్లుకొట్టి - సముద్రం ఒడ్డునేవున్న ఓ పెద్ద హోటల్లో కెళ్ళి కూర్చున్నారు. అక్కడ....

చిన్న తెర విడిపోయింది. స్పాట్‌లైటు వెల్తుర్లో వాళ్ళిద్దరూ కూర్చున్నారు. ముందు టేబిల్‌మీద ఏవేవో ఫలహారాలున్నాయి. పిచిగాలికి వాళ్ళ వుడుపులు రెప రెప లాడుతున్నాయి. సముద్రఘోష వినిపిస్తూంది. రేడియోలో ఇంగ్లీషు సంగీతం ఆ ఘోషలో కలిసిపోతూంది. ఆమె నుదుటిమీద ముంగురులు ఇసుకమీద ఆట్లాడుకునే పిల్లల్లా గెంతుతున్నాయి. అతడు సిగరెట్ పీల్చి వదు ల్తూన్న పొగ గాలికి పత్తా లేకుండా పోతూంది.

అతడు: బేబీ! సముద్రం వెన్నెలలో తళతళ మెరిసిపోతూంది.

బేబీ: అవును జాన్! చందమామ సముద్రపు టలలు వుయ్యాల కట్టుక వూగు తున్నాడు. వెండి నురుగులు చిలికి పోస్తున్నాడు కదూ?

జాన్: మనం ఎంత అదృష్టవంతులం.

బేబీ: ఏం?

జాన్: ఈ వెన్నెల, ఈ సముద్ర సంగీతం, ఈ చల్లని బీచిగాలి, అనుభవించలేని వాళ్ళెందరుంటారు? ఈ దారిని పోతూకూడా ఈ పూలవైపు కన్నెత్తి చూచే తీరికలేని వాళ్ళెందరుంటారు? బేబీ మనం ఎప్పటికీ యిలాగే వుండిపోతాం. మన కీ ప్రపంచంతో ఏలాటి సంబంధం వద్దు బేబీ!

బేబీ: నేను కావాలన్నానా జాన్! నా క్కావలసిందల్లా ఏమిటో చెప్పు చూద్దాం.

జాన్: నేను. కదూ?

బేబీ: అవును జాన్! నా జాన్!

జాన్: బేబీ అందం ఎలాగుంటుందని ఎవరన్నా అడిగితే నేను ఏం చెపుతానో తెలుసా?

బేబీ: ఏం చెపుతావ్?

జాన్: నా బేబీలా వుంటుందని చెప్తా.

బేబీ: (నవ్వింది) ములగచెట్టెక్కించే పొగడ్త లెలాగుంటాయి అని ఎవరయినా అడిగితే నేనేం చెప్తానో తెలుసా?

జాన్: ఏం చెప్తావు?

బేబీ: నా జాన్‌ను చూపెడతా!

ఇద్దరూ నవ్వారు

జాన్: బేబీ! రేపీపాటికంతా మనం ...

బేబీ: ఏమైపోతాం....

జాన్: ఒకి పైపోతాం.

బేబీ: ఎలా....

జాన్: ఈలా....

బేబీ: ఇదిగో....ఏమిటిది.... మరీ కుర్రతనం . .

జాన్: బేబీ! (ఆవేశంతో చూచాడు)

బేబీ: ఏం? కవిత్వం వస్తుందా?

జాన్: నిన్ను చూస్తుంటే రాకేమవుతుంది!.... కవిత్వం నీ కళ్ళల్లోంచి పుట్టి వస్తుంది బేబీ!

బేబీ: పోవోయ్....నువ్వెప్పుడూ యిలా కవిత్వం మాట్లాడుతావు. మామూలు మనిషిలా మాట్లాడవేం? నాకేంటోలాగుంటుంది.

జాన్: బేబీ (కాలిపోయిన సిగరెట్ కాలికిందవేసి నలిపి, కుర్చీనుంచిలేచి) నా ప్లాన్ ఏమిటో చెప్పమన్నావా?

బేబీ: చెప్పు.

జాన్: ఈలారా చెప్తా....రామరి.... ఊఁ.

బేబీ: (వచ్చింది. పక్కన నిలబడ్డది.)

జాన్: (ఆమె తల భుజంమీద ఆనించుకొని) బేబీ! అదిగో!.... అలా చూడు ... అక్కడ.... ఆ మబ్బుల చాటున.... ఆ కొండమీద ఓ చిన్న బంగ్లా కడదాం....రేపు పెళ్ళయిన వెంటనే కట్టిస్తా. ఆ బంగ్లాలో హాయిగా నువ్వూ నేను మాత్రం....ప్రశాంతంగా....పాడుకుంటూ ఆడుకొంటూ....

బేబీ: అబ్బ! ఎంత తీయనికలలు కంటున్నావోయ్?

జాన్: కలలు కావు బేబీ! నిజంగానే....ప్రపంచం ఏమైపోయినాసరే మన కక్కర్లేదు.... నాక్కావలసింది నువ్వు, నీ ప్రేమ, నీ అందం, నీ చిరునవ్వు....

బేబీ: ఆగాగు.... నన్నూపిరి పీల్చుకోనీయ్! (కిలకిల నవ్వింది.)

జాన్: (పరవశుడై పోయాడు.) ఓహ్! ఎంత కమ్మగా నవ్వుతావు బేబీ....

బేబీ: ఓహ్! ఎంత తియ్యగా పిలుస్తావు....అమ్మ, నాన్న, అందరూ నన్ను బేబీ అనే పిలుస్తారు కానీ యీతీపి లేదెందువల్లోయ్?

జాన్: అంతా నీలోంచి వచ్చిందేబేబీ! బేబీ! ఏదీపాడు....ఒక్కపాట....తియ్యగా.... హాయిగా....పాడు బేబీ....

బేబీ: నువ్వూ కలవాలి ..

జాన్: నేను వేరేగా ఇక వుండలేను బేబీ!

పాట మొదలెట్టింది. ఇద్దరూ కలిసి పాడుతున్నారు. పాట మంచి పట్టులో వుండగా సైరన్ కూత, విమానాల మోత - ఇద్దరి పాట తటాలున ఆగి పోయింది. ఒక్క క్షణం అలా మాన్పడి నిలుచున్నారు.

బేబీ: జాన్ (గట్టిగా కౌగలించుకొంది.) యుద్ధం ... బాంబర్లు జాన్ ....

జాన్: బేబీ! (ఆమెను సముదాయిస్తూ విమానాలవైపు చూస్తున్నాడు. విమానాల ననుసరించి అతని దృష్టి తిరుగుతుంది.)

బేబీ: జాన్ ....రేపు మనపెళ్ళి....రేపు పెళ్ళి....ఆపేస్తావా జాన్ ....ఆగదు కదూ? యుద్ధం లేని ఏ దేశానికైనా వెళ్ళిపోదాం జాన్.

ఆమె ఏడుస్తూంది. అతడు ఆమెను సముదాయిస్తున్నాడు.
రంగస్థలం చీకటయి పోయింది.

వాళ్ళిద్దరూ ఎన్నో తీయ తీయని కలలుకన్నారు. పెళ్ళిచేసుకొని ఎంతో హాయిగా, ఈ ప్రపంచాన్ని మరచి తమకు తామొక కొత్త ప్రపంచాన్నే కట్టుకు పోవాలనుకున్నారు. కానీ వాళ్ళ కలలన్నీ ఎగిరిపోయాయి. యుద్ధం వచ్చింది. మరుసటిరోజే ఆతను యుద్ధంలోకి వెళ్ళాలి. పెళ్ళి ఆగిపోయింది. పెళ్ళికానుగ్గా చాలా ఖరీదయిన డ్రెస్‌కొన్నాడు బేబీకి జాన్. ఆ డ్రెస్ బేబీ వేసుకుంటే చూడాలని వువ్విళ్ళూరేవాడు. ఆ డ్రెస్ తీసుకొని చివరిసారిగా తన ప్రియురాల్ని తన బేబీని కలుసుకొన్నాడు.

మళ్ళా తెర విడిపోయింది. బేబీ, జాన్ ఉన్నారు. బాంబులుపడి కూలిపోయిన పెద్ద భవనం. దూరంగా ఇంకా కాలుతూన్న ఇళ్ళు. ఆ శిథిలాలలో నిలబడి వున్నారు. మాడిపోయిన చెట్టు ఒకటి ఉంది.

జాన్: బేబీ!

బేబీ: ఆఁ (వంచివున్న తలయెత్తి అతని వంక చూచింది. కన్నీటికాల్వ ఆమె చెక్కిళ్ళనుంచి రొమ్ములమీద పడింది)

జాన్: ఏడుస్తున్నావా?

బేబీ: అవును....

జాన్: నేను యుద్ధంలోకి వెళ్తున్నాననే కదూ?

బేబీ: కాదు.

జాన్: చచ్చిపోతానని భయమా?

బేబీ: లేదు.

జాన్: తిరిగొచ్చి పెళ్ళి చేసుకుంటానో చేసుకోనో అనా బేబీ?

బేబీ: అవేవీ కావు జాన్!

జాన్: మరి.

బేబీ: ఎందుకొప్పుకొన్నావ్ జాన్ యుద్ధానికి వెళ్ళటానికి....నన్ను మరచిపోయావు కదూ?

జాన్: కాదు బేబీ....కానే కాదు. ప్రభుత్వ ఆజ్ఞ....

బేబీ: ప్రభుత్వం....ప్రభుత్వంతో చెప్పలేకపోయావా బేబీని ప్రేమిస్తున్నానని.

జాన్: పిచ్చిబేబీ! వూర్కో....యుద్ధం తొందరగా అయిపోతుంది. వచ్చేస్తాగా.

బేబీ: పోనీ నన్నుకూడా తీసుకెళ్ళు జాన్....

జాన్: నిన్నా!

బేబీ: ఏం!

జాన్: కాదు బేబీ! నువ్విక్కడే వుండు....నేనొక్క నెలలో వచ్చేస్తా....

బేబీ: ఒక్కనెలే! జాన్....

జాన్: రోజూ ఉత్తరం వ్రాస్తుంటాగా....ఇదిగో నీకని కొన్నా నీ గవును....బేబీ.... ఏదీ ఒక్కసారి యీ డ్రెస్ వేసుకురా....చూచి వెళ్తాను....వేసుకోవూ?

బేబీ: వేసుకుంటా జాన్....(వెళ్ళింది)

జాన్: (ఆలోచిస్తూ నిలబడి వున్నాడు. అతని చెవుల్లో మిలటరీ డ్రిల్లు ఆర్డర్లు మోగుతున్నాయి. రైట్, లెఫ్ట్, క్విక్‌మార్చ్, లెఫ్ట్ టర్న్. అటాక్, రిట్రీట్.... చార్జ్....ఈలాంటివి. తలపట్టుకుని కూలబడ్డాడు....బేబీ కొత్త డ్రెస్‌వేసుకొని వచ్చింది.)

బేబీ: (వచ్చి నిలబడ్డది.)

జాన్: (తలెత్తి చూచి) బేబీ! మై బేబీ!

బేబీ: బాగున్నానా?

జాన్: మాట్లాడకు బేబీ....అలాగే చూస్తుండనీ....బేబీ....

తనచేతి ఉంగరం ఆమె వేలికి పెట్టాడు. ఆమె తన ఉంగరం
అతని వేలికి పెట్టింది.

జాన్: ఈరోజే మన పెళ్ళిరోజు. (స్టీమరుకూత) టైమైంది....నవ్వు బేబీ....ఏదీ నవ్వు!

బేబీ: (నవ్వింది.)

జాన్: బాగా....

బేబీ: (బలవంతాన నవ్వింది.)

జాన్: అలాగే నవ్వుతూండు బేబీ....స్టీమరు కనుచూపు దాటిపోయేవరకు అలాగే నవ్వుతూండు....బేబీ! (ఆమె నవ్వుతూంది. అతడు ఆమెనుచూస్తూ వెనక్కి వెళ్తున్నాడు. ఆమె వక్షంలో ఏదో అశాంతి పొంగుతూంది.)

బేబీ: (వున్నట్లుండి) జాన్! (అతనిదగ్గరకు పరుగెత్తి గట్టిగా కౌగలించుకుంది. అతడామె నుదుటిమీద ముద్దెట్టుకున్నాడు. ఆమె జాన్ అంటూ అతని వక్షస్థలంమీద ముఖంపెట్టి ఏడుస్తూంది. పక్కనుంచి ఒక బలమైనచేయి అతన్ని లాగేసింది. ఆమె అతని వెంబడి పరుగెత్తబోయింది. గేట్ మూయబడింది. ఆమె ఆగి అలాగే చూస్తుంది కొయ్యబొమ్మలా, చీకటి పడింది.)

అమరయ్య: అలా ఆ రెండు హృదయాలను యీ పాడు యుద్ధం వేరుచేసింది తల్లీ. బలాత్కారంగా విడదీసి దూరంచేసింది. వాళ్ళిద్దరే కాదు....ఈలా దేశంలో ఎందరో విడిపోయారు. లేత బాలింతరాళ్ళి, కావుకావను పసికందును వదలి వెళ్ళారు. పెళ్ళయి మూడురోజులయినా కాకపూర్వమే భార్యలను వదలి వెళ్ళారు.........ఎందరి జీవితాలో తలక్రిందులయినయ్. అవమానాలకూ, అపవాదులకూ, అనుమానాలకూ గురి అయ్యారు....ఒక యింట్లో....సరిగ్గా ప్రసవసమయం. గదిలో ఇల్లాలు నొప్పులు పడుతూంది. బయట భర్త హృదయం తుళ్ళిపడుతూంది. కొడుకో కూతురో అన్న ఆదుర్దా — దుర్భరమైన బాధతో ఇల్లాలు హృదయవిదారకంగా పెడుతోన్న మూల్గులు — చావు బ్రతుకులమధ్య ఆ యిల్లాలు చేస్తున్న పోరాటం....యుద్ధం వచ్చిపడింది.... కొడుకో కూతురో తెలియకుండానే....భార్య బ్రతికిందా....లేక....ఏమీ తెలియకుండానే వెళ్ళాడు ఆ భర్త....యిల్లా ఎన్నో గుండెలు చీల్చే ఘట్టాలు.... అలాగే అతనూ వెళ్ళాడు....యుద్ధరంగంలో...

చిన్న తెర విడిపోయింది. ఒక మిలిటరీ క్యాంపు. చిన్న గుడారము. నలుగు రైదుగురు సైనికులు పడుకొని ఉన్నారు. రాత్రి. గాఢాంధకారము. జాన్ కూర్చున్నాడు. సిగరెట్ మీద సిగరెట్ కాల్చేస్తున్నాడు. తనలో

జాన్: ఏమిటీ బ్రతుకు?....ఎందుకీ యుద్ధం? ఎందరు అందమయిన ఆడవాళ్ళు చచ్చిపోయారు? ఎందరు పాపలు పాలులేక నోరెండిపోయారు?....ఎన్ని చక్కని

సౌధాలు, పూలతోటలు నాశనమయినాయ్? ఎన్ని సంవత్సరాల కష్టం బూడిదపాలయింది? ఎందుకీ యుద్ధం? దేశంకోసమా? ఏమిటి దేశమంటే? ఎక్కడుంది దేశం? ఇదంతా నాశనమయిన తరువాత దేశం ఏముంటుంది?

రేడియో ప్రకటన : ఒక శబ్దం

ప్రకటన: శత్రుసైన్యాలు పరాజయం పొందుతున్నాయి. మన సైన్యాలు ముందుకు పోతున్నాయి. రాజధానికి నలభై మైళ్ళలో వున్నాం మనం. రేపురాత్రికి రాజధానిని నాలుగువైపులనుంచీ ముట్టడించాలి మనం.

జాన్: ఏం ముట్టడించకపోతే?

ప్రకటన: శతృసైనికులు 200 మంది పట్టుబడ్డారు. నాలుగు గ్రామాలు మనవశమయినాయ్.

జాన్: గ్రామాలు కావు శ్మశానాలు.

ప్రకటన: విజయం మనదే. తప్పదు. సైనికులారా! ధైర్యం వహించండి? మీ సర్వస్వం ధారపోసి పోరాడండి.

జాన్: ఇంకేముంది ధారపోయటానికి మా దగ్గర.

ప్రకటన: ఈసారి శత్రుపక్షం నుండి తీవ్ర ప్రతిఘటన వుంటుంది. ప్రతి శత్రువూ ఒక బలమైన కోటగా తయారవుతున్నాడు. ప్రతి యిల్లూ ఒక యుద్ధరంగమవుతుంది. శత్రువులు చివరి నెత్తురుబొట్టుదాకా పోరాడుతారు. కాని జడవకండి. ధైర్యంగా ముందుకు రండి. దయాదాక్షిణ్యరహితంగా పోరాడండి. విజయం మనదే.

జాన్: (పిచ్చిగా అరుస్తూ) ఆపండి! యుద్ధం ఆపండి!! ఆపండి యుద్ధం. ఎవరు కావాలన్నారు? ఎవరికోసం? ఎందుకీ చంపటం? చావటం? ఆపండి....వద్దు యుద్ధం వద్దు.

సైనికుడు: (పడుకున్న సైనికుడు లేచాడు) జాన్!

జాన్: (వాడి భుజాలు పట్టుకొని) ఎవరిక్కావాలి యుద్ధం. నీక్కావాలా. చెప్పు—నువ్వు కావాలన్నావా చెప్పు.

సైనికుడు: జాన్ ఏమిటిది?

జాన్: ఏయ్! అడిగిందానికి చెప్పు! నువ్వు యుద్ధం కావాలన్నావా?

సైనికుడు: లేదు.

జాన్: మరి చెప్పవేం? గట్టిగా అరవ్వేం! నోరు పడిపోయిందా. యుద్ధం వద్దని అరవ్వేం.

సైనికుడు: జాన్ ...హహో.

జాన్: బేబీ... బేబీ (ఏడుస్తున్నాడు)

సైనికుడు: (అతన్ని వీపుమీద తడుతూ) నీ పెప్పకుమందు నాకు తెలుసు. రేపు నాతో రా ఇప్పిస్తా!

జాన్: (ఏమీ అర్థంగాక ఆతనివైపు చూచాడు.)

సైనికుడు: (పెద్దగా నవ్వాడు. అంతా చీకటైపోయింది.)

అమరయ్య: అక్కడ అతనలా జరుగుతూన్న పైశాచికమారణానికి మనసును నచ్చ చెప్పుకోలేక. బేబీమీద ప్రేమపోక, అంతర్యుద్ధం చేస్తున్నాడు. ఇక్కడ దేశంలో - యుద్ధం మూలాన ఆహారోత్పత్తి తగ్గిపోయింది. పండినదానిలో చాలా భాగం మిలటరీకి సరఫరా అయిపోతోంది. మిగిలిన కాస్త దొంగ బజార్లోకి వెళ్ళి దాగింది. ఫలితం కరువు - కాటకం - తిండిలేక సామాన్య జనం మలమల మాడిపోతున్నారు. ఎక్కడ చూచినా శవాలు - ఆకలి — వెన్నుకంటిన డొక్కలు....మనుష్యుల్ని మనుష్యులు తిన్నారు....ఎంగిలాకుల కోసం కుక్కలతో పోట్లాడారు....ఎందరో మానవతులు....

చిన్న తెర విడిపోయింది; అంతా చీకటి. ఎక్కడో ఒకటి రెండు మేడల్లో దీపాలు మినుకుమినుకు మంటున్నాయి. చిక్కిశల్యావశిష్టమైన కుక్కలు దారి పక్కన పడివున్న శవాలను రుచిచూచుకుంటూ తిరుగాడుతున్నాయి. ఎండి పోయిన చెట్టు ఎముకలగూడులా నిలబడి ఉంది. ఆ చెట్టుమీద ఒక పక్షిగూడు. అందులో రెండు పిల్లలు, ఒక తల్లిపక్షి చచ్చివేలాడుతున్నాయి, ఒక పక్కగా ఒక పంపు వుంది. ఒక శవం చేతిలో సగం పగిలిన బొచ్చె వుంది—మూల్గులు - దేహాన్ని విడిపోతూన్న ప్రాణుల బాధలు - బేబీ వచ్చింది భుజంమీద తమ్ముని మోసుకొని. చాలా నీరసించిపోయి వుంది. ఏడ్చిఏడ్చి కాబోలు కళ్ళు వుబ్బి ఎర్ర వారి వున్నయ్. ముఖం పాలిపోయి వుంది. వచ్చి దృశ్యమంతా ఒకసారి కలయ జూచింది. గుండెలాపుకోడానికేమో తమ్ముణ్ణి గట్టిగా ఆదుముకుంది. ఇంతలో పంపు కనిపించింది. చాలా ఆశతో ఆత్రంగా పంపు దగ్గరకెళ్ళి — తమ్ముని కాళ్ళమీద పండుకోబెట్టుకొని, నిద్రపోతూన్న వాణ్ణి లేపుతూన్నట్లు వూపుతూ తమ్ముా! తమ్ముా! మంచినీళ్లు - అంటూ కుళాయి తిప్పింది. నీటిచుక్క లేదు. మనిషి ఒక్కసారిగా కుంగిపోయింది. తమ్ము ఒక్కసారి కాళ్లు చేతులు గిజ గిజ తన్నుకున్నాడు. మరీ ఆదుర్దాగా అన్ని పక్కలా వెతికింది. శవం చేతిలో బొచ్చె కనిపించింది — ఒక్క గంతులో ఆ బొచ్చె అందుకుంది. ఆత్రంతో

బొచ్చె వంచింది. అందులో మంచినీళ్లు కాదు. — రక్తం పారింది. మనిషి కంగారుపడి కెవ్వుమంది. తమ్ము మరొక్కసారి చేతులు కాళ్లు తన్నుకుని తల వాల్చాడు. బేబీ వాడిమీదపడి వెక్కి-వెక్కి ఏడుస్తూంది. ఒక పెద్దమనిషి - చాలా దర్జాగా — చుట్ట పీలుస్తూ చేతికర్ర ఆడించుకుంటూ వచ్చాడు. ఒక శవం అతని కాళ్ళకు తగిలింది. చూచి విసిరితన్నాడు. ఇంతలో బేబీ ఏడ్పు వినిపించింది. కాస్త నిదానించి విన్నాడు. మెల్లగా దగ్గర కొచ్చాడు. బేబీని ఎగాదిగా చూచాడు. ఏమనుకున్నాడో కాని,

పెద్దమనిషి: ఎయ్.
బేబీ: (ఏడుస్తూనే వుంది.)
పెద్దమనిషి: (చేతికర్ర నేలకేసి కొడుతూ) ఏయ్! నిన్నే!
బేబీ: (తలెత్తి చూచింది)
పెద్దమనిషి: ఎందుకేడుస్తున్నావ్?
బేబీ: తమ్ము....తమ్ము చచ్చిపోయాడు....
పెద్దమనిషి: చ్ చ్ చ్ ....పోనీలే.
బేబీ: ఆఁ!
పెద్దమనిషి: చచ్చిపోయినవాళ్ళను పోనీకుండా ఏడ్చి బతికిస్తామా! పిచ్చిగాకుంటే.... చూడు....దేశంలో చాలామంది పోయారు.
బేబీ: అవును....అన్నంలేక....ఆకలితో....
పెద్దమనిషి: అదంతా వట్టిది. కాలం తీరింది పోయాడు. కారణం ఏదో ఒకటి ఉండాలిగా. అంతే! ఇదిగో....నీకు ఆకలిగా లేదూ!
బేబీ: లేదు.
పెద్దమనిషి: ఆఁ!
బేబీ: దాహం నాలిక పెడచకట్టుకు పోతూంది.
పెద్దమనిషి: అన్నం తిని ఎన్ని రోజులయింది.
బేబీ: జ్ఞాపకం లేదు.
పెద్దమనిషి: నీళ్ళు తాగి —
బేబీ: నిన్నట్నుంచి నీళ్ళు కూడా లేవు....తమ్ము దాహంతోనే చచ్చిపోయాడు.... అంత నీళ్ళు పోసుంటే బతికేవాడు —
పెద్దమనిషి: అదంతా వట్టి భ్రమగాని........నువ్వు పాడగలవ్.
బేబీ: పాట.

పెద్దమనిషి: ఆఁ!
బేబీ: హుఁ!
పెద్దమనిషి: చెప్పు!
బేబీ: ఒకప్పుడు బాగా పాడేదాన్ని ఇప్పుడు గొంతు పోయింది.
పెద్దమనిషి: దాన్ని చేస్తావ్. (చేయగలవ్.)
బేబీ: రాదు. నేర్పిస్తే నేర్చుకుంటా....
పెద్దమనిషి: ఊఁ. నాతో వస్తా...నీకు ఉద్యోగం ఇప్పిస్తా.
బేబీ: నాకా.
పెద్దమనిషి: ఆఁ! పందరూపాయలు జీతం!
బేబీ: పందరూపాయలే?
పెద్దమనిషి: అవును.
బేబీ: వస్తానండి. బాగా వండుతా. — బట్టలు ఉతుకుతా. — వూడుస్తా. — ఇస్త్రీ చేస్తా....
పెద్దమనిషి: అవన్నీ ఏమీ చెయ్యనక్కర్లేదులే.
బేబీ: లెక్కలు వ్రాస్తా. కొద్దిగా చదువుకున్నా....
పెద్దమనిషి: చదువువద్దు ఏమీవద్దు....నీకు పెళ్ళయిందా?
బేబీ: అయింది. (చేతులో వుంగరం లేకపోవటం చూచి) లేదు.
పెద్దమనిషి: నిజం చెప్పు. పెళ్ళయి వుంటే వందరూపాయలు. కాకుంటే నూట యేభై.
బేబీ: కాలేదు. కాలేదండి.
పెద్దమనిషి: (నవ్వి) ఊఁ - సరే, - నాతో రా!
బేబీ: తమ్ముడు.
పెద్దమనిషి: చచ్చిపోయినవాడి నేం చేస్తావు ఆ శవాల్లో వాడూ ఒకడు...అలా పారే....
బేబీ: ఆఁ. తమ్ముడు....(మళ్ళా ఏడుస్తూంది.)
పెద్దమనిషి: (కాస్సేపుండి చేతికర్ర కొడుతూ) ఇదిగో! టైమ్ అయింది, ఊఁ, ఊఁ.
బేబీ: (తటపాయించుకుంది. లేచి నాలుగడుగులేసి తడబడుతుంది.)
పెద్దమనిషి: జాగర్త...దగ్గరేలే....మిలటరీ క్యాంపు....రారా!
బేబీ: (అతన్ని వెంబడిస్తుంది....చీకటి పడింది)

అపరయ్య: ఇలా ఎందరో మానవతులు తమ శీలానమ్ముకున్నారు. ఆకలి, మనిషిని ఎంతకయినా దిగజారుస్తుంది. ఇక్కడ ఈలా ఉండగా అక్కడ యుద్ధ రంగంలో అతను — మనసు నిలకడలేక — లోపలి ఆవేదన అణచుకునే మార్గంలేక. ఉండలేక బైటపడలేక, అవస్థపడుచున్నాడు. అతని అవస్థ గమనించాడా స్నేహితుడు. మెల్లగా అతని బాధనంతా మరచిపోవటానికి రాగుడు మరిపాడు. మనిషి ఒక మెట్టు దిగాడు. ఇక ఆ స్నేహితునితోబాటు వ్యభిచారగృహాలు తొక్కాడు. డబ్బు పారేసి ఆడదాన్ని కొంటున్నాడు. ఇన్నాళ్ళూ స్త్రీ అంటే ఎంతో గౌరవం కల మనిషి ఇప్పుడు స్త్రీని కేవలం తన కామం తీర్చే యంత్రంలా చూస్తున్నాడు. ఇన్నాళ్ళూ ప్రేమమీద విశ్వాసం కల మనిషి ఇప్పుడు కేవలం శారీరక సౌఖ్యమే నమ్ముచున్నాడు. అతనిలో అనురాగం చచ్చింది. హృదయం బీడువారిపోయింది. అతనిప్పుడు మనిషి కాడు. కేవలం తుపాకిని మోస్తూ పేలుస్తున్న, ఒక మరమనిషి. అలా అతనొక వ్యభిచార గృహానికి వెళ్ళాడు — అక్కడ....

చిన్నతెర విడిపోయింది. ఒక సామాన్య గృహం. అందులో ఒక మంచం — ఒక అద్దం - టేబిల్ - ఒక చిన్న బల్ల - దానిమీద బుడ్డీలు. అతడు అతని స్నేహితుడు బాగా తాగివున్నారు.

సైనికుడు: ఏం బ్రదర్....ఏది కావాలి నీకు ..పొట్టిదా....పొడుగుదా.

జాన్: పొట్టిదే బెటర్ — గుడ్ ...

సైనికుడు: వెరిగుడ్....హావిట్....మేక్ ఎ హాపీనైట్....గుడ్‌నైట్....చీరియో... చీరియో....టా...ట...టా...టా టాటటా....టా....ట....టా, (కాస్సేపు ఇద్దరూ డాన్సు చేస్తారు.) రైటో....వస్తా బ్రదర్....(నాలుగడుగులు నడిచి తిరిగి) బ్రదర్ సిగరెట్!

జాన్: (సిగరెట్ పాకెట్ తీసి) ఓ యస్ హావిట్.

సిగరెట్ తీసి నోట్లో పెట్టుకొని అగ్గిపెట్టె తెరచి సైనికునికి చూపిస్తాడు. సైనికుడు వొక పుల్లతీసి నోట్లో పెట్టుకొంటాడు. అతడు అగ్గిపుల్ల గీసి వెలిగిస్తాడు. అగ్గిపుల్ల భగ్గుమంటుంది. సైనికుడు ఎగిరిపడ్డాడు. ఆక్రోశంకొద్దీ అతనికొక దెబ్బ యిస్తాడు. అతడు తిప్పియిస్తాడు. ఇద్దరూ కాస్సేపు దెబ్బలాడుతాడు. ఇంతలో సైనికుడు తెల్లగుడ్డ తీసి వూపుతాడు. అతడాగుతాడు.

సైనికుడు: పీస్ బ్రదర్ పీస్.

జాన్: రైటో....మనం ఫ్రెండ్సు....షేకాండ్ బ్రదర్ షేకాండ్.

సైనికుడు: సిగరెట్ పారెయ్....(షేకాండయి, ఇద్దరూ సిగరెట్ కాల్చుకుంటారు; వొకేసారి ఒకే అగ్గిపుల్లతో) గుడ్‌నైట్! (కొంతదూరం వెళ్ళి తిరిగివచ్చి) బ్రదర్! నీ బేబీ....బేబీ జ్ఞాపకముందా?

జాన్: బేబీ! (గుర్తు తెచ్చుకొంటానికి ప్రయత్నిస్తాడు.)

సైనికుడు: వెరిగుడ్...మరచిపోయావు....దటీజ్ నైస్... చీరియో. .(వెళ్ళాడు)

జాన్: కూలబడి బేబీ....బేబీ....(గొణుక్కొంటున్నాడు.)

బేబీ: (బేబీ మెల్లగా అతని వెనకాలే వచ్చింది. చాలా కృత్రిమంగా డ్రెస్ చేసుకుంది. ముఖంనిండా రంగే. ఆ కళ్ళల్లో మునుపటి వెలుగులేదు. వెనకాలే వచ్చి అతని కళ్ళు మూసింది. అతనేం పెద్దగా చలించలేదు.)

జాన్: ఊఁ ___ తీ.... తీ. .

బేబీ: ఎవరో చెప్పుకోవాలి.

జాన్: ఎవరా! డబ్బుకు శరీరాన్నమ్ముకునే దొంగంది.

బేబీ: ఆఁ! అయితే నువ్వో?

జాన్: నేనా! డబ్బిచ్చి ఒక ఆడదాని శరీరాన్ని కొనే వెధవను.

బేబీ: (నవ్వి) అంత అసహ్యమయితే ఎందుకు రావాలి?

జాన్: కారణాలు చెప్పుకోవాలా?

బేబీ: పోనీ నన్ను ప్రేమిస్తావా?

జాన్: ప్రేమ! నిన్నా!!

బేబీ: ఏం అందంగా లేనా.

జాన్: అందం! (నవ్వుతాడు)

బేబీ: చూస్తుంటే నువ్వెవ్వరినో ప్రేమిస్తున్నట్టున్నావు, అవునా?

జాన్: నేను లక్ష మందిని ప్రేమిస్తాను నీ కెందుకు? (అంటూ విసురుగా ఆవిడను వెనుకనుంచిలాగి పక్కమీద పడేసుకున్నాడు. బేబీ జాన్‌ను చూచింది, గుర్తించింది)

బేబీ: జాన్!....

జాన్: (పరిస్తనిదానించి చూచి) బేబీ!

బేబీ: నువ్వా!....

జాన్: నువ్వా?___ (మొత్తం వొక్కసారి చూచాడు) బేబీ! (ఆమెను పక్కమీద నుంచి లేపదీశాడు. భుజాలు పట్టుకున్నాడు. ముఖంలోకి చూచాడు. బేబీ చెప్పలేని కంగారు___సంతోషం దుఃఖం అన్నీ అనుభవిస్తూంది) బేబీ! బేబీ!

(అంటూ ఆమెను వూపాడు) బేబీ: — ఛీ: (వొక్కసారి విసిరికొట్టాడు పక్కమీదికి)

బేబీ: (పక్కమీద మూటకట్టుగా పడ్డది. వొక్కక్షణంలో సర్రుమని లేచింది) జాన్!

జాన్: షటప్.

బేబీ: జాన్! (అతనివైపు నడిచింది)

జాన్: జాన్! ఎలా నోరాడింది పిలవటానికి. ఎలా ముఖం చూపగల్గుతున్నావు ఛీ! వెధవబ్రతుకు! ఇంతకన్నా ఈ భోగంబ్రతుకుకన్నా చావకూడదూ?

బేబీ: జాన్!

జాన్: ముయ్‌నోరు! నేను నీ జాన్నీ కాను నువ్వు నా బేబీవి కావు. నా బేబీ ఏనాడో చచ్చింది.

బేబీ: జాన్ (అంటూ అతని చేయిపట్టుకుంది.)

జాన్: గెటౌట్ (అంటూ మళ్ళీ విసురుగా తోశాడు.)

బేబీ: (ఈసారి పడకుండా నిలతొక్కుకున్నది)

జాన్: (వెళ్తున్నాడు)

బేబీ: (వొక్కక్షణం ఆలోచించింది. ఆవేశం వచ్చింది. ఒక నిర్ణయానికి వచ్చింది. గంభీరంగా అన్నది.) జాన్!

జాన్: (ఆ కంఠంలో మార్పు గుర్తించాడు. ఆగాడు. ఏదో అధికార స్వరంలా ఆ పిలుపు ఆతన్ని ఆపింది.)

బేబీ: (తాపీగా అతని దగ్గరకు వెళ్తూ చేయిచాచి చాలా నిదానంగా, ఆవేశరహితంగా, కేవలం వ్యాపార స్వరంతో) మనీ ప్లీజ్! మనీ! ....

జాన్: (పిడుగుపాటు తిన్నాడు. ఒక్క నిమిషం తెల్లబోయాడు. ఏం చేయాలో తోచలేదు. అంతా ఒక్కసారిగా క్రోధంగా మారింది. తటాలున బేబీని లాగి లెంపకాయ కొట్టాడు) మనీప్లీజ్! మనీ! ....

బేబీ: (తిరిగి లెంపకాయ యిచ్చింది )

జాన్: (స్తంభించిపోయాడు.)

బేబీ: (తాపీగానే) జాగ్రత్త. నన్ను కొట్టే అధికారం నీకు లేదు.

జాన్: ఆఁ!

బేబీ: అవును!

జాన్: లేదూ! నా కధికారంలేదూ? నేన్నిన్ను ప్రాణానికి ప్రాణంగా ప్రేమించానే! నీవే నా సర్వస్వం అనుకున్నానే! నీ కోసమే బతికున్నానే!

బేబీ: నేనూ నీ కోసమే బతికున్నాను.

జాన్: యిలా నలుగురికీ శరీరాన్నమ్ముకుంటూనా?

బేబీ: నువ్వు! డబ్బిచ్చి నలుగురినికొని అనుభవిస్తూనా!

జాన్: నేను మగవాణ్ణి.

బేబీ: నే నాడదాన్ని.

జాన్: (బాగా దెబ్బతిన్నాడు. బేబీని గొంతుపిసికి పారేద్దామన్నంత కోపం వచ్చింది. కాని ధైర్యంలేదు. వేరే దారిలేని ఆ వెర్రికోపం ఒక్కసారిగా వేరే రూపంలో విరుచుకు పడింది.) గెటౌట్! యు నాస్టీక్రీచర్! యు బిచ్ — యు రెచ్ — గెటౌట్ — ఔట్ — గెటౌట్ (అరుస్తూ తానే వెళుతున్నాడు.)

బేబీ: (తాపీగా, గంభీరంగా, అధికారస్వరంతో) జాన్! ఆగు!

జాన్: (నిజంగానే ఆగాడు)

బేబీ: (అతనివైపు నడుస్తూ) నేను బిచ్ నే — బోగందాన్నే డబ్బుకు శరీరాన్నమ్ముకుంటున్నాను. నువ్వన్నదంతా నిజమే కానీ నేను చెప్పే నిజాన్నికూడా కాస్త వినిపో. నువు నన్ను కనికరించాలనికాదు. నామీద జాలిపడి నన్ను మన్నించాలని కాదు. నా తప్పేమీలేదని రుజువుచేయటానికికాదు - నువ్వు నన్నింక ప్రేమించనక్కర్లేదు. నేనూ నిన్ను ప్రేమించలేను. ప్రేమ! మరచిపోయి చాలా రోజులైంది. అయినా నా కథ కాస్త విను. ఇది నా కథమాత్రంకాదు. నువ్విలా ఎందరినో డబ్బిచ్చికొనివుంటావు. వాళ్ళందరి కథ యిది. చాలా కొన్ని వేలమంది కడుపు కక్కుర్తి కొద్దీ పడుపువృత్తిలో దిగున్నారు. వాళ్ళందరి కథ యిది. నువ్వు చాలా దేశాలు తిరిగుంటావు. అన్ని దేశాల్లో జరిగింది, జరుగుతున్న, కథే యిది జాన్! సరిగ్గా జ్ఞాపకంలేదు! బీచ్ ఒడ్డులో ఏదో హోటల్లో — రాత్రే ననుకుంటా, వెన్నెలరాత్రి, డాబామీదో ఎక్కడో కూర్చున్నాం... అవును మరుసటిరోజే నువ్వు యుద్ధంలోచేరి వెళ్లావు. నేను వద్దన్నా నువ్వు వినలేదు.... వెళ్లావు.... తరువాత కొన్ని రోజులకు జర్మనీ వాళ్ళో, జపానువాళ్ళో, ఎవరో మొత్తంమీద శతృవులట వచ్చారు. ఈ యేడు బాగా పండించాలని నాన్న పొలంమీద రాత్రింబవళ్ళు కష్టపడుతున్నాడు. తుపాకితో కాల్చేశారు. నాగలి చేతిలోనే వుంది. చచ్చిపోయాడు. పొలం పోయింది. వాళ్ళు వెళ్ళారు. ఇంకెవరో వచ్చారు. అందరూ శత్రువులే.... ఏడ్చాను.... రోజులు నెలలు ఏడ్చాను. ఎందుకో తెలుసా? ఏమిటీ శత్రువుల గుంపు! అందరూ శత్రువులే.... వీళ్ళకంతా నేనేం చేశాను.... ప్రపంచంలో

మనపు మిత్రులనేవాళ్ళు లేరా అని ఏద్చాను ఏడుస్తూనే వున్నాను. అమ్మ పోయింది....ఏడవటం మానేశాను ..ఒక్కసారి కళ్ళుతెరచి చూచాను. దేశమంతటా కరువులు. ఆకలి.... అన్నయ్య అర్ధరాత్రిలో అంతర్ధానమయ్యాడు....చెల్లీ తమ్ముా నేనూ మిగిలాం. జాన్.... జాన్ .. అబ్బ అందరూ పోయాడు——నువ్వూపోయావు. తమ్ముా అయినా బతుకుతాడనుకున్నా పోయాడు. మంచినీళ్ళులేకపోయాడు. ఈ వృత్తిలోకి దిగాను .... జాన్!.... ఏడుపు రావటంలేదు... ప్రేమను మరచిన నాడే ఏడుపుమరిచాను.... నాన్నగారనేవారు "మనుషులు పట్టి పూల్స్....భూదేవి తెలివైంది. జర్మనీవాళ్ళొచ్చినా. జపానువాళ్ళొచ్చినా, ఎవరొచ్చినా ఒకతీరుగా వుంటుంది. అందరినీ ఆదరిస్తుంది. ఈ యుద్ధాలతో భూదేవికి అనవసరం .... అలాగే నేనూ....పొలముంది నేనున్నా. పొలమున్నంతవరకూ నేనున్నా" అనేవారు అలాగే నేను! ఎవరొచ్చినా నా కొకటే.... అందరికీ నేనిప్పుడు ఆనందాన్నిస్తాను. కనీసం కష్టాల్ని మరిపిస్తాను.... జాన్! నిన్ను నేను కోరేదొక్కటే జాన్! ఒకప్పుడు నువ్వు నీ బేబీని మనసారా ప్రేమించివుంటే ఈ సహాయం చేయి. నీవు మనిషిగా పుట్టినందుకు కనీసం ఈ సహాయం చేయి. జాన్! నాలా ఇంకెందరో ఆడవాళ్ళిలాకాకుండా వుండేందుకు యీ పనిచేయి జాన్! వెళ్ళు ... మీ కమాండర్లందరితో చెప్పు —— యుద్ధం వద్దని చెప్పు. మేమందరం —— మనుషులందరూ యుద్ధం వద్దంటున్నారని చెప్పు - జాన్! ప్రపంచానికి నువ్వు చేయగలిగిం దేదయినావుంటే ఇదే.... ఆపే జాన్! యుద్ధాన్ని ఆపేయ్ జాన్!... చచ్చిపోయిన నీ బేబీకోసం ఆపేజాన్ (పక్కమీదపడి ఏడుస్తుంది)

జాన్: (ఇక అక్కడ నిలవలేక వెళ్ళాడు)

బేబీ: జాన్—— జాన్—— (తలెత్తి చూచింది. అతను లేడు) జాన్! (మళ్ళీ పక్కమీద పడింది)

అమరయ్య: ఆ నాటితో మనిషి పూర్తిగా మారిపోయాడు. మనసు విరిగిపోయింది. కేవలం పిచ్చాడులా తయారయాడు. తనెందుకు బ్రతికున్నాడో, ఏం చేస్తున్నాడో అతనికే తెలియదు. మిలిటరీ భాషతప్ప వేరే యింకేమీ జ్ఞాపకం లేదతనికి. బ్రతికుండటం చావటం ఈ రెండింటిలో తేడాలేమీ కనిపించటం లేదు. అలా....

అంతా చీకటిగా వుంది. ఒక ఏర్‌రైడ్ షెల్టర్ గోడకు అమర్చబడిన ఒక శవం శిల్పావశిష్టంగా వుంది. అతడొచ్చాడు. మనిషి చాలా నీరసంగా, కాళ్ళీడ్చు కుంటూ నడుస్తున్నాడు. యుద్ధం అతని మూపుమీద మోపిన బరువును మోయలే నట్లు నడుస్తున్నాడు. గడ్డం ఎదిగుంది. లోపలికొచ్చి వీపుమీద వున్న బరువు నంతా కింద పడవేస్తాడు. సంచిలోంచి ఎండిపోయిన రొట్టెముక్కను తీసి పీక్కుతింటూ ఇటూ అటూ పచారుచేస్తున్నాడు. దారిలో ఉన్న తుపాకి కాలికి తగిలింది. ఒక్కక్షణం దానివంక చూచి బలంగా తన్నాడు. మళ్ళీ ఇటు అటు తిరుగాడు తున్నాడు. ఎదురుపుగావున్న శవం కనుపించింది. చటాలున ఆగాడు.

జాన్: ఎవరు?

శవం: (వికటాట్టహాసం చేసింది)

జాన్: (కోపంగా) ఏయ్! ఎవడు నువ్వు? నవ్వుతావేం?

శవం: (పెద్దగా నవ్వింది)

జాన్: (కంగారు పడ్డాడు) ఎవరు నువ్వు? చెప్తావా లేదా? (కంగారుగా తుపాకికోసం చూచాడు.)

శవం: తమ్ముడూ!

జాన్: (నిర్ఘాంతపోయి ఆగి శవంవంక చూచాడు.)

శవం: ఏమిటి తమ్ముడూ నువ్వడిగింది? నే నెవరన్నా? నేను ఒకప్పుడు సిపాయినే — ఇప్పుడు శవాన్ని.

జాన్: శవం? శవం అయితే అలా నవ్వుతావేం? మాట్లాడుతావేం?

శవం: ఎవరు తమ్ముడూ మాట్లాడుతున్నది? నవ్వుతున్నది; నేనా?

జాన్: ఇంకెవరు?

శవం: నీలో నీవే మాట్లాడుకుంటున్నావు! నిన్ను చూచి నువ్వే నవ్వుకుంటున్నావు.

జాన్: నాన్సెన్స్! నువ్వుచెప్పేదంతా అబద్ధం! నన్ను మోసంచేదామని చూస్తున్నావు. ఎనిమీ! ఎనిమీ! (అని అరచాడు. సత్వరమని తుపాకితీసి ఎక్కుపెట్టాడు.) హాండ్సప్!

శవం: (మళ్ళీ పెద్దగా నవ్వింది) ఎంత పిచ్చివాడివోయ్! శవాన్ని చంపుతావా? మనుషుల్ని చంపి శవాల్ని చేశావు. ఇప్పుడు శవాల్ని చంపి ఏం చేయాలని?

జాన్: నువ్వు పట్టి శవంకావు. యిదంతా దగా — గారడీ. నువ్వు శత్రువువి — శవం రూపంలో వచ్చి దగా చేస్తున్న శత్రువువి.

శవం: అవును. ఒకప్పుడు నీ శత్రువునే. మీ దేశంలో నాలాంటి మనుషుల్ని చాలా మందిని చంపాను. వాళ్ళందరు నాకు నా దేశానికి శత్రువులని చెప్పారు. కాని ఇప్పుడాలోచించుకుంటే ఎవరు ఎవరికి శతృవులయ్యారో ఏమీతెలీదు. అసలు మనుషులు మనుషులు కెందుకు శత్రువులు కావాలో, అవుతున్నారో విచిత్రంగా ఉంది—కానీ అప్పట్లో ఎంతో ఆవేశంతో, సగర్వంగా యుద్ధంలో చేరాను. ఎందర్ని చంపగల్గితే అంత గర్వించాను. యుద్ధంలో చస్తే వీరస్వర్గం వస్తుందనుకున్నాను. ఒకనా డున్నట్లుండి తుపాకిగుండు దూసుకుపోయింది. చచ్చిపోయాను. నేను చచ్చిపోయానని ఎవ్వరికీ చాలాకాలం వరకు తెలీదు. చాలాకాలం వరకు నేను కనపడక పోయేటప్పటికి. మా వాళ్ళందరూ నేను చచ్చిపోయాననుకున్నారు. అంతే. వీరమూలేదు — స్వర్గమూలేదు. ఇక్కడే పడిఉన్నాను. ఇప్పుడు నాకెవ్వరూ శత్రువులు లేరు. చచ్చిన తరువాత శత్రువు లేంటి నాయనా?

జాన్: ఆపు నీ ఉపన్యాసం! నువ్వు చచ్చినా నేను బతికున్నాను. నువ్వు నాకు శత్రువువి — హాండ్సప్.

శవం: (నవ్వి) తమ్ముడూ! సిగరెట్టుంటే ఇవ్వు.

జాన్: ఇవ్వను.

శవం: పోనీ నేనిస్తా కాల్చు తమ్ముడూ.

శవం: అక్కర్లేదు. ఇదేదో కుట్ర. నన్ను సిగరెట్టిచ్చి చంపాలనుకున్నావు. శత్రువులు ఆటంబాంబుల్లాగే సిగరెట్టు బాంబులేవో కనిపెట్టుంటారు.

శవం: (నవ్వి) అబ్బ! ఎంత అపనమ్మకమోయ్ మనిషిమీద మనిషికి — పోనీ నేను కాల్చుకుంటా — (సిగరెట్ తీసి అగ్గిపుల్ల వెలిగించ బోతూంది)

జాన్: షటప్! వీల్లేదు — నువ్ సిగరెట్ కాల్చటానికి వీల్లేదు. హాండ్సప్. కదిలావా తల పేలుతుంది.

శవం: పోనీ కాల్చనులే! — తమ్ముడూ యుద్ధం నిన్నెలా చేసిందో చూడగలుగుతున్నాను. తమ్ముడూ .... నేను తొందరగా వెళ్లాలి. ఇక్కడుంటానికే వీల్లేదు. వెళ్ళేముందు నిన్నొక్కటే సహాయం కోరుతా. నీకు నచ్చితేనే చేయి. చూడు తమ్ముడూ! యుద్ధాలను ఆపేయ్. వీలయినంత త్వరగా ఆపేయటానికి ప్రయత్నించి ప్రపంచంలో యుద్ధాలే లేకుండా చేసేయ్. యిక యుద్ధాలనవసరం తమ్ముడూ! తర తరాలుగా యుద్ధాలు చేశాం. కానీ ఏమీ లాభం లేదు. యుద్ధాలవల్ల ఎప్పుడూ ఏమీ జరగదు. శత్రుశవం చెప్పిందని చులకన

చేయకు. మనిషిగా నువ్వు చేయగలిగిన మంచికార్యం అదొక్కటే. వస్తా తమ్ముడూ, గుడ్ నైట్.

జాన్: ఆగు — ఎక్కడికి పోతావ్. ఆగు. (అంటూ ఆవేశంతో బాయ్‌నెట్‌తో శవాన్ని పొడిచాడు. వెర్రిగా పొడిచాడు. శవం కింద పడింది. ఇంకా పొడుస్తూనే ఉన్నాడు. కాస్సేపటికి ఆగి చూచాడు. తాను చేసినపని గుర్తించాడు. నవ్వుకున్నాడు. నేనేం చేశాను. నేను చేసిన పనేంటి? ఎంత వెర్రివాణ్ణయ్యాను....ఓ యుద్ధం. యుద్ధం!....(అంటూ బయటకు పరుగెత్తాడు. చీకటి పడింది.)

అమరయ్య: అదంతా నిజంకాదు. మతిభ్రమ. అంతే అతనలా పూర్తిగా పిచ్చాడయ్యాడు. పిచ్చిగా చంపుతున్నాడు.

యుద్ధం ఆగిపోయింది. కానీ మనం కోరిన విధంగా ఆగలేదు. భయంకరంగా ఆగింది. మరో యుద్ధానికి బీజంవేసే ఆగింది. హిరోషిమాలో ఆటంబాంబు పడింది. మానవుడు కనిపెట్టిన మారణాయుధాల్లోకి ఆటంబాంబును మించింది లేదు. అది ఘోరం! భయంకరం అమానుషం!

యుద్ధం ఆగిపోయింది. అతన్నింటికి పంపేశారు. ఇక్కడ నిరుద్యోగం జీవిత సమస్య. ఏం చేయాలో తోచకుండా వీధుల్లో తిరుగుతున్నాడు. నీటి నుంచి బైటపడ్డ చేపలా అల్లాడుతున్నాడు ఒకనాడు —

తెర విడిపోయింది. అదొక టీ షాపు. షాపు ముందు ఆమె టేబిల్ దగ్గర కూచుంది. కొందరు టీ తాగుతున్నారు. కొందరు తాగి డబ్బిచ్చిపోతున్నారు. ఒక గ్రామఫోను ఇంగ్లీషు రికార్డులు—అతడు వచ్చాడు. తాగినవాడి హుంషారుం దతనిలో. మనిషి ముఖం చాలా మారిపోయి వుంది. బాగా దగ్గర కెళ్ళితేగాని గుర్తుపట్టలేం.

జాన్: ('జాక్ అండ్ జిల్ వెంటప్ ది హిల్' అని పాడుకుంటూ షాపులోకి తిన్నగా వెళ్ళి కూర్చున్నాడు. — కాస్సేపటికల్లా షాపులో కుర్రాడు అతని దగ్గరకు వచ్చి)

కుర్రవాడు: ఏమి కావాలి సార్?

జాన్: ఉద్యోగం.

కుర్రవాడు: ఇక్కడది లేదు సార్!

జాన్: ఏమన్నావ్! నా కుద్యోగం లేదంటావూ. నే నెవరో తెలుసా? మిలిటర్ ఆఫీసర్ని. నాకు మీరు వచ్చినట్లు వుద్యోగం ఇవ్వాలి. నేను విమానాల్ని

నడిపాను. 90 మైళ్ళ స్పీడులో కారు నడిపాను. ఎన్నో రోజులు తిండిలేక బతికాను. నాకు మీరుద్యోగం ఇవ్వాలి. ఇస్తారాలేదా?

కుర్రవాడు. ఇది టీ షాపు సార్ — టీ షాప్.

జాన్: టీ షాప్ —! టీ షాప్ —! ఆల్‌రైట్! — ఒక టీ తీసుకురా — స్ట్రాంగ్ - ఎక్స్‌ట్రా స్ట్రాంగ్.

కుర్రవాడు: రైటో రైట్ (వెళ్ళాడు)

జాన్: టీ షాప్? ఏం టీ షాపిది; పూర్వం బీచ్ వొడ్డునే ఓ హోటలుండేది. ఇప్పు డెల్లి చూస్తే లేదు. ఎంత అందంగా ఉండేది. ఆ హోటలు ఇదే వీధి ఏదో వీధి — పేరుతో ఏం పని — ఇక్కడ ఓ పార్కు — దేశంలోకల్లా అందమైన పార్కు ఉండేది....ఏదీ ఇప్పుడు....ఏమైపోయింది జాక్ అండ్ జిల్ వెంటప్ ది హిల్ —

కుర్రవాడు: (టీ తెచ్చిపెట్టాడు.)

జాన్: పాడుతూ యీలవేస్తూ టీ తాగేశాడు లేచాడు. (ఇటటు దేనికోసమో వెతుకు తున్నాడు) నా తుపాకి — తుపాకి. ఓ నేను ఎక్స్‌మిలిటరీ వాణ్ణిగా....యస్ (జాక్ అండ్ జిల్ పాడుతూ వెళుతున్నాడు.)

ఆమె: ఏయ్! మిస్టర్ (బల్లమీద పెన్సిలుతో కొడుతూ పిలిచింది).

జాన్! ఏం? ఏం మిస్టర్?

ఆమె: డబ్బు.

జాన్: దేనికి?

ఆమె: దేనికి? తాగిన టీకి.

జాన్: టీ తాగితే డబ్బివ్వాలా.

ఆమె: అవును.

జాన్: ఎందుకివ్వాలి.

ఆమె: ఎందుకంటే — ఇది టీ షాప్ — ఇక్కడ టీ అమ్ముతాం — మీరు డబ్బు ఇవ్వాలి....

జాన్: ఇవ్వకుంటే ఏం? ఏమవుతుంది....ఇంకో యుద్ధం వస్తుందా?

ఆమె: ఇవ్వకుంటే నువ్విక్కడనుంచి కదలటానికి వీల్లేదు.

జాన్: ఓయస్! దానికేం ఇక్కడే కూకుంటా!....అరగంటకొకసారి అయ్యగారి కరగాలన్ టీ ఇప్పిస్తూండు చాలు.

ఆమె: డబ్బులిస్తావా? ఇవ్వవా?....

జాన్: వుంటే ఇచ్చేవాణ్ణే ..వున్న రోజుల్లో చాలా మందికిచ్చాను వెధవ డబ్బులు.

ఆమె: అరే ఆ కోటుతీసి వుంచరా

జాన్. ఆఁ — ఏమన్నావ్ నా కోటుతీసి వుంచుతావా?...నా కోటు నే నెవరో తెలుసా? మిలిటరీ ఆఫీసర్ని....ఓ పెద్ద బెటాలియన్ నడిపాను....కొన్ని వేలమంది శత్రువుల్ని చంపాను మిమ్మల్ని మీ పిల్లల్ని కాపాడాను. నా కోటు తీసివుంచుతారా? చివరికి నాకొక్క టీ యివ్వనంటారా? మీరంతా యిక్కడ హాయిగా యిళ్ళల్లో భోంచేసి కూచుంటే — నే నక్కడ ఎండలో — వానలో చీకటిలో — రాళ్ళల్లో గుళ్ళల్లో — తిండిలేక, నీళ్ళులేక, నిద్రలేక తిరిగాను. మీ రిక్కడ షోగ్గా డ్రెస్ చేసుకుని అలు మగలు టింగురంగా అని డాన్సులకూ పార్టీలకూ పోతే, నే నక్కడ చెమటకంపు కొట్టుకుంటూ, వెధవ ముతక ఖాకీగుడ్డలు వేసుకుని గాడిదబరువును మోస్తూ, ఒంటరిగా అర్ధరాత్రిలో దెయ్యంలా బ్రతికాను. తెగిపోయిన చేతులు, కాళ్లు, తలలు, మొండాలు — శవాలు, వీటిమధ్య శ్మశానంలో నక్కలా తిండికోసం దేవులాడే గద్దలా తిరిగాను. మీ రిక్కడ సినిమాలు డ్రామాలు. సంగీతాలు, రేడియోలు చూస్తూ వింటూంటే నే నక్కడ అనుక్షణం చావునోట్లో పడు తున్నవాళ్ళ మూల్గులు, కేకలు, ఏడుపులు ఒకవైపు - ఇంకొకవైపు ధాం ధాం ధాం — హాహాహా హూ (వెర్రికేక వేశాడు) యీలాంటివి వింటు న్నాను. నేను మిమ్మల్ని, మీ పిల్లల్ని, మొగుళ్ళని, భార్యల్ని కాపాట్టానికి యుద్ధానికి వెళ్ళాను. నా యిల్లూ వాకిలీ అన్నీ వదులుకున్నాను. నా ప్రేమను బలియిచ్చాను. చివరికి నాకొక్క కప్పు టీ ఇవ్వనంటారా! ఛీ కృతఘ్నులూ! నేను మీ కోసం చేసిన త్యాగమంతా వేష్టు వేష్టు....

ఆమె: ఆగు. ఏమిటి నువ్వు చేసిన త్యాగం? ఎవరు చేయమన్నారు? ఎందుకీ త్యాగం మేమీ యుద్ధం కావాలన్నామా? ఎందుకీ యుద్ధం ఎవరికోసం యీ యుద్ధం— నువ్వు మమ్మల్ని మా పిల్లల్ని కాపాడావా! మమ్మల్ని రక్షించటంకోసం యుద్ధం చేశావా! అంతా అబద్ధం. మేం యుద్ధం కావాలనలేదు. మాకు శత్రువులు లేరు. యుద్ధంవల్ల లాభపడ్డ వాళ్ళనడుగు. మేమే మీకోసం చాలా త్యాగాలు చేశాం. పండింది పండినట్టు పంపించాం - కరువు, కాటకాలు, తెచ్చుకున్నాం. పిల్లల్ని, తల్లుల్ని, భర్తల్ని పోగొట్టుకున్నాం. కాపురాలు నాశనం చేసుకున్నాం. మేం సివిలియన్సు కాని మా నరకం మీకేం తెలుసు.

అనవసరంగా అర్థరహితంగా పడ్డాం బాధలు. నేను నా ప్రేమను పోగొట్టుకున్నా, నా శీలాన్ని అమ్ముకున్నా, నా ఆనందం, అందం, అంతా నాశనం చేసుకున్నాను. నే నిప్పుడు జీవచ్ఛవాన్ని. ఇదంతా దేనివల్ల తెలుసా? మీ యుద్ధంవల్ల. మా జీవితాన్నంతా నాశనం జేసిన మీకు ఇంకా టీ యివ్వాలా. కృతజ్ఞత కూడానా? వెళ్ళండి! రాక్షసులు — వెళ్ళు! .... వెళ్ళు ....

జాన్: ఏయ్! ఏం కూశావ్. నే నెవరో తెలుసా మిలటరీవాణ్ణి — నాకు చంపటమంటే చాలా తేలిక. ప్రాణాలంటే ఎక్కడన్నా విలువుందేమోగాని ఇక్కడ లేదు. నిన్నిక్కడే — ఇప్పుడే గొంతు పిసికి పారేయగలను.... జాగ్రత్త!

ఆమె: పిసికి పారేయ్ చూద్దాం! చావడమంటే ఎక్కడన్నా భయముందేమోగాని ఇక్కడకాదు. బ్రతికుంటానికి విలువేలేనప్పుడు చావటానికి అర్థమేముంది. చంపే....

జాన్: (ఆవేశంకొద్దీ ఒక్కసారి ఆమె మీదకురికి గొంతు నులుముతూ) ఏయ్! చావు! — చావు....

ఆమె: (అతన్ని నిదానించి చూచి) జాన్....జాన్....

జాన్: (బాగా గొంతు నులిమేశాడు. మించిపోయింది. తన బేబీ అని గుర్తించాడు.) బే....బీ....

చేయిపట్టు తప్పింది. ఆమె కిందపడిపోయింది. అతడూ ఆ పక్కనే కూలాడు బేబీ....బేబీ....)

బేబీ: చంపేజాన్........బాగా నులిమే గొంతు....కనీసం నీ చేతిలో చచ్చానన్న సంతోషం మిగలనీ జాన్....హాయిగా చచ్చిపోతా....చంపే జాన్....

జాన్: బేబీ....బేబీ....

బేబీ: జాన్........

జాన్: బేబీ బేబీ (ఆమె మీదపడి ఏడుస్తున్నాడు.)

చీకటి పడింది

సమత: (తాతా వెర్రికేక వేసింది.)

అమరయ్య: ఊర్కో తల్లీ....ఊర్కో.

సమత: తాతా (వెక్కి వెక్కి ఏడుస్తూంది.)

అమరయ్య: ఏడవకమ్మా....ఏడవకు.

సమత: బేబీ, బేబీ ఏమయింది తాతా?

అమరయ్య: చచ్చిపోయిందమ్మా.

సమత: (ఇంకా వెక్కి వెక్కి ఏడుస్తూనే వుంది.) జాన్ ఏమయ్యాడు తాతా?

అమరయ్య: ఏడవకమ్మా, ఏడ్చి ఏం లాభం,..,జాన్ కూడా ఇక బతకలేక ఆత్మహత్య చేసుకున్నాడు. ఈలా ఎందరో పోయారు....ఎందరి గుండెలో బ్రద్దలయినయి....ఎందరి కన్నీరో పారింది....కాని ప్రపంచం ఏమీ మారలేదు-ప్రపంచం అలాగే వుంది.

సమత: యుద్ధం అంటే ఇదా తాతా?

అమరయ్య: ఇదేనమ్మా! ఇది యుద్ధంలో వెయ్యోవంతు లేదు. ఈలా ఎన్నో కథలున్నాయి.

సమత: తాతా....అయితే పెద్దన్నయ్య ఇంకా యుద్ధం కావాలంటున్నాడేం తాతా.

ఉన్నట్టుండి ప్రేక్షకులలో పెద్దగల్లంతు. అందరూ లేచారు. ఒక అతను పెద్దగా అరుస్తున్నాడు.

ఒక ప్రేక్షకుడు: అవును పెదబాబు యుద్ధమే కావాలంటాడు పదండి అందరూ పదండి — అది పింగాణి ఫ్యాక్టరీకాదు....మందు గుండ్లు తయారుచేసేది....పదండి ఫ్యాక్టరీ పడగొట్టండి.

(ఇంతలో సుబ్బయ్య స్టేజీమీదికి పరుగెత్తుకొచ్చి ప్రేక్షకుల నుద్దేశించి) అవును నే నిప్పుడే వస్తుండా ఫ్యాక్టరీనుంచి. పెద్దయ్యగోరు శాస్త్రిగోరు కలిసి పెద్ద మందుగుండు తయారు చేసినారంట. పేచీలు పడుతుండారు లాభాలకాడ. నేనంతా సాటునుంచి ఇన్నాను....

భూదేవి చివాలున లేచి స్టేజీమీద కొచ్చింది

భూదేవి: సుబ్బయ్యా ఏమిట్రా — నువ్వు అంటున్నది నిజమేనా?

సుబ్బయ్య: నత్తెపెమానకంగానమ్మా....

భూదేవి: ఆఁ....

ఇంతలో శాంతి విశ్వం వచ్చి నిలబడ్డారు.

భూదేవి: (ముఖం ఎర్రబారింది.) పదండ్రా పదండి — యుద్ధం ఎక్కడికొచ్చినా, ఏ దేశం మనుషులు చచ్చినా — మనం వూర్కోలేం పదండి.

సమత: శాంతి కావాలని అరవండి....

అందరూ: ఫ్యాక్టరీ పడగొట్టండి (అందరూ గల్లంతుగా వెళ్ళారు.)

అమరయ్య: వదమ్మ....పద:
సమత: (లేచివెళ్ళింది.)
అమరయ్య: (ఇంకోవైపు వెళ్ళాడు.)

చీకటి పడింది.

---



సలహా

మామూలు పక్కకువెళ్ళే తెరనే ఒకవైపు మూత బడితే, ఇంకోవైపు తెరచుకొనే విధంగా ఏర్పాటుచేయండి చాలు. ఒక భాగం అమరయ్యది, మరొకటి బేబీ జాన్‌ది. నాటకం జరుగుతూండగా అమరయ్య నము కనిపించరు.

# అయిదవ రంగం

ఫ్యాక్టరీలో ఒక భాగం. ఒక పెద్దగది. ప్రదర్శకుల అనుకూలాన్నిబట్టి గదిలోని సామగ్రిని అమర్చుకోవచ్చు. వీలైతే పెద్ద పరిశోధనల కుపకరించే సాధన సామగ్రి, గొప్ప సైంటిస్టుల చిత్రాలు, ఆటంబాంబుకు సంబంధించిన చిత్రాలు ఈలాంటి వింకేమైనా. లేదా కొన్ని కుర్చీలు, ఒక గుండ్రనిబల్ల చాలు. ముఖ్యంగా వుండవలసినవి - అది ఒక పాతాళ గృహం. ఆ వాతావరణం కనుపించాలి. ఒకవైపునుంచి మెట్లు దిగుతుంటాయి. గదిలో ఒక ప్రక్కగా టెలిఫోనుంది. ఒక బల్లమీద చిన్న బాంబులాంటిది వుంది. కుడిచేతివైపు మాత్రం ఒక ద్వారం వుంది. అది గోడలో ఇమిడిపోయి సామాన్యంగా కనుపించదు. ఇంకొక బల్లమీద ఏవో పుస్తకాలు, కాగితాలు. గమనింపు: ఈ సీనులో వెనుకవైపువాడే తెర క్షణంలో తీసివేయటానికి వీలుగా వుండాలి. దాని వెనకాలే ఒక తెల్లటి తెర వుండాలి. దాని తరువాత స్టేజి చివరలో (లోవైపు) ఒక నల్లటి తెర వుంచండి. సీను చివరికి స్టేజి లోపలికి ఎంత స్థలం వుందో అంతా వాడటం మంచిది. ఈ సీనులో లైట్లు కాస్త జాగ్రత్తగా వాడుకుంటే బాగుంటుంది. స్టేజంతా వెలుతురు ప్రసరించకుండా, వ్యక్తులమీద మాత్రం వాడటం కొంత మెరుగు. వీలుకాని పక్షంలో స్టేజిలో దీపాలన్నీ ఆర్పేసి సైడువింగ్స్‌లో కొద్ది దూరంలో దీపాలుంచి వాటి వెలుగు రంగస్థలంమీదికి కొద్దిగా ప్రసరించేటట్లు చేయండి సరిపోతుందేమో! మొత్తంమీద కొంచెం భయానకంగా తయారు కావాలి రంగస్థలం. ప్రదర్శకుల వీలు, వూహలకు వదిలేస్తానింక.

తెర ఎత్తేటప్పటికి శాస్త్రి, పెద్దవాడు వున్నారు. ఇద్దరూ కొంచెం విసువుగా, అప్పుడే దెబ్బలాడిన వాళ్ళలా వున్నారు. శాస్త్రి బాంబువైపు వున్నాడు. పెద్దవాడు ఫోనువైపు వున్నాడు. పెద్దవాడివైపే మెట్లు కూడా వున్నాయి.

తెర ఎత్తిన ఒక్కక్షణం నిశ్శబ్దం. శాస్త్రి పెద్దాడు ఎవరి లోకంలో వాళ్లున్నారు. కాని వాళ్ళలో క్రోధం; కారంగా కనిపిస్తూంది.

పెద్దవాడు అలాగే ఒక్కక్షణం ప్రేక్షకులవైపు రెప్పవాల్చకుండా చూస్తున్నాడు. అంతా నిశ్శబ్దంగా వుండటంవల్ల ఆ చూపు మరీ భయంకరంగా వుంది.

శాస్త్రి ఒకసారి పెద్దాడివైపు బల్లమీద వున్న బాంబువైపు చూశాడు. మళ్లా పెద్దాడివైపు తిరిగాడు! ఇంతలో పెద్దవాడు శాస్త్రివైపు తిరిగాడు.

పెద్దాడు: ఊం - (రిస్టువాచి చూచి) శాస్త్రిగారూ! నాటకం ముగిసే టైమయింది!

శాస్త్రి: నే నిర్ణయించే దేముంది? ఏమీలేదు.

పెద్దాడు: అయితే హక్కులన్నీ మీకే వుండాలంటారు.

శాస్త్రి: అవును.

పెద్దాడు: తెలియకడుగుతా - ఏం చేస్తారండీ హక్కులుంచుకొని....

శాస్త్రి: హక్కు లుంచుకొని మీరేం చేస్తారు?

పెద్దాడు: (నవ్వి) మేం చేయగలిగినదంతా మీరు చేస్తే ఇంక బాధేముంది. అసలు ఒక్కవిషయం మరిచిపోయారు. శాస్త్రిగారూ! మన దేశం తటస్థదేశం. జ్ఞాపకముంచుకోండి....

శాస్త్రి: నా కొక్కడికే నామనా!

పెద్దాడు: కానీ మీకూ నాకూ కొన్ని తేడాలున్నాయి. అవి మీరు గుర్తించాలి. మీరు మెదడుతోగానీ శరీరంతోగానీ చాకిరీ చేయగల రంటే. మీ చాకిరీకి విలువగట్టి, కొని. అమ్మి. దాన్ని డబ్బుగా మార్చే శక్తిమా దగ్గరుంది.

శాస్త్రి: అలాగనే మమ్మల్ని దోపిడి చేస్తున్నారు.

పెద్దాడు: (నవ్వి) పెద్దమాట వాడుతున్నారే శాస్త్రిగారూ! ఏమండీ మూడు సంవత్స రాల పూర్వం పెళ్ళాం బిడ్డలతో అలో రామచంద్రా అని పిడికెడు కూటి కోసం టిక్కెట్లు లేకుండా రైలెక్కి వస్తున్నప్పుడు తెలుసా మీకీ దోపిడి మాట?

శాస్త్రి: ఆపండి! పిడికెడు కూటికోసం మే మెప్పుడూ బయల్దేరలేదు. తెలివితేట లుండటంవల్ల, ఎక్కడా బానిస చాకిరీ చేయలేక గొప్ప పరిశోధనలు చేయా లని, ఏదో సాధించాలని, లోపలున్న ఆవేశంకొద్దీ....

పెద్దాడు: అప్పట్లో నేను మీకు తటస్థపడకుంటే ఏమయ్యేవారు .

శాస్త్రి: దేశంలో మీలాంటివారు మీరొక్కరే లేరు.

పెద్దాడు: ఊఁ — శాస్త్రిగారూ? మళ్ళా ఇంకొకసారి చెప్తున్నాను. మనది తటస్థ దేశం.

శాస్త్రి: నాకూ తెలుసు ఆ తాటస్థ్యం ఏమిటో! అమెరికాలో చేతులు కలిపి వ్యాపారం చేయటానికి మనవాళ్ళ కేమీ అభ్యంతరం లేదు.

పెద్దాడు: ఓ....హక్కులన్నీ మీరుంచుకొని అమెరికాతో బేరాలు పెట్టవచ్చని కలలు కంటున్నారా పాపం!

శాస్త్రి: ఏం! ఆ మాత్రం కలలైనా కనడానికి నోచుకోలేదా మేము?

పెద్దాడు: నోచుకోకేం! చివరికి సద్దిహూటి కష్మకుంటారు. కృతఘ్నులు! వస్తులుపడి వస్తూన్నవాళ్ళను మూడు సంవత్సరాలు మేపాను....అన్ని సౌకర్యాలు కల్పించాను....

శాస్త్రి: దానికి ప్రతిఫలం మా ప్రాణాలతోపాటు పుచ్చుకపోవాలంటారు. ఈ ఫ్యాక్టరీ నిర్మాణానికి, యీ పరిశోధనకు మీరెంత బాధ్యులో నేనూ అంతే బాధ్యుణ్ణి.

పెద్దాడు: శాస్త్రీ! నా ఫ్యాక్టరీ అంతా నాశనమైనా సరే మీరు చేసిన యీ దొంగచాటు వ్యాపారం గవర్నమెంటుకు తెలియజేస్తే మీగతి ఏమవుతుందో తెలుసా?

శాస్త్రి: ఈ బెదరింపు లేమీ అక్కర్లేదు! మీ గతి తేలిన తర్వాతే నాది. మర్యాదగా అన్నమాట నిలబెట్టుకోండి.

పెద్దాడు: ఏమన్నాం?

శాస్త్రి: లాభాలలో సగంభాగం ఇస్తామన్నారు.

పెద్దాడు: వచ్చిన తర్వాతనా రాకముందా?

శాస్త్రి: తర్వాతేగానీ, ముందు రాతలో తేల్చండి!

పెద్దాడు: మామీద అంత నమ్మకం లేదన్నమాట.

శాస్త్రి: గొర్రె కసాయివాణ్ణి నమ్మినట్టే.

పెద్దాడు: శాస్త్రీ! (పిస్టల్ లాగి గురిపెట్టాడు.)

శాస్త్రి: (బెదరలేదు) పిస్టల్ పేల్చావా నీ ఫ్యాక్టరీ మొత్తం పేలిపోతుంది. ఇది చాలా సున్నితమైన బాంబు!

పున్నట్లుండి ఒక మూలవున్న రేడియోలాంటి పరికరంలో జనం గుంపులు గుంపులుగా కేకలు పెడుతూ పరుగెత్తుతూన్న శబ్దం. ఒక్కసారిగా ఇద్దరూ మెట్లపైపు చూచారు. ఇంతలో రేడియోలో కేకలు — "యుద్ధఫ్యాక్టరీ పడగొట్టండి! శాంతిని స్థాపించండి" అని. పెద్దాడు గబ గబ మెట్లెక్కి పోతున్నాడు. ఎదురుగా కావలావాడు దిగివచ్చాడు.

కావలావాడు: ఊళ్ళో జనం అంతా విరుచుకుపడి వస్తున్నారు బాబూ!

పెద్దాడు: ఆఁ....సుబ్బయ్య వున్నాడా వాళ్ళల్లో?

కావలావాడు: అగుపించ లేదండి?

పెద్దాడు: ఊఁ—(ఇటటు చూచాడు) పై తలుపు బంద్ చెయ్యి. నువ్వు గేట్ దగ్గరే నిలబడు....ఇదిగో—(దాపున్నే వున్న తుపాకి అందించాడు) అవసరమైతే పేల్చు—ఏం ఫర్వాలేదు....పో....

కావలావాడు: (పరుగెత్తాడు)

రేడియోలో శబ్దం ఇంకా దాపున కొస్తూన్నట్లు

పెద్దాడు: (గబ గబ దిగి ఫోనుతీసి) హల్లో పోలీస్ స్టేషన్....ఆఁ....కూలీలందరూ ఫ్యాక్టరీమీద పడ్డారు....దొమ్మి...వెంటనే....అర్జంట్....థాంక్స్....

ఇకమీదట పెద్దవాడి నడక, మాట అతి వేగంగాను, భయంకరంగాను వుంటుంది, అడివినుంచి అప్పుడే పట్టుకొచ్చి బోనులో పెట్టిన పులిలా.

పెద్దాడు: (శాస్త్రివైపు వెళ్తూ) చెప్పండి....మీ కొంప నా కొంప అన్నీ ఒక్కసారిగా మునుగుతాయి. ఏమంటారు?

శాస్త్రి: నేను చెప్పాల్సిం దిదివరకే చెప్పాను. ఇప్పుడు నీకు తప్పించుకోటానికి మార్గం కూడా లేదు. నువ్వే చెప్పాలి...తప్పించుకునే దారి నా చేతుల్లో వుంది...

పెద్దాడు: ఆఁ ..మనం తరువాత మాట్లాడుకుందాం .... మన తగాదాలతో తలలు వాళ్ళ చేతికిస్తామా? కానీండి ... ఈ సరంజామానంతా ఇక్కడినుంచి కదపండి....

శాస్త్రి: కదపటానికేం. క్షణంలో కదుపుతా. ఒక్కసారిగా యీ గదంతా మాయమై పోయి ఇక్కడ యథాప్రకారం భూమి వస్తుంది. మనజాడే కనపడదు. కానీ....

పెద్దాడు: ఓ... ఇప్పుడా కానీ గీనీ...

శాస్త్రి: (పెద్దగా నవ్వి) మెదడుబలం ఇప్పటికైనా తెలిసిందా?

పెద్దాడు: (నిప్పులు కక్కుతున్నాడు అసహాయత్వంతో)

ఇంతలో రేడియోలో

సుబ్బయ్య: ఇదేనమ్మా! ఇదే భూ గృహానికి దారి....

కావలావాడు: ఆగండి....హేండ్సప్....అడుగు ముందుకుపడ్డదా తలలు పేల్తాయి.

భూదేవి: ఎవర్రా అది....

సుబ్బయ్య: మన కావలోడు—గుండయ్యమ్మా!

భూదేవి: ఏంరా గుండయ్యా? నామీదే తుపాకి ఎత్తావర్రా! నేనెవరో నీకు జ్ఞాపకముందారా? ఈరోజు యీ కాకీగుడ్డలు వేసుకొని బానిస బతుకులో నాలుగు రూకలు సంపాయించేటప్పటికి మరిచిపోయావారా చిన్నతనమంతా? నీ తల్లి తరువాత తల్లినిరా. పసికందుగా నిన్ను ప్రపంచంలో పడేసిపోయింది నీ తల్లి. నిన్ను పాలుపోసి పెంచానురా! కళ్ళల్లో పెట్టుకొని కాపాడానురా! నేను

భూదేవినిరా నాయనా! చూడు బాగా చూడు. నా మీదే తుపాకి పేలుస్తావా? పేల్చరా? పేల్చు!

గుండయ్య: అమ్మా! (వెర్రిగా ఏడుస్తున్నాడు) పెద్దయ్యగారి వుప్పుతిన్నాను. ఆయనాడ్డరు. ఎట్టామ్మా! అమ్మా!

భూదేవి: పెద్దయ్యగారు—నువ్వూ— అందరూ నా రక్తం పంచుకోలేదారా?

గుండయ్య: మన్నించండమ్మా! మీ పాదాలట్టుకుంటా. ముందు నన్ను మీ చేతులారా కాల్చేయండి. తరువాత మీరేమన్నా చేయండి....

భూదేవి: నువ్వో నన్ను కాల్చేరా ఫర్వాలేదు. సుబ్బయ్యా....ఇదేనా దారి....తలుపిదేగా... గుండా. ..తలుపుతీస్తున్నాను....కాల్చరా!

తలుపు తెరిచిన శబ్దంతోపాటు తుపాకి ఢాం అన్నది. ఒక్కక్షణం తర్వాత భూదేవి గబ గబ మెట్లుదిగి వచ్చింది. ఆమె వెనకాలే "అమ్మా అమ్మా" అంటూ గుండయ్య తడబడుతూ ఒకటి రెండు మెట్లుదిగి ఇక నిలబడలేక పడిపోయాడు. మెట్లమీద నుంచి అతని శవం దొర్లివచ్చి భూదేవి పెద్దాడు మధ్యన నిలిచింది. పెద్దాడు భూదేవిని శవాన్ని చూచాడు. భూదేవి పెద్దాణ్ణి శాస్త్రిని చూచి

భూదేవి: ఏం చేస్తున్నా రిక్కడ!

పెద్దాడు: ఎవ రీ హత్య చేసింది?

భూదేవి: నువ్వు! బానిసత్వపు పత్తుపందు బాగా తినిపించి, యజమాని వుప్పు తిన్నామనే భయంతో, అధర్మానికి కూడా ఎదురు తిరగలేని పిరికిపందను చేశావు. లోపల అంతరాత్మ అరుస్తూంటే, బైట బానిసత్వం పీక నొక్కేస్తూంటే. రెంటిమధ్య నలగలేక తన్నుతానే చంపుకున్నాడు — విశ్వాస ఘాతుకుడనే చెడ్డపేరు తప్పించుకోవాలని.

పెద్దాడు: ఊఁ—బాగానే వుంది వుపన్యాసం! ఇప్పుడు ఇక్కడి కెందుకొచ్చినట్టు.... బైట ఏమిటా అల్లరి! నువ్వేనా ఆ జనాన్నంతా తోలుకొచ్చింది? అమ్మా! అనవసరంగా నువ్వీ విషయాల్లో తల దూరుస్తున్నావు. కన్నకొడుకును ఢీ కొంటున్నావు. బాగా ఆలోచించుకో. అందాకావస్తే నాకు తల్లీ తండ్రీ అనే అభిమానం లవలేశం వుండదు.

భూదేవి: పెద్దాడా!

పెద్దాడు: అసలు నీకేం తెలుసు చెప్పు యీలాంటి విషయాలన్నీ? ఎవరో వుక్కిటి పురాణాలు, కాకమ్మ కథలు చెప్పి రెచ్చగొడితే, ఏడిపిస్తే, నువ్వీలా

పురకటమేనా: నెమ్మదిగా వెళ్ళు - ఆ మూకనంతా ఇళ్ళకు పంపించు — లేదా....

భూదేవి: నన్నే బెదిరిస్తున్నావారా? నిన్ను నవమాసాలు మోసి నీకు జీవంపోసి, నీ కీ రూపు ఇచ్చినదాన్నిరా? నన్నే బెదిరిస్తావు:

పెద్దాడు: మరి యీ మూకనంతా వెంటవేసుకొనివచ్చి నువ్వు నన్ను బెదరించాలనా?

భూదేవి: (నవ్వి) పిచ్చివాడా: కన్నబిడ్డలను బెదరిస్తుందా తల్లి? బెదిరించినా ప్రేమ కొద్దీ, మంచికోరేగా! పెద్దాడా! నామాట వినరా ఈ ఫ్యాక్టరీని ఆ ఏట్లో విరగ దోసేరా! మనకెందుకురా ఈ రాక్షస వ్యాపారం? మనుషులను చంపే మందు గుండ్లు తయారుచేసి మహారాజనిపించుకోవలసిన కర్మే మొచ్చిందిరా మనకు! మనం ఎన్నడూ చూడలేదా సిరిసంపదలు? మన వంశానికి, మనుష్య జాతికే తలవంపులురా! శాస్త్రిగారూ! నమ్మి మిమ్మల్ని పంచన చేర్చినందుకు ఇదేనా మీరు చేసింది? ఇదేనా మీ విజ్ఞానం? ఇన్నాళ్లూ రాత్రింబగళ్ళు కష్టపడి మీ తెలివితేటలంతా వుపయోగించి మనుషులనెలా సులభంగా చంపటం అన్నదా మీరు కనిపెట్టింది? సిగ్గు పట్టంలేదూ మీరు! మీ తల నెరసిన పెద్దరికం తగ లేయనా? ఇట్లా గడ్డితిని గడించకపోతే అడుక్కుతినరాదూ!

పెద్దాడు: అమ్మా! (ఠపీమని చెంపకాయ యిచ్చాడు. తల్లి స్థంభించిపోయింది. ఇంతవరకు బైటకేకలు వినపడుతూనే వున్నాయి. ఫ్యాక్టరీలో అద్దాల కిటికీలు అవీ విరగగొడుతూన్న ధ్వనులు. మధ్య మధ్య శాంతి, చిన్నాడు, సమతల గొంతులు. రెచ్చిపోయిన జనాన్ని శాంతపరుస్తూ "ఆగండి తొందరపడ కండి!" "ఒరే కొండయ్యా ఏమిట్రా అది? చెప్తూంటే వినవూ" "నిజం తేలేదాకా శాంతంగా వుండండి!" ఈలాంటివి. భూదేవికి దెబ్బ తగలగానే ఈ గోలంతా వున్నట్లుండి ఒక్కసారిగా ఆగిపోయింది. ఒక్కక్షణం అంతా నిశ్శబ్దం. పోలీసు విజిల్స్. "పోలీస్ పోలీస్" అని కొన్ని గొంతులు - తరువాత పోలీస్‌వారి బెదిరింపులు - "ఎయ్‌వెళ్ళండి వెళ్ళండి". భూదేవి విన్నది. పోలీసు లొచ్చారని తెలుసుకుంది. కంగారుపడుతూంది.... పెద్దవాడు విజయవంతంగా ఆమెవైపు చూచాడు)

భూదేవి: పోలీసుల్ని పిలిపించావారా?

పెద్దాడు: (పెద్దగా నవ్వి) ఇక వెళ్ళి కాపాడుకో నీ బిడ్డలను. తెలివితక్కువగా ప్రవర్తింటారా నిలువునా పలపల రాలిపోతారు ....

మళ్ళా నవ్వి రేడియోను నొక్కేసాడు

భూదేవి: ఆఁ.... ఒరే....ఒరే.... (గబగబ మెట్లెక్కి వెళ్తూంది. టపటప తుపాకులు పేలిన చప్పుడు. ఒక్కక్షణం ఆగి పరుగెత్తింది భూదేవి....శాస్త్రి మళ్ళా రేడియో తిప్పాడు. రేడియోలో తుపాకుల కాల్పులు, హాహాకారాలు - అప్పుడప్పుడు "అమ్మా, అన్నయ్యా ఒదినా" అని సమత అరుపులు....)

భూదేవి: (కంఠం) ఆగండర్రా! నా బిడ్డల్ని చంపకండర్రా!

(ఇక్కడ)

పెద్దాడు: శాస్త్రిగారూ! రాసేండి. సమయం మించిపోతుంది. తరువాత విచారిస్తాం. దింపండి - గదిని కిందికి దింపండి.

శాస్త్రి: (ఒక కాగితాన్ని పెద్దాడిముందుపెట్టి) సంతకం చేయండి....

పెద్దాడు: శాస్త్రీ! ఇన్నాళ్లూ చేసిన కృషంతా బూదిపాలవుతుంది. సాధించటానికిదా సమయం!

తుపాకి కాల్పులు కేకలు వినబడుతూనే వున్నాయి.

భూదేవి: (గబగబ మెట్లుదిగి వచ్చింది పెద్దాడి దగ్గరకు) పెద్దాడా! ఆపరా! యీ అన్యాయపు కాల్పులు ఆపరా! నాయనా! నామాట వినరా! ఈ మహాపాతకాన్నెందుకురా మన నెత్తిన కట్టుకోటం. మన బిడ్డలురా వాళ్ళు! అమాయకులు. నీకోసం వాళ్ళ రక్తాన్ని ధారపోశారు! నీకు చాకిరి చేశారు. లాభాలు సంపాయించి పెట్టారు. వాళ్ళ తాతలు ముత్తాతలు మన పంచలో బిడ్డల్లా పెరిగారురా తండ్రీ!

పెద్దాడు: అమ్మా ఈ ఆడంగి ఏడుపులు నా దగ్గరేం లాభంలేదు. ఫ్యాక్టరీ పడగొడుతారూ! పడగొట్టనీ ——

భూదేవి: శాస్త్రిగారూ! మీరన్నా చెప్పరూ! అన్యాయంగా అనవసరంగా ఎన్ని అమాయక ప్రాణాలు బలి అవుతున్నాయి! ఆపండి - మనలో తకరార్లు మనమే తీర్చుకుందా. మధ్య యీ పోలీసుల కాల్పులు ఎందుకు చెప్పండి? శాస్త్రిగారు! ఒక్కసారి గుర్తు తెచ్చుకోండి? మిమ్మల్నెంత గౌరవంగా చూచారో నా బిడ్డలు. మీకు కరువురోజుల్లో కూడా తిండి గింజలిచ్చారు. దొడ్లో కాచిన కూరగాయలు ప్రేమకొద్దీ, మీరు గొప్పవారని, విజ్ఞాని అని తీసుకొచ్చి సమర్పించారు. ఈనాడు మీరే వాళ్ళ ప్రాణాలు తీస్తారా?

మళ్లా కాల్పులు ప్రారంభం. సమత అమ్మా అని కేక.

భూదేవి: తల్లీ! (పరుగెత్తింది. ఎదురుగా శాంతి వచ్చింది.)
శాంతి: అత్తయ్యా! సమతకు దెబ్బ తగిలిందత్తయ్యా!

భూదేవి పరుగెత్తి వెళ్ళింది. శాంతి నాన్న దగ్గరకు వచ్చింది.

శాంతి: నాన్నా! నాన్నా! ఆపండి నాన్నా! ఈ కాల్పులు ఆపండి!
శాస్త్రి: శాంతీ! నువ్వెళ్ళు....ఇంటికి వెళ్ళు....
శాంతి: వెళ్ళను! వీళ్ళతోపాటే వుంటాను.
శాస్త్రి: శాంతీ వెళ్తావా వెళ్ళవా?
శాంతి: నాన్నా! ఒక్కసారి గుర్తు తెచ్చుకోనాన్నా! అన్నయ్య ఎలా చచ్చిపోయాడో - ఎంత బాధపడ్డాడో - విషబాంబుకు ఎలా బలి అయ్యాడో. అప్పుడు అమ్మా నువ్వూ కొన్ని నెలలు ఎలా కుంగి కుమిలి కృశించారో! నాన్నా! నువ్వు నీ విజ్ఞానాన్నంతా వెచ్చించి యీ బాంబు సృష్టించావు. నీ బిడ్డలాటి బిడ్డలు ఎందరు బలి అవుతారో - అమ్మలాంటి అమ్మలెందరు కుమిలిపోతారో - ఎందరు నిన్ను, నీ వంశాన్ని శపిస్తారో - నాన్నా ——
పెద్దాడు: శాంతీ!
శాస్త్రి: శాంతీ! శాంతీ! అవునమ్మా! అన్నయ్య చచ్చిపోయాడమ్మా! విషవాయువు పీలుస్తూ - నరకం అనుభవిస్తూ - అన్యాయంగా పోయాడు తల్లీ! శాంతీ....
పెద్దాడు: శాస్త్రిగారూ! ఏమిటీ వెర్రి! ఏడుస్తూ కూచోటానికిదా సమయం.
శాంతి: ఏడవకుండా నీలా నవ్వుతూండడానికి మేమేం రాక్షసులమా ఛీ! నీ బ్రతుకు చెడ! అత్తయ్య కడుపు చెడబుట్టావు. ఆ తల్లి కడుపులో నీలాంటి ——
పెద్దాడు: ఏయ్ (లాగి గెంటాడు)
శాస్త్రి: శాంతీ!
పెద్దాడు: శాస్త్రీ దింపు గదిని...
శాస్త్రి: దింపను!
పెద్దాడు: ఆఁ....
శాస్త్రి: తల్లీ శాంతీ! పాపినమ్మా! మహాపాపిని! మేధస్సును దుర్వినియోగం చేశాను తల్లీ! మూడు సంవత్సరాలు కృషిచేసి మానవులను చంపటానికి సులభమార్గం కనిపెట్టానమ్మా! అయ్యయ్యో విజ్ఞానం నన్ను వెక్కిరిస్తూంది తల్లీ!
పెద్దాడు: శాస్త్రీ గదిని కిందికి దింపుతావా లేదా?
శాస్త్రి: లేదు!

పెద్దాడు: ఖోనీ ఏలా దింపాలా చెప్పు....ఎక్కడుంది దాని కిటుకు?

శాస్త్రి: చెప్పను....

పెద్దాడు: చెప్పకుంటే నువ్వు నీ విజ్ఞానం నీ శాంతి అందరూ నాశనమైపోతారు....

భూదేవి: (ఇంతలో గబగబ దిగివచ్చింది. అంతా రక్తమయంగా వుంది. తెల్లటిచీర పూర్తిగా రక్తంలో ముంచి ఎత్తినట్లుంది. కళ్ళు నిప్పులు చెరుగుతూన్నాయి; ముఖం ఎర్రబారింది. చేతిలో తుపాకి వుంది.) రాక్షసుడా! ఆవుతావా లేదా యీ కాల్పులు!

పెద్దాడు: ఆపను. శాస్త్రీ! (బల్లమీదవున్న బాంబు చేతికి తీసుకొన్నాడు. గోడలో వున్న ఒక స్విచ్ నొక్కాడు. గోడలోవున్న తలుపు తెరుచుకుంది.) శాస్త్రీ! వస్తావా! ఇక్కడే చస్తావా! (వెళ్ళబోతున్నాడు.)

భూదేవి: (వణికిపోతూ) పెద్దాడా! (తుపాకి పేల్చింది, పెద్దాడు దెబ్బతిన్నాడు. రెండవ సారి పేల్చింది. గురితప్పి అక్కడున్న సామగ్రికి తగిలింది. నిప్పంటుకుంది.)

శాస్త్రి: (కంగారుగా) వెళ్ళండి.... తల్లీ, అందరూ వెళ్ళండి. ఇక కొద్దిసేపటిలో ఆ బాంబు పేలుతుంది.ఫ్యాక్టరీ అంతా కూలిపోతుంది. వెళ్ళండి. భూదేవీ! (కాళ్ళట్టుకున్నాడు) వెళ్ళండి. .

శాంతి: నాన్నా!

శాస్త్రి: నేను యిలాగే నశించాలిలేమ్మా! ఇదిగో - యీ కాగితాలు తీసుకెళ్ళు. ఈ బాంబు చేయటానికి వుపయోగించిన విజ్ఞానం, శక్తి, మానవకళ్యాణానికి, సుఖానికి వుపయోగించవచ్చు. ముందుతరంవాళ్ళు వుపయోగించుకుంటారు. భద్రంగా దాచు. వెళ్ళమ్మా....వెళ్ళండి. (మైక్‌లాంటిది అందుకొని) అందరూ వెళ్ళండి. పోలీసులు అందరూ వెళ్ళండి. ఇది పింగాణీ ఫ్యాక్టరీ కాదు. బాంబుల ఫ్యాక్టరీ. బాంబుపేలి అంతా కూలిపోతుంది. వెళ్ళండి. వెళ్ళండి.. అందరూ వెళ్ళండి. (అని అరిచి చెబుతున్నాడు.)

భూదేవి శాంతి వెళ్ళారు. పెద్దాడు మూలుగుతున్నాడు. నిప్పు గదంతా అలుముకొంటూంది. బాంబు పేలింది.

ఫ్యాక్టరీ కూలిపోవడం నీడలో చూపండి. అట్టముక్కలతో ఫ్యాక్టరీలాంటిది చేసి లోపల ఒక టపాకాయ పెట్టి పేల్చండి. తెల్లటితెర వెనకపెట్టి నీడను పెద్దదిచేస్తే ఫ్యాక్టరీ పేలినట్లనిపిస్తుంది. తదనుగుణ్యమైన శబ్దాలు కల్పించటానికి ప్రయత్నించండి.

తెల్లటి తెరవెనుక మంట లగుపిస్తూనే వున్నాయి. కూలిపోయిన ఫ్యాక్టరీ కని పిస్తూంది. చిన్నవాడు తలకు కట్టుకట్టుకొని, సమతను చేతులమీద మోసు కొచ్చాడు. వెంబడే భూదేవి శాంతి ఇంకా జనం వచ్చారు. అందరూ ఒక్క సారి కాలిపోతూన్న ఫ్యాక్టరీవైపు చూచారు. సమతను కింద పడుకోబెట్టి శైత్యోపచారాలు చేశారు. సమత మెల్లగా కళ్ళు తెరిచింది. లేచి కూర్చుంది.

జనాన్నంతా ఒక్కసారి కలయచూచింది. బిగించిన పిడికిలితో లేచింది.

సమత: ఇంతా చూచి ఇంకా వూర్కుంటారా! అరవండర్రా! శాంతి కావాలని అరవండర్రా!

జనంలో కొందరు అరుస్తారు.

సమత: (అరవని వాళ్ళనుద్దేశించి వాళ్ళవైపువెళ్ళి) శాంతి కావాలని అడగటానికి సిగ్గర్టా! అరవండి శాంతి కావాలని అడగండి! (అందరూ అరిచారు.)

అమరయ్య: అడగటంకాదు - శాంతిని స్థాపిస్తాం! యుద్ధాలను నిర్మూలిస్తాం!

అందరు: రిజర్వాయరు కడదాం! బంగారు పంటలు పండిద్దాం! పాడుతూ ఆడుతూ హాయిగా అందరం బతుకుదాం!

అయిపోయింది.

—ంంంంంం—

# కప్పలు



ఆత్రేయ చలనచిత్రరంగంలో స్థిరపడిన తర్వాత. పూర్వ నాటకాలకు భిన్నంగా రాసిన విలక్షణమైన రచన కప్పలు. సున్నితమైన వ్యంగ్యంతో కూడిన హాస్యం (సెటైర్) ఈ నాటకంలోని ప్రత్యేకత. రచనాకాలం 1953.

# నా మాట

విశ్రాంతి తరువాత నా నాటకం ఇదే!

రాజకీయ వివాదాలతో నాటకాన్ని రక్తికట్టించుకుంటాడన్న వాదును కాదనిపించుకోవాలని యీ నాటకం వ్రాశాను. ఏమాత్రం సఫలుణ్ణి కాగలిగానో జనం నిర్ణయించాల్సిందే.

ఇందులో కథావస్తువు కొత్తదికాదు. తెలుగు ప్రజలకి సుపరిచితమైన 'సుమతీ శతకం'లోని 'తెప్పలుగచెరువు నిండిన కప్పలు పదివేలు చేరు' అనే పద్యం ఇందులోని ఇతివృత్తం. ఇలాంటి వస్తువుగల నాటకాలు తదితర భాషల్లో ఉండవచ్చు. అయినా యిది పూర్తిగా స్వతంత్ర రచన. వాటిని పోల్చుకుని చూడవలసిన అవసరం లేదు. ఒకవేళ అలా చూచుకున్నా, సామ్యాలున్నా స్వతంత్ర భావనను సందేహించటం అన్యాయమని మనవి.

పాటలకు రెండు స్థలాలున్నాయి. నాటకం రక్తికట్టాలంటే పాటలు అవసరం అనుకునే ప్రదర్శకులు వాటిని సద్వినియోగం చేసుకోవచ్చు.

ఆంధ్రప్రజ యీ నాటకాన్ని ఆదరిస్తుందని ఆశిస్తా.

మీ

ఆత్రేయ.

# పాత్రలు

శ్రీపతి : బాగా డబ్బుగల ఆసామి
కమల : అతని కూతురు
నారయ్య : వాళ్ళింట్లో చాలాకాలంగా వుంటున్న నౌకరు
గోపాలం : శ్రీపతి స్నేహితుడు
చలపతి : కమల ప్రియుడు
జగ్గయ్య : చలపతి తండ్రి
సాంబశివం : శ్రీపతి బంధువు
పంకజమ్మ : ,,
భద్రయ్య : ,,
పిల్లవాడు : ,,

.... ఇంకా ఎవరన్నా అవసరమైతే ...

కాలం : నిన్న - నేడు
స్థలం : శ్రీపతి ఇల్లు
రంగాలు : రెండు
సమయం : ప్రథమ రంగం - ఒకనాడు రాత్రి పది గంటలు మొదలు ఒంటిగంట లోపు.
సమయం : ద్వితీయ రంగం - మరునాడు ప్రొద్దున ఆరు గంటలు మొదలు సాయంత్రం ఆరు లోపు.

**6-11-1954** తేదీన విజయవాడ శ్రీ వెలిదండ్ల హనుమంతరాయ గ్రంథాలయ హాలులో 'ఆంధ్ర ఆర్టు థియేటరు' వారిచే విజయవంతంగా ప్రదర్శింపబడి, వివిధ పత్రికలచే, ప్రముఖులచే మన్నన లందబడినది.

## నాటి నట వర్గము

| | | |
|---|---|---|
| శ్రీపతి | : | ఆదిశేషయ్య |
| నారయ్య | : | సత్యం |
| సాంబశివం | : | సూర్యనారాయణ |
| భద్రయ్య | : | హరినారాయణ |
| జగ్గయ్య | : | శర్మ |
| గోపాలం | : | చలపతిరావు |
| చలపతి | : | శేఖర్ |
| డ్రైవర్ | : | ప్రసాదరావు |
| పిల్లవాడు | : | చి॥ బాబా పుండరి |
| పంకజమ్మ | : | కాంచనలత |
| కమల | : | ఉషాబాల |

# మొదటి రంగం

శ్రీపతి యిల్లు. సిరిగలవాని సరదాలన్నీ కనపడతాయి ఆ హాలులో. హాలులోకి మేడ మెట్లున్నాయి. ప్రేక్షకుల కుడిచేతివైపు సింహద్వారముంది. సింహద్వారానికి ఇరువైపులా పెద్ద అద్దాల కిటికీలు నిలువునా వున్నాయి. సింహద్వారానికెదురుగా, అంటే ప్రేక్షకుల ఎడమవైపు గోడలో రెండు ద్వారాలున్నాయి. రెంటికి పరదా లున్నాయి. ప్రేక్షకులకు ఎదురుగావున్న గోడలో ఒక ద్వారం వుంది. దానికి రెక్కతలుపులు (సగం) వున్నాయి. ఆఫీసుగదిలా వుంది చూస్తే. హాల్లో చాలా ఖరీదైన సోఫాలు, కింద తివాసీ, ఇంకా వుండదగిన సామాన్లు చాలా నాజూకైనవి వున్నాయి. గడియారం కనుపించకపోయినా వినిపిస్తే చాలు. తొమ్మిది గంటలు కొట్టింది.

తెర తీసేసరికి రాత్రి హాల్లో దీపాలు వెలుగుతున్నాయి. ఒక సోఫామీద ఒయ్యారంగా వాలి కమల యేదో పుస్తకం చదువుకొంటూంది. దాపునే వున్న చెరువులో "కప్పల బెక బెకలు" వినబడుతున్నాయి. కమల అప్పుడప్పుడు ఆ శబ్దానికి విసుగుపడుతూ చదువుతూంది. రాను రాను ఆ "బెక బెకలు" విపరీతమై దుర్భరమైనాయి. కమల ఇక భరించలేక లేచి పుస్తకం విసిరికొట్టింది బల్లమీద. అప్పుడే నారయ్య వచ్చాడు. నారయ్య బాగా ముసలివాడు. ఒడ్డూ పొడుగూ మనిషి, పుష్టిగా వున్నాడు.

నారయ్య: భోజనాకి వస్తారామ్మా!

కమల: నారయ్యా. ఇలారా!

నార: ఏమమ్మా!

కమ: కూచో.

నార: (కూచున్నాడు)

కమ: నువ్వెంత కాలంగా వున్నావు నాన్న దగ్గర?

నార: ఏమమ్మా! ఎందుకట్లా అడుగుతున్నావు?

కమ: ఏంలేదు, చెప్పు చెప్తా!

నార: నీవు పుట్టకపూర్వంనుంచీ వుంటున్నానమ్మా.

కమ: అంటే దాదాపు యిరవైయేళ్ళయి వుంటుందా?

నార: ఆఁ.

కమ: అయితే నాన్నగారి విషయాలన్నీ నీకు బాగా తెలుసుకదూ?

నార: అన్నీ ఎట్లా తెలుస్తాయమ్మా? నౌకర్లకు తెలియతగ్గవే తెలుస్తాయిగాని.

N 11

కమ: అలా కాదులే! నిన్ను నాన్నగారు కేవలం నౌకరులాగా చూసుకోరుగా, వ్యాపారం విషయాలు కూడా నీతో మాట్లాడుతుంటారు.

నార: ఆఁ ఏదో ఆయన నమ్మకం కొద్దీ.

కమ: అదేలే. మరి ఈ యిల్లు కట్టించేప్పుడు నువ్వున్నావుగా.

నార: లేకేం?....తులసికోట కట్టించడం విషయంలో నాన్నగారికీ నాకూ పెద్ద దెబ్బలాటైంది కూడా.

కమ: ఎందుకు?

నార: నాన్నగారు అప్పట్లో దేవుడూ లేడు గీవుడూ లేదని వాదించేవారు లేమ్మా, అందుకని...

కమ: అయితే ఇల్లు కట్టడానికి ఈ స్థలం చూసిందీ నువ్వేనా?

నార: పూర్తిగా నేను కాకున్నా నేనూ వున్నాన్లే. ఏమిటమ్మా ఎందుకు ఈ భోగట్టా అంతా.

కమ: అసలు మీ కెవ్వరికీ మతిలేదు నారయ్యా!

నార: మతిలేదా! ఏమిటమ్మా ఇంతబతుకూ బతికి ఈనాటి కనిపించుకున్నాం.

కమ: మతుంటే మనుష్యమాత్రు లెవ్వరైనా యిక్కడ ఇల్లు కట్టుకుంటారా?

నార: అదా! ఈ ఇంటికేమమ్మా, బంగారంలాంటి స్థలం....చుట్టూ పెద్ద తోట.... అటువైపు కొండలు....ఇటు పొలాలు....నాలుగడుగులు వడిస్తే సముద్రం లాంటి చెరువు.

కమ: అదే అదే....రాత్రయితే చెవులు గింగురుపోయేట్టు కప్పలు గోల, కీచురాళ్ళ గీగీలు, పొరబాటున ఇటు తిరిగామా ఎవడి కాష్టమో కాలుతూన్న మంటలు. నక్కల కూతలు....అబ్బ....ఎంత అందమైన స్థలంలే నారయ్యా.

నార: ఏమోనమ్మా నాన్నగారి కివే చాలా నచ్చినయి. వీటికోసమనే ప్రత్యేకంగా కట్టించా రీ యిల్లు.

కమ: ఏడ్చినట్టుంది. విన్నావా....ఆ కప్పలు....చెవులు చిల్లులుపడుతున్నాయి. నారయ్యా! నాన్నగారితో చెప్పి ఆ కప్ప లన్నిటినీ పట్టించి ఎక్కడన్నా దూరాన వదిలే. లేకుంటే ఈ ఇంట్లో బతకడం కష్టం.

నార: కప్పలెన్నాళ్ళుంటాయమ్మా, చెరువులో నీళ్ళున్నన్ని నాళ్ళేగా!

కమ: చెరువులో నీళ్ళు తీయించేస్తే?

నార: బాగుంది. కప్పలకోసమని నీళ్ళు పాడుచేసుకుంటామా?

కమ: కప్పలన్నీ చచ్చేటట్టు మందేమైనా కలిపితే సరి.

నార: నీళ్ళు పనికొస్తాయా? కప్పలతోపాటు పశువులు, పక్షులు కూడా చావవూ?

కమ: అవి చస్తాయని మనం చస్తున్నాం. నారయ్యా యీ కప్పలు పోయేదాకానే నెక్కడన్నా పోతా. అంతే. (వున్నట్లుండి కెవ్వుమని కేకేసి ఎగిరిపడింది సోఫాలోంచి)

నార: (కంగారుగా) ఏమిటమ్మా? ఏమైందీ ...ఏమిటి?

కమ: నారయ్యా, నారయ్యా....

శ్రీపతి: (మేడమెట్లు దిగివస్తూ) ఏమిటమ్మా కమలా. ఏమిటది?

కమ: కప్పలు....కప్పలు నాన్నా.

నార: ఎక్కడమ్మా, ఎక్కడ?

కమ: అదిగో, సోఫాకిందికి వెళ్ళింది. పాడు కప్పలు. ఇంట్లోకే వస్తున్నాయి.

శ్రీపతి: (నవ్వి) ఎందుకమ్మా అంత గాభరా! కప్పలేం చేస్తాయి?

కమ: అబ్బ ఛీ, వెధవకప్పలు నా కసహ్యం. నాన్నా ఈ ఇల్లు వెంటనే వదిలేయాలి. ఇంట్లో కప్పలు, తోటలో కప్పలు, చెరువులో కప్పలు ఛీ ఛీ.

నార. కాస్త చెమ్మవుంటే చాలమ్మా కప్పలు చేరతాయి, నేల ఎండిందంటే పత్తా లేకుండా పోతాయి.



కమ: మన నేల ఎండనూ ఎండదు, అవి పారిపోనూ పోవు. మనం యిలా చావాల్సిందే.

శ్రీ: (నవ్వి) సాంబశివంవాళ్ళు ఎక్కడమ్మా?

కమ: సినిమాకెళ్ళారు నాన్నా.

శ్రీ: కార్లోనే వెళ్ళారా?

కమ: ఆఁ....

నార: మీరు భోంచెయ్యండయ్యా, వాళ్ళు రావటం ఆలస్యమవుతుందేమో!

శ్రీ: ఏమమ్మా!

కమ: వాళ్ళూ రానీ నాన్నా నాకేం ఆకలిగా లేదు.

శ్రీ: సరేలే నారయ్యా, వాళ్ళొచ్చిన తర్వాతే భోంచేస్తాం.

నార: సరేయ్యా (వెళ్ళాడు)

శ్రీ: ఏమిటమ్మా చదువుతున్నావు?

కమ: చదివినట్లే వుంది నాన్నా యీ యింట్లో.

శ్రీ: ఏం?

శ్రీ: సుమతిశతకం చదివావుకదూ నువ్వు! అందులో పద్యం జ్ఞాపకముందా?

కమ: అందుకని కప్పలతో పేగాలంటావా?

శ్రీ: ఏదీ ఆ పద్యం చదువమ్మా విందాం!

కమ: ఏమిటినాన్నా మరీ నువ్వు. సుమతి శతకం పద్యం చదవమంటావు పో... పోయి.

శ్రీ: దానికేమమ్మా! ఎప్పటికైనా పనికొచ్చే పద్యాలవి. ఏదీ ఆ పద్యం చదువు.... ఊఁ... చదువు మరి.

కమ: "ఎప్పుడు సంపద కలిగిన
అప్పుడు బందుగులువత్తు రదియెట్లన్నన్
దెప్పలుగ చెరువునిండిన
కప్పలు పదివేలుజేరు గదరా సుమతీ."

అంతేనా.

శ్రీ: అంతేనమ్మా! అదే జీవితం, అదే పరమసత్యం.

కమ: అయితే ఇప్పుడు మనింటికివచ్చిన బంధువులందరూ కప్పలేనంటావా?

శ్రీ: (నవ్వి) చలపతికూడా.

కమ: నాన్నా!

శ్రీ: అవునమ్మా! అదే నీకు చాలాకాలంగా చెప్పాలనుకొంటున్నాను.

కమ: నాన్నా! మీరేమన్నా అనండి. చలపతి అలాంటివాడు కాదు నాన్నా.

శ్రీ: పిచ్చితల్లీ! చలపతి మనిషేనంటావా?

కమ: మనుష్యు లందరూ అంతేనంటారా?

శ్రీ: అనటానికి సాహసించను. కానీ చాలామంది అంతేనమ్మా.

కమ: ఆ చాలామంది కాని కొద్దిమందిలో చలపతి ఒకరు కాకూడదా నాన్నా!

శ్రీ: కావచ్చు, కాకపోవచ్చు. కాలం నిర్ణయించాల్సిందే. కానీ చలపతి కూడా ఆ చాలామందిలో ఒకడైననాడు కాదు - ఒకడైనాడని నువ్వు గ్రహించిననాడు చాలా బాధపడతావు. అందుకని ముందుగా చెప్తున్నాను. అంతకన్నా వేరింకేమీ లేదమ్మా!

కమ: (నిశ్శబ్దంగా కూర్చుంది ఆలోచిస్తూ)

శ్రీ: ఏమమ్మా! నొప్పించానా?

కమ: ఏంలేదు నాన్నా!

శ్రీ: చూడు తల్లీ. నువ్వుకాక నాకింకెవరున్నారు. కొడుకైనా, కూతురైనా నువ్వే. నీ సంతోషాన్ని కాదని నేను చేసేదేముందమ్మా!

కమ: నాన్నా!

శ్రీ: బాధపడకమ్మా! ఆడదాని జీవితం అరిటాకులాంటిది. ప్రపంచంలో డబ్బు ప్రధానమైంది. అన్నీ ఆలోచించుకొని, నీ ఆనందం ఇదని నువ్వు నిర్ణయించుకున్నరోజు నేను దాన్ని 'ఏమిటని' అడక్కుండా ఆమోదిస్తాను. ఆశీర్వదిస్తాను. అనుమానాలతో బాధపడక్కర్లేదు. సరేనా?

కమ: (ఊరుకుంది)

శ్రీపతి మెల్లగా మేడ మెట్లవైపు వెళ్ళాడు. కమల అలాగే వుంది. శ్రీపతి మళ్ళీ ఒకసారి ఆమెను చూసి ఆపీసురూంలోకి వెళ్ళాడు. ఆలోచనలోపడ్డ కమల అలాగే కూచుంది.

కప్పల బెకబెకలు వినబడుతూనే వున్నాయి. వాకిట కారాగిన చప్పుడు. అందులోంచి దిగుతూన్న జనం సందడి కప్పల బెకబెకలను మింగేస్తూంది. మధ్య పిల్లవాడి యేడుపు. "ఆకలమ్మా ఆకలని. . ." "మెల్లగా దిగు బాబూ"-"నువ్వు దిగవే పిల్లవాణ్ణి నే నందిస్తాను" తదితరాలైన మాటలు. తలుపు మూసిన ధ్వని. ఈ గోల కమలను మళ్ళా కలల లోకాన్నించి దింపింది. ఇంతలో సాంబశివం, పంకజమ్మ, భద్రయ్య గుంపుగా లోపలికి వస్తున్నారు. పంకజమ్మ పదేళ్ళ కుర్రాణ్ణి మోసుకొస్తుంది. అందరూ ఎవరికివాళ్లు మాట్లాడుతున్నారు. నారయ్య ఆఫీసు రూంనుంచి వచ్చాడు. అందరూ తల వక ఆసనంలో నిట్టూరుస్తూ అమిరారు. పంకజమ్మ పిల్లవాణ్ణి కిందికి దింపుతూ....

పంకజమ్మ: అమ్మయ్య! తిరణాళ్ళకుపోయి వచ్చినట్లయింది, పాడు సినిమాకు పోయి రావడం. భోంచేశారామ్మా?

కమ: లేదు.

పంక: శ్, అబ్బ! కాస్సేపు కూలబడితేగాని ప్రాణం కుదటబడదమ్మా! కొంచెం ఆగి భోంచేస్తాంలే. మీరు కానీండి. శ్రీపతి వున్నాడా?

కమ: ఉన్నారు (లోపలకు వెళ్ళింది)

పంక: అయినా ఊరికామడ దూరంలో కట్టుకున్నాడేమమ్మా యిల్లు.

సాంబశివం: ఆమడదూరమైతే యేం, పదామడలైతే యేం? భూమికి చాలా దూరంలోనే ఉంటుంది స్వర్గం.

భద్రయ్య: అదికాదులే, పంకజమ్మ అన్నది. మనబోటివాళ్లు రావాలన్నా, పోవాలన్నా....

నారా: అట్టాగని రాకుండా ఎవరున్నారయ్యా, రోజుతప్పినా బందుగులు తప్పరుగా మన యింటికి.

సాంబ: అంతేలే నారయ్యా! బెల్లం వున్నచోటే చీమలు చేరుతాయి. అయ్యగారు భోంచేశారా?

నారా. మీకోసం కాచుకున్నారు.

పంక: మాకోసమా? అయ్యోదేవుడా! లేవండి మరి. వాళ్ళు చేతులు కడుక్కోండి. ఇంతలో నేను వడ్డించేస్తా.

నారా: మీ రెందుకమ్మా వంటమనిషుండగా?

పంక: ఆఁ, వంట మనిషెందుకు - ఇంత ఆడది నేనుండగా, ఫర్వాలేదులే.

పిల్లవాడు: అమ్మా ఆకలే!

పంక: పాడు సినిమా చూచాడో లేదో ఇదొక పల్లవి పట్టుకున్నాడు.

శ్రీ: (వస్తూ) ఏం పంకజమ్మా! ఎలాగుంది సినిమా?

పంక: ఏం సినిమాలో, ఒక హరిశ్చంద్రనా - సతీసావిత్రా - దేవుడికథా - ఏమన్నా వుందా? రోజూ కొంపలో జరిగే భాగోతాలు చూట్టానికెందుకో ఈ సినిమాలు!

సాంబ: నీబోటి అత్తలకు బుద్ధిరావటానికి!

పంక: మీలాంటి మొగుళ్ళకో?

పిల్ల: మామా! మామా! నాకో పాటవచ్చు!

శ్రీ: ఏదీ పాడు.

పిల్ల: "అమ్మా ఆకలే, బాబూ ఆకలి!" (పాడి అభినయించాడు)

పంక: చాల్లే, అడుక్కుతినే పాటా నువ్వూ.

భద్ర: మీరు భోంచెయ్యకపోయారా? మాకోసం కాచుకున్నారట పాపం!

శ్రీ: ఆఁ....!

పంక: ఆ అలవాటు అతనికి చిన్నప్పట్నుంచీలేదు. బంధువులంటే శ్రీపతికి మహా ప్రీతి. ఉన్నదాంట్లో నలుగురికి పెడితేగాని అతనికి తిన్నట్లుండదు. ఒకసారి తన పదోయేట ఏమైందంటే...

సాంబ: సరేలే, వెళ్ళి వడ్డించు.

పంక: సరేలే మీరుండండి. ఆకలి, ఆకలి ఎప్పుడూ వున్నదేగా మనపాట. అచ్చం అబ్బగుణమే వచ్చింది వీడికి. పెట్టేవాళ్ళుంటే పీఠం వేసుక్కూచుంటారు. మా పెద్దవాడున్నాడే, వాడిట్లా కానే కాదన్నయ్యా, పుస్తకం చేతపట్టాడంటే పేళ్ళకంటుకు పోవాల్సిందే అట్లా....

సాంబ: నువ్వు వాగడం మొదలెడితే వడ్లమిల్లయిపోయినట్లు....

పంక: బాగుంది. వాగటమా యిది. అతనింత డబ్బుపోసి, కారిచ్చి, మనల్ని సినిమాకు పంపితే, అడిగితే మనం యేం చూశామో చెప్పక్కర్లా!

పిల్ల: అమ్మా ఆకలే.

పంక: ఉండరా నీ రొద. శ్రీపతి తెలీక అడుగుతా, ఆ సినిమాలో ఒక డబ్బుగల ఆసామిని తల పగులగొట్టి డబ్బు లాకెళ్ళిందిగదా ఆ యిల్లాలు.. ..అంతే. అందరూ అట్లా చేయాలనా యేమిటి, పాడు సినిమా అది.

సాంబ: ఆఁ, అందరూ అలాంటి మహారాజులే వుంటారాయేం?

భద్ర: ఆమాటకొస్తే మన శ్రీపతిగారున్నారు, ఆయన తల బద్దలుకొట్టమంటే మాత్రం కొడతామా మనం?

పంక: ఏడ్చినట్లుంది. శ్రీపతికి, ఆ సినిమాలోవాడికి యేంపోలిక?

పిల్ల: మామా! ఆ లావాటి ఆయన్నిచూచి అమ్మ యేమన్నదో తెలుసా?

పంక: ఛీ! నువ్వు నోరుముయ్!

శ్రీ: ఏమన్నది బాబూ?

పిల్ల: అచ్చం మీ మామలాగున్నాడు అంది.

పంక: ఆఁ పోలిక్కేమిలే. అవును శ్రీపతీ. అచ్చం నీలాగే వున్నాడు రూపానికి. కానీ గుణమో? నీ కాళ్ళక్రింద వెయ్యిసార్లు లాగితేమాత్రం వాడికి నీ గుణం వస్తుందా?

భద్ర: ఆ మాటకొస్తే, శ్రీపతిగారి గుణం, శ్రీపతిగారు మళ్ళీ పుట్టి, వారికే చమ్మన్నా వస్తుందా?

సాంబ: అసలందాకి ఎందుకు? శ్రీపతిగార్కి మళ్ళా పుట్టుక వుంటుందా అంట?

భద్ర: ఆమాటకొస్తే శాస్త్రంలో ఏమన్నారో తెలుసా? "పునరపి జననం, పునరపి మరణం, పునరపి జననీ, జఠరేశయనం" అన్నారు.

సాంబ: అది మనబోటి మనుష్యులకయ్యా.

శ్రీ: అయితే నేను మనిషినే కాదంటావా సాంబశివం?

సాంబ: ఛాఛా! ఎంతమాట ఎంతమాట!

పంక: ఏడ్చినట్లున్నాయి మీ మాటలు మీరూ? ఎక్కడున్నుంచెక్కడికి పోయారు. చావడం, పుట్టడం. శుభమా అంటూ పెళ్ళిముహూర్తం పెట్టుకుపోదామని వస్తే చావు మాట్లేమిటి?

శ్రీ: ఎవరికి పంకజం పెళ్ళి?

పంక: ఆ పెద్దపిల్లవాడికే!

శ్రీ: పిల్లదొరికిందా యేం?

పంక: బాగుంది నువ్వడగడం! పిల్ల? నా పీకలో ప్రాణాలుండగా పేరేసంబంధం చేసుకుంటానా? బంగారంటిపిల్ల మేనకోడల్ని పెట్టుకుని పేరేపిల్లని చూట్టమే? నేను బతికుండగా జరగదాపని.

శ్రీ: మేనకోడలా! ఎవరు పంకజం? (పంకజం సాంబశివాన్ని గిల్లింది)

సాంబ: ఇంకెవరున్నారు? మన కమలే!

శ్రీ: కమలా!

కమ: (వచ్చింది) నాన్నా! భోజనానికి అంతా సిద్ధంగా వుంది.

శ్రీ: ఆఁ లేవండి, భోంచేద్దాం.

పంక: అదేవఁమ్మా కమలా! నేనొస్తూనేవున్నా. యింతలో నువ్వు అంతా ఏర్పాటు చేశావా? నువ్వు ఇంటిపని చెయ్యగలవని నాకు చూపించ నక్కర్లేదులే! అందరి అత్తగార్లలా కాదు నేను. నేను నేలపడేదాకా నిన్ను కూర్చోబెట్టి చేస్తా.

భద్ర: సరే, పదండి, పదండి.

అందరూ వెడుతున్నారు. కమల మాత్రం వెనక పడింది.

పంక: రామ్మా కమలా, రా!

శ్రీ: రామ్మా?

కమ: నే నీ పూట భోంచెయ్యను నాన్నా.

శ్రీ: ఏం?

కమ: నాకు ఆకలిగాలేదు.

పంక: కాస్త మజ్జిగన్నం తినమ్మా, వేడిచేస్తుంది.

కమ: అక్కర్లేదు.

శ్రీ: సరే పదండి.

అందరూ వెళ్ళారు. కమలమాత్రం హాల్లో వుంది.
కాస్సేపటికి నారయ్య వచ్చాడు.........

నార: ఏమమ్మా, భోంచెయ్యలే?

కమ: ఆకలిగాలేదు నారయ్యా, వాళ్ళు భోంచేస్తున్నారా?

నార: ఆఁ ఇక దొరకదన్నట్లు తింటున్నారు.

కమ: నారయ్యా! ఏమిటిది?

నార: కాకుంటే ఏమిటమ్మా! వాళ్ళూ మనుష్యులేనా? అబ్బబ్బ, ఏం పొగడ్తలు ఏం పొగడ్తలు, నాన్నగారిని ఒక్కదెబ్బన ఆకాశానికి ఎత్తేస్తున్నారు. ఒకర్ని మించి ఒకరు. అసలు వాళ్ళ మాటలు వింటూంటే నాకే ఒళ్లు మండుకొస్తుంది. నాన్నగారెట్లా వింటున్నారో గాని, అవి వచ్చి అబద్ధాలని మనకే అనిపిస్తా వుంటే ఎట్లాగమ్మా మరీని. ఏదో వచ్చారు. తిన్నారు. పోరే పోలే! ఎందుకు చెప్పు యీ తెగ పొగడ్తం?

కమ: ఏమో నాన్నని చూస్తే వాళ్ళకట్లా అనిపిస్తుందేమో నారయ్యా!

నార: ఆc....నాబొంద అనిపిస్తావుంది. పో అమ్మా, మళ్లా యీాళ్ళె, ఎనకజేరి ఎక్కిరిస్తారు. ఈళ్ళ సంగతి నాకు తెలీదూ!

కమ: నారయ్యా! చలపతిగార్ని ఎరుగుదువా నువ్వు?

నార: ఎరక్కేవమ్మా! రోజూ మనింటికొస్తుంటేను! ఈ రోజు ఏడమ్మా యింకా రానరాలే!

కమ: ఇంకా రాలేదు నారయ్యా! మనింటికి రాకపూర్వం నుంచీ ఎరుగుదువా ఆయన్ని?

నార: ఆయన్నేంటి! ఆయన నాయన్ని కూడా ఎరుగుదును.

కమ: ఎట్లాంటి వాళ్ళంటావ్?

నార: నాయన సంగతేమోగానీ, ఈయన శానాపంచాయన. అసలు బాగా బతికిన కుటుంబం గాదమ్మా, పాపం యిప్పుడేదో కాస్త తంటాలు పడుతున్నారట గానీ, ఏం? ఎందుకమ్మా?

కమ: ఏం లేదు.

నార: నాకు తెలుసులే అమ్మా! నాన్నగారితో నేను కూడా ఎన్నోసార్లు చెప్పాను.

కమ: ఏమని?

నార: మిమ్మల్నిద్దర్నీ చూస్తావుంటే చిలకాగోరింకల్లా వున్నారని.

కమ: నువ్వు చెప్పావా? ఎందుకు చెప్పావ్?

నార: ఏమమ్మా?

కమ: నాన్నగారికి ఆయనంటే యిష్టంలేదు.

నార: ఇష్టంలేదా? నీతో చెప్పారా?

కమల: ....

నార: నువ్వాడిగావమ్మా?

కమ: లేదు. నాన్నగారే చెప్పారు. ఎంత మంచి తల్లిదండ్రులైనా చివరకింతే నారయ్యా! పిల్లల పెళ్ళి విషయం వచ్చేటప్పటికి మేమున్నామని ముందు కొస్తారు. పెళ్ళి కేవలం ఎవరికి వారు నిర్ణయించుకోవాల్సిందని మర్చి పోతారు. ఎంత చదువుకున్నవాళ్ళయినా, ఎంత పెద్ద మనస్సు కలవాళ్ళయినా, యింతే అన్ని స్వాతంత్ర్యాలు యిచ్చి, అసలు విషయంలో పీకనొక్కేస్తారు. ఛీ! ఆడదాని బతుకు అధ్వాన్నపు బతుకు. (చాలా బాధపడుతూ అన్నది. కళ్ళనీళ్ళ పర్యంతం వచ్చింది. నారయ్య గుర్తించాడు. ఏమీ పాలుపోక కాసేపాలోచించి)

నార: ఎందుకమ్మా అంత బాధపడతావ్? నాన్నగారు ఎందుకు చెప్పారో ఏమో! నీ సంతోషంకన్నా నాన్నగార్కి కావలసిందేముందమ్మా!

కమ: ఆఁ....అందరు నాన్నలూ యిదేమాటన్నారు. కన్నకూతురు బతుకు గంగలో కలిపినవాళ్ళు కూడా ఇదే మాటన్నారు.

నార: పెద్దలమాట వినకుండా చెడిపోయిన బిడ్డలో?

కమ: నా పళ్ళు నేనూడగొట్టుకుంటే పరవాలేదు నారయ్యా! ఎదుటివాళ్ళు ఊడ గొడితేనే బాధ!

నార: పిచ్చితల్లి, ఎవరైనా బాధ ఒకటేనమ్మా! నిజం ఆలోచిస్తే పనికిరానిపళ్లు డాక్టరు తీసేయటమే మంచిది, మనం రాయిపెట్టి కొట్టుకుంటే రభసవుతుంది కదూ?

కమ: నారయ్యా! (నారయ్య వాదన తనకేమాత్రం నచ్చలేదు. లేచివెళ్ళబోతుంది. చలపతి వచ్చాడు. సన్నగా, నాజూగ్గా వున్నాడు. సాదా పైజామా షర్టు)

చలపతి: హల్లో కమలా!

కమ: (ఆగింది, ఒక్కక్షణం అతనివేపు చూసి) నేను పైకి వెళ్తున్నా!

చల: ఏం అప్పుడే నిద్రవస్తుందా?

కమ: తల నొప్పిగా వుంది. (ఇక ప్రశ్నకు తావీకుండా సరాసరి మేడమీదికెళ్ళింది)

చల: (కొస్త కంగారు తిన్నాడు. కాని సర్దుకున్నాడు. సరిగ్గా యీ సమయానికే లోపల్నుంచి బంధువులు విరగబడి నవ్వటం వినిపించింది. తన్ను చూసే నేమోనని బుజాలు తడుముకుని, చెప్పరిల్లి) బంధువులొచ్చారా నారయ్యా?

నార: ఆఁ....రాబందులు.

చల: కమలేమిటి అలా వుంది?

నార: చెప్పారుగా తలనొప్పని!

చల: ఓ!

నార: మీరుంటారా? వెళతారా?

చల: వెళ్తాను. (అంటూ కూర్చున్నాడు)

నార: (ఇతని అభిప్రాయం ఏమిటా అన్నట్టు చూచాడు. ఇంతలో 'నారయ్యా' అని శ్రీపతి కేక. 'అయ్యా' అని లోపలి కెళ్ళాడు.)

చల: (జేబులోంచి కలంతీసి. సిగరెట్ పేకట్ అట్టముక్క చింపి ఉత్తరం రాస్తున్నాడు)

శ్రీ: (వస్తూ) నారయ్యా! అందరికీ పక్కలవీ ఏర్పాటుచెయ్.

చల: (లేచి నుంచుని) నమస్తే!

శ్రీ: ఓ, చలపతా! కూర్చోవయ్యా కూర్చో!

సాంబశివం, భద్రయ్య లోపల్నుంచి వస్తూ .

భద్ర: డబ్బునంత మాత్రాన సరా సాంబశివం! అనుభవించటం చేతకావద్దూ! అందరికీ అవుతుందా?

సాంబ: అదే నేనూ చెప్పేది. అనుభవం అంటే శ్రీపతిగారిదే అనుభవం (వచ్చారు)

శ్రీ: రండి! కూర్చోండి.

భద్ర: అమ్మాయ్ ఎక్కడ?

శ్రీ: పడుకుందేమో!

చల: వస్తానండి.

శ్రీ: ఉండవయ్యా! నీతో మాట్లాడాలి.

చల: (కూర్చున్నాడు)

సాంబ: (పై కప్పుకేసి చూస్తూ) బావగారూ! ఈ వాసాలు ఎక్కడ్నుంచి తెప్పించారు?

భద్ర: ఆ మాటకొస్తే బర్మాలో ఒక అడవిని కొని కొట్టించారని విన్నాను. నిజమేనా?

శ్రీ: (నవ్వి ఊరుకున్నాడు)

సాంబ: అసలు మా బావగారి అభిరుచులే ఒకి ప్రత్యేకంగా వుంటాయి. చిన్నప్పట్నుంచీ అంతే. అన్నీ అందంగా నాజూగ్గా, ఉన్న కొద్దిపాట్లోనే అలా అమర్చుకునేవారు. అదీ కొందరి జాతకంలేవయ్యా.

భద్ర: ఆ మాటకొస్తే నువ్వూ వున్నావ్? ఎందుకూ? ఇనప్పెట్టెల్లో డబ్బు మురగాల్సిందేకాని, నీ కుక్కినులకమంచం మార్చవుకదా!

సాంబ: సరేలే భద్రయ్యా! పెద్దవాళ్ళతో పోటీపడి మనం నెగ్గగలమా?

శ్రీ: ఎందులో పెద్ద సాంబశివం? వయసులోనా?

భద్ర: ఆఁ ఆమాటకొస్తే మీకు వయసేమైందని?

శ్రీ: షష్టిపూర్తికి సిద్ధంగా వున్నాను.

భద్ర: ఆఁ మీమాటలకేంలెండి. మిమ్మల్ని చూస్తే ఎవ్వరూ అలా అనరు. నువ్వే మంటావ్ సాంబశివం?

సాంబ: నలభై ప్రాంతం అని చెప్పొచ్చు.

భద్ర: చాల్లేవయ్యా! ఆ మాటకొస్తే నీకు తొంభై చెప్పాలి. శ్రీపతిగారి కేమయ్యా ఇప్పటి కేముప్పయి ప్రాయం అనిపిస్తూంటేను. వారు వద్దని ఊరుకున్నారు గాని, రెండో పెళ్ళి చేసుకోవాలనుకుంటే ఇప్పటికైనాసరే వెయ్యిమంది ఇస్తారు పిల్లల్ని.

శ్రీ: (నవ్వి) పోవయ్యా భద్రయ్యా! నా కెవరిస్తారు పిల్లని.

భద్ర: అదేమిటండీ అలాగంటారు. ఆమాటకొస్తే, మీరు అపుననండి మా అమ్మాయినిచ్చి పెళ్ళిచేస్తాను.

శ్రీ: ఆఁ మీ అమ్మాయినా!

భద్ర: ఆఁ దానికేం? మొన్న పుష్యమాసానికి పదహారేళ్ళు వచ్చినాయ్. మీకివ్వటాని కేమిటండీ? కళ్ళు కద్దుకుని ఇస్తాం.

సాంబ: భద్రయ్యా? తొందరపడి మాట జారకు. నీ పెళ్ళాం...

భద్ర: ఆ మాటకొస్తే అదే నన్నిక్కడికి పంపింది.

శ్రీ: (షాక్ తిని) భద్రయ్యా!!

ఇంతలో లోపల్నుంచి పంకజమ్మ పళ్ళెంలో
పళ్లు, తాంబూలం పట్టుకుని వచ్చింది........

పంక: రండి. డాబామీదికెళ్ళి కూర్చుందాం. వెన్నెల అదీ ఎంతో బాగుంది.

పిల్లి: అమ్మా! పండే.

పంక: ఇస్తానుండు. వెధవ కడుపాత్రం నువ్వూ...

పిల్లి: నువ్వు నాలుగు తిన్నావుగా అప్పుడే....

పంక: షుయ్ నోరు. రండి మరి.

శ్రీ: పదండి.

సాంబ: మీరు రారూ?

శ్రీ: వస్తున్నా పదండి.

పంక: ఏఁవండీ ఇది కాస్త మీరు పట్టుకెళ్ళండి. శ్రీపతితో ఒకమాట మాట్లాడి వస్తా. (వళ్ళెం సాంబశివాని కిచ్చింది - సాంబశివం, భద్రయ్య, పిల్లవాడు మేడమీదకు వెళ్ళిపోయారు.)

శ్రీ: ఏమిటి పంకజమ్మా!

పంక: ఒక్కసారిలా ఆఫీసుగదిలోకి వస్తారు!

చల: ఎందుకూ నేను బైటుంటాను. మీరు మాట్లాడండి.

శ్రీ: అక్కర్లేదులే చలపతీ! ఆఫీసు గదిలో కూర్చో! (చలపతి ఆఫీసు గదిలోకి వెళ్ళాడు.) ఏమిటమ్మా అంత రహస్యం?

పంక: ఏం లేదు నాయనా! నారయ్యా వాళ్ళేమో నీతో చెప్పడానికి భయపడుతున్నారు. ఇంక నేనూ చూస్తూ ఊరుకుంటే ఎట్లా? ఎప్పటికప్పుడే చెబుదామని. అయినా నువ్వేమనుకుంటావో!

శ్రీ: అనుకునేదేముందమ్మా! చెప్పు!

పంక: అనుకున్నా సరే, నే చెప్పక తప్పుతుందా! నీక్కాక ఇంకెవరికి చెప్తాను. ఏం లేదు నాయనా! మనుషు లందరు ఒకలేలా ఉండరు. నీకు తెలియంది కాద నుకో! ఎంత చేసినా కొందరికి నీచబుద్ధులు పోవు.

శ్రీ: అవునులే! అసలు విషయమేమిటి?

పంక: ఏముంది నాయనా! భద్రయ్య వున్నాడు చూశావూ వెధవది అడిగితే నువు కాదనవుకదా. సబ్బుబిళ్ళలు మొదలుకొని తుండుగుడ్డలవరకూ దొంగిలించి దాచుకోవలసిన ఖర్మమేమొచ్చింది చెప్పు?

శ్రీ: ఏదో పోనీలో పంకజమ్మా!

పంక: అంతేలే! కాకుంటే నీకు తెలిసుండనీ అని.

శ్రీ: అంతేనా?

పంక: అంతే, అయితే ఋంతదూరం నీతో చెప్పొచ్చానా? అతనూ ఋంకా యేదో పెద్దయెత్తు వేసుకుకూచున్నా డక్కడ. వాళ్ళ అమ్మాయిని యెప్పుడన్నా చూశావా నువ్వు?

శ్రీ: లేదే!

పంక: అంత మంచిది కాదంటారు. ఊళ్ళో యెన్నో మాట్లాడుకుంటారులే నాయనా, మనకెందుకుకొచ్చింది కానీ, సంబంధం దొరక్క చస్తున్నాడు. దానికా మూడు ముళ్ళు పడ్డాయనిపించుకోవాలనే యిక్కడిన్నాళ్ళుగా వుంటున్నాట్ట!

శ్రీ: అవును నాతోకూడా చెప్పాడు.

పంక: చెప్పాడూ? ఇంకేం. నువ్వేమన్నావ్?

శ్రీ: ఆలోచిస్తామన్నాను.

పంక: (ఒక్కక్షణం ఆలోచించి) అదేనాయనా! ఆలోచించు నీకు నేను చెప్పేదే ముంది; వస్తా! (వెళుతూంది. శ్రీపతి నవ్వి అదోలా చూచాడు.)

శ్రీ: చలపతీ! (చలపతి వచ్చాడు) ఫోంచేశావా?

చల: అయింది.

శ్రీ: తొందరేం లేదుగదూ?

చల: ఫరవాలేదు.

శ్రీ: ఆలస్యంకాదులే. ఒకటి రెండు మాటలడగాలనుకున్నా అంతే!

చల: నన్నా?

శ్రీ: ఆఁ....ఏం లేదూ! నాకు ఎంత స్థిరాస్థి వుందో నీకు తెలుసా?

చల: నాకెలా తెలుస్తుంది?

శ్రీ: సరిగా తెలియకపోవచ్చు. కనీసం వినుంటావుగా?

చల: విన్నాను.

శ్రీ: ఏమని?

చల: సుమారు పదిరవై లక్షలున్నాయని.

శ్రీ: పదికి యిరవైకి చాలా తేడా వుంది. నే చెప్తున్నా విను. నాకున్న ఆస్థి, యీనాడు యే దొంగచేతికిచ్చినా యిరవై లక్షలు చేస్తుంది. నా కెందరు పిల్లలున్నారో తెలుసా?

చల: పిల్లలా!

శ్రీ: ఆఁ.

చల: కమల ఒక్కతే అని విన్నాను!

శ్రీ: అవును! కమల ఒక్కతే! కొడుకైనా, కూతురైనా అదే! నా తరువాత యీ ఆస్థంతా కమలకే చెందుతుంది.

చల: న్యాయమే!

శ్రీ: కమలకు పెళ్ళీడొచ్చింది.

చల: (ఏమనాలో తెలియక వూరుకున్నాడు)

శ్రీ: దాన్నొక మంచివాడి చేతిలోపెట్టి. ఒక యింటిదాన్ని చెయ్యాల్సిన బాధ్యత నామీదుంది. ఏమంటావ్?

చల: అవును.

శ్రీ: సంబంధాలు దొరకవని కాదు. 'కో' అంటే కోటిమంది వస్తారు.

చల: నిజమే!

శ్రీ: కానీ. కలిగిన వాళ్ళకు ఒక్కటే చిక్కు. కావలసినవాళ్ళూ చాలా తక్కువ మందుంటారు. నా అభిప్రాయం అర్థమైందా?

చల: ఆఁ.

శ్రీ: విశదంగా చెప్తాను విను. డబ్బుగలవాళ్ళకు అభిమానం అనురాగం దొరకడం చాలా అరుదు. నన్ను చూస్తే నీ కేమనిపిస్తుంది? నా వెనకాలవున్న ఇరవై లక్షల ఆస్థి కనిపిస్తుంది. నేను ఒక వ్యక్తిగా కనపడను. రూపాయలు, అణాలు, పైసలే నా రూపం. నన్ను గౌరవించేవాళ్ళు, ప్రేమించేవాళ్ళు చాలామందున్నారు. కానీ వాళ్ళలో ఎందరు నన్నే నిజంగా గౌరవిస్తున్నారో తెలుసుకోవడం కష్టం. కమల విషయం కూడా అంతే. ఈనాడు ఎవరైనా సరే కమలను ప్రేమిస్తున్నాను, పెళ్ళి చేసుకుంటాను అని ముందుకొస్తే వాడు కమలనే ప్రేమిస్తున్నాడో. కమల వెనకాల వున్న కలిమినే ప్రేమిస్తున్నాడో నిర్ణయించలేం!

చల: అందరినీ అలా సందేహిస్తే ఎలా?

శ్రీ: సందేహం కాదు. కాలాలు మారిపోయినవి. మనుషులమీద మమతలు బంధాలు తెగిపోయినయి. మనిషిలో మంచీ, చెడూ చూచి, లోపల వ్యక్తిని అభిమానించే శక్తి మనకు లేదిప్పట్లో! పరిస్థితులకు దాసులం. ద్వేషం ఒక దివ్య సందేశం అయిపోయింది. నేను డబ్బుకలవాళ్ళను వెనకేసుకురావడం లేదు. అందరి సంగతి నా కక్కరలేదు. నేను సంపాయించాను. నాకు తెలిసి యే అన్యాయము అక్రమము చేసి సంపాయించలేదు. సంపాయించాలని కంకణం కట్టుకొని చేయలేదు. అదిగా వచ్చింది. వచ్చిందాన్ని కాలదన్నుకునేంత యోగిని కాను నేనప్పట్లో. కానీ యీనాడు చూచుకుంటే అంతా అసహ్యంగా వుంది. నా చుట్టూ జరుగుతున్న మోసాన్ని ఆత్మవంచనను చూస్తే నాకు జ్వరులు పాకుతున్నాయి. ఎందుకు ఎవరు, నా పక్క చేరుతున్నారో, ఎందుకు నన్ను అందల మెక్కిస్తున్నారో తెలీదు. సంపాయించటం మహాపాపమయి పోయింది. నా డబ్బుకున్న విలువ నాకు లేకపోయింది. అంతా మోసం, అనుమానం, ఆత్మవంచన.

చల: అదంతా కేవలం మీ అనుమానమే అనుకుంటా!

శ్రీ: అనుమానమా? (ఈపాటికి ఇద్దరూ నిలబడి వున్నారు. శ్రీపతి చలపతిని సన్నిహితంగా వచ్చి సమీపించాడు. ముఖంలో ముఖంపెట్టి అడుగుతున్నాడు. సరిగ్గా ఈ సమయానికే కమల పైనుంచి వచ్చి మెట్లమీద నిల్చుంది) అయితే చెప్పు. నీ గుండెమీద చేయివేసుకుని చెప్పు. నీ అంతరాత్మను అడిగి మరీ చెప్పు. నా ముఖం చూసి చెప్పు. నువ్వు నిజంగా కమల అనే స్త్రీ వ్యక్తిని ప్రేమిస్తున్నావా? చెప్పు?

చల: (కంగారు తిన్నాడు)

శ్రీ. ఏం? నిన్ను నువ్వు మోసం చేసుకోవద్దు. నిజంగా ప్రేమిస్తుంటే రేపీపాటికి భార్యాభర్తలు కావచ్చు. చెప్పు!

చల: (నోట మాట రాలేదు)

శ్రీ: పిచ్చివాడా! ప్రేమంటే నాకూ తెలుసు! నేనూ ప్రేమించాను. ప్రేమించిన వ్యక్తికోసం తల్లీ, తండ్రీ అందరినీ వదులుకున్నాను. ఇంటినుంచి వెళ్ళగొట్టారు. ఊళ్ళో అందరూ ఉమ్మేశారు. దేవుని ఎదుట ప్రమాణం చేసుకుని ఇద్దరం దేశంమీద పడ్డాం. అడవుల్లో అంతఃపురాలు కట్టుకున్నాం. చెట్ల నీడల్లో స్వర్గాలు నిర్మించుకున్నాం. చివరికి శ్రీమంతుణ్ణయ్యాను. కలిమి లేములు మా దాంపత్య జీవితంలో కాలు పెట్టలేదు. మా అనురాగానికి ఆనకట్టలు వేయనూలేదు. అలా ప్రేమించగలవాళ్ళు ఈకాలంలో ఉన్నారంటావా?

చల: (పలకలేదు)

శ్రీ: ఉన్నారంటావు నువ్వు! ఉంటే సంతోషమే! ఈ ఐశ్వర్యమంతా నా భార్యది. నా భార్య నాకు వదిలి పెట్టిపోయిన ఒక్కగాని ఒక్క బిడ్డది. నిజమే! కానీ ఆస్తిమీద ఆశను వదులుకుని ఆలోచించు. కమల శ్రీపతి కూతురు కాదనుకొని ప్రేమించటానికి ప్రయత్నించు. ఆలోచించుకుని మరీచెప్పు. నీ మనసును నీకు మనసిచ్చిన మనిషిని మోసం చెయ్యొద్దు. (వెళ్ళబోతున్నాడు. కమల మేడ మెట్లమీద కనుపించింది) ఇంకా మేల్కొన్నావా అమ్మా! చలపతి నీకోసం వచ్చాడు. మాట్లాడిరా (వెళ్ళాడు)

కమ: (మెల్లగా మెట్లుదిగి వచ్చింది. తిన్నగా చలపతిని సమీపించి అలాగే చూచింది. చలపతి ఎందుకో తలవంచాడు) ఇదేనా నువ్వు నన్ను ప్రేమిస్తున్నది.

చల: కమలా!

కమ: గట్టిగా ఒక్కమాట చెప్పలేకపోయావేం?

చల: ఏమని?

కమ: ప్రేమిస్తున్నానని!

చల: చెప్పలేక కాదు కమలా! ఏమిటో నాన్నగారిని చూస్తేనే భయమేసింది. ఆయనెందుకడుగుతున్నారో, ఏమిటమగుతున్నారో అర్థంకాకపోయింది.

కమ. అర్థం కాకుంటే నేను చెప్తావిను. నన్ను వున్న మనిషిని వున్నట్టుగానే పంపేస్తారు. కట్టుకున్న చీరతో కట్టిపెడతారు. చిల్లిగవ్వ ఇవ్వకుండా పెళ్ళి చేస్తారు. కమల శ్రీపతి కూతురుకాదు. ఇరవైలక్షల ఆస్తిపరురాలుకాదు. నడి వీథుల్లో అడుక్కుతినే అనాథ. అప్పుడు నాలో అందం అగుపిస్తుందా నీకు? ప్రేమ పలచబడకుండా వుంటుందా? అని అడుగుతున్నారు.

సల: అదికాదు కమలా ఆయన అభిప్రాయం!

కమ: అదే అయితే?

చల: నిన్నిలా అనాథగా వదిలేస్తారా?

కమ: వదిలేస్తే?

చల: ఈ ఆస్తంతా నీదేననికూడా చెప్పారు?

కమ: చెప్పారు. రేపు కాదంటారు. అంతా దానధర్మాలు చేసేస్తారు. నాశనంజేస్తారు. అది నీ కెందుకు?

చల: అలా చెయ్యటానికి వీల్లేదు కమలా! ఆడపిల్లకు ఆస్థిలో హక్కువుంది.

కమ: అదన్నమాట నీ ధైర్యం, నీ ఆశ!

చల: కమలా! అదికాదు....

కమ: ఏదికాదు? ఇన్నాళ్ళూ నువ్వాడిందంతా నాటకం, చెప్పిందంతా అబద్ధాలు, నన్ను మోసం చెయ్యాలనుకున్నావ్! ప్రేమ ప్రేమని చెవుల్లో నూరిపోశావు. నన్ను వంచించావ్.

చల: కమలా! కానేకాదు. అన్యాయంగా అంటున్నావు. అలా ఎన్నడూ అనుకోలేదు.

కమ: మరింకేమిటి?

చల: నేన్నిన్ను ప్రేమిస్తున్నాను. నుమ్మాటికీ ప్రేమిస్తున్నాను.

కమ: ప్రేమ! ఆ మాట నాన్నతో చెప్పలేకపోయావేం?

చల: నీతో చెప్తున్నాను. ఆయనతోనూ చెప్తాను.

కమ: ఇంకా నీకా అవకాశంలేదు.

చల: ఉంది ఆలోచించుకుని చెప్పమని ఆయనే అన్నారు.

కమ: ఆయన పొరపడ్డారు. ఆలోచించి చెప్పేది అనురాగంకాదు.

చల: ఆవేశంలో మనిషికేదే అనురాగమంటావా?

కమ: అవును.

చల: అయితే ఇక నేను చెప్పేదేమీలేదు కమలా!

కమ: చెప్పాల్సిందికూడా ఏమీలేదు.

చల: నువ్వు నన్నర్థం చేసుకున్నది ఇంతేనన్నమాట?

కమ: ఇంకెలా అర్థం చేసుకోమంటావు? సమయం వచ్చినప్పుడు నిలబడి ఒక్క మాట చెప్పలేనివాడివి జీవితమంతా ఏం నిలబడతావు? నిన్నూ, నీ ప్రేమనూ ఎలా నమ్మకోమంటావు (ఇంతకు కొద్దిపూర్వమే పంకజమ్మ మేడమీదినుంచి దిగివస్తూ, మెట్లమీద ఆగి యీ మాటలు వింటూంది)

చల: నమ్మకం పోయింతర్వాత ఏం చెప్పి లాభంలేదు. ఇది నీ ఇష్టం కమలా! ఇన్నాళ్ళ మన స్నేహానికి యీ ఒక సంఘటనతో నువ్వు విలువగట్టి విసిరి పారేస్తున్నావ్ సరే! ఆలోచించుకోవటంమీద నమ్మకంలేని నీకు ఆలోచించుకో మని చెప్పటం అనవసరం. వస్తా!

కమ: మళ్ళా రానక్కరలేదు.

చల: రమ్మన్నప్పుడే వస్తాలే (వెళ్తున్నాడు)

కమ: చలపతీ!

చల: (ఆగాడు)

కమ: (అతన్ని సమీపించి) ఇదిగో (వేలినవున్న ఉంగరంతీసి యిచ్చింది)

చల: (ఒక్కక్షణం అలా చూసి) కమలా! ఈ ఒక్కరాత్రికి ఉంచుకో! రేపు యివ్వాలనిపిస్తే యిద్దువుగానిలే (వెళ్లాడు)

కమ: (ఉంగరాన్ని చేతిలో వుంచుకుని యిలా తిరిగింది)

పంక: ఎవరమ్మా ఆ అబ్బాయి?

కమ: (ఉలిక్కిపడింది, పంకజమ్మను ఒక్కక్షణం చూసింది) మీరా? ఇంతసేపు ఇక్కడే వున్నారా?

పంక: దానికేముందిలేమ్మా! వాడెవడోగాని బాగా ముఖం మీదకొట్టి పంపించావులే! ఇట్లాంటి దగుల్బాజీ వాళ్ళకు అట్లా చేయాల్సిందేమ్మా! కాకుంటే ప్రేమట ప్రేమ. వీడి పిండాకూడు కాదూ?

కమ: ఏమండీ! మీరాయన్నేమీ అనక్కర్లేదు. దయచేసి వెళ్ళండి.

పంక: అదిరావమ్మా! ఆ మాటకొస్తే ఇప్పుడు మా పెద్దవాడున్నాడు. నువ్వు చూడ లేదులే. వాడికి నువ్వంటే ప్రాణాలు. చేసుకుంటే కమలనే చేసుకోవా లంటాడు. అలాగని వాడు యీ పిచ్చిపేషాలేమైనా వేస్తాడా? పెళ్ళంటే పెద్దవాళ్ళద్వారా, పెద్దవాళ్ళు చేయాల్సిందని వాడికి తెలుసు. పెళ్ళంటే పెద్ద విషయాలు చూడాలి. ప్రేమకేంలే. కావాలనుకుంటే వుంది. వద్దనుకుంటే లేదు. ఏమంటావు?

కమ: నే నేమీ అనను. మీరు వెళ్తారా లేదా?

పంక: అయ్యో తల్లీ! ఎందుకమ్మా అంత విసిరికొడతావు. శ్రీపతికి మేమంటేచెప్పరాని అభిమానం. వద్దన్నా, నీమీదుండక తప్పుతుందామ్మా! నువ్వు మా కోడలివి కావాలని మేము తపస్సు చేస్తున్నాం శ్రీపతి ఎంతో ఉబలాటపడు తున్నాడు.

కమ: నిజంగానా?

పంక: అదేమిటమ్మా అలా అడుగుతావు? నీకు తెలియదూ? నేను నీ అత్తయ్యను!

కమ: అత్తయ్యా! (ఒక్కసారిగా పాతాళానికి క్రుంగిపోయిన ట్లనిపించింది. తెల్ల బోయింది, క్షణంలో తెప్పరిల్లి వెర్రిగా) నే నెవర్నీ చేసుకోను. నాకు పెళ్ళే అక్కర్లేదు. నే నెవర్నీ చేసుకోను, (అంటూ వెళ్ళిపోయింది)

పంక: (కాస్త కంగారుపడి చూసింది. అలా నిలబడిపోయింది)

సాంబ: (మేడమీదనుంచి) ఇక్కడున్నావా యింకా, పడుకోలా?

పంక: (పైకి చూసి) అంపడక, పడక ఇరవైనాలుగుగంటలూ వున్నపడకే! ఇలా రండి, కొంప మునిగిపోయింది.

సాంబ: (దిగివస్తూ) అబ్బ! అర్ధరాత్రిలో కూడా నీకు కొంపలు మునిగిపోతుంటాయి కదా!

పంక: మునిగిపోయేకొంపలు మునగాలని ఆర్తంకోసం చూస్తూంటాయేమో లేకుంటే!

సాంబ: ఇంతకూ ఏమిటది?

పంక: కమల సంగతి విన్నారా?

సాంబ: ఏమిటో!

పంక: మీరిట్లా గుడిలో లింగంలా కూచుంటే యేమీ జరగదు చెప్తున్నా! చేయి దాటింతర్వాత నెత్తి బాదుకున్నా లాభంలేదు. ఇంతదూరం మీకు నూరిపోసి తీసుకొస్తే, వారం రోజులుగా యేంచేస్తున్నట్టు మీరు? ఇంట్లో ఏం జరుగు తుందో, ఎవరేమనుకుంటున్నారో యేమన్నా గమనిస్తున్నారా?

సాంబ: అబ్బబ్బ! ఏమిటో చెప్పవే!

పంక: కమల ఎవరో ఒక అబ్బాయిని ప్రేమిస్తోందండి.

సాంబ: అంతేకదా!

పంక: అంతేకదా? ఎంత తేలిగ్గా అన్నారు.

సాంబ: ఇందులో మనకొంప మునిగిపోయిందేముందని!

పంక: మీ తెలివి! ఆ పిల్ల ఎవరినో ప్రేమిస్తూంటే, మన పిల్లవాణ్ణెట్లా చేసుకుంటుందండీ?

సాంబ: లేకుంటే మాత్రం చేసుకుంటుందని నీకు నమ్మకమేనా?

పంక: ఆ పిల్ల చేసుకునే దేమిటి. శ్రీపతిని ఒప్పిస్తే సరి!

సాంబ. ఆ పని ఇప్పుడూ చెయ్యొచ్చుగా!

పంక: అదే చెప్పడం. చేసేదేదో తొందరగాచేయండి అని. అసలు శ్రీపతితో కదిలించారా?

సాంబ: ఆఁ.

పంక: ఏమన్నాడు?

సాంబ: ఆలోచిస్తామన్నాడు.

పంక: ఆమాత్రం అంటే చాలు. అయినా మీకు నోరు పెగలదేమండీ! ఈలాటి వాళ్ళనంతా ఇంద్రుడూ, చంద్రుడూ, దేవేంద్రుడూ అని పొగిడితే పనవుతుంది.

సాంబ: అంత అవసరం లేకుండా, నువ్వు కలిపేశావుగా బాదరాయణ సంబంధం!

పంక: అంతేలెండి. అన్నీ నేను చేసుకుపోతే మీరు చంక లెగరేస్తారు.

సాంబ: సరేగాని పంకజం! నీకు జ్ఞాపకముందా? ఇదే శ్రీపతిని మనం ఒకప్పుడు ఎలా తిట్టామో, ఎలా తరిమికొట్టామో?

పంక: బాగుంది. మనం ఒక్కరేనా? ఊళ్ళో అందరూ వెలివేశారు.

సాంబ: ఈనాడు అదే శ్రీపతి సంబంధంకోసం పడిచస్తున్నాం.

పంక: సరేలెండి గడిచినవన్నీ జ్ఞాపకం పెట్టుకుంటే గడుస్తుందా?

సాంబ: మనం మరిచినా శ్రీపతి మరుస్తాడా?

పంక: శ్రీపతి ఎన్నడూ యిలాంటివి మనసులో పెట్టుకోడు. వాడి స్వభావమే అది కాదు.

సాంబ: పంకజం! ఇప్పుడు శ్రీపతి యిక్కడ లేడులే ఎందుకు పొగుడుతావు?

పంక: చాల్లెండి. అసలు విషయం మరచా! భద్రయ్య ఎందుకొచ్చాడో తెలుసా-మీకు?

సాంబ: అతనికి కొడుకు లేడనుకుంటాను!

పంక: కూతురేలెండి వున్నది! ఆ కూతురిని కట్టిపెట్టాలని చూస్తున్నాడు.

సాంబ: ఎవరికి? కమలకే?

పంక: ఏడ్చినట్లుంది మీ తెలివి! శ్రీపతికి!

సాంబ: ఏమిటీ! శ్రీపతికా?

పంక: ఆఁ.

సాంబ: రెండవపెళ్ళా!

పంక: ఆఁ.

సాంబ: ఈ వయసులోనా!

పంక: వయసులో ఏముంది? మనసులో వుందిగానీ.

సాంబ: శ్రీపతికి పెళ్ళిచేసుకోవాలని వుందంటావా?

పంక: మీకు లేమూ, ఇచ్చేవాళ్ళుంటే!

సాంబ: నేనా? ఇంకో పది జన్మలకూ్కడా చేసుకోను?

పంక: పోనీండి. శ్రీపతి చేసుకుంటాడు.

సాంబ: ఆయన మొదటిభార్య చాలా మంచిదన్నమాట!

పంక: ఏం?

సాంబ: భార్యంటే యేమిటో బాగా అనుభవమై వుంటే ఆయన మళ్ళా పెళ్ళిచేసుకుంటాడా?

పంక: ఏం శ్రీపతి నాన్నగారు చేసుకోలా ఇదే వయసులో!

సాంబ: ఆయన చేసుకున్నారంటే కారణం వుంది. శ్రీపతి ఎవరో దారినిపోయే పిల్లను, కులం కానిదాన్ని ప్రేమించాను, పెళ్ళిచేసుకుంటాను, అని ఆయన మాట కాదంటే, ఇక దారిలేక సంతానం కోసం, సాంప్రదాయంకోసం చేసుకున్నాడు.

పంక: ఆమాత్రం కారణం శ్రీపతికి వుంది. శ్రీపతిలాగే ఈ పిల్ల ఎవర్నో ప్రేమిస్తూందిగా? అంతకన్నా పెద్ద కారణం శ్రీపతికి మగసంతానం లేదు. ఎంతటివాడికైనా కొడుకు కావాలని వుంటుంది. కూతురు కొరివి పెడుతుందా?

సాంబ: నిజమే! నీకు తెలిసింది చూశావూ....

పంక: అందుకనే మనం భద్రయ్యకన్న ముందు భద్రపడాలంటాను. అసలు కమలకు సమయంచూసి చెప్పాలి. "అమ్మా! ప్రేమ ప్రేమని పోయావంటే మీ నాన్న నీకు చిల్లిగవ్వ లేకుండా చేస్తాడు" అని వాళ్ళ తాతగారి కథంతా

చెప్పాలి! ఆ పిల్లమాత్రం ఏం తెలివి తక్కువదా? ఆ మాత్రం తెలుసు కోదూ?

సాంబ: అయినా భద్రయ్య అంత చిన్నపిల్లని ఇస్తాడంటావా?

పంక: అంతా డబ్బండీ! డబ్బు!

సాంబ: డబ్బుకోసం గడ్డితింటారా?

పంక: డబ్బులేకుండా తినడంకన్నా, తిని డబ్బు గడింపటం మంచిదేనండి.

సాంబ: ఏమిటో ఇదంతా చూస్తుంటే నాకు మతిపోతూంది. ఏం డబ్బో! ఏం మనుష్యులో!

నార: (నారయ్య వచ్చాడు) అమ్మా! మీకు పక్కలన్నీ ఆ లోపలి గదిలో వేశాను.

పంక: సరేలే నాయనా!

నార: దీపాలార్పేయ్యనా అమ్మా?

సాంబ: ఆర్పెయ్ నాయనా, ఆర్పెయ్! నీ ధర్మాన్ని నిద్రపోతాం.

అంటూ వెళ్ళాడు, పంకజం వెంబడించింది. నారయ్య దీపాలార్పేస్తున్నాడు. ఒకటి రెండు ఆర్పాడు. ఇంతలో కమల పరుగెత్తుకొచ్చింది.

కమ: నారయ్యా! నారయ్యా!

నార: ఏమమ్మా, యింకా నిద్రపోలే?

కమ: లేదు నారయ్యా! యిలా రావోచ్చే. నీకీ సంగతి తెలుసా?

నార: ఏమిటమ్మా?

కమ: నాన్నగారు రెండవపెళ్ళి చేసుకుంటారట!

నార: ఏమిటమ్మా! ఏమిటి నువ్వంటున్నది?

కమ: అవును నారయ్యా, ఇప్పుడు వాళ్ళందరూ అనుకుంటూంటే విన్నాను.

నార: ఏమని? నాన్నగారు రెండవపెళ్ళి చేసుకుంటారనా? వాళ్ళకు మతిపో... ఉండాలి.

కమ: కాదు నారయ్యా! భద్రయ్యకు కూతురు వుందట!

నార: ఉంటే!

కమ: ఆయనిక్కడున్నది అందుకేనట?

నార: అదంతా వట్టిదమ్మా. నేను నమ్మను.

కమ: నాన్నగారు భద్రయ్యకు ఈ పదిరోజుల్లో చాలా డబ్బిచ్చారు నారయ్యా!

నార: నాన్నగారు చాలా మంది కిచ్చారు! ఇస్తే!

కమ: నారయ్యా (గొల్లుమన్నది)

నారి: అమ్మా! ఏమిటది?

కమ: నాన్నగారు రెండవపెళ్ళి చేసుకుంటారు. నన్నెవరికో ఒకరికిచ్చి వదిలించుకోవాలని చూస్తున్నారు.

నారి: పిచ్చితల్లీ? అలా ఎన్నటికీ జరగదు. నాన్నగారు నీ కెన్నడూ అన్యాయం చేయరు.

కమ: నీకు తెలియదు నారయ్యా! నాన్నగారు నన్ను అన్యాయం చేయాలనుకున్నారు. లేకుంటే చలపతి నెందుకలా అంటారు? ఎందుకు భద్రయ్య నింకా ఇంట్లో వుండనిస్తారు?

నారి: ఏమిటమ్మా నీ పిచ్చి! అంతగా అయితే రేపు నాన్నగారినే అడిగి తెలుసుకుంటే పోలా? ఇంతలోగా మునిగిపోయేది లేదుగా! ఈ అర్ధరాత్రిలో ఎందుకమ్మా. ఎవరన్నా విన్నా బాగుండదు. నువ్వెళ్ళి పడుకో తల్లీ! నా మాట విను.

కమ: నువ్వెళ్ళు నారయ్యా! దీపాలు నే నార్పేస్తానులే!

నారి: అలా కాదు. నువ్వెళ్ళి పడుకోవాలి. చూడమ్మా, నిన్ను ఈ చేతుల్తో ఎత్తి పెంచాను. నీకు ఏ ఆపదా రాకుండా నేను చూసుకుంటాను. ఈ ముసలి తాతను నమ్ము తల్లీ! వెళ్ళు ఇవన్నీ మనసులో పెట్టుకోకుండా హాయిగా పడుకొని నిద్రపో! లే! లేమ్మా!

కమ: (లేచింది)

నారి: ఊఁ వెళ్లు! నా మాట వినవూ?

కమ: (వెళ్తుంది)

నారయ్య చూస్తూ నిలబడ్డాడు. కమల మేడమీదకు వెళ్ళిందన్న నమ్మకం కుదిరిన తర్వాత అతనూ వెళ్లాడు. దీపం ఆరిపోయింది. ఒక్కక్షణం తర్వాత మళ్లా దీపం వెలిగింది. కమల మెట్లమీద కనుపిస్తూంది. మెల్లిగా దిగివచ్చింది. ఎవరన్నా మేల్కొన్నారేమోనని ఇటు అటు చూసింది. కాసేపు కంగారుగా పచారు చేసింది. ఒక మూలగావున్న బల్లదగ్గర కెళ్ళి ఒక కాగితం తీసుకుంది. అక్కడే వున్న కలంతో గబగబా ఏదో వ్రాసింది. ఆ కాగితం పుచ్చుకుని మేడమీదికి వెళ్ళింది. హాల్లో యిప్పుడెవ్వరూ లేరు. గడియారం 'టిక్ టిక్' మనడం మాత్రం వినిపిస్తూంది. ఒక్క నిమిషం అయిన తర్వాత గడియారం 12 గంటలు కొట్టింది. కమల మేడమీదనుంచి మెల్లిగా దిగివచ్చింది. మళ్ళా హాల్లో ఇటు అటు చూసింది. ఆఫీసురూంలోకి వెళ్ళింది. మళ్ళా తిరిగివచ్చింది. హాల్లో కొచ్చి అక్కడున్న సోఫానో, కుర్చీనో బర్రుమని లాగింది. కాస్సేపాగి అలికిడి వినబడుతుందేమోనని చూసింది. మళ్ళా పూలకుండీ క్రింద పడేసి

చూసింది. ఆ శబ్దానికూడా ఎవ్వరూ లేవలేదు. ఇక ధైర్యంగా వాకిలివైపు వెళ్తూంది.

శ్రీ: (మేడమీదినుంచి శ్రీపతి కంఠం) కమలా!

కమల మంత్రంచేత కట్టుబడినట్లు ఆగిపోయింది. శ్రీపతి దిగివస్తున్నాడు. షాక్ నుంచి తెప్పరిల్లి మెల్లగా యిటు తిరిగింది. ఈపాటికి శ్రీపతి దగ్గర కొచ్చే శాడు. కమల శ్రీపతి ముఖం చూచింది, అతని చేతిలో వున్న ఉత్తరం చూచింది. దుఃఖం ఒక్కసారిగా పొంగివచ్చింది. "నాన్నా" అంటూ శ్రీపతిమీద వాలింది. శ్రీపతి ఆమెను గుండెల్లో దాచుకున్నాడు. అతని కళ్ళవెంట నీళ్ళు తిరిగాయి. ఆమెను తడుతూ "ఊర్కోమ్మా ఊర్కో" అని ఓదారుస్తూ సోఫాలవైపు తీసుకొచ్చాడు. "కూర్చో అమ్మా!" ఆవిడను కూర్చోబెట్టి, తనూ పక్కనే కూచున్నాడు.

కమ: నాన్నా!

శ్రీ: పిచ్చితల్లి! ఊర్కోమ్మా! ఎందుకలా ఇదవుతావ్? ఇప్పు డేమయిందని... ఏం ఫర్వాలేదులే! (లేచి ద్వారందాకా వెళ్ళి) నారయ్యా! నారయ్యా! (బిగ్గరగా పిలిచాడు 'అయ్యా' అని బదులు వినిపించింది. కమల దగ్గరకొచ్చి) కళ్ళు తుడుచుకోమ్మా?

నారయ్య వచ్చాడు

నార: అయ్యా!

శ్రీ: నీకు చలపతి ఇల్లు తెలుసుకదూ?

నార: తెలుసయ్యా?

శ్రీ: వెళ్ళి నేను రమ్మంటున్నానని పిలుచుకురా!

కమ: నాన్నా!

శ్రీ: ఉండమ్మా! వెళ్ళిరా నారయ్యా!

నార: (వెళ్ళబోతున్నాడు)

కమ: నాన్నా! అక్కర్లేదు నాన్నా!

శ్రీ: వెళ్ళిరానీయమ్మా!

కమ: నాన్నా! వద్దు నాన్నా! నా మాట వినండి, నారయ్యా! నువ్వెళ్ళద్దు.

శ్రీ: ఏమమ్మా, చలపతంటే నాకిష్టంలేదనా?

కమ: కాదు నాన్నా? అది కాదు చలపతిని యిప్పుడు పిలిపించ వద్దు. నేనేదో పిచ్చిగా చేశాను. నాకు మతిపోయింది. వద్దు నాన్నా!

శ్రీ: నారయ్యా నువ్వెళ్ళి పడుకో.

నార: (వెళ్ళాడు)

శ్రీ: ఏమిటమ్మా! ఎందుకీ కంగారు, నాతో చెప్పవ్?

కమ: నాన్నా! (యేడుస్తుంది)

శ్రీ: ఏడవకమ్మా! ఏడవకు ఏమిటో చెప్పు? ఎందుకిలా తొందరపడ్డావు? నాకే ఉత్తరం రాసిపెట్టి అర్ధరాత్రి నువ్వు ఇల్లు వదిలిపోవాల్సిన ఖర్మ మేమొచ్చింది? నీకేదన్నా కాదన్నానా? లేదంటానా? చెప్పు తల్లీ! మీ అమ్మ పోయిన నాటి నుంచి నిన్ను గుండెల్లో దాచుకుని పెంచుకున్నాను, ప్రేమించాను. నీ కోసం బ్రతికున్నాను. ఈ ముసలి నాన్నమీద నీ కెందుకమ్మా యింత కోపం వచ్చింది? చెప్పవూ?

కమ: నాన్నా! నాన్నా!

శ్రీ: నాకు కోపమూ లేదు, బాధాలేదమ్మా! నీకేమైనా బాధ కలిగించానేమోనని బాధ పడుతున్నాను. అంతే! చెప్పమ్మా! తెలియకుండా నీకేమైనా కష్టం కలిగించానా?

కమ: లేదు నాన్నా!

శ్రీ: మరింకేమిటమ్మా?

కమ: నాన్నా ఒక్క విషయం అడుగుతాను చెప్తారా?

శ్రీ: చెప్తానమ్మా! నీకు చెప్పరాని దేముంది, అడుగు?

కమ: తాతగారు రెండవపెళ్ళి చేసుకున్నారా?

శ్రీ: అవునమ్మా! నేను మీ అమ్మను ప్రేమించానని కోపం వచ్చి నన్ను ఇంటి నుంచి వెళ్ళగొట్టారు. చిల్లిగవ్వలేకుండా పొమ్మన్నారు. సంతానంకోసం మళ్లా పెళ్ళి చేసుకున్నారమ్మా? ఏం? ఎందుకమ్మా ఆ విషయం?

కమ: ఏం లేదు నాన్నా! భద్రయ్య యిక్కడెందుకుంటున్నాడు?

శ్రీ: ఈ సత్రంలో ఎవరు ఎందుకున్నారో, అసలు ఎవరు ఎవరో ఎవరికి తెలుసమ్మా?

కమ: భద్రయ్యకు మీరు చాలా డబ్బిచ్చారు కదూ?

శ్రీ: ఇచ్చానమ్మా! ఏదో బాధల్లో వున్నాడంటే కనికరించి యిచ్చాను.

కమ: అంతేనా!

శ్రీ: అంతగాక యింకేముందమ్మా! ఏమిటమ్మా? ఏమిటీ ప్రశ్నలు?

కమ: నాన్నా....(గొంతునుంచి పెగిలి రావడంలేదు. బాధపడుతూంది. తన సందేహాన్ని ఎలా చెప్పాలో తెలీక అవస్థపడుతూంది)

శ్రీ: ఏమిటమ్మా? చెప్పు! సంకోచించకు.

కమ: నాన్నా! నన్ను అన్యాయం చేస్తారా?

శ్రీ: అమ్మా కమలా! ఏమిటి నువ్వంటూన్నది?

కమ: నాన్నా! కొడుకైనా, కూతురైనా నేనే అన్నారు! నా ఆనందానికి అడ్డు రానన్నారు. ఇంతేనా? ఇదేనా నాన్నా?

శ్రీ: కమలా! ఇప్పుడు నేనేం చేశాను? ఏం చేశానమ్మా?

కమ: మీరు రెండవపెళ్ళి చేసుకోబోతున్నారు.

శ్రీ: ఆఁ. .

కమ: భద్రయ్యకు కూతురుందిట. ఆమెను చేసుకోబోతున్నారట.

శ్రీ: కమలా!

కమ: అవును. అందరూ అనుకుంటున్నారు. మీరు రెండవపెళ్ళి చేసుకోబోతారు. నన్ను పంకజమ్మ కొడుక్కి కట్టబెట్టబోతారు. రాతగారిలా మీరూ నాన్నా....

శ్రీ: కమలా! (ఒక్క క్షణం నిశ్శబ్దం. శ్రీపతి తల తిరిగిపోయింది. తల చేత్తో పట్టుకున్నాడు)



కమ: నాన్నా! నాకు మీ ఆస్తిపాస్తియేమీ అక్కరలేదు. నేను మిమ్మల్ని కోరేదేమీ లేదు. మీరు నాన్నగా వుండండి. అంతే! మీరు నన్ను దూరం చెయ్యకండి. నాకు చలపతి వద్దు, ప్రేమ, పెళ్ళి అక్కర్లేదు. నాక్కావలసింది మా నాన్న...

శ్రీ: అమ్మా కమలా! (ఒక్కసారి కౌగలించుకున్నాడు) అమ్మా రామ్మా! రా పడుకుందువు రా!

కమ: చెప్పండి నాన్నా! నాకు మాట ఇవ్వండి.

శ్రీ: నీకు నాన్నే కావాలన్నప్పుడు; నాకు నువ్వే కావాలని ఎందుకు నమ్మవమ్మా! నాన్నమీద నమ్మకం లేదా? రా తల్లీ, పడుకుందువురా! రేపు తెల్లవారి అంతా చెప్తానురా! (ఆమెను మెల్లగా నడిపించుకొని వెళ్తున్నాడు. వాళ్ళు మేడ మెట్లు ఎక్కబోతుండగా భద్రయ్య దిగివచ్చాడు.)

భద్ర: మీరింకా పడుకోలా?

అసహ్యంగా చూచాడు. అంతే. కమల అతనూ వెళ్లారు. భద్రయ్య అలా
చూస్తూ నుంచున్నాడు. నారయ్య వచ్చాడు. నారయ్య భద్రయ్యను
చూచి దగ్గాడు.

భద్ర: (మేడమీదికే చూస్తున్నవాడు ఉలిక్కిపడి యిటు తిరిగాడు) ఓ! నారయ్యా!

నార: అయ్యా! నేనే...

భద్ర: నారయ్యా! అయ్యగారూ వాళ్ళూ ఇంకా నిద్రపోలేదేం?

నార: వెధవ కప్పలగోల ఎక్కువై నిద్రపట్టటం లేదయ్యా వాళ్ళకి!

భద్ర: అవునవును ఆ చెరువులో నీళ్ళయిపోతేగాని ఆ కప్పల బాధ తప్పదు.

నార: అయ్యా! చెరువులో నీళ్ళన్నీ కప్పలే తాగేస్తాయా?

భద్ర: అదేమిటి నారయ్యా! అంత చెరువునీళ్ళూ అవెక్కడ తాగివస్తాయి!

నార: కానీ కొన్ని కప్పలు తాగేస్తాయయ్యా!

భద్ర: ఆఁ నీదంతా విచిత్రంలే!

నార: కనీసం తాగేయాలని ఆశపడతాయి కదయ్యా?

భద్ర: ఆఁ అదీ ఒట్టిదే! వాటిదేముంది పాపం. గుక్కెడు తాగి గుక్క విరక్కుండా అరుస్తాయి.

నార: అంతేనా? తమరెప్పుడు పోతారయ్యా?

భద్ర: ఇక్కడినుంచేనా?

నార: ఈ లోకాన్నుంచని నే నెట్టా అడుగుతానయ్యా? అడిగినా మీరెట్టా చెప్ప గలరు?



భద్ర: భలేవాడివోయ్ నువ్వు. ఏం? నీకు కష్టంగా వుందా?

నార: నాకేం కష్టమయ్యా పేదోడికి! మీవల్ల యేదన్నా కష్టమొచ్చినా, మావోటి వాళ్ళకొస్తదా మారాజులకి రావాలిగానీ!

భద్ర: మీ అయ్యగారి కేమైనా కష్టంగా వుందా?

నార: మా అయ్యగారు ఇట్లాంటి కష్టాలు శానా సూశారు లేయ్యా!

భద్ర: మరింకెవరికి?

నార: మీకే!

భద్ర: మాకేం కష్టం! హాయిగా పెట్టేమహారాజు పెడుతూంటే తింటూ కూచున్న వాళ్ళకి?

నార: ఎన్నాళ్లు ఉంటారులేయ్యా! తిన్నవి అరగొద్దు, లేకుంటే అజీర్తి చేస్తది. అందుకని తొందరగా...

భద్ర: ఆ మాటకొస్తే నీకు అజీర్తి చేయదూ?

నార: మాదేముందయ్యా, గంజినీళ్ళు తాగేవాళ్ళం.

భద్ర: ఆ మాటకొస్తే నారయ్యా! మీ అయ్యగారు ఒట్టి అమాయకుడోయ్!

నార: అందుకనేగదయ్యా, పూటకి యిన్ని ఇసళ్ళు లేస్తున్నాయి ఇంటో!

భద్ర: ఆ మాటకొస్తే నలుగురికి పెట్టడం మంచిదేననుకో! అయినా అందులోనూ కొందరున్నారు చూశావ్, సందు దొరికితే చాలు సవారి చేయడం మొదలెడు తారు. పంకజమ్మ ఎవరని నీ అభిప్రాయం?

నార: ఆయన అక్కగారు కదయ్యా!

భద్ర: నా బొంద. ఆ మాటకొస్తే నేనూ ఆయన మామగార్నే!

నార: ఉంటుందయ్యా! లేకుంటే మీరిన్నాళ్ళు వుంటారా?

భద్ర: ఆమెకన్నా ముందునుంచీ వున్నానా? ఉన్నా, ఆమెలాగా నేనేమైనా అధార్టీ యి వెలగబెడుతున్నానా? అసలు రహస్య మేమిటంటే నారయ్యా, వాళ్ళ పెద్ద బ్బాయి వున్నాడు, కమలను ఎట్లాగైనా వాడికి చేసుకోవాలని విశ్వప్రయత్నం చేస్తున్నారు ఎంతసేపూ వాణ్ణి చూపించకుండా నాటకం ఆడి అయ్యగారిచేత ''ఔ''నని పించుకోవాలని. ఆ మాటకొస్తే అయ్యగారు వాణ్ణి చూశారంటే చచ్చినా వప్పుకోరనుకో! వాడు వొట్టి మొద్దు వెధవ! ముండల ముతాకోరు.

నార: (ఇంతసేపు చాలా శ్రద్ధగా ఊకొడుతున్నాడు) అలాగయ్యా?

భద్ర: ఇంతా నీతో ఎందుకు చెపుతున్నా నంటే, ఇది అయ్యగారితో నేచెప్తే బాగుండదు. తెలియకుండా తలవూపేస్తారేమో! నమ్మినబంటువు నువ్వు వాస్త హెచ్చరిస్తావని!

నార: అంతేలేయ్యా, లేకుంటే మీరెందుకు చెప్తారు!

భద్ర: ఆ మాటకొస్తే ఇంత నాటకం ఎందుకంటావు? ఒక్క హాతురేకదా, వున్న ఆస్తంతా వూడ్చుకుపోవచ్చని! డబ్బు నారయ్యా! డబ్బు! డబ్బుకోసం గడ్డితింటారు.

నార: అంతేలేయ్యా! ఎదవపది మా బోటివాళ్ళ దగ్గరే నాటకం ఆడతారే, ఇక మారాజుల విషయం చెప్పాలా? ఆ మాటకొస్తే అయ్యా! మొన్న మా యింటికి ఓ దూరపు బంధు వొచ్చాడు. వారంరోజులైనా కదల్లే! తీరా యేమిటాని విచారించితే ఆయనకో పదారేళ్ళ పిల్ల వుందట. ఆ గుంటని నా కెట్టాగైనా కట్టిపెట్టాలని కూకున్నాట్ట!

భద్ర: నీకా?

నార: అదేగదయ్యా! ఆ మాట తెలిసేసరికి, నేనేం చేశానో తెలుసా? పోవయ్యా పో, పెద్దమనిషి. పదహారేళ్ళ అమ్మాయిని అరవై యేళ్ళాయనకిచ్చి పెళ్ళి చేస్తావా? డబ్బు కక్కుర్తికి, కన్న కూతుర్ని అమ్ముకుంటావా? ఇంతకన్న అడుక్కుతిని బతకరాదూ! ఛీ! నీదీ ఒక బతుకేనా?

(భద్రయ్య తెల్లబోయాడు. గుక్కతిప్పకుండా నారయ్య మాటలనేస్తున్నాడు. భద్రయ్యకేమీ పాలుపోక "ఆఁ, ఆఁ..." అంటున్నాడంతే!)

పో! బతికి పో! ఇంక యిట్లాంటి పనులకి రాకు. తిన్నింటికి వాసాలెంచకు, పో! పొద్దునలేచి యీ పొలిమేరల్లో కనుపించావా....(పైనుంచి 'నారయ్యా' అని శ్రీపతి కేక. నారయ్య శ్రీపతిని చూచి) ఆఁ, ఆఁ, అని కర్ర తీసుకునేసరికి అదేపోత పారిపోయాడయ్యా!

శ్రీ: (దిగివచ్చి) ఏమిటి నారయ్యా అది?

నార: ఆఁ ఏంలేదయ్యా! ఏదో నా యింటి గొడవలు.

శ్రీ: ఓ, అలాగా! నారయ్య తమాషాగా మాట్లాడుతుంటాడు కదూ!

భద్ర: ఆమాటకొస్తే, నేనూ ఆనందిస్తున్నా, నారయ్య మంచి తెలివైనవాడు. నాకు తెలీదూ!

శ్రీ: ఆఁ పడుకోరూ?

భద్ర: పడుకుంటా. మీరు?

శ్రీ: నాకు కొంచెం ఆఫీసు పనుంది.

భద్ర: ఆమాటకొస్తే, అర్ధరాత్రిదాకా యిట్లా పనిచేస్తే మీ ఆరోగ్యం యేమవుతుంది? ఆరోగ్యం మహాభాగ్యం అన్నారు. అది జాగ్రత్తగా చూసుకోవాలి. సరే నేను పడుకుంటా. (వెళ్ళాడు)

శ్రీ: నారయ్యా! ఎందుకలా నోరు జారావు?

నార: మన్నించండయ్యా! కడుపులో ఏదో కలత.

శ్రీ: నారయ్యా! డబ్బును నేను సంపాయించాను. చివరికి నన్నే మింగేస్తుందీ డబ్బు. చూస్తున్నావుగా!

నార: చూస్తున్నాయ్యా!

శ్రీ: నువ్వేమీ తొందరపడకు. ఏం?

నార: అయ్యా! ఒక్కమాట, కోప్పడకుంటే.. ....

శ్రీ: ఏమిటి నారయ్యా?

నార: తమరు....?

శ్రీ: అడుగు నారయ్యా!

నార: మళ్ళీ పెళ్ళి చేసుకోటం..... .

శ్రీ: నిజమేనా అని అడుగుతావ్? అంతేనా?. ..అది రేపు చెప్తా....నారయ్యా, రేపు నా పుట్టినరోజు!

నార: రేపాయ్యా?

శ్రీ: ఆఁ ఇంతవరకు ఎప్పుడూ పండగ చేసుకోలేదు. ఈ యేడు చేసుకోవాలని వుంది.

నార: దానికేమయ్యా! చేసుకుంటే పోలా!

శ్రీ: రేపు ఎవరి మనసూ కష్టపెట్టవద్దు. ఎవరినీ యేమీ అనవద్దు. ఎవరికి నచ్చింది వాళ్ళు చేయనీ. చేసుకోనీ.

నార: అలాగే!

శ్రీ: రేపు తెల్లవారి ఆరుగంటలకల్లా చెరువు దగ్గరకు వెళ్ళొస్తా!

నార: అలాగేనయ్యా!

శ్రీ: నారయ్యా? నే నింతవరకు ఏమీ అన్యాయం చేయలేదని నీకు నమ్మకమేనా?

నార. అదేంటయ్యా, అట్లా అడుగుతారు!

శ్రీ: ఇకముందు చేయనని నీకు నమ్మకం వుందా?

నార: (ఏం చెప్పాలో తెలీక) నన్ను పరీక్షిస్తున్నారయ్యా?

శ్రీ: లేదు. ఇంత డబ్బు ఎలా సంపాయించానో నీకు తెలుసా?

నార: (ఊరుకున్నాడు.)

శ్రీ: నీకు తెలీదు. తెలిస్తే నువ్వే సంపాయించేవాడివి. సంపాయించి అలా బాధ పడేవాడివి. అంతే! పోనీలే, సుఖపడ్డావు. రేపు చెప్తాలే! డబ్బు! ఈ డబ్బు కోసం మానవుడు పడే పాట్లు. ఈ డబ్బు పెట్టే బాధలు....అన్నీ రేపు చెప్తాలే....వెళ్ళి పడుకో....దీపాలార్పేయ్........

అంటూ మేడమీదికి వెళ్ళిపోయాడు. నారయ్య దీర్ఘాలోచనలో దీపాలార్పు తున్నాడు. గడియారం 1 గంట కొట్టింది.

తెర జారుతుంది.



# రెండవ రంగం

గడియారం ఆరుకొట్టింది. తూర్పు తొలిరేఖలు హాలులోకి తొంగిచూస్తున్నాయి. రాత్రి మెల్లగా హాలులో వెలుగు హెచ్చుతుంది. ఇదివరకులాగ హాలులో ప్రేక్షకులకు కనుపించే దీపాలు ఇప్పుడు వెలిగించకూడదు. ప్రక్షిప్త దీపప్రకాశమే ప్రసరించాలి.

కమల చక్కగా సింగారించుకుంది. చాలా అందంగా అగుపిస్తుంది. హుషారుగా కూడా వుంది. మేడమీదనుంచి కూనిరాగం లాగుతూ సర్రుమని దేవకన్యలా దిగివచ్చింది. కూనిరాగం పాటగా మారినా మారవచ్చు. హాలంతా కలయచూచింది. వాకిలివైపు వెళుతూ .. . ....

కమ: నారయ్యా! (బదులు లేదు) ఛీ ఛీ, ఏమి నౌకర్లు, ఇల్లింకా ఇట్లాగే వుంచి పెట్టారు.

సోఫాలు అవీ లాగి వేరేవిధంగా ఏర్పాటుచేసింది. పూల కుండీలోని పూలు తీసేసింది. వేరే పూలకోసం వెలుపలికి వెళ్లింది. లోపల్నుంచి పంకజమ్మ గబగబా వచ్చింది.... .

పంక: శ్రీపతీ! శ్రీపతీ! (హాలులో లేడని ఆఫీసుగదిలో చూచింది. అక్కడా లేడని వాకిలివైపు వెళ్ళింది. అక్కడా లేడు.) ఏమిటోనమ్మా! ఎక్కడికి వెళ్ళాడో ఏమో! యీయన పుట్టినరోజు పండుగని చెప్పాడేకాని మనిషి ఇంట్లో వుంటేనా? తలంటిపోసుకొని కొత్తబట్టలు కట్టుకుంటే యీ పాటికి ఎంత బాగుండేది. పెణ్ణీళ్ళేమో తెర్లిపోతున్నాయి పొయ్యిమీద. వంటలేంచేయాలో... ఎవర్నడగాలో... ఈ యింటి సంగతి నాకేమీ అర్థంకాకుండా ఉంది. ఎవడికి వాడే నాథుడైపోతే ఎట్లా! (అని తనలోతాను మాట్లాడుకొంటూంది. ఇంతలో కమల తోటలోంచి కొత్తపూలు పట్టుకొని వచ్చింది) ఏమమ్మా కమలా మీ నాన్నెక్కడా? తెల్లవారకముందే వెళ్ళాట్ట. ఇంతవరకు తిరిగిరాలా! ఎండెక్కిపోయిన తర్వాత ఏం తలంటుకుంటాడు. (కమల కుండీలో పూలుసర్ది బల్లమీద పెట్టింది.) ఏమమ్మా! వంటలవీ ఏంచేయాలో ఏమో నువ్వైనా చెప్పు. పుట్టినరోజు - అదీ లేక లేక చేసుకుంటున్నప్పుడు నాలుగు పిండివంటలూ చేయాలా!

కమ: ఈరోజు ఎవరెవరికి ఏమేం కావాలో అన్నీ చేయండి. అంతే!

పంక: బాగుందమ్మా! ఇంతకూ మీ నాన్నెక్కడ?

ఇంతలో నారయ్య వచ్చాడు.

కమ: నారయ్యా! నాన్నెక్కడ?

నార: చెరువుకాడి కెళ్ళారు. వస్తారమ్మా!

పంక: సరే. వాడెప్పుడొస్తాడో ఏమోగానీ, నారయ్యా! బండీ ఏదన్నా చూడు నాయనా! నేను బజారువెళ్ళి కావలసిన కూరానారా పట్టుకొస్తా! అవునుగానీ, అమ్మా! ఈరోజు అందరికీ లేకపోతే పోయింది. నువ్వూ మీ నాన్నైనా కొత్తబట్టలేసుకోండి.

కమ: నేను, మా నాన్నమాత్రం ఏం? అందరూ తగిలించుకోవచ్చు. (అంటూ మేడ మీది కెళ్ళింది)

పంక: నువ్వెళ్ళి బండిసంగతి చూడు నాయనా.

నార: ఆఁ. (వెళ్ళాడు)

సాంబ: (వచ్చాడు)

పంక: అయిందా స్నానం.

సాంబ: ఆఁ.

పంక: పొగ వేసుకున్నారా!

సాంబ: పొగా! నా కెప్పుడూ అలవాటు లేందే?

పంక: ఏడ్చినట్లుంది. మీ దరిద్రం మీరు. తలకు స్నానంచేసిన తర్వాత పొగ వేసుకో టానికి బంగారంవంటి పొడివుంటే వేసుకోరాదూ? పిల్లవాడికి వేశాను. ఉన్నప్పుడు కూడా దరిద్రమేనా? రండి వేసుకొందురు.

భద్ర: (వచ్చాడు)

పంక: భద్రయ్యగారూ! శిరస్నానం చేయలేదూ?

భద్ర: ఇంకాలా.

పంక: కానీండి మరి. అందరం అలా బజారువైపు వెళ్ళివద్దాం. తొందరగా కానీండి.

భద్ర: బజారు కెందుకు అందరూ?

పంక: బట్టలవీ పట్టుకురావద్దటండీ వెళ్ళి!

భద్ర: ఎవరికి బట్టలు?

పంక: అందరికీని! శ్రీపతి పుట్టింరోజు చేసుకుంటూంటే ఈ చింపిరిగుడ్డలు వేసు కుంటామా మనం?

భద్ర: మీరు తీసిస్తున్నారా అందరికీ?

పంక: తీసిచ్చేవాళ్ళు యిస్తారు మీ కెందుకు? తొందరగా బయల్దేరండి. (సాంబశివాన్ని గిల్లి పమ్మని సైగచేసింది. సాంబశివం ఆమెను వెంబడిస్తున్నాడు, భద్రయ్య ఏమీ పాలుపోక తెల్లబోయి చూస్తున్నాడు. నారయ్య వచ్చాడు)

భద్ర: నారయ్యా! ఏమిటీ పంకజమ్మ హడావిడి?

నార: ఏమోనయ్యా!

భద్ర: బజారు వెళ్తానంటూంది!

నార: తమరు వెళ్తున్నారు కదయ్యా?

భద్ర: నీతో ఎవరు చెప్పారు?

నార: డ్రైవరును కారు తయారుగా వుంచు పంకజమ్మ వెళ్ళాలన్నారు అంటే వాడు చెప్పాడు; తమరు ముందుగానే రిజర్వు చేశారని!

భద్ర: ఆఁ. అలా వెండి బంగారం దుకాణాలకి వెళ్ళి అయ్యగారికి పంచి భోజనం పళ్ళెం తెద్దామనుకున్నాను.

నార: ఆమెగారిని కూడా తీసుకువెళ్ళండి.

భద్ర: ఇంకేమన్నా ఉందా? కొళ్ళబెట్టదూ! (వెళ్ళాడు)

నార: ఈయనేదో మహా ఉద్ధరిస్తున్నట్టు? ఎవరికివాళ్ళు ఎవటివాళ్ళ ననటం తప్ప. ఇందులో ఎవరు తిన్నారు తక్కువ! (వెళ్తున్నాడు తనూ)

శ్రీ: (వాకిటినుంచి వచ్చాడు ఇంతలో) నారయ్యా! ఇలారా!

నార: (అతన్ని ఆఫీసుగదిలోకి వెంబడించాడు)

కమ: (మేడమీదనుంచి సోఫాలకు, అందులో తలగడలకు, బల్లమీదికి, తలుపులకు, కిటికీలకి, కొత్త గలీబులు, తెరలు, రుమాళ్ళు తెచ్చి అక్కడ బల్లమీద పడేసి) నారయ్యా! నారయ్యా!

నార: (లోపలినుంచే) వస్తున్నా నమ్మా!

కమ: ఆఫీసులో ఏం చేస్తున్నావు? నాన్నగా రొచ్చారా?

నార: ఆఁ వచ్చారమ్మా!

కమ: నాన్నా! (ఆఫీసులోకి వెళ్ళబోతూంటే శ్రీపతి, నారయ్యా వచ్చారు బైటికి) నాన్నా! ఎక్కడికి కెళ్ళావు నాన్నా? ఈరోజంతా నేను చెప్పినట్టు వినాలి.

శ్రీ: అలాగేనమ్మా!

కమ: అయితే, ముందు రా! వలకు పోసుకుందువు.

శ్రీ: తలకా?

కమ: ఆఁ పుట్టినరోజు. తప్పకుండా పోసుకోవాలి.

శ్రీ: మీ అమ్మ ఉండగా పోసుకున్నదే మళ్ళా ఎరగనమ్మా!

కమ: అయితే పద! నే చెప్తున్నా పోసుకో.

శ్రీ: సరేలే.

కమ: నారయ్యా! ఈ గలీబులు బిల్లగుడ్డలు అన్నీ తీసేసి కొత్తవెయ్యాలి.

శ్రీ: ఎందుకమ్మా! ఇవన్నీ?

కమ: ఆహా! నీ పుట్టింరోజు. నా యిష్టప్రకారం జరగాలి అంతే.

శ్రీ: (నవ్వాడు)

కమ: పో, మరి తొందరగా స్నానంచేసి రా. కొత్తబట్టలు వేసుకోవాలి.

శ్రీ: కొత్త బట్టలా? ఎప్పుడు తెప్పించావమ్మా?

కమ: అవన్నీ అడక్కు.

నార: అమ్మాయిగారు సరదాపడుతున్నారు వెళ్ళిరండయ్యా?

శ్రీ: పిచ్చితల్లి. (అంటూ వెళ్ళాడు)

కమ: (శ్రీపతితో వెళ్తూ) నారయ్యా! ఆ కర్టెన్లన్నీ మార్చు. నే నిప్పుడే వస్తా. (వెళ్ళింది)

నారయ్య కమల అక్కడ పడవేసిన బట్టలన్నీ తీసి చూసి, పాతవి ఊడబీకడానికి ప్రయత్నిస్తున్నాడు. అవసరమైతే అతనికి సరదాగా వుంటే ఒక పాత పాట పాడుకుంటాడు. లేదా ఊరుకుంటాడు. అది అతని యిష్టం. అతనలా ఏదో పనిచేస్తూ వుండగా పంకజమ్మ లోపల్నుంచి అరుస్తూ వస్తుంది.

పంక: ఆ పిండిరుబ్బి పాళ్ళన్నీ కొట్టిపెట్టించు. ఇంతలో నే వచ్చేస్తా. ఎంతసేపు, చిటికలో వస్తా. పిండివంటలే ప్రధానం. వాళ్ళిట్లా కబుర్లు చెప్పుకుంటూంటే క్షణంలో అయిపోతుంది. నారయ్యా బండి సిద్ధంగా ఉందా?

నార: భద్రయ్యగారు వెళ్ళారటమ్మా?

పంక: అయ్యోరామా! నే నప్పుడనగా చెప్పానే! ఏంచేసినట్టు నువ్వు? భద్రయ్యగారికేం తొందరొచ్చింది? నేను బజారువెళ్ళాలి. కూరా, నారా తేవాలి. వండాలి. ఎప్పుడయ్యేటట్లు? వస్తే ఆయనన్నారమ్మను. ఎక్కడ దిగబెట్టాలో దిగబెడతా.

భద్ర: (వస్తూ) ఆ మాటకొస్తే మీరేరండి, మిమ్మల్ని నేనే దిగబెడతాను.

పంక: దిగబెడతారు సరే. కొన్నవన్నీ నా నెత్తిన వేసుకురానా ఏమిటి?

సాంబ: సరేలేవే! ఎప్పుడూ మహాకార్లలో ఏడ్చినట్లు.

భద్ర: ఆ మాటకొస్తే నేను పదిచోట్లకు తిరగాల్సిన పనుంది అందుకని ——

పంక: దానికేం? తిరిగే దేదో తిరిగి మళ్ళా వచ్చేటప్పుడు మమ్మల్ని వేసుకు రాకూడదటా!

సాంబ: సరే. ఎలాగో ఒకలాగు సర్దుకుందాం. పదండిముందు.

పిల్ల: అమ్మా! నాకూ ఒక లాగే.

పంక: నువ్వొకడివి, సరే రా. (సాంబ, పంక, భద్ర. పిల్లాడు అందరూ వెళ్ళారు. నారయ్య నవ్వుకొని తనపనిలో పడ్డాడు. కారు కదిలిన శబ్దం. కారు వెళ్ళిపోయింది కమల వచ్చింది.)

కమ: నారయ్యా! ఈ పని నేను చేస్తానుకానీ. నువ్వు తొందరగా కార్లోవెళ్ళి

నార: కారు వెళ్ళిపోయిందమ్మా!

కమ: ఎవరు తీసుకెళ్ళారు?

నార: బంధువులు.

కమ: ఎందుకు?

నార: బజార్లో పనుందని . .

కమ: ఛీ! చస్తున్నాం వీళ్ళతో... సరే....సైకిలు మీదైనావెళ్ళు.

నార: ఎందుకమ్మా ఇంకొక కారుందిగా!

కమ: చెడిపోయిందన్నావు?

నార: ఊర్కే చెప్పాను. బాగుందంటే అదీ బ్రతకదని.

కమ: మంచిపని చేశావు. మన టెయిలర్ దగ్గర కెళ్ళి నాన్నగారి బట్టలు కుట్టిస్తానన్నాడు. ఉండి మరీ తీసుకురా. ఏం? ఇక్కడున్నట్టు రావాలి.

నార: అలాగేనమ్మా. (వెళ్ళాడు)

కమల ఒక్కసారి హాలంతా ఇటు అటు చూచి, ఏం జ్ఞాపకమొచ్చిందో మేడమీదికి వెళ్ళబోతూంది.

చల: (వచ్చాడు) కమలా!

కమ: నా లెటరందిందా?

చల: ఆఁ.

కమ: మీ నాన్నగారు రాలా?

చల: వస్తారు.

కమ: నుంచున్నావేం? కూచో.

చల. (కూచుంటూ) సరేగానీ కమలా! నీ పుట్టినరోజు ఈ నెలలోనా?

కమ: నా పుట్టినరోజు కాదు. మా నాన్నది.

చల: నాన్నగారిదా! నువ్వు లెటరులో అలా రాశావా?

కమ: రాసిందదే. నువ్వెలా చదువుకున్నావో గాని.

చల: కొంప మునిగింది. నారయ్య ఉన్నాడా?

కమ: ఏం?

చల. నాన్న నీకు పుట్టినరోజనుకుని బజారు వెళ్తున్నాడు ఏదైనా పట్టుకురావటానికి. తీరా చీరెలు, జాకెట్లు పట్టుకొచ్చారంటే....ఉండొస్తా! నారయ్యా! (బయటి కెళ్ళాడు)

కమల నవ్వుకున్నది. ఆ కర్టన్ల పని చూస్తోంది.

చల: (తిరిగొచ్చాడు) బతికాం. తీరా ఆ సమయానికి తెలిసి తెల్లబోకుండా.

కమ: అయినా లెటరు చదువుకోటంలో అంత వయ్యారమా?

చల: వయ్యారం కాదు, నీమీదున్న మమకారం.

కమ: ఆఁ. తెలుస్తూనే వుంది.

చల: నిన్నటి అనుమానాలన్నీ తీరినట్లేనా?

కమ: ఇప్పుడెందుకులే అవన్నీ.

చల: పోనీలే.

కమ: నిన్నరాత్రి మళ్ళా ఎంత నరకం అనుభవించానో తెలుసా?

చల: అక్కర్లేదని మళ్ళా అదే తిరగేస్తున్నావ్?

కమ: కాదు. నీతో ఒక్కసంగతి చెప్పాలి. రాత్రి 12 గంటలై ఉంటుంది. ఆ అర్ధరాత్రిలో ఇల్లు వదిలి బయల్దేరాను.

చల: నువ్వా! అర్ధరాత్రిలో! ఎక్కడికి?

కమ: ఏట్లోకి.

చల: కమలా!

కమ: మరి ఎక్కడికని అడుగుతావేం.

చల: నా కోసమా?

కమ. కాదు. నా కోసమే. నన్ను నేను కాపాడుకోటానికి.

చల: అంత ఆపదేం వచ్చింది?

కమ: డబ్బుగలవాళ్ళకు వచ్చేవి అన్నీ ఆపదలే. లేనివాళ్ళకొచ్చేవి కష్టాలు.

చల: ఇంతకూ ఏం జరిగింది?

పంక: పంకజమ్మకు ఒక కొడుకున్నాడు.

చల: ఉంటే?

కమ: చదువుకుంటున్నాడు. చాలా అందంగా ఉంటాడు. మాకు చాలా బంధువు కూడా.

చల: పంకజమ్మ మీ అత్తయ్యకాదూ?

కమ: ఇప్పటిదాకా కాదు.

చల: మరి అలా చెప్పుకు తిరుగుతూందే?

కమ: అత్తగారు కావాలని ప్రయత్నిస్తోంది. అందుకే ముందు సంబంధం కలిపేసింది.

చల: అలాగా!

కమ: నేను కోడలవుతానని కొండంత ఆశతో ఉంది.

చల: మీ నాన్నగారు?

కమ: కాదనటానికి కారణంలేదు.

చల: నువ్వు?

కమ: నేనింతవరకు ఏమీ నిర్ణయించుకోలేదు.

చల: కమలా!

కమ: ఏం?

చల: ఏం లేదు. మరి అర్ధరాత్రి వేళప్పుడు నువ్వు యిల్లువదిలి రావటానికి కారణం?

కమ: నీతో ఈ విషయం చెపుదామని.

చల: ఇందులో నాతో చెప్పేదేముంది?

కమ: ఏమీలేదా? అయితే నేనే పొరబడ్డాను. నీతో చెప్పాల్సిన అవసరం ఉందని భ్రమపడ్డాను. పోనీలే, అంతదూరంవచ్చి అవమానపడకుండా ఆగిపోవటం మేలైంది.

చల: కమలా! నన్ను పదేపదే అపార్థం చేసుకుంటున్నావు. నా అభిప్రాయం అదికాదు.

కమ: ఏదైతే ఏం? నువ్వు నన్ను కాపాడుతావనుకున్నాను. ఓదారుస్తావనుకున్నాను. ఆ ఆశతోనే అర్ధరాత్రిలో బయల్దేరా, ఇప్పుడు తెలిసింది. నీ మీద ఆశపెట్టుకోవటం నా తెలివితక్కువని.

చల: కమలా! (ఆమె చేయి పుచ్చుకున్నాడు. ఒక్కక్షణం ఇద్దరూ ఒకరి కళ్ళల్లోకి ఒకరు చూసుకున్నారు) నీకు నా ప్రాణమయినా యిస్తాను. నమ్మ.

కమ: (కరిగింది) నన్నీ బాధనుంచి తప్పిస్తావా?

చల: ఏం చేయమన్నావో చెప్పు.

కమ: నాకేమీ అర్థం కావటంలేదు. ఎవరి ఆశలు వారికున్నాయి. అంతా డబ్బుకోసమే. వలలువేసి చూచున్నారు. చివరికి డబ్బుకోసం వీళ్ళు ఖూనీలు చేసినా చేస్తారు.

చల: ఛీ! ఏమిటా పిచ్చి. అంతా నువ్వు వూహించుకుంటున్నావు అంతే.

శ్రీ: (లోపల్నుంచి) అమ్మా, కమలా!

కమ: ఆఁ. (కమల వెళ్ళబోతూంది)

శ్రీ: (ఇంతలోనే వచ్చాడు) ఎవరు? చలపతా. .ఏమోయ్ ఈ రోజు నా పుట్టినరోజు.

చల: కమల చెప్పింది.

కమ: అందరికీ Invite చేశాను నాన్నా.

శ్రీ: ఓ నాన్నగారూ వస్తున్నారా?

చల: ఆఁ.

శ్రీ: కూచో వస్తా. (వెళ్తున్నాడు.)

కమల ఒకసారి చలపతి వంక చూచి శ్రీపతిని వెంబడించి వెళ్ళింది.
చలపతి కూచున్నాడు. నారయ్య వచ్చాడు.

చల: ఏం నారయ్యా! నాన్నగారితో చెప్పావా?

నార: ఆయన లేరయ్యా! ఇంట్లో చెప్పొచ్చా. చిన్నమ్మగారెక్కడయ్యా?

చల: పైనున్నారు.

నార: అయ్యగారు?

చల: ఇద్దరూ!

నారయ్య వెళ్లారు. ఇంతలో వాకిట ఎవరో వచ్చిన చప్పుడు. ఏవేవో మాటలు.
పంకజమ్మ కంఠం అందరికన్నా పెద్దగా వినిపిస్తూంది. ఒక క్షణంలో
పంకజమ్మ, సాంబశివం, భద్రయ్య, పిల్లవాడు
అందరూ లోపలి కొచ్చారు ........

పంక: నారయ్యా! నారయ్యా! (డ్రైవరు కొన్ని సామాన్లు లోపలికి తెస్తున్నాడు. అందరిచేతుల్లో ఏవో మూటలున్నాయి. పిల్లవాడు ముఖ్యంగా కొత్త బట్టలు వేసుకున్నాడు.) అట్టా నిలబడతారేం? ఆ బండిలోఉన్న సామానులు తలా ఒకటి పట్టుకు రాకూడదూ? నువ్వలా పెట్టేసే నాయనా! మేం లోపలికి తీసుకు వెళ్తాంలే. (సాంబశివం, భద్రయ్య మూటలు పట్టుకొచ్చారు.) నారయ్యా!

నారి: (ఈ పాటికి నారయ్య వచ్చాడు) అమ్మా!

వంక: ఈ సామానులన్నీ లోపలకు తీసుకెళ్ళి పెట్టు నాయనా:

నార: ఇవన్నీ మనవేనమ్మా!

వంక: మనకే కాకుంటే యింకెవరి కనుకున్నావు? మన శ్రీపతి పుట్టింరోజు పండగంటే. అందులో లేక లేక చేసుకుంటున్నాడు. వాడిక్కాకుంటే యింకెవరికి నాయనా ఇంత సంపాదన, ఇంత ఆస్థి.

నార: (భుజానెగరేసి మూట తీసుకున్నాడు.)

పిల్ల: అందులో నా చొక్కాయున్నాయి. తీసుకెళ్ళవద్దు.

వంక: చాల్లే! నీకింకా చొక్కాయి కొన్నాననుకున్నావా? ఏడ్చి ప్రాణాలుతీస్తే ఆ ఒక్కటి కొన్నాం చాల్లే.

పిల్ల: లేదమ్మా! నాన్నగారి పంచెలు. నా చొక్కా గుడ్డలు అన్నీ అందులోనే వున్నాయి. నువ్వు మరిచిపోయావు.

వంక: సరే. నువ్వు మయ్యినోరు. నువ్వు తీసుకెళ్ళు నాయనా!

పిల్ల: ఊఁ...ఊఁ....నా చొక్కా బట్టలు....ఊఁ (ఏడుస్తూ నారయ్య వెంబడి వెళ్ళాడు. ఈ సమయంలోనే సాంబశివం, భద్రయ్య చాలా సామాన్లు లోపలికి తీసుకెళ్ళి పెట్టారు)

వంక: (ఈ హడావిడిలో ఇంతవరకు అక్కడ వున్న చలపతిని చూడలేదు. ఇప్పుడే చూచింది) ఏం నాయనా! మళ్ళా వచ్చావు?

చల: (యిరిటేట్ అయి) రమ్మంటే వచ్చాను.

వంక: ఎవర్రమ్మన్నారు?

చల: అది మీ కెందుకు?

వంక: నే నెవర్నో తెలుసా?

చల: తెలుసు.

వంక: ఎవరంటావు?

చల: కమలకి కావాలనుకొంటున్న అత్తగారు.

వంక: కావాలనుకొంటూన్న ఏమిటి? అయిన అత్తగార్నే. తెలుసా?

చల: తెలీదు.

వంక: తెలీకుంటే ఇప్పుడైనా తెలుసుకో నాయనా! అందుకనే అడుగుతున్నా, నిన్ను ఎవర్రమ్మన్నారని?

చల: కమలే రమ్మన్నది.

పంక: కమలా! కమల రమ్మన్నదా? (ఇంతలో శ్రీపతి కమల మేడమెట్లమీద నుం పెంచారు. శ్రీపతి కొత్త బట్టలు వేసుకున్నాడు)

శ్రీ: పంకజమ్మా!

పంక: (తిరిగి చూస్తూ) శ్రీపతీ! యిప్పుడే వచ్చా నాయనా! బజారునుంచి బట్ట.. బగ్గీ అంతా కొనేటప్పటికి ఇంతయింది. వంటెంతసేపులే, చిటికెలో చేయిం చేస్తా! (శ్రీపతి కమలా వచ్చారు) అది సరేగాని శ్రీపతీ. ఏమిటీ బజారంతా ఒకటేమాట?

శ్రీ: ఏం? ధరలు తగ్గించమన్నారా?

పంక: అదికాదు. మనింటికొచ్చిన మనుషులని తెలిసేసరికి డబ్బిచ్చినా ఒక్కడన్నా పుచ్చుకుంటేనా? మన కారులో వెళ్ళటం పొరపాటైపోయింది. వద్దని ఎంత చెప్పినా వింటేనా? అన్నీ నీ పద్దులో రాసేవారు. నువ్వెట్లా ఆర్డరు వేసు న్నావట. "మీ దగ్గిర డబ్బు పుచ్చుకుంటే ఆయన మా తల తీసేస్తా''రని అందరిదీ ఒకటే గోల. ఏం చేస్తాం. ఏదో కొనుక్కుని బయటపడ్డాం.

శ్రీ: (నవ్వి) అవునుమరి. ఇంత లక్షాధికారి ఇంటికొచ్చి మీరు డబ్బిచ్చి కొన్నా రంటే మాకెంత అవమానం!

పంక: అవమానం ఏముందిలే. అభిమానం ఉండాలిగాని. వస్తా నాయనా! వంటపని చూడాలి. (వెళ్ళింది)

డ్రైవరు వస్తాడు

శ్రీ: ఏం డ్రైవర్! బజార్లో ఏం జరిగింది?

డ్రైవర్: వీళ్ళ సంసారానికి సంవత్సరానికి చాలినన్ని బట్టలు కొన్నారయ్యా!

కమ: మన పద్దులోనే వేశారా?

డ్రైవ: ఆఁ....అంతా మనపద్దేనమ్మా! డబ్బివ్వడానికి పోరే. వాళ్ళు వద్దన్నారు అన్నదంతా పట్టిదమ్మా! వాళ్ళ చేతుల్లో కాసీలేకుండా వస్తేను!

శ్రీ: పోనీలే.

కమ: ఇంతకూ నీకేమన్నా కొనిచ్చారా?

డ్రైవ: నాకెందుకమ్మా!

శ్రీ: ఏంరా! కొనుక్కోపోయావూ?

డ్రైవ: ఆఁ, కొనుక్కోకుండానే జరుగుతుందయ్యా? ఈ బట్టలన్నీ మీరు పుట్టి చ్చినవికావూ? ఈ రోజు కొనుక్కుంటేనే కొన్నట్టా!

శ్రీ: సరేపోనీ! చలపతీ కూచో. సాంబశివం. భద్రయ్యా అందరూ ఉండి. పంక జమ్మనూ రమ్మను. చలపతీ! నాన్నగారు రాలేదేం?

చల: వస్తూంటారు. (సాంబశివం, భద్రయ్యా వచ్చారు.)

శ్రీ: పంకజమ్మ ఏదీ?

సాంబ: వంటపని అదీ చూస్తూంది.

శ్రీ: వంటమనిషి ఉంది. చూస్తుందిగానీ, ఆమెను రమ్మను.

సాంబ: ఏమే! నిన్నే! రా. శ్రీపతిగారు పిలుస్తున్నారు తొందరగా రా!

పంక: వస్తున్నా!

సాంబ: వెధవది. ఆ పొయ్యి దగ్గర పడ్డదంటే దానికదే వైకుంఠం.

శ్రీ: కూచో భద్రయ్యా! కూచో సాంబశివం! నారయ్యా మీరూ ఇక్కడే ఉండండి.

పంక: (వచ్చింది) ఎందుకు శ్రీపతీ పిలిచావట?

శ్రీ: నువ్వు రావమ్మా! వంట ఆ లక్ష్మి చూసుకుంటుందిలే!

పంక: ఉండు నాయనా! దానికా పోపు పెట్టడం కాస్త చెప్పొస్తా!

శ్రీ: పంకజమ్మా! ఏం ఫర్వాలేదు. కూచో చెప్తా. కూచో పిల్లవాడెక్కడ

పంక: ఒరేయ్ నాయనా చిన్నాడా!

పిల్ల: వస్తున్నానమ్మా! (పరుగెత్తుకొచ్చాడు)

శ్రీ: కూచోండి, అందరూ కూచోండి. కూచోమ్మా కమలా! (అందరూ ఆసీను లయ్యారు) ఈనాడు మీరందరూ ఇక్కడ ఉండటం నాకు నిజంగా చాలా సంతోషం.

సాంబ: మాకు మరీమరీ సంతోషం.

భద్ర: ఆ మాటకొస్తే సంతోషం ఏమిటి? మీరు ఎన్నడూ లేంది యీయేడే పుట్టిన రోజు పండుగ చేసుకోవాలని సంకల్పించటం, సరీగ్గా సమయానికి మే మిక్కడ ఉండడం, నిజంగా మా పూర్వజన్మ పుణ్యం అనాలి. ఇది ఒక్కరోజు ముందే తెలుసుంటే మా అమ్మాయిని కూడా పిలిపించేవాణ్ణి.

పంక: (సాంబశివాన్ని గిల్లింది)

సాంబ: ఒక్కరోజు కాదు. కొన్ని గంటలముందు తెలుసుంటే మా పెద్దబ్బాయిని తంతిమీద పిలిపించేవాణ్ణి.

భద్ర: ఆ మాటకొస్తే మా అమ్మాయి వుంది చూచారూ! చక్కటి శాస్త్రీయ సంగీతం పాడుతుంది. భరతనాట్యం బాగా నేర్చింది, ఒక కచేరీ పెట్టించే వాణ్ణి.

పంక: (సాంబశివాన్ని గిల్లింది)

సాంబ: మా పెద్దబ్బాయి వున్నాడు చూశారూ! అద్భుతంగా ఆశుధారగా కవిత్వం చెప్తాడు. ఇక్కడవుంటే ఈపాటికి మీమీద ఆశువుగా ఒక శతకం చెప్పేసే వాడు.

కమ: (ఒకవైపు నవ్వూ, ఇంకొకవైపు చిరాకుగా వుంది) చలపతిగారూ మీరేం చేస్తారు?

చల: ఇవన్నీ వుంటే వీటిని చూచి ఆనందించేవాణ్ణి.

కమ: అంతేనా? ప్రేమమీద ఒక ఉపన్యాసం దంచరూ?

చల: ఆలోచించుకోకుండా ఉపన్యాసం ఇవ్వాలంటే మీరే.

కమ: ఆలోచించి ఉపన్యాసం ఇవ్వటానికి మీరా?

శ్రీ: (నవ్వి) నా పుట్టినరోజు పండుగ చేసుకోవాలని నా కెందుకో రాత్రే అనిపించింది. అమ్మాయితో చెప్పాను, అలాగే నాన్నా అని అమిత ఉత్సాహపడింది అమ్మాయి. ఉత్సాహంకొద్దీ చేసుకోక తప్పిందికాదు.

పంక: అమ్మాయి రాత్రే నాకు చెప్పింది. అప్పటినుంచి నాకు నిద్రపడితేనా? ఒకటే ఆలోచన. పండగకు ఏం చేస్తామా, ఎలా చేద్దామా అని.

శ్రీ: నిజంగా పంకజమ్మ ఈనాడు మా యింట్లో ఆడదిక్కులేని కొరత తీర్చింది. నా అదృష్టంకొద్దీ పెద్దలు మీరందరూ వున్నారు. మీరు నన్నూ, మా అమ్మాయినీ, ఆశీర్వదించాలని ప్రార్థిస్తున్నాను.

పంక: వుండండి? కాస్త ఆగండి. ఆశీర్వాదమంటే అట్లా ఊర్కే జరిపేయటమేనా? (వెళ్ళింది)

భద్ర: ఇదిగో ఒక్కనిమిషంలో వస్తా. (వెళ్ళాడు)

శ్రీ: ఏం? చలపతీ మీ నాన్నగారు రాలేదేం?

చల: వస్తుంటారనుకుంటా.

కమ: నాన్నా! నాన్నా! ఒక గమ్మత్తు చెప్పనా నేను. ''నాన్న పుట్టినరోజు'' అని లెటర్ రాసి పంపితే ఈయనగారు నా పుట్టినరోజని చదువుకున్నారట. ఇప్పుడు వాళ్ళ నాన్నగారు నీకు....

చల: (చెప్పవద్దని సైగచేశాడు)

కమ: (నవ్వింది)

పంక: (ఇంతలో పంకజమ్మ పళ్ళెంలో అక్షతలు, ధోవతులు అన్నీ పట్టుకొచ్చి బల్ల మీద పెట్టింది. భద్రయ్య ఏదో పాకెట్ పట్టుకొచ్చాడు. సాంబశివంతో) ఇక కానీండి!

సాంబ: (లేచి అక్షతలు అందుకొని అక్షతలు అందరికీ పంచిపెడుతూ ఆశీర్వాదం పనస చదువుతున్నాడు. పనస పూర్తిఅయింది. అందరూ అక్షతలు చల్లారు) ఇక చదివింపులు కావచ్చు.

పంక: (ధోవతులు చాపు అందిచ్చింది)

సాం: (మరో చిన్న పనస చదివి) ఏదో ఉచితాభక్తి. చంద్రునికొక నూలు పోగన్నట్టు, మా స్వల్పాన్ని మీరు స్వర్ణంగా స్వీకరించాలి. శ్రీమాన్ శ్రీపతిగారికి వారి బావగారు సాంబశివంగారి ఆశీర్వాదం (అంటూ ఇచ్చాడు.)

శ్రీపతి అందుకున్నాడు.

సాం: (పంకజమ్మ చీర రవిక అందించింది) చిరంజీవి కమలాదేవికి, అంటే నా కాబోయే కోడలికి. ఆమె అత్తగారు పంకజమ్మగారి ఆశీర్వాదం. (అంటూ ఇచ్చాడు. కమల విసుగ్గా పుచ్చుకుంది)

భద్రయ్య తన పళ్ళెం ఇచ్చాడు.

సాం: (చిన్న పనస చదివి) శ్రీమాన్ శ్రీపతిగారికి వారి జన్మదిన సందర్భాన వారి - (అని భద్రయ్యను చూచాడు)

భద్ర: మామగారు.

సాం: ఆఁ వారి మామగారు శ్రీ భద్రయ్యగారి ఆశీర్వాదం.

జగ్గయ్య వచ్చాడు.

శ్రీ: ఓ జగ్గయ్యగారా! రండి రండి.

సాం: దయచేయండి. సరీగ్గా సమయానికొచ్చారు. ఆశీర్వాదాలు యిప్పుడే అవుతున్నాయి.

జగ్గ: అరరే! ఆలస్యంగా వచ్చానన్నమాట.

చలపతి కంగారుపడుతున్నాడు.

భద్ర: ఆ మాటకొస్తే ఏం ఫర్వాలేదు. చదివింపులు ఇంకా పూర్తికాలేదుగా.

జగ్గ: మరింకేం! ఇదిగో చదివించు?

చల: నాన్నా!

జగ్గ: ఏమిరా?

చల: అదికాదు నాన్నా...! అదికాదు.

జగ్గ: మీరు కానీండయ్యా? మీరు కానీండి.

సాం: (జగ్గయ్య ఇచ్చిన పాకెట్ తీసుకొని పనస చదివి) శ్రీమాన్ శ్రీపతిగార్కి-వారి ప్రియమిత్రులు జగ్గయ్యగారి ఆశీర్వాదం (అంటూ పొట్లాం విప్పి ఇవ్వబోయాడు. అది చీరకావటం చూసి అందరూ గొల్లుమన్నారు. జగ్గయ్య తెల్లబోయాడు. చలపతి తల వంచాడు.)

జగ్గ: ఏమిటి, ఏమిటిది, ఎందుకు నవ్వుతారు?

సాం: ఏం లేదండి. మీ స్నేహితాన్ని తెలుపుతుంది. లేకుంటే శ్రీపతిగారితో ఇంత పరాచకాలాడుతారా మీరు?

జగ్గ: పరాచకాలా! ఏమిటండీ?

చల: అదికాదు నాన్నా! యీనాడు కమల పుట్టినరోజు కాదు. శ్రీపతిగారిది.

జగ్గ: మరి నువ్వమ్మాయిదని చెప్పావే?

చల: ఉత్తరం చదువుకోవటంలో పొరపాటైంది నాన్నా!

జగ్గ: ఏడ్చావ్ వెధవ, ఉత్తరం చదవటంలో అంత వయ్యారమా? ఛీ ఛీ! ఎంత అవమానం, ఎంత తలవంపులు?

శ్రీ: జగ్గయ్యగారూ కోప్పడకండి. ఇప్పు డేం మునిగిపోయిందీ? మనలో మనకు లాంఛనాలేమిటండీ! నాకైతే ఏం? నా బిడ్డకైతే ఏం? కూచోండి, కూచోండి.

జగ్గయ్య విసుక్కుంటూ కూర్చున్నాడు. నారయ్య శ్రీపతి మెడలో ఒక పూలమాల వేసి నమస్కరించాడు.

శ్రీ: నారయ్యా! ఏమిటిదంతా?

నారయ్య పలక్కుండా వెళ్ళిపోయాడు. డ్రైవరు పళ్ళూ పూలు తీసుకొచ్చి బల్లమీద పెట్టి దండంపెట్టి వెళ్ళాడు.

శ్రీ: ఏమిటది? మిమ్మల్నంతా ఎవరు చేయమన్నా రీ పని?

పంక: ఒకడు చేస్తే చేసేదా ఈ పని? అభిమానం!

శ్రీ: మీ అందరి అభిమానం చూస్తే నాకు చాలా బాధగా ఉంది. నిజంగా శ్రీపతి ఎవరో, ఎలా యింతవాడయ్యాడో, తెలిస్తే, మీ రెవ్వరూ నన్నభిమానించరు.

పంక: మాకు తెలియని శ్రీపతా ఏం? శ్రీపతిని గురించి మాకు చెప్పనక్కర్లేదులే. (గిల్లింది)

సాం: (లేచి) అవకాశం దొరికింది కనుక మా శ్రీపతిగార్ని గురించి నన్ను నాలుగు ముక్కలు చెప్పనిస్తారూ?

జగ్గ: తప్పకుండా చెప్పండి.

సాంబ: మీకు తెలుసో లేదో శ్రీపతిగారిది మా వూరు.

పంక: ఊరేంఖర్మ! మా బంధువు కూడా.

సాం: అవును. శ్రీపతిగారిని ఇంత చిన్నప్పటినుంచీ నేను బాగా ఎరుగుదును. వారి నాన్నగారికి మా కుటుంబంమీద చాలా అభిమానం. నిజం చెప్పాలొస్తే మే మంతా ఒకే కుటుంబంగా వుండేవాళ్ళం.

పంక: అసలు నేను ఇంత పిల్లప్పటినుంచీ యిరవైనాలుగు గంటలూ వాళ్ళింట్లోనే ఉండేదాన్ని. మా నాన్నగారు 'ఏమే, ఎప్పుడూ అక్కడే ఉంటావ్' అని కోప్పడితే శ్రీపతి నాన్నగారు అనేవారు కదా 'పంకజమ్మను మేము దత్తు తీసుకున్నాం లేవోయ్' అని. వారు నన్ను స్వంత కూతురులాగా చూచుకునే వారు. (సాంబశివాన్ని గిల్లింది)

సాంబ: అవునవును. అసలు మా యిద్దరికీ సంబంధం కుదిర్చి పెళ్ళిచేసినవారు కూడా ఆయనే.

పంక: మీరూరుకోండి. మహా తెలుసున్నట్టు మాట్లాడుతున్నారు. సంబంధం కుదిర్చింది శ్రీపతి తల్లిగారండి. నాకు తెలుసు.

సాంబ: చాల్లేవే నువ్వు, అసలు దీనికప్పట్లో అవన్నీ తెలిసే వయసుకూడా కాదు. నాకు బాగా తెలుసుగా. శ్రీపతి తండ్రిగారే....

పంక: మీరు లక్ష చెప్పండి, వెయ్యి చెప్పండి. ఆనాడు నాకు నీళ్ళుపోసి జడవేసి అంతా చేసింది ఆమె. నాకు బాగా గుర్తుంది.

సాంబ: ఏడ్చినట్లుంది. నన్ను బజారుకు తీసుకెళ్ళి బట్టలు కొనితెచ్చింది ఆయనైతేను. (ఇద్దరూ లేచి నిలబడి దెబ్బలాడే స్థితికొచ్చారు.)

శ్రీ: (అడ్డుపడి) పంకజమ్మా! ఎవరైతే ఏం ఊరుకో అమ్మా! మీరిద్దరూ మొగుడూ పెళ్ళాలైనారు. ఇంకేం?

పంక: అందుక్కాదు. ఏది చెప్పినా ఉన్నమాట చెప్పుకోవాలి. అబద్ధాలాడితే నే చచ్చినా ఒప్పుకోను.

శ్రీ: పోనీలేమ్మా! కూచో, కూచో.

సాంబ: ఆఁ. ఇంతకూ ఏం చెప్పొచ్చాననంటే....అలాంటివారి కుమారులు శ్రీపతి గారు, ఈనాడు శ్రీపతిగారు వారి నాన్నగారినే మరిపిస్తున్నారు.

భద్ర: ఆ మాటకొస్తే శ్రీపతిగారు వారి నాన్నగార్ని మించిపోయారు. ఒక్కొక్కప్పుడు నా కనుపిస్తుందీ శ్రీపతిగారి చేతికి ఎముకలు లేవుకదా, కనీసం నరాలైనా ఉన్నాయా? అని.

జగ్గ: మీ కింకా సందేహంగా ఉందేమో? మాకు మాత్రం శ్రీపతిగారి చేతికి నరాలు లేవన్న విషయం గట్టిగా తెలిపోయింది.

సాం: ఈలాంటి శ్రీపతిగారు మా ఊరివారు కావడం మాకు గర్వకారణం.

జగ్గ: మీ ఊరివారైనా, మా ఊరిలో నివాస మేర్పరచుకోవడం మాకు మరీ గర్వకారణం.

భద్ర: ఆ మాటకొస్తే శ్రీపతిలాంటివారికి మా ఊరు మీ ఊరు అని ఎల్లలు ఏర్పరచటం ఉంది చూశారూ అది మన చిన్నతనం. వారూ, ఈ విశాల విశ్వానికే చెందినవారు.

జగ్గ: అందుకనే మా అబ్బాయి వాళ్ళకాలేజీలో శ్రీపతిగారి శిలావిగ్రహాన్ని ప్రతిష్ఠించటానికి చందాలు వసూలు చేస్తున్నాడు. కాదబ్బాయ్?

చల: (వెకిలిగా నవ్వి) అవునవును.

కమల నవ్వింది.

శ్రీ: చూడండి, మనం ఇదంతా మాట్లాడుకోటంలో ఏమీ సరదా ఉండదు. కులాసాగా కాలక్షేపం చెయ్యాలి. కాని పబ్లిక్కు మీటింగులా చెయ్యడం నా కిష్టం లేదు.

జగ్గ: అందుకనే నే నూరుకున్నా. లేకపోతే టౌన్ హాల్లో ఈ పాటికి ఒక బహిరంగ సభ జరిపేవాళ్ళం.

శ్రీ: Thanks! నారయ్యా, ఆఫీసుగదిలో వున్న ఆ పెట్టె పట్టుకురా!

నారయ్య వెళ్ళాడు.

శ్రీ: ఈ రోజంతా చిన్ననాటి కబుర్లు చెప్పుకుంటూ గడపాలనుంది. మీ కెవ్వరికీ తొందరపన్లు లేవనుకుంటా.

జగ్గ: అబ్బే! మా కింతకన్నా ఏం పనుందండీ.

శ్రీ: అస లీ రోజు నేను భూదానం. గోదానం అన్నీ చెయ్యాలనుకున్నాను. కానీ వ్యవధి లేకపోయింది. అన్నిటికీ స్వర్ణదానం చేస్తే సరిపోతుందంటారు. నిజమా సాంబశివంగారూ!

సాం: శాస్త్రం సమ్మతిస్తుంది.

నార: (పెట్టె తెచ్చాడు.)

శ్రీ: భద్రయ్యగారూ! ఎంత డబ్బుంటే ఏం? మనిషి నలుగురిలో మంచనిపించుకోవాలి. ఏమంటారు?

భద్ర: ఆమాట కొస్తే అంతే. మంచి మీలో మూర్తీభవించిందంటే నమ్మండి.

శ్రీ: (నవ్వి పెట్టెలోంచి డబ్బుతీసి) పుచ్చుకోండి భద్రయ్యగారూ!

భద్ర: నాకా!

శ్రీ: ఏదో నా కానుక తీసుకోండి. సాంబశివంగారూ! ఏది శాశ్వతం? ఉన్నట్టుండి నే నిప్పుడు చచ్చిపోయాననుకోండి.

సాంబ: అదేమిటండీ! ఇందరముండీ మిమ్మల్నిలా చచ్చిపోనిస్తామా?

శ్రీ: తీసుకోండి.

సాంబ: (నవ్వి పుచ్చుకున్నాడు.)

శ్రీ: జగ్గయ్యగారూ! డబ్బులో ఏమున్నదండీ? ఇలా అందరికీ పంచిపెట్టి నే నివాళ దివాళ తీసేననుకోండి మీరు నన్ను గౌరవించడం మానేస్తారా?

జగ్గ: మనిషంటే వెధవ డబ్బేనంటండీ? డబ్బు దేముంది ఈ రోజు పోతుంది. రేపొస్తుంది. నా మట్టుకు మనిషంటే మనిషే.

శ్రీ: మంచి మాటన్నారు. పుచ్చుకోండి? (బలవంతాన చేతిలో పెట్టేస్తాడు.) పంకజమ్మా! నువ్వు ఆలోచించుకోకుండా ఒక్క అబద్ధం చెప్పు. అయిదువే లిస్తాను.

పంక: అయ్యో నాయనా! అబద్ధం అంటే ఏమిటో నే నెరగందే!

శ్రీ: (నవ్వి) నువ్వే గెల్చావమ్మా! యివిగో అయిదువేలు!

కమల, చలపతి నవ్వారు.

శ్రీ: (నిలబడి) మీరందరూ ఆశ్చర్యపోతున్నారు. ఏమిటూ, నేడు యిలా డబ్బు వెద జల్లుతున్నాడని. ఇదంతా నాటకం అని కూడా అనుకుంటారు. అసలు మీకు ఇది నిజమైన నోట్లేనా అని సందేహం కూడా రావచ్చు. నే నొకవేళ నోట్లు అచ్చువేస్తున్నానేమోనని మీరు అనుమానం పడొచ్చు. అసలు విషయం ఈ డబ్బంటే నా కసహ్యం. ఎన్నో పాపాలు చేసి సంపాయించా నీ డబ్బు. ఆ పాపాలన్నీ పరిహారం చేసుకోవాలంటే ఈ డబ్బు పదిమందికీ పంచిపెట్టడమే మార్గమని తోచింది. అంతేకాదు, ఈ డబ్బు నా దగ్గర ఉన్నందువల్ల ప్రపంచంలో ఎన్నో పాపాలు పెరుగుతున్నాయ్. ఇంత డబ్బూ నా ఒక్కడి ఇన

ప్పెట్టెలో మూలుగుతుందంటే ఎందరో పేదవాళ్ళుగా ఉన్నారన్నమాట. వాళ్ళందరూ డబ్బు లేకపోవడంవల్ల, అబద్ధాలు చెప్తారు. అభిమానాన్ని అమ్ముకుంటారు. ఆత్మలను చంపుకునే పనులు చేస్తారు. దొంగతనాలు, దోపిళ్ళు, ఖూనీలు, ఎన్నో చెయ్యాల్సివస్తుంది. అన్నిటికి కారణం ఈ డబ్బు నా దగ్గర ఉండటమే. ఆ పాపాలన్నిటికీ బాధ్యుణ్ణి నేనే.

పంక: బాగుందీ వాదన. ఎవరో పాపాలు చేసారని మనం డబ్బు సంపాదించడం మానేస్తామా?

భద్ర: ఆ మాటకొస్తే, ధర్మార్థ కామమోక్షాలన్నారు. మిగతా మూడింటినీ సాధించ డానికి అర్థం చాలా అవసరం. అందుకనే బాగా సంపాయించమన్నారు.

శ్రీ: సంపాయించాలి. కానీ నాలా కాదు. నేను ఎన్నో అన్యాయాలు, పాపాలు, అక్రమాలుచేసి సంపాయించాను.

చలపతి తెల్లబోయి చూస్తున్నాడు.

శ్రీ: ఎవ్వరూ తెల్లబోనక్కర్లేదు. ఒకప్పుడు నేనే ఏ అక్రమమూ చేసి సంపాయించ లేదని కొందరితో చెప్పాను. మహారాజులందరూ ఇదేమాట చెప్తారు. కానీ ఒకనాడు కాకున్నా ఒకనాడు నిజం వాళ్ళ గుండెల్లో గుచ్చుతుంది.

పంక: చాల్లే నాయనా! పండుగ చేసుకోవాలనుకుని ఈ పాడు మాటలెందుకు. పాపాలు చేసేట్టు, చెపుతున్నాడు. నువ్వు ఎంత చెప్పినా మేమెవ్వరం నమ్మటానికి సిద్ధంగా లేములే.

సాం: శ్రీపతిగారు పాపం చేశారంటే ఎవరు నమ్ముతారు మరి.

భద్ర: ఆ మాటకొస్తే వారే పాపులంటే మనం మహాపాపులం.

జగ్గ: ఆఁ. ఇదంతా ఏదో తమాషా కంటున్నారుగాని నిజమా?

శ్రీ: నిజమే చెప్తున్నాను. మీరు నమ్మినా నమ్మకున్నా నిజం నిజమే. నా మైకాగనుల త్రవ్వుతూ వందమంది కూలీలు చచ్చిపోయారు.

భద్ర: ఆ మాటకొస్తే చావుపుట్టుకలకి మనం కారకులమా? వాళ్ళ ఖర్మ.

శ్రీ: నేనూ ఖర్మనుకునే కళ్ళుమూసుకొని, వెళ్ళిపోయాను. కానీ ఈనాడు తెలుస్తోంది. నా పెట్టుబడి వాళ్ళను పొట్టబెట్టుకుందని. పట్నంలో యిప్పుడు బాడుగలు సంపాయిస్తున్న నా యిల్లు కడుతూ దూలాలుపడి ఇద్దరు తాపీవాళ్ళు చచ్చిపోయారు.

సాంబ: అలాంటి ప్రమాదాలు సహజం.

శ్రీ: వాళ్ళు పోగానే వాళ్ళ పెళ్లాలు. ఒకతె గుండెపగిలి, ఇంకొకతె మంచానపడి చనిపోయారు. ఆ రెండు సంసారాలు నా సంపాదనకు ఆహుతై పోయినయ్. కమలను కని నా భార్య పోయింది. కనుగందుప తల్లిపాలులేవు. పాలివ్వ దానికి ఒక దాదిని ఏర్పాటుచేశాను. ఆవిడ పేదరాలు. డబ్బుకాశపడి ఒప్పు కుంది. నా బిడ్డకు పాలిచ్చి తన బిడ్డకు లేకుండా చేసుకుంది. ఆమె బిడ్డ కొద్ది రోజులకే పోయింది. ఇంతకన్నా ఘోరం ఇంకేం కావాలి. డబ్బుతో మనుష్యుల్ని కొన్నాను. చంపేశాను. నేను హంతకుణ్ణి.

కమ: నాన్నా!

పంక: శ్రీపతీ!

శ్రీ: చెప్పనివ్వండి, చేసినపాపాలు చెప్పకుంటే పోతాయంటారు. నేనొక వ్యాపారం పెట్టాను. నా వ్యాపారం బాగా పెరిగింది. అదివరకు అదే వ్యాపారం చేస్తున్న తనికి బేరం తగ్గింది. అతను దివాలాతీశాడు. అప్పులపాలయ్యాడు. ఇక బతక లేక ఆత్మహత్య చేసుకున్నాడు. దీన్నేమంటారు? అతన్ని ఖూనీ చేసిందెవరు? నేనే. ఇలా ఎందర్నో చంపి సంపాయించాను. ఆ డబ్బుతో మేడలుకట్టాను. గౌరవం కొన్నాను. పదవులు తెచ్చుకున్నాను. పెద్దమనిషిలా లోకాన్ని మోసం చేసి బతుకుతున్నాను. ఈనాడు నేను పాపిని కాకపోవచ్చు. మీ కళ్ళకు నేను పాపిగా కనపడకపోవచ్చు. కొన్నాళ్ళకైనా నా బండారం బయట పడుతుంది. నేను పాపినని నిర్ణయించే కాలం వస్తుంది. ఆనాడు నన్నందరూ అసహ్యించు కుంటారు. నా పేరూ ఊరూ లేకుండా తుడిచేస్తారు. అంతా మోసం. నేను మోసం. నా బతుకే మోసం. (శ్రీపతి కళ్ళనీళ్ళ పర్యంతం వచ్చాడు.)

కమ: ''నాన్నా నాన్నా'' (అందరూ నిర్ఘాంతపోయారు)

కొత్తవ్యక్తి లోపలికి వచ్చాడు.

శ్రీ: (కళ్ళనీళ్ళు తుడుచుకొని) నమస్కారం దయచేయండి.

అతను: నేనెవరో మీకు తెలియదు. కానీ మీరు నాకు తెలుసు. మిమ్మల్ని చూడాలని చాలా రోజులుగా అనుకుంటున్నాను. పట్టుకుందామంటే దొరికేరుకారు.

శ్రీ: కూర్చోండి.

అతను: (కూర్చుంటూ) ఈనాడు పుట్టినరోజు పండగని తెలిసే వచ్చాను.

శ్రీ: చాలా సంతోషం.

అతను: ఈలా పుట్టినరోజు పండగచేసుకునే అలవాటు మీ కెప్పుడూ లేదనుకుంటా.

శ్రీ: లేదండి.

అతను: ఈ యేడే ప్రత్యేకంగా చేసుకుంటున్నారు కదూ?

శ్రీ: అవును.

అతను: కారణం ఏమిటి?

జగ్గ: ఏమండీ! మీరెవ్వరో నాకు తెలీదు - కానీ క్షమించాలి. మీరు కేవలం పోలీసు వాళ్ళు క్రాసుచేసేలా అడుగుతున్నారు. అదేమంత బాగాలేదు నాకు.

భద్ర: ఆ మాటకొస్తే నాకూ బాగోలేదు.

శ్రీ: దానిదేముందిలెండి. ఆయనను తెలుసుకోవాలనుంది అడిగారు. కారణం ఏమీ లేదండి. ఎందుకో ఉన్నట్టుండి రాత్రే అనిపించింది.

అతను: రాత్రినుంచి మీలో ఏదో మార్పు అగుపించి ఉండాలి.

సాంబ: చూస్తే మీరు జ్యోతిషుడిలాగున్నారు.

అతను: నన్ను గురించి ఇప్పుడేమీ అడక్కండి. ఏమండీ నే నే నన్నది నిజమేనా?

శ్రీ: ....

అతను: మీలో కలిగిన మార్పేమిటో చెప్పగలరూ?

శ్రీ: సరీగ్గా చెప్పలేను. కాని ఒకటిమాత్రం తెలుస్తూంది. నా చరిత్ర అందరితో ఏ దాపరికము లేకుండా చెప్పుకోవాలనిపిస్తూంది.

అతను: వేరేవిధంగా అనుకోకండి. మీకు చచ్చిపోతారన్న భయం ఏమన్నా ..

శ్రీ: అబ్బే అలాంటిదేమీ లేదు.

అతను: పోనీ ఏదైనా ఆపద వస్తుందని...

శ్రీ: ఆపదా? అలాగని కూడా చెప్పలేను.

అతను: ఆవేదనకు కారణం అదే. మీ అంతర్వాణి ఏదో ఆపదను ఎదురుచూస్తోంది.

పంక: ఏం నాయనా! నువు చూస్తే నాకంటే చిన్నవాడివిగా వున్నావు. అందుకని చెప్తున్నా, మేమేదో హాయిగా పండుగ చేసుకుంటూంటే, ఇప్పుడు ఈ ఆపదలూ, చావులు ఎందుకు చెప్పు?

అతను: వచ్చే ఆపదలు మనకోసం ఆగుతాయమ్మా?

పంక: వచ్చినప్పుడు రానీలే నాయనా! శ్రీపతికి ఆపదలొస్తే ఆదుకునేవాళ్ళు లక్షయాభైమందున్నారు.

అతను: (నవ్వి) ఏమండీ! మీరు జీవితంలో ఎప్పుడో ఘోరమైన పాపమో, మోసమో, అన్యాయమో చేసినట్టు మీకు లోపల అనిపిస్తుందా?

శ్రీ: (అందరూ తెల్లబోయారు) మీరేమంటేనేం. మహానుభావుడుగా ఉన్నారు. మీరు రావటానికి ఉదయం నుంచీ అదే చెప్తున్నా.

అతను: ఎందుకు చెప్పవలసొచ్చింది?

శ్రీ: చేసినపాపం చెప్పుకుంటే పోతుందేమోనని.

అతను: (నవ్వి) చెప్పుకుంటే ఎలా పోతుందండీ? అనుభవించాలి.

శ్రీ: అవును. అదీ నిజమే.

అత: అనుభవించాల్సొస్తుందని బాగా తెలుసా?

శ్రీ: తెలుసు.

పంక: శ్రీపతీ! మమ్మల్ని ఉండమంటావా? వెళ్ళమంటావా?

శ్రీ: అదికాదు పంకజమ్మా!

పంక: నాకు మరింకేమిటి? ఈపాటు పురాణాలు వినటానికేనా పండగ పిలవ గన్నావ్?

అత: క్షమించండి. మీ కందరికీ ఇష్టంలేని విషయం నేను మాట్లాడాను మీ కందరికీ నేను అడ్డొచ్చాను. అవును. పండగంటే హాయిగా పాడుతూ. ఆడుతూ . . .

పంక: అవునమ్మా కమలా! ఒక్క పాటపాడు వింటాం.

కమ: అబ్బే నాకు పాటలు రావు.

చల: అబద్ధం. పాడాల్సిందే. తప్పకుండా పాడాలి.

శ్రీ: పాడమ్మా!

అత: పాడాలి. మీ పాటవింటూ కాసేపు బాధలైనా మర్చిపోతారు. మనిషికి కావల్సింది అదే. తన్ను తాను ఎలాగో మోసం చేసుకోవడం.

పంక: అదుగో నోరు తెరిస్తే మోసం మోసం అని అదే మాటొస్తుంది. ఎందుకు మీ కందరికీ. నువ్వు పాడమ్మా.

కమ: ఊహూఁ.

చల: నా కోసం ఒక్క పాట.

కమ: (గొంతు సర్దుకుని పాడబోతూంది. ఇంతలో....)

అత: క్షమించండి. నా కర్జంటుగా మీరో సహాయం చెయ్యాలి.

శ్రీ: ఏమిటి?

అత: వెయ్యి రూపాయల చిల్లర కావాలి.

శ్రీ: అంతేనా! పెద్ద సహాయం అన్నారు. (పెట్టె తెరచి చూచి) అరెరే. ఇప్పుడే అందరికీ యిచ్చేశాను. ఆఁ. మీ దగ్గరేమైనా ఉందేమో చూడండి. (ప్రతి

ఒక్కరూ వాళ్ళ నోట్లకట్ట యింకొకరికి కనబడకుండా పరుగ్గా తీసి లెక్క పెట్టుకుంటున్నారు)

సాంబ: నా దగ్గర రెండువందలకుంది.

భద్ర: ఆ మాటకొస్తే... నా దగ్గరా ...నాలుగు వందలున్నాయిలెండి.

జగ్గ: నా దగ్గర రెండువందలకంటే ఎక్కువ లేవండీ!

శ్రీ: పంకజమ్మా! నువు చూడూ!

పంక: నా దగ్గిరా.. అసలు నువ్వు నాకు చిల్లరిచ్చావా? చూస్తానుండు నాయనా! (నోట్లుచూచి) ఏదో కొద్దిగా వుందిలే నాయనా.

శ్రీ. అందరిదీ కలిపితే వెయ్యి రూపాయలు రావచ్చు. ఇవ్వండి. (ఎవరికి వాళ్ళు, వాళ్ళ దగ్గరున్న నోట్లు యిచ్చి, అతని దగ్గర్నుంచి వందరూపాయల నోట్లు పుచ్చుకున్నారు. భద్రయ్య అతనిచ్చిన నోట్లను కొంచెం పరీక్షగా చూశాడు)

అత: దొంగనోట్లు కావులెండి.

భద్ర: అబ్బే! అందుక్కాదు.

అత: ఆఁ అందరికి డబ్బు అందిందా? సెలవు. మీకు శ్రమకలిగించినందుకు క్షమించండి. వస్తా.

శ్రీ: వెళ్తున్నారా?

అత: అవసరమైతే మళ్లా కలుసుకుంటాను. (వెళ్తాడు)

పంక: అబ్బా! శనిగాడెవడో, విరగడై పోయాడు.

కమ: ఎవరు నాన్నా! అతను?

శ్రీ: ఎవరోనమ్మా! ఎక్కడా చూచిన గుర్తులేదు.

జగ్గ: నాకూ ఎక్కడా తటస్థ పడలేదు.

సాంబ: ఎవరైతేనేం? ఏమిటాయన ప్రశ్నలు?

భద్ర: ఆ మాటకొస్తే అవన్నీ అడగటానికి ఆయన ెవరు?

పంక: అడిగినా, శ్రీపతి జవాబు చెప్తూ కూర్చున్నాడు. చూడండి అది మరీ మంటయింది నాకు.

చల: అతని ప్రవర్తనే ఏదో వింతగా వుంది నాకు.

సాంబ: వింతేమిటి? వాలకం చూస్తే ఒట్టి దగుల్బాజీ అనిపిస్తున్నాడు.

పంక: పాడుముఖం వాడూ!

జగ్గ: పోలీసులాగ ప్రశ్నలూ వాడూ!

శ్రీ: బహూశా పోలీసేమో?

చల: పోలీసు ఎక్కడి కెందుకొస్తారు?

శ్రీ: రాకూడదని ఏముంది?

కమ: ఆయన ఏం చేసుకుపోయినట్లు?

భద్ర: ఆమాటకొస్తే వెయ్యిరూపాయల చిల్లర పట్టుకుపోయాడు.

శ్రీ: అదే ఆలోచిస్తున్నా! నోట్లు పట్టుకెళ్ళాడు ఎందుకు పట్టుకెళ్ళాడా అని. (లేచి పచారు చేస్తున్నాడు.)

సాంబ: అఁ ఏదో చిల్లర కావాల్సొచ్చి పట్టుకెళ్ళాడు. దానికేముంది.

శ్రీ: ఇంత పెద్ద ఊళ్ళో చిల్లర ఎక్కడా దొరక్కుండా మన దగ్గరకే రావాల్సొచ్చిందా?

జగ్గ: ఏమిటండీ మీరు? అతన్ని గురించి అంతగా ఆలోచిస్తున్నారు. ఎవడో వచ్చాడు, వాగిపోయాడు.

శ్రీ: అలా కాదులెండి ఏవీ ఆ నోట్లు యిలా యివ్వండి చూద్దాం (నోట్లుతీసి పరీక్షగా చూచి) ఊఁ! (మళ్ళా పచారు చేస్తున్నాడు.)

జగ్గ: ఏమిటండీ? ఏమిటది?

పంక: దొంగనోట్లా ఏం? కొంపతీసి!

కమ: ఏం నాన్నా!

శ్రీ: ఏమీలేదమ్మా (ఆఫీసుగదిలో టెలిఫోన్ మోగింది.)

నార: అయ్యా! ఫోన్!

శ్రీ: ఆఁ (ఆఫీసుగదిలోకి వెళ్తూ) నారయ్యా యిలారా!

నార: (శ్రీపతివెంట ఆఫీసులోకి వెళ్ళాడు)

పంక: ఛీ! పాడుముండావాడు వచ్చినవాడు ఊరుకోక ఏదో తెచ్చిపెట్టాడు.

జగ్గ: బహుశా అతనిచ్చినవి దొంగనోట్లేమో!

భద్ర: ఆ మాటకొస్తే దొంగనోట్లు మనకు తెలియవూ?

జగ్గ: అది కనిపెట్టడం అంత తేలిక కాదులెండి. మనబోటి వాళ్ళకు ఆ రేవా తెలియదు.

సాంబ: అయినా దొంగనోట్లిచ్చి వాడేం బావుకుంటాడని?

పంక: ఏడ్చినట్లుంది మీ తెలివి. వెయ్యిరూపాయలు పోతే మట్టికొట్టుకుని.

భద్ర: ఆ మాటకొస్తే శ్రీపతిగారు ఆ మాత్రానికే అంత కలవరపడతారా?

చల: (కమలేదో ఆలోచనలో ఉంది. మెల్లగా ఆమెపక్కనచేరి) ఏమిటి కమలా? ఏమిటిదంతా?

కమ: ఏమిటో! నాన్నగారు నిన్నటినుంచి ఒకలాగున్నారు.

చల: ఎప్పుడూ ఇలా ఉండేవారు కాదే?

సాంబ: మాకు తెలియదూ? ఎప్పుడూ మందహాసం వారూ!

శ్రీపతి ఆఫీసు గదిలోంచి మెల్లగా బయటకు వస్తున్నాడు. మనిషి పూర్తిగా మారిపోయాడు. ముఖం నల్ల బడిపోయింది. అంత భారీమనిషి ఏదో మోయరాని బరువుకింద కుంగిపోతున్నట్లుంటాడు. అందరూ అతని వాలకం చూసి తెల్ల బోయారు. బల్లదగ్గరకొచ్చాడు. ఏదో కంపం కనిపిస్తోంది. నిలబడలేకుండా ఉన్నాడు. అడుగుల్లో తడబాటు. కుర్చీని ఊతచేసుకుని నిలబడ్డాడు

కమ: నాన్నా! ఏం నాన్నా! ఏమిటలా ఉన్నారు?

శ్రీ: ఏమీలేదమ్మా! (పొంగివస్తున్న దుఃఖాన్ని దిగమింగుకున్నాడు) ఏమీలేదు తల్లీ. నా పాపం పండింది.

కమ. నాన్నా!

శ్రీ: ఔనమ్మా! నా పాపం పండింది. అమ్మా! కమలా! (ఇక నిలవలేక మేడ మెట్ల మీదికి వెళ్తున్నాడు)

కమ: నాన్నా! (ఏమీ పాలుపోక ఇటూ అటూ చూసి శ్రీపతి వెంట వెళ్ళింది. అందరూ రాతిబొమ్మల్లా నిలబడిపోయారు. ఎవరికీ నోటమాట రాలేదు. ఒక్కక్షణం తరువాత పంకజమ్మ తెప్పరిల్లి....)

పంక: ఏమిటో బాబూ! ఇదంతా ఏదో విచిత్రంగా ఉంది!

భద్ర: ఆమాటకొస్తే అయోమయంగా ఉంది.

సాం: ఇంతకూ ఏమిటై ఉంటుందంటారు?

జగ్గ: ఏమో! శ్రీపతిగారికి అంత కొంప మునిగే ఆపద ఏమొస్తుందబ్బా! ఏమీ ఊహించుకోలేకుండా ఉన్నాను.

చల: 'నా పాపం పండిందన్నారు' ఏమిటో నాన్నా?

జగ్గ: నారయ్యా!

నార: అయ్యా!

జగ్గ: నీకేమైనా తెలుసా?

నార: ఏమిటయ్యా!

జగ్గ: అదే అయ్యగారు ఎందుకలా ఉన్నారని?

నార: నాకూ ఏం పాలుపోలేదయ్యా! ఆయనెప్పుడూ ఇట్లా మాట్లాడలేదు. పెద్ద పెద్ద కష్టాలొచ్చినప్పుడు కూడా నవ్వుతూ "కష్టాలెంతకాలం ఉంటాయిలే

నారయ్యా'' అనేవారు. నేనూ ఇలాగే ఎప్పుడూ చూస్తున్నా. ఆయన కంట తడిబెట్టడం ఎరగం! ఏమైందో ఏమో! నిన్నటినుంచీ మనిషేదోలా మారి పోయారు.

పంక: నారయ్యా! నువ్వు లోపలి కెళ్లావుకదా ఏం జరిగింది?

నార: ఏముందమ్మా! ఫోనులో ఎవరో పిలిచారు. మాటాడారు.

సాం: అదే నువ్వక్కడ ఉన్నావుకదా. నీకేం వినపడలే?

భద్ర: ఆ మాటకొస్తే అతడు వింటాడనా?

చల: నిన్ను లోపలకు పిల్చారు ఎందుకు నారయ్యా?

నార: పిల్చారేగాని ఏమీ చెప్పలేదయ్యా! ఫోనులో మాటాడిం తర్వాత చెవులు మూసు కున్నారో ఏమో! మాట్లాడుతూండగానే మనిషి ముఖం మారిపోయింది. ముచ్చెమటలు పోసినయ్. ఒకటే కంగారు. లేవలేకపోయి నారయ్యా! నారయ్యా! అన్నారంతే. ఇంకేం పలకలే. బయటికొచ్చారు.

చల: నీకేం వినపడలేదంటావ్?

నార: ఒక్కమాటమాత్రం విన్నానయ్యా!



జగ్గ: ఆఁ ఏమిటది?

నార: ఏదో పోలీసు, అరెస్టు అని యినపడ్డదయ్యా!

పంక: ఆఁ! పోలీసే!! (అందరూ ఒక్కసారిగా ''పోలీస్'' అన్నారు. ఒకరి ముఖాలు ఒకరు చూసుకున్నారు. కమల మేడమీదినుంచి దిగొస్తుంది)

నార: చిన్నమ్మగారొస్తున్నారు. (అందరూ అటు తిరిగారు. కమల చాలా కంగారుగా ఉంది. మనిషి జారిపోయింది)

పంక: ఏమమ్మా కమలా! ఏమన్నా చెప్పావా?

సాం: ఏమీ ప్రమాదం లేదుకదా?

చల: ఇంతకూ ఏం జరిగింది కమలా?

భద్ర: ఆమాటకొస్తే నువ్వు ముందుకూర్చోవమ్మా! చూదాం.

జగ్గ: నాన్నగారు ఎక్కడున్నారు? ఏంచేస్తున్నారమ్మా?

కమ: గదిలో ఉన్నారు.

చల: నీతో ఏమీ చెప్పలేదా?

కమ: ఏమీ చెప్పలేదు. నన్ను వెళ్ళమన్నారు. అంతా తరువాత చెప్తానన్నారు.

జగ్గ: ఏమైవుంటుంది చెప్మా!!

పంక: ఏమిటో తెలిస్తే మనం ఏమైనా చెయ్యటానికి ప్రయత్నించొచ్చు. కనీసం ఏంచెయ్యాలో ఆలోచించొచ్చు.

భద్ర: ఆమాటకొస్తే ఆలోచించేదాకానా? అదేదో తెలిస్తే ఇందాకా ఊరుకుంటానా?

కపు: నాకేమో భయంగా వుంది. నాన్నగారిని చూస్తే పిచ్చిపట్టినవారిలా ఉన్నారు. పక్కమీద ఊర్కే దొర్లుతున్నారు. (యేడుస్తూంది)

నార: అమ్మా! అమ్మా! ఏడపకమ్మా! ఏడవకండి.

పంక: ఛీ పిచ్చిపిల్లా ఏమిటా భయం! మేమింతమంది ఉండగా భయ మెందుకు? ఊర్కోమ్మా! ఊర్కో!

జగ్గ: అమ్మా కమలా! నీకు తెలిసి నాన్నగారికేమైనా బాధలున్నాయా?

కమ: బాధలున్నట్టుగా యింతవరకు ఎప్పుడూ కనుపించనుకూడాలేదు.

జగ్గ: పోనీ విరోధులెవరైనా ఉన్నారా?

సాం: అబ్బే! శ్రీపతిగారికి విరోధులేమిటండీ? ఆయన అజాతశత్రువైనేను.

చల: కమలా! కాసేపు తాపీగా ఆలోచించు. ఏమిటై ఉంటుందో.

కమ: ఏమో! నాకేమీ అర్థంకాలేదు. నన్ను దగ్గరకూడా వుండొద్దని పంపించేశారు. తలుపులు వేసుకుని ఒంటరిగా గదిలో వున్నారు. ఏమైపోతారో! (ఏడుస్తుంది)

నార: అమ్మా! ఊర్కోమ్మా! నే వెళ్ళి చూసొస్తా! ఊర్కోమ్మా! (మేడమీదికి వెళ్ళటానికి బయల్దేరాడు. శ్రీపతి మేడమీదనుంచి దిగివస్తున్నాడు) అమ్మా! నాన్నగారు (అందరూ అటుతిరిగి చూశారు.)

కమ: నాన్నా! (లేచి శ్రీపతివైపు వెళ్ళింది. శ్రీపతి వచ్చాడు. తలంతా చిందర వందరగా వుంది. కళ్ళు ఎర్రబడి వున్నాయి. పదిలంకణాలు చేసిన మనిషి లాగు అగుపిస్తాడు. అందరూ నిశ్శబ్దంగా ఆదుర్దాగా చూస్తున్నారు.)

శ్రీ: (నిలబడి అందర్నీ ఒక్కసారి చూశాడు) మీతో చెప్పాలనుకునే వచ్చాను. ఇప్పుడు నేను మీకు చెప్పకపోయినా మీ కెలాగూ తెలుస్తుంది. ఇంకో గంటలో నన్ను అరెస్టుచేసి తీసుకెళ్తారు.

కమ: నాన్నా!

అందరు: అరెస్టా?

శ్రీ: అవును. కంగారు పడకండి అది తప్పదు, చేసిన పాపం అనుభవించాలి. యింక లోకం ఏమనుకుంటుందన్న దాంతో నాకు ప్రమేయంలేదు. అయిపోయింది. లోకానికి దూరమైపోతున్నాను. లోకం ఏమనుకున్నా నాకింక వినపడదు.

కమ: నాన్నా! ఏమిటి నాన్నా యిదంతా? నువ్వేం చేశావ్?

శ్రీ: చేశానమ్మా! లోకాన్ని మోసం చేశాను.

జగ్గ: శ్రీపతిగారూ! మాకేమీ అర్థంకాక అల్లాడిపోతున్నాం. అంతా అయోమయంగా వుంది. ఏమిటో చెప్పండి?

పంక: లోకంలో ఎవ్వరూ చెయ్యని మోసం నువ్వేం చేశావ్ నాయనా! చెప్పు.

సాంబ: మేమందరం ఉన్నాం. ఏమైనా చేయగలిగితే చేస్తాం. చెప్పండి.

చంద్ర: ఆ మాటకొస్తే మీ కష్టసుఖాల్లో భాగం పంచుకోలేని బంధువులం మేముండటం దేనికి?

శ్రీ: చెప్తాను. మీతోకాక యెంకెవరితో చెప్పుకుంటాను. నేను చెప్పకపోయినా రేపు లోకం చెప్తుంది. నేను దొంగనోట్లు అచ్చువేశాను.

అంద: ఆఁ.

శ్రీ: అవును. దొంగనోట్లు అచ్చువేసి ప్రభుత్వాన్ని ప్రజలను మోసంచేశాను. ఇన్నాళ్ళు చేస్తున్నాను. ఇంకా చేద్దామనుకున్నాను. కాని ఈనాడు పట్టుబడ్డాను. పోలీసు డిపార్టుమెంటులో నా స్నేహితుడొకడు ఇప్పుడే టెలిఫోన్ చేసి చెప్పాడు. నామీద అరెస్టు వారెంటు తయారవుతోంది. ఇంతకు పూర్వం ఇక్కడకు వచ్చి వెళ్ళినతను పోలీసు సి. ఐ. డి.

అందరూ: పోలీసే!

పంక: వాడే! వాడిమొహం మండ. వాడు నాశనంకానూ! నంగనాచిలా వచ్చి ఎంత పని చేశాడమ్మా!

శ్రీ: ఇప్పుడు మీవద్ద ఉన్న నోట్లన్నీ దొంగనోట్లే. నాతోపాటు మీరూ పట్టుబడి బాధపడ్డం దేనికి? ఆ నోట్లన్నీ తగలేయండి. లేదా అవతల పారేయండి.
(అందరూ వాళ్ళ దగ్గరున్న నోట్లు బల్లమీద పారేశారు)

కమ: నాన్నా! ఎందుకు చేశావ్ నాన్నా ఈ పని?

శ్రీ: చెప్తానమ్మా! అంతా చెప్తాను.

జగ: శ్రీపతిగారు! దీన్ని తప్పించుకోవానికి ఏమీ మార్గంలేదా? ఉంటే చెప్పండి. ప్రయత్నిస్తాం.

శ్రీ: లేదు జగ్గయ్యగారూ! ఒకవేళ ఉన్నా లాభంలేదు.

సాం: లాభం లేకేం బావా! చెప్పు.

పంక: చెప్పు నాయనా! చెప్పు. యిట్లా చేతులు వెలాతవేసుకుంటే ఎట్లా?

కమ: నాన్నా చెప్పండి నాన్నా!

శ్రీ: ఒక్కటే మార్గముందమ్మా! (ఏమిటా అని అందరూ ఆదుర్దాగా చూస్తారు) నోట్లచ్చువేసే విషను. దానికి సంబంధించిన సామాన్లు ఉన్నాయి. వాటిని ఎవరైనా తీసుకువెళ్ళి ఒకరోజు దాపగలిగితే ఒక విధంగా ఈ ఆపద తప్పు తుంది. అదీ ఈ అరగంటలో జరగాలి. (అందరూ ఆలోచనలో పడ్డారు. ఒకరి మొగాలు ఒకరు చూసుకున్నారు. ఒక్క క్షణం నిశ్శబ్దం) అయినా ఎందుకు లేమ్మా! ఎవరిగ్గాని ఎందుకు నావల్ల కష్టం. నన్నెవ్వరూ కాపాడక్కర్లేదు. ఇంత మోసంచేసి ఇన్నాళ్ళూ తప్పించుకు తిరిగాను. ఇంకా తప్పించుకోవా లనుకోవడం దురాశ. నేను జైలుకు వెళ్ళడానికి సిద్ధంగా ఉన్నాను. ఏం ఫర్వాలేదు. మీ రెవ్వరూ బాధపడకండి. (మేడమెట్లవైపు వెళ్తున్నాడు. నారయ్య —— అందరూ నిశ్శబ్దంగా ఉండటం చూసి.)

నార: అయ్యా! అయ్యా! అయ్యా!

శ్రీ: ఏం నారయ్యా!

నార: (శ్రీపతిని సమీపించి) నేను తీసుకెళ్ళి దాస్తాను.

శ్రీ: ఆ....నువ్వెక్కడికి తీసుకెళ్తావు నారయ్యా?

నార: నా గుడిసెలో దాచుకుంటాను. అక్కడికొచ్చి ఎవరు చూస్తారయ్యా!

శ్రీ: పిచ్చివాడా! నువ్వు నా నౌకరివని అందరికీ తెలుసు. నా యింట్లో నేపున్న ఆ గుడిసెలో వెతక్కుండా వదిలేస్తారా నారయ్యా?

నార: పోనీయ్యా! తీసుకుని ఎక్కడికైనా పారిపోతాను. ఇయ్యండయ్యా.

శ్రీ: లాభంలేదు నారయ్యా! పోలీసులు చూచారంటే తప్పకుండా అనుమానిస్తారు. అనుమానించారంటే నిన్ను కాల్చేసినా కాల్చేస్తారు.

నార: పోనీయ్యా! చస్తే చస్తాను. ఇన్నాళ్ళూ మీ ఉప్పు తిని ఈ వొళ్ళు పెంచాను. మీకు పనికిరాని పేణాలు ఉండి ఏంచేసుకోనయ్యా! చెప్పండయ్యా?

శ్రీ: ఒద్దు నారయ్యా. ఇప్పటికే నేను చాలా పాపాలు చేశాను. ఎందరో పేదల ప్రాణాలు తీశాను. ఇంకా ఇదికూడానా? వద్దులే.

నార: అయ్యా! అయ్యా! సరే ననండయ్యా! నేను బతికుంటే ప్రయోజనమేముంది. మీరు చల్లగుంటే నాలాటి పేదోళ్ళను పదిమందిని కాపాడతారు. నాకేం పిల్లా పీసుకా? మీకోసం కాకున్నా మా కోసం కమలమ్మ కోసం ఒప్పు కోండయ్యా! కమలమ్మను బిడ్డలా ఎత్తుకు పెంచాను. ఆ తల్లి కంట తడి పెడతావుంటే నా కడుపు తరుక్కుపోతా వుంది. నాన్న లేని బిడ్డలాగా

నే నామెను సూడలేనయ్యా! ఒప్పుకోండి? ఆ మిషనేదో నాచేత కట్టేయండి. నే నెట్టాగో పోతా. (కాళ్ళా వేళ్ళాపడి ప్రాధేయపడ్డాడు. తల్లడిల్లాడు)

శ్రీ: (నారయ్యను భుజం పట్టుకులేపి వీపుమీద రాస్తూ) నీ అభిమానం నా కర్థమైంది నారయ్యా! కానీ ఏం చేస్తాం? నా మాట విను! నువ్వు నన్నెటూ కాపాడలేవు. నువ్వు లేకపోతే కమలేమైపోతుంది. కమల్నెవరు చూసుకుంటారు. నువ్వున్నావన్న ధైర్యంతోనే నే నిప్పుడు జైలుకి వెడతాను. అది లేకుండా చేస్తావా నారయ్యా?

నారా: అయ్యా! (భోరుమని ఏడుస్తున్నాడు)

కమ: నాన్నా! (గొల్లుమన్నది)

శ్రీ: (కమలను ఓదారుస్తూ) పిచ్చిదానా! ఏడుస్తావా! సుఖాల్లో సంతోషించామే! కష్టాల్లో ఏడుస్తామా?

కమ: నాన్నా (ఏడుస్తూ నిలబడిపోయింది. శ్రీపతి మేడమెట్లు ఎక్కివెడుతున్నాడు. నారయ్య కంటతడి పెట్టుకుని అలానే చూస్తున్నాడు శ్రీపతివైపు)

శ్రీ: నారయ్యా! ఇలారా!

నారయ్య పరుగున వెళ్ళాడు. జగ్గయ్య, చలపతి బైటకు వెళ్ళారు....

పంక: (కమలను సమీపించి) ఏడవకమ్మా! ఏడవకు. ఏడ్చి ఏం చేస్తాం.

కమ: (సర్రుమని తిరిగి) ఏమీ చెయ్యలేమా! నాన్న జైలుకు పోవల్సిందేనా. అంతేనా? అత్తయ్యా! ఈ ఒక్క సహాయం చేయలేరా? ఒక్కరోజు ఆ మిషను మీ దగ్గరుంచుకోండత్తయ్యా! ఇదంతా తప్పిపోతుంది.

పంక: చెయ్యగలిగితే చేయలేమమ్మా! ఈ ఊరా? ఇక్కడేమన్నా ఇల్లా? ఎక్కడ తీసుకెళ్ళి పెట్టుకుంటాం?

కమ: మీ ఊరికే తీసుకెళ్ళండి.

పంక: ఊరికా? ఇంత మిషను ఎట్లా మోసుకుపోతామమ్మా?

కమ: కారుందత్తయ్యా. కార్లో తీసుకెళ్ళండి.

పంక: అయ్యో తల్లీ! ఆ పాడు కొంపకు కారు పోగలిగితే యింకేమి. వెధవ కుగ్రామం అదీని. కార్లోంచి రెండెడ్ల బండిమీది కెక్కించి, అంతా చేసే టప్పటికి ఏ పోలీసు వెధవో చూశాడంటే పని చెరుపు కావడం తప్ప యింకేముందమ్మా! ఏమండీ మీరేమంటారు? (గిల్లుతుంది)

సాం: ఔనౌను. అంతే కదూ.. (వీళ్ళిలా మాట్లాడుతూండగా భద్రయ్య జారుకున్నాడు)

కమ: అంతేనా? నాన్న జైలుకు పోవలసిందేనా? (అని అక్కడున్న సోఫాలో పడి ఏడుస్తూంది. పంకజమ్మ సాంబశివాన్ని గిల్లి రమ్మని సైగచేసింది. ఇద్దరూ మెల్లగా లోపలికి వెళ్ళిపోయారు. వాకిలివైపునుంచి చలపతి వచ్చాడు. మెల్లిగా ఆమెను సమీపించి)

చల: కమలా!

కమ: (తలెత్తకుండానే) వెళ్ళండి. అందరూ వెళ్ళండి ఎవ్వరూ నాన్నను కాపాడరు. నాన్న జైలుకి వెళ్ళవలసిందే. సమయానికి ఎవ్వరూ ఆదుకోరు. నా కింక నాన్న లేడు.

చల: కమలా!

కమ: (తలెత్తి చూసి) నువ్వా చలపతీ! చెప్పు నువ్వయినా కాపాడతావా నాన్నని. ఒకరోజు మిషన్ను ఎక్కడికయినా తీసుకెడతావా? చెప్పు చలపతీ! టైమై పోయింది చెప్పు. పోలీసువాళ్ళు వచ్చేస్తారు. నాన్నను పట్టుకెళ్తారు. నేను దిక్కులేని దాన్నయిపోతాను. చెప్పు చలపతీ! చెప్పు!

చల: నేను తీసుకువెళతాను కమలా!

కమ: తీసుకెళతావా! చలపతీ, (మేడమీదికి పరుగెత్తబోయింది)

చల: కమలా! కమలా! (ఆగింది) ఇలారా! ఒక్కమాట.

కమ: ఏం? (దగ్గరకొచ్చి)

చల: నేను తీసుకు వెళతానుకానీ...

కమ: కానీ...

చల: నాన్న ఒప్పుకోవటంలేదు కమలా!

కమ: ఆఁ నాన్న ఒప్పుకోవటంలేదా? (ఒక్కసారిగా మనిషి వణికిపోయింది. కళ్ళు ఎర్రబడ్డాయి. వెర్రి ఆవేశంలో అరిచింది) వెళ్ళండి. అందరూ వెళ్ళండి. మీ అందరూ దగుల్బాజీలు, దొంగలు. మీరు మనుష్యులుకారు. మీకు మనుష్యులక్కర్లేదు. మీకు కావల్సింది డబ్బు. వెళ్ళండి (సోఫామీద కూలింది) నేను మోసపోయాను. నేను భ్రమపడ్డాను. మీరు చూపే ప్రేమనంతా నిజమనుకున్నాను. మీకు హృదయముందనుకున్నాను. నాన్నగారు చెప్పింది నిజమైంది. (తోక తొక్కిన తాచులా లేచింది) వెళ్ళు. ఇంకా

ఎందుకు ఇక్కడ నిలబడ్డావ్? ఇంకా నీ బూటకపు మాటల్తో నన్ను మోసం చేయాలనుకుంటున్నావా! వెళ్ళు (అని వెర్రిగా కేకవేసింది)

చల: కమలా!

కమ: వెళ్తావా లేదా!

చలపతి ఇంకేం మాట్లాడకుండా తల వంచుకుని వెళ్ళిపోయాడు. కమల పొంగి వచ్చే దుఃఖాన్ని చేతుల్తో ఆపుకుని ఆఫీసుగదిలోకి వెళ్ళిపోయింది. భద్రయ్య ఒక చిన్న ట్రంకు, మూట చేతిలో పట్టుకుని మెల్లిగా లోపలనుంచి వచ్చాడు దొంగలా. హాల్లో ఇటు అటూ చూచాడు. బల్లమీద శ్రీపతికి చదివించిన వస్తువులింకా అలాగే వున్నాయి. తను చదివించిన పళ్ళెం తీసి చంకలో పెట్టుకున్నాడు. పిల్లిలా అడుగులు వేసుకుంటూ జారుకున్నాడు బైటికి. ఒక్కక్షణం తర్వాత పంకజమ్మ ఒక పెద్ద మూట చంకన, ఇంకో చంకన పిల్లాణ్ణి వేసుకుని గబగబా వచ్చి వెనక్కు తిరిగి.........

పంక: రండీ! తొందరగా రండి? (ఎవరైనా ఉన్నారేమోనని ఇటు చూచింది)

పిల్ల: అమ్మా!

పంక: (వాడిని నోరుమూసి) శ్! అరవకు! అబ్బబ్బ! రండి తొందరగా!

సాం: వస్తున్నానే (అంటూ మోయలేని బరువు మోస్తున్నాడు. ఒక పెద్ద ట్రంకు, రెండు మూడు మూటలు. ఒక మూటలోనుంచి కాయకూరలు పైకి కనిపిస్తున్నాయి)

పంక: 'వస్తున్నా' అని కూచుంటే ఆ పోలీసులు కాస్తా వచ్చేస్తారు....పదండి...

సాంబ: ఎవ్వరితో చెప్పనక్కర్లా.

పంక: ఏడ్చినట్లుంది మీ తెలివి. పదండి! (సాంబశివం ముందు వెనకాల పంకజమ్మ వెళ్తున్నారు. వెళ్తూన్న పంకజమ్మ కంటికి బల్లమీద ఉన్న ధోవతులు చీర కనుపించాయి. ఆగి) ఏమండోయ్....(ఆగాడు) ఇవి ఇక్కడే మరచి పోయాం.

సాంబ: పోనీలేవే. అవి ఆయన డబ్బుపెట్టి కొన్నవేగా!

పంక: ఇప్పుడు తీసుకెళ్తూన్నవన్నీ మీ డబ్బుపోసి కొన్నారా ఏం?

సాంబ: అదికాదు. వాళ్ళకోసం కొన్నాంకదా అవి.

పంక: ఏం ఫర్వాలేదు తీసివుంచండి. (వాటిని తీసి సాంబయ్య మీద ఉన్న మూటలో దోపింది.)

పిల్ల: అమ్మా పండే!

పంక: (బల్లమీద ఉన్న పండుతీసి ఇచ్చింది) తిను నాయనా! ఇంకెప్పటికో తిండి (బయల్దేరింది)

పిల్ల: అమ్మా! ఊరికా?

పంక: అవునురా బాబూ!

పిల్ల: నేను రాను - ఊం నా కిక్కడే బాగుంది. నేను రాను. (దిగడానికి ప్రయత్నిస్తాడు)

పంక: (వాణ్ణి బాది నోరు మూసి) నోరు మూసుకుని రా. మధ్య సువ్వొక తద్దినం మాకు. (పిల్లవాడు ఏడుస్తూనే ఉన్నాడు. వాళ్ళు వెళ్ళారు.)

ఒక్కక్షణం తర్వాత బయటనుంచి చలపతి విసురుగా లోపలికి వచ్చాడు. అతని వెనకాలే జగ్గయ్య అతనికన్నా విసురుగా వచ్చాడు.

జగ్గ: చలపతీ! (చలపతిని ఆపాడు)

చల: నాన్నా! ఇది చాలా అన్యాయం నాన్నా!

జగ్గ: ఏమిటిరా అన్యాయం నోరుమూసుకుని ఇంటికి పద.

చల: నాన్నా అందరూ శ్రీపతిగారిని ఆకాశాని కెత్తేశారే. ఇంద్రుడు, చంద్రుడు అన్నారే, ఎక్కడలేని అభిమానం వెళ్ళగక్కారే. కష్టం వచ్చినప్పు డిలా వదిలేస్తారా?

జగ్గ: సరేలేవోయ్. ఆయన కష్టాలు తీర్చబోయి మనం లేనికష్టాలు తెచ్చుకుంటామా?

చల: ఇప్పుడు మనకిందులో వచ్చే నష్టం ఏముంది నాన్నా?

జగ్గ: నీకేం తెలుసురా! ''పిల్లకాకికి ఏం తెలుసు వుండేలుదెబ్బ'' అన్నారు. వెధవ వేషాలు మాని పదపద.

చల: నాన్నా! మీరెవ్వరూ ఏం చెయ్యనక్కర్లేదు. నేను తీసుకుంటూన్న ఆ బాధ్యత, ఆ బాధలేవో నేను పడతాను. మీరు వెళ్ళండి.

జగ్గ: నువ్వు పడే బాధలు నీతోపోతే ఫర్వాలేదు. నీ కింకా చిన్నవాళ్ళు చెళ్ళెళ్ళు. తమ్ములున్నారు. వాళ్ళ బాధ్యత కూడా నీ మీదుంది. ఆలోచించు. అసలిదంతా ఎందుకు? దారినిపోయేదాన్ని ఇంటికి తెచ్చుకుంటానంటావేమిరా?

చల: నాన్నా! ఇన్నాళ్ళూ కమలను ప్రేమిస్తున్నానని కబుర్లు చెప్పాను. ఈనాడు కమల ఇంత కష్టంలో ఉంటే విడిచి వెళ్ళమంటారా?

జగ్గ: చాల్లే, ప్రేమట ప్రేమ. కన్నతండ్రిమీద, తోబుట్టువులమీద లేని ప్రేమ కమల మీద మాత్రం పొడుచుకొచ్చిందేమో; నా మాటవిని పద.

చల: నేను రాను.

జగ్గ: రావూ! (చలపతిని మెడబట్టుకు గెంటుకుపోయాడు. చలపతి ఎదురుగుణాడు లాభంలేకపోయింది )

చల: నాన్నా!

జగ్గ: నోరు మూసుకుని నడు.

చల: నాన్నా:

జగ్గ: మాట్లాడావా చెంపలు వాయిస్తా. ఏమనుకున్నావ్ నాటకాల్లో నాన్న ననుకున్నా వేమో! ఆ మాటలన్నీ మనదగ్గర కావు. రాడట. ప్రేమట ప్రేమ. పదవోయ్! (అలాగే గెంటుకు వెళ్ళాడు)

పంక: (ఒక్క క్షణం తరువాత బయట) అయ్యో నాయనా! మేమేమీ ఎరగం మా దారిన మమ్మల్ని పోనీండి నాయనా!

పిల్ల: పోనీసే!

సాంబ: చూడండి ఇనస్పెక్టరుగారూ!

ఇన: ఊం చూసేదీ గీసేదీ పనిలేదు. పదండి. లోపలికి పదండి.

భద్ర: ఆ మాటకొస్తే పదండి, ఏం చేస్తాం.

పంకజమ్మ, సాంబశివం, భద్రయ్య, పిల్లవాడు మూటా ముల్లెతోసహా లోపలి కొచ్చారు. వాళ్ళ వెనకాలే పోలీస్ ఆఫీసర్ వచ్చాడు. ఎవ్వరూ మూటలు వింప కుండా చేతుల్లో పట్టుకున్నారు .......

పంక: అయ్యో! అయ్యో: బుద్ధిలేకుండా వచ్చా మమ్మా వీడింటికి. ఇట్లా పోలీసాళ్ళకు పట్టిస్తాడనుకుంటే చచ్చినా వచ్చేవాళ్ళం కాదు. అయినా ఇదే మన్యాయం! వాడు దొంగనోట్లు వేసుకుంటే మేమేం చేశామని? పోలీసువాళ్ళ బుద్ధి మండిపోను.

ఇనస్పెక్టర్: ఏయ్ షటప్!

పంక: అంటే ఏమిటి నాయనా! ఇంకేం చెయ్యమంటావ్?

సాం: షటప్పే? షటప్పు!

భద్ర: ఆ మాటకొస్తే ఏమండీ, మే మెవ్వరికీ అప్పులేం.

ఇన: ఏయ్! అదికాదు, నోరు మూసుకోండి.

పంక: ఆం నోరు మూసుకోవాలా? ఎందుకు మూసుకోవాలని! మేమేం చేశామని? ఏదో చుట్టపుచూపుగా చూసిపోదామనొస్తే ఇదేం ఖర్మ మొచ్చిందిరా తండ్రీ!

ఇన: ఏయ్! పూరుకుంటారా లేదా? మర్యాదగా మూటలన్నీ క్రింద పెట్టండి.

పంక: పెడతాంగానీ నాయనా... !

ఇన: పెట్టు ముందు.

పంక: (మూటలన్నీ కింద దింపేసి) నాయనా! నడిచిపోయేవాళ్ళం గనుక అడ్డుపడి అదమాయిస్తున్నావుగానీ, కార్లో తుర్రుమని పోయారే. జగ్గయ్య. ఆయన కొడుకు చలపతినీ - వాళ్ళనేం చేయగలిగావని? ఇదేనా న్యాయం? మొత్తటి వాళ్ళయితే మొత్తబుద్ధేస్తుందన్నారు.

ఇన: పూర్కే వాగకండి. అడిగిందానికి జవాబు చెప్పండి. శ్రీపతిగారికీ మీకూ ఏం సంబంధం?

పంక: అయ్యో నాయనా! వాడితో సంబంధం కూడానా? మా పిల్లవాడికి కడుపులో బిల్ల వచ్చిందంటే డాక్టరుకి చూపించుదామని పట్నం వచ్చాం. "మన వూరి వాడని శ్రీపతి, వాడింట్లో దిగుదాము"ని ఈయనే ఉబలాటపడ్డాడు. చెప్తే విన్నారా? వద్దో అని అప్పుడే నెత్తిన బాదుకున్నా నేను? లంకంత సత్రం రామసామి సత్రం ఉంది. అక్కడ దిగితే ఈ అగచాట్లేమీ లేకపోయేవా? అనుభవించండి. ఇప్పుడంతా అనుభవించండి. నాకే?

ఇన: అయితే మీకూ శ్రీపతిగార్కి ఏమీ సంబంధం లేదంటారా?

భద్రయ్య: ఆ మాటకొస్తే నా కసలు సంబంధం లేదండి. వాళ్ళది పూరైనా ఒకటే. నా కదీలేదు.

ఇన: శ్రీపతిగార్ని గురించి మీకేమైనా తెలుసా?

పంక: (రహస్యంగా) తెలియకేం నాయనా బోలెడంత తెలుసు.

ఇన: మీకు తెలిసిందేమిటో చెప్పండి.

పంక: ఒక్కటా, రెండా, నాయనా చెప్పటానికి, చిన్నప్పుడు వాడుట్టి అల్లరి వెధవ. (గిల్లింది)

సాంబ: అసలు వాడు ఇంత చిన్నప్పుడే, అంటే ఏ ఐదారేళ్ళో వుంటుంది. నే నిద్ర పోతూంటే నా బొడ్డులోంచి రూపాయి దొంగిలించుకుపోయాడు.

పంక: ఒక దొంగతనమేనా! వాడి అబద్ధాలు మంచి. అసలు వాడేం చేశాడో తెలుసా నాయనా? ఈ కిమల తల్లి వుండే దాన్ని లేపకీసుకొచ్చాడు.

సాంబ: అయితే పెళ్ళి చేసుకున్నది కాదంటావా?

ఇన: అయ్యో! వాడి ముఖానికి పెళ్ళి పెటాకులు కూడానా?

భద్ర: ఆ మాటకొస్తే మా అమ్మాయిని, పదహారేళ్ళపిల్లను రెండవపెళ్ళి చేసుకోవా లని నన్ను ఇక్కడికి పిలిపించి బుట్టలో వేసుకోడానికి ఎంతో ప్రయత్నం చేశాడు. నేనేనా వప్పుకునేవాడిని, నాకు తెలియదూ?

పంక: అసలు వాణ్ణి మా కులంలోనుంచే వెలివేశారు. వాడితో సంబంధం ఎవరూ చేసు కోరు. వాడి కూతురు కమలకి మొగుడుకోసం వెతికి చస్తున్నాడు. (గిల్లింది)

సాంబ: అవు నవును. అందుకనే మా పెద్దబ్బాయి కెట్లాగైనా అంటగట్టాలని మమ్మ ల్నిక్కడికి పిలిపించాడు.

పంక: అవునుగానీ నాయనా? మీదేకులం?

ఇన: బ్రాహ్మలం.

పంక: అదే తెలుస్తూంది. ఆ ముఖవర్చస్సు అదీ! ఎంత ఇంగ్లీషు గుడ్డలేసుకున్నా బ్రాహ్మణ కళ వుట్టిపడుతోంది నాయనా? ఏం గోత్రమో!

ఇన: ఆత్రేయస గోత్రం.

పంక: అయితే ఇంకేం! మా వియ్యంకుల గోత్రమే. కూర్చో నాయనా కూర్చో.

ఇన: ఏయ్! కూర్చునేది గిర్చునేది ఏంలేదు.

పంక: చూడు నాయనా! నీకంటే పెద్దదాన్ని. ఏయ్ అని మాత్రం అనకు. నువ్వేం చెయ్యమన్నా చేస్తా.

ఇన: ముందు మూటలన్నీ విప్పండి. (ఎవ్వరూ విప్పకుండా అలాగే నిలబడి పోతారు) నిలబడతారేం? కానీయండి (ఎవరు మూటలు వాళ్ళు విప్పుతారు) ఇవన్నీ ఎక్కడ కొన్నారు?

భద్ర: ఆ మాటకొస్తే యింకెక్కడ కొంటాం, బజార్లోనే!

ఇన: వీట్లో ఏవీ తీసుకుపోవటానికి వీల్లేదు.

పంక: అయ్యో నాయనా! అంతంత సొమ్ముపోసి కొన్నాం. అంతా ఈ శ్రీపతి ముఖాన్ని తగలేసుకోవలసిందేనా?

ఇన: ఎవరి సొమ్ముపెట్టి కొన్నారు?

భద్ర: ఆ మాటకొస్తే ఎవరిసొమ్ము! మా సొమ్మే.

ఇన: మా కంతా తెలుసు. ఇది శ్రీపతిగారి పద్దులో కొన్నవి. ఇక్కణ్ణుంచి చీపురు పుల్ల కదలడానికి వీల్లేదు.

పంక: అయ్యో! అయ్యో! ఇదుగో నాయనా! ఈ చీర మా అత్తగారింటివాళ్ళు సత్య న్నారాయణ వ్రతాని కిచ్చారు. ఇదిమాత్రం తీసుకుపోనీ నాయనా! (అని కమల కిచ్చిన చీర చూపిస్తూంది)

పిల్ల: లేదమ్మా! అది యిక్కడ కొట్లో కొన్నదే. నువ్వు మర్చిపోయావు.

పంక: ఛీ! నోర్ముయ్!

భద్ర: ఆ మాటకొస్తే ఎలా చూడండి. మా అమ్మాయి భోజనానికి వెండిపళ్ళెం కావాలని ఒకటే పోరు పెట్టింది. మొన్ననే కొన్నా. మీ రనుగ్రహిస్తే మా అమ్మాయి ఆశ తీరుతుంది.

పంక: ఏమండీ, ఈ ధోవతులు మొన్న 'రాజు'గా రింట్లో పౌరోహిత్యాని కిచ్చినవి కదూ (గిల్లుతుంది)

సాం: ఔనౌను. లవే!

ఇన: ఏవైనా సరే! తీస్కెళ్ళటానికి వీల్లేదు!

పంక: (గోలగా) అయ్యో! అయ్యో! ఇదేం అన్యాయమమ్మా! ఇదేం అక్రమమమ్మా! ఒరేయ్ శ్రీపతీ! నువ్వయినా వచ్చి చెప్పరా! వాడి దగ్గర్నుంచి చిల్లిగవ్వైనా తీసుకుని ఎరగం. మా కెందుకొచ్చింది నాయనా! మా కున్నదేదో ఉంది. కష్టపడి సంపాయించుకున్నది కూడా దక్కని కాలం అయిపోయింది. ఒరేయ్ నారయ్యా! శ్రీపతీ! (అని కేకలు వేసింది. కమల ఆఫీసుగదిలోంచి వచ్చింది. పోలీసు ఆఫీసర్ని చూచి)

కమ: పోలీస్....నారయ్యా....(మేడమీదికి పరుగెత్తబోయింది. శ్రీపతి ఎదురుగా వస్తున్నాడు. చూసింది....నాన్నా — అంటూ కేకేసి పరుగెత్తిపోయి అతన్ని కౌగిలించుకుంది)

ఇన: నమస్కారం శ్రీపతిగారూ!

శ్రీ: నమస్కారం. నేను సిద్ధంగా ఉన్నాను.

కమ: నాన్నా! నాన్నా! (కమల శ్రీపతి దిగి వస్తున్నారు)

ఇన: ఊం మీరంతా బైటుండండి (సాంబశివంవాళ్ళు వాళ్ళ మూటలు తీసుకోబోతారు) ఏయ్! మూట్లిక్కడ పెట్టి కదలండి. (వాళ్ళనంతా తోలుకుని బైటకు వెళ్ళాడు)

కమ: నాన్నా! నాన్నా! చెప్పు నాన్నా! ఎందుకు చేశావీపని?

శ్రీ: అంతా నీ కోసమేనమ్మా!

కమ: (పిడుగుపాటు తిన్నదానిలా) ఆఁ....నాకోసమా? నా కోసం చేశావా? నాన్నా... ఏమిటి నాన్నా? నా కోసం ఎందుకుచేశారు నాన్నా?

శ్రీ: ఔనమ్మా! నీకోసమే. తల్లిదండ్రులు దాచిపెట్టేది పిల్లలకోసం కాకపోతే యింకెవ్వరికి? నువ్వు సుఖంగా గౌరవంగా బతకడానికి యింతా చేశానమ్మా! నేను పోయింతర్వాత నా కమల కష్టపడకూడదని చేశాను. మీ అమ్మ

పేదరాలు కావడంవల్ల ఆమెను సంఘం హీనంగా చూసింది. ఆమెను పెళ్ళి చేసుకోడానికి మా నాన్న ఒప్పుకోలేదు. పేదవాళ్ళకు ప్రేమేమిటని నన్ను పిచ్చివాణ్ణిచేసి నవ్వింది లోకం. చివరికి ఆమెను లేవదీసుకు వెళ్ళానన్న అపవాదుకి గురి కావాల్సొచ్చింది. నువ్వూ అలాంటి బాధలు పడటం నా కిష్టం లేదు. అందుకనే చేశానమ్మా!

కమ: నాన్నా! నేను కష్టపడకూడదని చేశారా? ఎందుకు నాన్నా ఈ ఐశ్వర్యం? అడుక్కుతిని బతికేవాళ్ళమే. ఎందుకు నాన్నా యిలా చేశారు. ఇప్పుడు నాన్న లేకుండా నన్నెలా బతకమంటారు?

శ్రీ: పిచ్చితల్లీ! నాన్నా, అమ్మా ఎవ్వరూ అవసరం లేదమ్మా! ఈ ప్రపంచంలో కావాల్సింది డబ్బు. డబ్బుంటే మనుష్యులొస్తారు, గౌరవిస్తారు. డబ్బు లేకపోవడం అంటే ఏమిటో నేను బాగా ఎరుగుదునమ్మా! పస్తులున్న ఆ రోజుల్లో ఈ సంఘపు పెద్దలూ పట్టెడన్నం పెట్టిన పాపాన పోలేదు తల్లీ! అనుభవించాను. అనుభవించి తెలుసుకున్నాను. అన్యాయమూ, అక్రమమూ చేసి డబ్బు సంపాయించాలని నిశ్చయించుకున్నాను. ఈ ప్రపంచంమీద పగ సాధించాలనుకున్నాను. నా పెళ్ళాం బిడ్డలు హాయిగా బతకాలని, ఆనాడు కాలదన్నిన వాళ్ళంతా మన కాళ్ళమీదొచ్చి పడాలని కసితో చేశాను. బయట పడకుండా బతికిపోయుంటే నేనూ మంచివాణ్ణే. మీరూ సుఖపడేవాళ్ళు. దైవం సహించలేకపోయాడు. బైటపడ్డాం తల్లీ! మంచో చెడో చేశాను. ఈనాడు నన్నందరూ మోసగాడని ఎత్తిపొడుస్తారు. కానీ నువ్వైనా మీ నాన్న యిదంతా తనకోసం చేసుకోలేదని, నీ సుఖంకోసం చేశాడని నమ్మితేచాలు.

కమ: నాన్నా! (అని ఏడుస్తుంది. ఇనస్పెక్టరు వచ్చాడు)

ఇన: శ్రీపతిగారూ, క్షమించాలి. టైమైంది. (అని బేడీలు వేయడానికి వస్తున్నాడు. శ్రీపతి చేతులు అందించాడు. కమల ఆ చేతులు పుచ్చుకొని)

కమ: నాన్నా! నన్నూ తీసుకెళ్ళు నాన్నా. నన్నూ తీసుకెళ్ళు. ఇనస్పెక్టరుగారూ! నాన్న లేకుండా నే నుండలేను? నాకు నాన్న కావాలి. మా నాన్న కావాలి. (ఏడుస్తుంది. చలపతి గబగబా పరుగెత్తుకొచ్చాడు లోపలికి)

చల: కమలా! కమలా! ఆ మిష నెక్కడుందో చెప్పు. నేను తీసుకువెళ్తాను. (ఇనస్పెక్టరు ఉండడం ఇప్పుడు గమనించాడు. తెల్లబోయి నిలబడ్డాడు.)

కమ: (తిరిగిచూచి) తీసుకువెళ్తావా? ఇంకేం తీసుకెళ్తావ్? నా ప్రాణాలున్నాయి తీసుకువెళ్ళు. మళ్ళా ఏ ముఖం పెట్టుకొచ్చావ్? ఇంక నువ్వెవర్నీ కాపాడ

నక్కర్లేదు. వెళ్ళు (అని చలపతివేపు నడుస్తుంది. శ్రీపతి. ఇనస్పెక్టరు విరగబడి నవ్వారు. కమలా, చలపతి నిర్ఘాంతపోయి చూచారు. వాళ్ళంతా నవ్వుతున్నారు. చలపతికి కమలకి ఏమీ అర్థంకాలేదు) నాన్నా ఏమిటిదంతా?

శ్రీ: నాటకమమ్మా!

కమ: నాటకమా? ఏమిటే నాటకం?

శ్రీ: ఎవ్వరూ రాయని నాటకమమ్మా! (కమలకు ఇంకా ఏమీ అర్థంకాలేదు. ఇనస్పెక్టరువైపు చూచింది ఈయనెవరూ అన్నట్టుగా)

ఇన: నేనమ్మా! నేనింతవరకూ మీకెవ్వరికీ పరిచయంలేదు. నాటకం రాసే అనుభవం వున్నకవి అయితే నన్నెప్పుడో ఇంట్రడ్యూస్ చేసుండేవాడు. కానీ ఈ నాటకం నేనూ మీ నాన్నగారు కలిసి రాసుకున్నాం. చెరువు గట్టుమీద రిహార్సెల్సు వేసుకున్నాం. అందుకని నా కర్మకాలి నన్ను పరిచయం చేసుకోవాల్సి వచ్చింది. నేను మీ నాన్నగారి స్నేహితుణ్ణి. గోపాలం అంటారు. ఇంతకూ ఎలాగుందంటావ్ నాటకం?

శ్రీ: ఏమమ్మా! ఫస్టుప్రైజు యివ్వాల్సినట్టే వుందికదూ?

గోపా: ఆఁ. అసలు ప్రైజులుకోసమా మనం నాటకం ఆడింది?

కమ: ఏమిటి నాన్నా! ఎందుకింత నాటకం ఆడేరు?

గోపా: బాగుందమ్మా! ఇంతనాటకంచూచి ఎందుకనేది అర్థం కాలేదంటే నాటకం ఫేల్యూర్ అన్నమాట.

కమ: అయితే దొంగనోట్లు అచ్చుచేసిందంతా అబద్ధమేనా!

పంక: (లోపలికివస్తూ) అబద్ధమని నేనప్పుడే అనుకున్నానమ్మా! ఇదంతా నాటకం అని నాకప్పుడే అనిపించింది. ఒరేయ్! శ్రీపతీ! ఉత్తినే ఎంత ఏడిపించావురా అందర్నీ!

గోపా: ఏయ్! ఎవరిది నాటకం? పదండి స్టేషనుకి.

భద్ర: ఆమాటకొస్తే ఏ స్టేషనుకి? రైలు స్టేషనుకా?

సాం: ఏస్టేషనుకి లేదుకానీ, బావగారూ పదండి. ఫోంచేద్దాం పదండి.

గోపా: కాస్త ఆగండి వస్తాను, నారయ్యా! ఆ కమ్చీ యిలా తీసుకో!

సాం: ఆఁ....

పంక: ఆఁ....

భద్ర: ఆఁ....

నార: (కమ్చీ యిచ్చాడు.)

గోపా: పదండి. మర్యాదగా పదండి. లేకుంటే వీపులు విమానం మోత మోగుతాయి.

పంక: మోగుతాయేం? అసలు నువ్వెవరూ ఈ యింట్లో. ఎవడో నాటకాల్లో వేషాలు వేసేవాడివి ఇక్కడికొచ్చి అదమాయిస్తున్నావ్?

గోపా: ఏయ్! షటప్ వాలికి బుద్ధిచెప్పండి. ఇంక పొలిమేరలో కనుపించారా చంపేస్తాను. (కమ్చీ తీసుకుని బాదడాని కొస్తాడు. పరుగెత్తబోతూ మూటలు తీసుకోడానికి ప్రయత్నిస్తారు. కమల శ్రీపతి నవ్వుతుంటారు. గోపాలం ఒకటి రెండు దెబ్బలు కొడతాడు. పంకజమ్మకి ఒక దెబ్బ తగుల్తుంది)

పంక: కొడతావుట్రా. నీ చేతులు పడిపోనూ? నువ్వు నాశనమైపోను. నవ్వుతున్నారా? నవ్వండి. నాశనమైపోతారు, నవ్వండి. (అందరూ వెళ్ళారు. చలపతి మాత్రం ఉన్నాడు.)

కమ: (చలపతిని చూపుచూ) ఆయన్ని మాత్రం వదిలేశారేం?

గోపా: ఆయన సంగతి నీకు వదిలేశాం.

శ్రీ: కమలా యిలారా! ఒక్కమాట. (చెవిలో ఏదో చెప్పాడు) రాండి యినస్పెక్టరు గారూ! మనంవెళదాం (అని శ్రీపతి గోపాలం ఆఫీసు రూంలోకి వెళతారు.)

నార: అమ్మా! కమలమ్మా!

కమ: ఏం నారయ్యా!

నార: చలపతి వాళ్ళ నాన్న లాంటాయనకాదు. ఏదో చూసి పోషించండి. (లోపలకు వెళ్ళాడు)

కమ: ఏం నిలబడ్డారు?

చలపతి మాట్లాడకుండా వెళ్ళి కూర్చుంటాడు.

కమ: అదేమిటి? మిమ్మల్ని పొమ్మని నేను చెప్పలేదు.

చల: వెళ్ళమన్నావని నాకు తెలుసు. కానీ ఎక్కడికి వెళ్ళడమా అని ఆలోచిస్తున్నా!

కమ: ఎక్కడికో ఎందుకు? మీ ఇంటికే వెళ్ళండి.

చల: మా ఇంట్లో నాకు చోటులేదు.

కమ: ఏం చాలా పెద్ద యిల్లే!

చల: చిత్తం. మానాన్నతో దెబ్బలాడాను. ఇక ఇంటికి వెళ్ళడానికి వీల్లేదు.

కమ: ఓ. అలాగయితే ఇక్కడే ఉండండి.

చల: ఉండొచ్చు. కానీ....

కమ: కానీ....

చల: ఇక్కడ ఒకటే కప్పలగోల.

కమ: అన్ని కప్పలూ పోయినాయి. ఇంక ఒక్క కప్పే గొప్పింది.

చల: నన్నూ కప్పే అంటావా విమలా?

కమ: ఊహుఁ... ఊర్కే తమాషాగా అంటే!

శ్రీ: (శ్రీపతి గోపాలం వచ్చారు) ఏమమ్మా విమలా! ఈ రెండు రోజులూ నీకు కప్పలగోల వినిపించిందా?

కమ: అసలు కప్పల గోల్లో అదెక్కడ వినిపించింది నాన్నా!

నార: భోజనానికి రండయ్యా!

కమ: ఎన్ని విస్తళ్ళు వేశావ్?

నార: నాకు తెలియదమ్మా! నాలుగేశాలే. (అందరూ లోపలకు వెళ్ళారు.)

తెర జారుతుంది.

---

# భయం




మనోవిశ్లేషణ ప్రధానంగా సాగిన భయం రచనాకాలం 1954. ఈ నాటక రచనలో శ్రీ సి. నాగభూషణం వ్రాయసకానిగా సహకరించినట్టు ఆత్రేయ పేర్కొన్నారు. బ్రతుకులో భయానికి అద్దం పట్టిన ఈ నాటకం అనేక నాటక కళాపరిషత్‌లలో బహుమతులు గెల్చుకొంది - గెల్చుకొంటోంది....!

## పాత్రలు

ప్రొప్రయిటర్
మేనేజర్
అకౌంటెంటు
క్యాషియర్
టైపిస్ట్ (పార్వతి)
ఓ. సి (శంకర్, కుర్రవాడు)
పి. యస్.
మేనేజర్ భార్య
పార్వతి తండ్రి
సర్కిల్ ఇనస్పెక్టర్
ముసలయ్య
పిల్లవాడు

'భయం' రాఘవకళాసమితి, రాజమహేంద్రవరం వారిద్వారా **15-10-55** న రాజమహేంద్రవరంలోను, **23-10-55** న హైదరాబాదులో నాటకకళా పరిషత్ నాటకపోటీలలోను, ప్రదర్శించబడి ప్రశంసల నందుకున్నది. ఆంచలి నటవర్గం:

| | | |
|---|---|---|
| ప్రొప్రయిటర్ | : | డాక్టర్. జి. రాజారావు |
| మేనేజర్ | : | అంకరాజు శంకరరావు |
| అకౌంటెంట్ | : | మేడూరి వీరవెంకన్న |
| కాషియర్ | : | వేములూరి నాగేంద్రాజీ |
| ఓ. సి. (శంకర్) | : | ఏలూరి సత్యన్నారాయణరావు |
| పి. యస్. | : | శ్రీపాద పట్టాభి రామారావు |
| ముసలయ్య | : | యాసంరెడ్డి వెంకట్రావు |
| పార్వతి తండ్రి | : | పి. యస్. భాస్కరరావు |
| సర్కిల్ ఇనస్పెక్టర్ | : | వి. యస్. రావు |
| కానిస్టేబిల్ | . | యాసంరెడ్డి సత్యన్నారాయణ |
| పిల్లవాడు: | : | మాష్టర్ పృధ్వీరాజ్ |
| టైపిస్టు (పార్వతి) | : | శ్రీమతి కే.వి. శాంతాదేవి |
| మేనేజర్ భార్య | : | కుమారి లక్ష్మి |

దర్శకత్వం. డా॥ జి. రాజారావు.

తెర తొలగక పూర్వం :

ఒక గొంతు :

భయం యుగం భయం యుగం
మహా భయంకర యుగం

అనుక్షణం మరణ భయం
జీవన సంఘర్షణ భయం
ధనమదాంధ జనచోదిత
రణభయం మరణ భయం

అంధకార మయోమయం
ఆర్తనాద సంకులం
అసహన మ్మనుమానం
అడుగడుగున వంచనం

మనిషికి మనిషన్న భయం
మనసంటే మనకు భయం
సత్యమన్న చచ్చే భయం
చచ్చుదాక చావుభయం

ఊప్పులెగయు తూర్పు దెసను
పరుగులెత్తు పడమటను
అన్నియెడల అందరికీ
అర్థరహిత వ్యర్థభయం.

బ్రతుకు భయంకరంభయం
కష్టతరం నిష్ఠురం
బరువెక్కిన పాడుశవం
భగ్నమనోరథ పథం.

పాటతోపాటు తెర విడిపోయింది. తెర పూర్తిగా తొలగగానే పాట ఆగిపోయింది.

అదొక ఆఫీసు లాగుంది. కుడి ఎడమవైపుల రెండు పెద్ద బల్లలు. వాటిమీద ఫైళ్ళు, కాగితాలు, సిరాబుడ్లు తదితర ఆఫీసు పరికరాలు కనిపిస్తున్నాయ్. ఒక బల్లమీద ఫోన్ వుంది. ఈ రెండు బల్లలకు ముందుభాగంలో ఒక సోఫాపెట్టు వుంది. ప్రేక్షకుల కెదురుగా ఒక దర్వాజా కనుపిస్తూంది. ఆ దర్వాజామీదనో పక్కగానో "ప్రొప్రయిటర్" అనే బోర్డు వుంది. కుడి, ఎడమవైపుల రెండు ద్వారా లగుపిస్తున్నాయ్.

ఒక బల్లదగ్గర ఒక బక్కచిక్కిన దేహం కూర్చొని పనిచేస్తూంది. అతనిచుట్టూ కాగితాలే, ఫైళ్లే, లెక్కల పుస్తకాలే. దీపం వెలుగుతోంది.

సూర్యోదయమైందేమో, బయటనుంచి ఎర్రని కాంతి లోనికి ప్రసరిస్తూంది.

ఆ బక్క దేహం పనిచేసుకుంటూనే వుంది. కుడివైపునుంచి ఒక ముసలిదేహం మెల్లగా వచ్చింది. ఆ పనిచేస్తూ న్నతన్ని చూచింది.

ముస: అయ్యా! దీపం ఆర్పేనా!

అత: మన దీపా లెప్పుడో ఆరిపోయినయి. నువ్వార్పే దేమిటి?

ముస: అది కాదయ్యా. తెల్లారిపోయింది. బారెడు పొద్దెక్కిందికూడా.

అత: తెల్లారిందా. హుఁ. పొద్దు తెల్లారిందేకాని, యీ పని తెల్లారలా యింకా. తొమ్మిది గంటలకల్లా ఆయన దుముకుతాడు. పని పూర్తికాలేదని పైనబడ తాడే కాని - రాత్రంతా కన్నుమూయకుండా చచ్చి చెడి పనిచేసింది ఆయన కేం తెలుస్తుంది?

ముస: అవునయ్యా పాపం! ఒక్క క్షణం అట్టా ఒరగలేదు తమరు. ఒకసారి యింటికెల్లిరండయ్యా. ఎదవ పని యాడికి పోతుంది. లచ్చనంగా స్తానంచేసి వచ్చి కూకున్నారంటే గబగబా అయిపోద్ది.

అత: హుఁ, ఇల్లా ముసలయ్యా? ఇంటిక్కాదు వల్లకాటికి పోవల్సిందే. మా కెందు కోయ్, యిల్లూ వాకిలీ. పెళ్ళాం బిడ్డలూ....అరవై రూపాయల కీ అరవచాకిరీ చేస్తూ ఆఫీసులోనే చస్తేచాలు. అదంతా అదృష్టం చేసుకున్నవాళ్ళకు లేవయ్యా....అనుభవించేవాళ్ళు అనుభవిస్తారు. ఇట్లా చాకిరిచేసి చచ్చేవాళ్ళు చస్తారు. అంతే.

ముస: (నవ్వాడు)

అత: ఏం! నీకు నవ్వుగా వుందా ముసలయ్యా!

ముస: అబ్బే. లేదయ్యా. నేనూ ఇరవై ఏళ్ళనుం దీ ఆఫీసుకొచ్చి. ఇదే మాట అందరినోట ఇంటూండ. ఇనీ ఇనీ ఇసుగేసిపోయింది. ఈడనే కాదు,

యాడికిపోండి ఇదేమాట. పెతొక్కరూ ఎదటాదేమో సుకంగుండాడని ఏడుప్పు. ఏడుపుగాకుంటే ఇంకేదో. ఆ ఓటల్లో పనిచేసేవాణ్ణి చూసి 'నీ కేమోయ్. తిండికి తిండి, డబ్బుకి డబ్బు' అంటాన్నేను. ఆడు నన్నుసూసి 'నీకేం దట్టా. నెలతిరగ్గానే టంచనుగా యాభై రూపాయలు కళ్ళసూస్తావ్' అంటాడు. ఇట్టాగే అందరూ. ఎవరు సుకంగుండారు. ఎవరు కష్టపడు తుండారు. ఏందో యీ బతుకులు .

అత: (నవ్వి) అయితే నువ్వనేదేమిటి? సుఖంగా వుండేవాళ్ళే లేరనా? పెట్టిపుట్టిన వాళ్ళు కొందరున్నారు ముసలయ్యా. లేకేం? కావాలంటే మన మానేజర్ను చూడు. హాయిగా ఆఁ, వూఁ అంటే యింట్లోకెళ్ళి పెండ్లాం బిడ్డలతో కమ్మగా కబుర్లుచెబుతూ కూచుంటాడు. ఆయనకేం. ఇంట్లోవున్నా ఆఫీసులో వున్నట్టే లెక్క. మనలాగా! ఇల్లూలేదు. వాకిలీ లేదు. అహోరాత్రులు చాకిరి చాకిరి అని చావడానికి.

ముస: ఆయనంటే ఆయ నిల్లు ఆఫీసులోనే అయిపోయె. అందుకని ఆ సుఖవు. అందరికీ అట్టా వస్తుందయ్యా?

అత: రాకేమవుతుంది. ఆయనలా నేనే కాకా పట్టగలిగితే, అన్నింటికీ చిత్తం చిత్తం అని తలవంచుకొని చేతులు పిసుక్కోగలిగితే, ఎంత అన్యాయమైనా అక్రమమైనా, ఎదుటివా దేమైపోయినా సరే చీమైనా కుట్టనట్టు తుడుచుకోగలి గితే నేనూ యిల్లేకాదు, బంగళా కట్టేవాడిని. అది చేతగాక ఇంకా అంత రాత్మను చంపుకోలేక ఇట్లా పడివున్నా.

ముస: (మళ్ళీ నవ్వాడు)

అత: ఏమిటా వెధవనవ్వు నువ్వూ.

ముస: ఏంలేదయ్యా, ఎవడికివాడు ఎదుటివాడు అన్నాయం చేసే పైకొచ్చాడనుకుంటె నిజంగా ఎవరు నాయం చేస్తున్నట్టు. ఎవ రన్నాయం చేస్తున్నట్టు!

అత: ఆ వేదాంతాని కే మొచ్చిందిగాని ముసలయ్యా, కాస్త ఆలోచిస్తే అన్యాయమని గట్టిగా చెప్పే ధైర్యం లేకుండా అన్యాయాన్నే న్యాయంగా నచ్చచెప్పుకొని మనం బతికిపోతున్నాం. అందరి విషయం దేనికి? నీ విషయం ఆలోచించు. నీ కెంతమంది పిల్లలు....

ముస: పిల్లల కేం తక్కువలేయ్యా. నా పిల్లలూ, నా పిల్లల పిల్లలూ అంతా కలిసి పాతికమందుంటారు - కుటుంబం.

అత: వాళ్ళల్లో ఎందరు సంపాదిస్తున్నారు?

ముస: ఆ ముందరో యేడయ్యా. పెద్దోడు ఆవాడో కంపెనీలో పనిచేస్తుండాడు మొన్నటిదాకా. ఉద్దోగంలో కోత లొచ్చాయని వాడ్నేమో ఊడబెరికారు. సిన్నోడేమో కిల్లగిసి నాలుగుకాసులు సంపాయిస్తున్నాడు. అదాపేసిరి. ఆ ఇంట్లోనే గూకుని - ఏరే పని సేతగాక. సరె మిగతా ఇద్దరూ ఆడకూతుళ్లు. ఒకతేమో ముండమోసి ఇల్లుచేరింది. రెండోదాని మొగుడేమో యాదా పని లేదని ఇక్కడేవచ్చి కూకుండాడు. తెచ్చినాడు తెస్తాడు, లేన్నాడు లేదు. ఏదో ఇట్టాగే యాగటంవా యీ యాభై రూపాయలతో.

అత: చూశావా? చెప్పుకోవలసివస్తే నీ దెంత కథుందో.

ముస: లేదేమయ్యా. వదిలిస్తే అన్నీ వదలే. అట్టాగని మనం వూళ్ళోవాళ్ళమీద ఇరుసుకుపడితే ఏం లాబం. ఏదో మనకు రాసిపెట్టింది వుంటది; లేంది లేదు.

అత: విరుచుకపడటం కాదు ముసలయ్యా. నువ్వూ నేనూ ఇరవై ఏళ్ళుగా పని చేస్తున్నాం, ఏం ప్రయోజనం! సంవత్సరం తప్పినా పిల్లలేమో తప్పటంలేదు. ఇప్పుడు మళ్ళా నా పెళ్ళానికి ప్రసవంరోజులు. చేదోడుగా మనిషైనా లేకుండా అది ఆ పిల్లలతో ఏగుతూంది. పనిమనిషిని పెడదామంటే భయం....జీతమా ఎదిగినట్టే వుంటుంది, చేతి కేమో అందదు. ఇది మన గతి....అదే చూడు ఆ పి. యస్. గాడు.

ముస: ఆఁ, ఆఁ. అయ్యా. పి.యస్. అంటారే ఏందయ్యా అది.

అత: అంటే పరసనల్ సెక్రటరీ (Personal Secretary)

ముస: అంటె ఆయనచేసే పనేందో.

అత: అయ్యగారి సొంత వ్యవహారాలు చూసుకోవటం.

ముస: అయితే మనం చూసుకునేయన్నీ అయ్యగారి యవ్వారాలు కానట్టా.

అత: అంతకన్నా మరీ సొంత వ్యవహారాలున్నా యిలే ముసలయ్యా. నీకు తెలీదు.

ముస: తెలుసులేవయ్యా ఆయనచేసే యవ్వారాలు. నాకు తెలీనట్టా. అయితే అదీ ఒక ఉద్దోగ పటయ్యా. దానికి పి.యస్. అని పెద్ద పేరా! అన్నాయంగావుందే. నేనింకా ఏదో అనుకున్నా. దానితాడు తెగింది - ముండల్ను తార్చడం, బుడ్డీ లందీయటం....అయ్యగారొ స్తున్నట్టుంది. మన కెందుకొచ్చిందిలే.

అత: అయ్యగారు కాదులే ముసలయ్యా, కారు చప్పుడుకాదూ!

ముస: ఆఁ. ఎప్పుడులేనివారు కొత్తొచ్చారు కదయ్యా చూసుద్దినీ. (వాకిలివైపు వెళ్ళి చూచి) పి.యస్. అయ్యా పి.యస్.

అంటూండగా పి.యస్. వచ్చాడు.

పి.యస్: ఏమోయ్ ముసలయ్యా. రాత్రంతా ఇక్కడే ఉన్నావా? వుండకుండా ఎక్కడికి పోతావులే. రాత్రంతా పనుందిగా ఆఫీసులో. ఏమందీ అకౌంటెంటు గారూ, ఎంతవరకొచ్చింది పని? అయిపోయిందా? ఆఁ. ఎట్టా అవుతుందిలే. నాకు తెలీదూ. నువ్వేక్కడ చేస్తావ్. మానేజరెక్కడ? ఎక్కడుంటాడు. ఇంట్లో పెండ్లాందగ్గరుంటాడు. నాకు తెలీదూ. ఏం ముసలయ్యా! అయ్యగారి గదేమైనా శుభ్రంచేశావా? ఎందుకు చేస్తావ్? నాకు తెలీదూ. అయ్యగారు పదిగంటలకొస్తారనిగదూ నీ అభిప్రాయం. ఈరోజు పెందరాడే వస్తున్నారు గాని - రా, గదంతా తుడిచి శుభ్రంచేయాలి. ఏమయ్యా అకౌంటెంటూ! ఇంటికిపోతావా? నువ్వెట్టాపోతావ్ పని పూర్తిచెయ్యందే. నాకు తెలీదూ. (అంటూ పి.యస్. రూమ్‌లోకి వెళ్ళాడు. ముసలయ్య అతన్ని వెంబడించాడు. పి. యస్. గదంతా ఒకసారి కలయచూచి) ఇక్కడేముంది శుభ్రం చేయడానికి? ఏం లేదు లే. నాకు తెలీదూ. రా, పడకగది చూద్దాం రా.

అంటూ పడకగదిలోకి వెళ్ళారు.

పి.యస్: (లోపల్నుంచి) అదంతా తరువాత చూద్దువుగాని ముందీ సోడాబుడ్లు తీసుకపో ఇక్కడనుంచి.

ముసలయ్య సోడాబుడ్లు తీసుకొని పి.యస్. రూములోకి పరుగెత్తుతాడు.

పి.యస్: (లోపల్నుంచి) ముసలయ్యా! అదంతా తరువాత చూద్దువుగాని ముందు ఈ పక్కగుడ్డలన్నీ మార్చవయ్యా ఖరాబుగా వుంది.

ముసలయ్య సోడాబుడ్లు అక్కడపెట్టి లోపలికెళ్ళి పక్కగుడ్డలు తీసుకొని పి. యస్. రూములోకి వచ్చాడు. వచ్చీ రాకముందే

పి.యస్: (లోపల్నుంచి) అవి తరువాత చూద్దువుగాని ముందీ గ్లాసులు కడుగు.

ముసలయ్య బట్టలక్కడపెట్టి లోపలికెళ్ళి గ్లాసులు తీసుక పరుగెత్తుతాడు.

ముస: (గ్లాసులు వాసన చూచి అసహ్యించుకుంటాడు.)

పి.యస్: (బయటికొచ్చి) ఏమోయ్ గ్లాసులు వాసన చూస్తున్నావ్. నాకు తెలీదూ నువ్వు చూస్తావని.

ముస: అవునయ్యా ఏదో దురువాసనేస్తోంది.

పి.యస్: వేస్తే వేస్తుంది. నీ కెందుకు? ఇకమీదట ఎప్పుడుగాని అయ్యగారి గ్లాసులు కడిగేటప్పుడు ముక్కులు మూసుకు కడుగు.

ముస: అట్టాగేయ్యా. (అని పోబోతున్నాడు. పి. యస్. రాయిస్తూన్న సిగిరెట్టు యాష్ట్రేలో వేయబోయి అది నిండివుండటం చూసి)

పి.యస్: ఇదుగో. బుద్ధుందా నీకు. ముందీ గది శుభ్రం చేయకుండా అక్కడి కెందుకొచ్చావ్. ముందీ యాష్ట్రే కడుగు.

ముసలయ్య గ్లాసు అక్కడపెట్టి యాష్ట్రే తీసుకువెళుతూంటాడు. పి. యస్. అతని వెంటనే ఆఫీసుగదిలోకి వస్తాడు.

పి.యస్: ఏమయ్యా అకౌంటెంటూ! కాఫీ తాగావా! - నువ్వెక్కడ తాగుంటావ్. నాకు తెలీదూ! ముసలయ్యా అది తర్వాత చూద్దువుగాని ముందు రెండు కాఫీ పట్టుకురా.

ముసలయ్య యాష్ట్రే అక్కడపెట్టి వెళుతున్నవాడల్లా ద్వారందగ్గర ఆగి

ముస: అయ్యగారొస్తున్నారయ్యా.

పి.యస్: అయ్యగారా? అదంతా తర్వాత చూద్దువుగాని ముందా ఆఫీసు గది సర్దవయ్యా.

ముసలయ్య పి.యస్. గదిలోకి పరుగెత్తాడు. ఇంతలో ప్రొప్రయిటర్ వచ్చాడు.

పి.యస్: నమస్కారం, అప్పుడే వచ్చేశారా. మీరు వచ్చేస్తారు. నాకు తెలీదూ!

అకౌంటెంటు నమస్కారంపెట్టి కూర్చున్నాడు.

ప్రొప్ర: ఏమయ్యా ఆ స్టేటుమెంట్లూ అవీ తయారయ్యాయా?

అక: అయినయండి.

ప్రొప్ర: ఊఁ. ముసలయ్యా!

పి.యస్: ముసలయ్యా! అదంతా తర్వాత చూద్దువుగాని ముందు అయ్యగారు పిలుస్తున్నారు. యిట్రా.

ముసలయ్య పరుగెత్తుకొచ్చాడు.

ప్రొప్ర: మేనేజర్ను పిలవ్వోయ్.

పి.యస్: (రహస్యంగా) అదంతా నేచూస్తాగాని ముందది చూడు.

అని తనే మేనేజరును పిలవటానికి వెళతాడు. ముసలయ్య పి. యస్. గదిలోకి వెళతాడు. పి. యస్. ఎదురుగా మేనేజరు వచ్చాడు.

మేనే: నమస్కారం

పి.యస్: ఆదంతా తర్వాత చూద్దాంగాని, ముందు అయ్యగారు పిలుస్తున్నారు. పోవయ్యా.

మేనే: (ప్రొప్రయిటర్ దగ్గరకొచ్చి) నమస్కారం సార్.

ప్రొప్ర: ఏమయ్యా మేనేజరు!

మేనే: అవును సార్.

ప్రొప్ర: ఏమిటయ్యా అవును. ఆ పని ఏమాత్రమయింది?

మేనే: చేస్తున్నాడు సార్.

ప్రొప్ర: చేస్తున్నాడని తెలుసు. పూర్తయిందా అని.

మేనే: తెలవదు సార్. అడిగి చెపుతాను.

ప్రొప్ర: ఏమిటయ్యా, అడిగి చెప్పేది. ఎందుకున్నట్టు నువ్విక్కడ. అడిగి చెపుతాడట. తెల్లవారేటప్పటికల్లా ఆ స్టేటుమెంటులు తయారుకావాలని నేను చెప్పి వెళ్ళాను. నీపాటికి నువ్వు యింట్లోపోయి కూర్చుంటావ్. ఏమిటి నీ వుద్దేశ్యం?



మేనే: చెప్పివెళ్ళాను సార్.

ప్రొప్ర: నాన్‌సెన్స్! చెప్పి వెళ్ళితే చేస్తున్నాడో లేదో చూసుకోవద్దు? ఇందుకేనటయ్యా ఆఫీసులోనే నీకు యిల్లు కట్టించింది? ఆఁ ఊఁ అంటే యింట్లోచేరి పెండ్లాంతో కబుర్లు చెప్పుకుంటూ కూర్చోటానికా! ఏడుగంటలయింది. ఇంతవరకు నువ్వు ఆఫీసుముఖం చూడలేదు. ఇప్పుడు నిద్ర లేస్తున్నావు.

మేనే: అసలు నిద్రపోలేదు సార్.

ప్రొప్ర: షటప్. బుద్ధుండాలి మనుష్యులకి. ఎందుకయ్యా మీరంతా ఉద్యోగాలకొస్తారు. ఇంకొక గంటలో ఆ స్టేటుమెంటులు తయారుగా నా బల్లమీదుండాలి. జాగ్రత్త.

అని వెళుతున్నాడు. పి. యస్. అతన్ని వెంబడించాడు. మేనేజరు వాకిలిదాకా వెళ్ళి తిరిగివచ్చి

మేనే: ఏమయ్యా అకౌంటెంటు! చూశావా నీవల్ల నా కొచ్చే చీవాట్లు. నిన్న గట్టిగా చెప్పి పోయాను కదా - ఆ స్టేటుమెంట్లు తెల్లవారేటప్పటికి తయారుకావాలని? ఏం చేస్తున్నట్టు నువ్వు. నిద్రపోతున్నావటయ్యా, ఎందుకయ్యా మీరంతా

ఎవ్వొగాలకొచ్చి మా ప్రాణాలు తీస్తారు. పనిచేసే ఓపిక లేకపోతే ఇంటి వయ్యా యిళ్ళకు.

అత: అదికాదు సార్.

మేనే: ఏది కాదు సార్?

అత: స్టేటుమెంట్లు తయారై పోలేనయ్ సార్.

మేనే: తయా రయ్యాయా? నువ్వు కూత ఉందుగా కాశావుకాదేం. పొద్దునలేచి నీ మూలంగా ఆయన చేత నానామాటలూ అనిపించుకున్నాను.

అత: అయ్యగారితో చెప్పాను సార్.

మేనే: అయ్యగారితో చెప్పావా! దేవుడితో చెప్పలేక పోయావా? ఆయనతో చెప్పగలిగినవాడివి నాతో ఎందుకు చెప్పలేదు? నే నెందుకయ్యా యిక్కడున్నది. గాడిదలు కాయటానికా. ఆఫీసులోనే యిల్లూ, పల్లెకాడూ. ఇరవైనాలుగు గంటలూ యిక్కడే అఘోరిస్తున్నానే, నాతో ఒక్కమాట చెపితే ఏం పోయేదని. మెహర్బానయ్యా, మెహర్బాని. అయ్యగారితోనే చెప్పుకుంటే ఏదో కిరీటం పెడతారని ఆశ. ఎందుకయ్యా యిట్టా కాకాపట్టి బతుకుతారు.... .. ఎదటవాడి నెత్తిన ఎంతసేపూ దుమ్ము పడేసి మీరేదో ఏలుకపోవాలని. పని చేయండయ్యా, పనిచేయండి. పైకొస్తారు.

అత: ఎందుకండీ అట్టా కేకలేస్తారు. ఇక్క డెవరూ కాకాలు పట్టడంలేదు - ఏలుకపోవటంలేదు. రాత్రంతా చచ్చిచెడి పనిపూర్తిచేసి. మీరు దయచేస్తారేమోనని మీకోసం పడిగాపులు పడున్నా. మీకేం అరుస్తారు - హాయిగా యింట్లో కూర్చొని....

మేనే: ఏడుస్తున్నావు నాయనా, నువ్వు ఏడుస్తున్నా! నా బతుక్కి హాయి ఒక్కటే తక్కువైంది. యింట్లో కూర్చున్నానట. నరకం. నీకేం తెలుస్తుంది నా బాధ.

అత: మా బాధ మీకు తెలిస్తేగా?

మేనే: అంతేలే. ఎవడి కష్టం వాడికెక్కువ. రాత్రంతా ఇంటికి పోలేదని నువ్వేడుస్తుంటే. ఇంట్లోనే వుండాల్సి వచ్చిందని నే నేడుస్తున్నా. ఆఫీసులోనే యిల్లు పెట్టుకొని నేనేదో అనుభవించిపోతున్నానని నీ ఏడుపు. ఎందుకులే అవన్నీ కదిలించటం. ఏదీ, ఏం చేశావో యిలా తీసుకురా.

అత: (కాగితాలు తెచ్చియిస్తాడు.)

మేనే: (వాటిని చూసి) ఎంతబాగా చూశావని. ఇదేనా నువ్వు చేసింది? ఈమాత్రానికేనా అయ్యగారితో అయిపోతుందని మహాబాధగా చెప్తున్నావు.

అత: అయిపోతుందా మరుండండీ అన్ని స్టేటుమెంట్లూ తయారుచేశాను. ఇంకేముంటది?

మేనే: చూస్తుంటావయ్యా. ఇంకో గంటలో బిల్లుమీద తయారుగా వుంచాలన్నారు. ఇట్లాగే తెంపుకెళ్ళి పెడతావా? వీన్ని టైపో గీపో చేయించకపోతే ఎట్లాగయ్యా?

అత: దానికేముంది. టైపిస్టుందిగా. ఆమె చేస్తుంది.

మేనే: ఆమె చేస్తుందని వదిలేస్తావన్నమాట. ఆమెగారు రాణీలాగ పదిగంటలకొస్తారు. అంతదాకా ఆపి వుంచాల్సిందే నంటావు. అంతలోగా అయ్యగారొస్తే నేను చీవాట్లు తినాల్సిందే నంటావు. ఏమిటయ్యా నువ్వనేది? ఏం నువ్వు చేస్తే యేంపోతుంది? అరిగిపోతావా? కరిగిపోతావా? ఎందుకయ్యా ఈ పంతాలు మీకు? పనిచేయండయ్యా. పనిచేయండి. పైకొస్తారు.

అత: పనిచేయకుండా ఏం చేస్తున్నానండి. పది సంవత్సరాలుగా పనిచేస్తున్నా. ఇరవైనాలుగ్గంటలూ పనిచేస్తున్నా. నిన్న పొద్దుట్నించీ ఇప్పటిదాకా. ఇంటి ముఖం చూడకుండా పనిచేస్తున్నా. ఇంతకన్నా ఏం చేయమంటారు. ఇంకా రావల్సిందేం పైకి. ఇప్పుడున్నదానికంటే అడుక్కుపోకుంటె చాలు. మమ్మల్నిట్టా బతకనిస్తే చాలు. అందరి పనులూ మా నెత్తిన వేసి చంపకుండా వుంటే చాలు...లేకుంటే ఆ టైపిస్టు చేయాల్సినపని నేనెందుకు చేయాలో!

మేనే: చెయ్యాలి నాయనా. చెయ్యాలి. తప్పదు.

అత: ఎందుకు చెయ్యాలని అడుగుతున్నాను.

మేనే: ఎందుకంటె - టైపురైటింగు. షార్టుహాండు. బుక్కీపింగు అన్నీ వచ్చునని పెద్ద పెద్ద సర్టిఫికేట్లతో అప్లికేషను పెట్టుకున్నావు గనుక.

అత: పెట్టుకుంటె! నాకు అవే రావు. ఇంకా ఎన్నో చేతవును. అలాగని అన్నీ చేయమంటారేటండీ. నాకు మీరు అకౌంటెంటు వుద్యోగమిచ్చారు. అకౌంటెంటు పని చేస్తున్నాను. అంతేగాని నాకు ఇల్లు చిమ్మటం చేతవునని ఆఫీసు చిమ్మమంటారా?

మేనే: చిమ్మమంటే చిమ్మాల్సిందే నాయనా!

అత: ఏమిటండీ, యీ దౌర్జన్యం! ఎందుకు చిమ్మాలని?

మేనే: బతకాలి గనక. నీకు పెళ్ళాంబిడ్డలు వున్నారుగనక. నీ సంసారాన్ని పోషించాల్సిన బాధ్యత నీమీదే వుందిగనక. ఇది వదిలిపెడితే మనకు వేరే గతిలేదు

గనుక. తెలిసిందా నాయనా. చెయ్యాలి. ఏం చెయ్యమన్నా చెయ్యాలి. చేసి బతకాలి. మనల్ని నమ్ముకున్న జీవాల్ని బతికించాలి.

ఉత. బతక్కపోతే చస్తాం. యీ ఉద్యోగం లేకపోతే అడుక్కుతింటాం. అంతేగాని యేమిటండీ యీ అన్యాయం. చాకిరీ చేసేవాడుంటె చేయించుకుంటూండడ మేనా? అంతూ పంతూ లేదా? ఎంతకాలం చేస్తామీ చాకిరీ?

మనే: బతికున్నంతకాలం, బతకాలనుకున్నంతకాలం చేయాల్సిందే

ఉత: చేయాల్సిందే! మీకేం చెప్తారు హాయిగా ఇంట్లో కూర్చొని, పెండ్లాంతో కబుర్లు, పిల్లలతో ముచ్చటలూ చెప్పుకొని, సుష్టుగా భోంచేసి, కమ్మగా నిద్ర పోయి, కడుపులో చల్ల కదలకుండా మామీద అథార్టీలు చేస్తూ జరిపించుకునే మీకు....

మనే: ఆగవయ్యా ఆగు!

ఉత: (తపీమని ఆగాడు.)

మనే: పిచ్చివాడా! ఆవేశంలో అంటే అన్నావు. నాకు తెలుసు నీ బాధ. కానీ నా బాధే నీకు తెలీదు. నా బతుకు నువ్వనుకున్నంత హాయిగా లేదు. నా యిల్లు నువ్వు వూహిస్తున్న స్వర్గమూ కాదు. చూడు నాయనా. నా కిప్పుడు డెబ్బయి యేళ్ళు. ముప్పైఅయిదేళ్ళు ఇదే ఆఫీసులో చాకిరీ చేశాను. ఆలోచించుకో. పదేళ్ళకే నువ్వింత బాధపడుతున్నావే! నే నెంత బాధపడాలో వూహించుకో. నీకన్నా చిన్న వుద్యోగంలో చేరాను. అడ్డమైన చాకిరీ చేశాను. అవమానాలు భరించాను. అన్యాయాలు సహించాను. అక్రమాలకు తలవంచాను. అహో రాత్రులు పనిచేశాను. ఒక పనికాదు. అన్ని పనులూ చేశాను. నీకు తెలీదు. అప్పుడు అయ్యగారు ఇంత మహారాజుకాడు. వ్యాపారం ఇంత గొప్పదికాదు. ఇందరు గుమాస్తాలూ లేరు. నే నొక్కణ్ణి. ఒక్కణ్ణీ బీదుకోమని ఆఫీసులో కూచొని అర్ధరాత్రిదాకా పనిచేసేవాణ్ణి. అప్పుడు నా యిల్లు ఎక్కడో వూరి బయటుండేది. నా భార్య బిక్కుబిక్కుమని పసిపిల్లల్ని పెట్టుకొని నాకోసం ఎదురుచూస్తూ కూచునేది. పలికే మనిషి లేదక్కడ. దొంగల భయం. పురుగూ పుట్రా భయం....ఇంతకూ ఎందుకున్నామని అక్కడ! ఎక్కువ అద్దె అయితే ఇచ్చుకోలేమని భయం....అలాగే ఆ యింట్లోనే దినాలుకావు, ఏళ్ళు గడిపాం....ఆఫీసులో నేను, ఇంట్లో మా ఆవిడ అలాగే ఏళ్ళు గడిపాం... ఆ వయసులో అది పడ్డ బాధలు అన్నీ యిన్నీ కావు...అవన్నీ నా కప్పట్లో కనపడలేదు....వుద్యోగం....వుద్యోగం....అంతా నా నెత్తిన్నే

కరిగిపోతున్నట్టు పనిచేశాను. అంతా నా సొంతమైనట్టు పాటుపడ్డాను. వ్యాపారం వృద్ధిచేశాను. గట్టిగా గుండెమీద చెయ్యివేసుకొని చెపుతున్నాను.... నేనే నేనే . యీ వ్యాపారాన్నింత చేసింది. నేనే యీ లక్షలు సంపాదించింది అయ్యగారు మహారాజయ్యారు. కార్లు కొన్నారు. .ఇళ్ళు కట్టుకున్నారు పెళ్ళిళ్ళు చేసుకున్నారు, పెత్తనాలు - పదవులూ సంపాయించారు పెద్దవాళ్ళయ్యారు.. అన్నిటికీ నే ననుభవిస్తున్న దేమిటంటావు. నా నెత్తికొచ్చిన కిరీటం ఏమిటంటావు. ఇదుగో నువ్వేడుస్తున్నావే యీ మేనేజరు పదవి. ఈ గాడిదని కొంప! — అంతే నాయనా అంతే!

లత: (కరిగిపోయాడు) మేనేజరుగారూ! బాధపడకండీ ఏదో తెలియకుండా అన్నాను.

మేనే: అన్నదానికేంకాదు నాయనా. విను .అంతా విను. నే నిప్పుడు ఆఫీసు అంటే ఇంటికెళ్ళి కూర్చుంటూన్నది ఇంట్లో హాయిగా వుండీకాదు; ఆనందంగా వుండీ కాదు. నా భార్య కోసం. .పాపం. . నాకన్నా అది నలిగిపోయింది బతుకులో . గంపెడు పిల్లలు, సంసారం. యిన్నాళ్ళూ యీదింది. యింకా యిందేదో వుందిన్న ఆశతో యీదింది... అలసిపోయింది, బతుకు అస్తమిస్తూందని దానికి తెలిసింది. .గుండె పగిలింది.... కుమిలిపోయింది. ..పిల్లలు. .పెళ్ళిళ్ళు చదువులు. ..! ఏలా ఏలా అని దాని దిగులు. .అదొక్కటే దాని ప్రశ్న? ఆ ప్రశ్నకు నాకూ జవాబులేదు.... ఎలాగుంటే అలా జరుగుతుందనే జవాబుతో ధైర్యం చిక్కబట్టుకునే వయసు కాదిది . ఆ దిగులుతో మంచం పట్టింది. డాక్టరు దానికి పిచ్చి పట్టినా పట్టొచ్చు అంటాడు....దానికి పిచ్చిపడితే....ఆ పిల్లలు... ఆ పసికూనలు. . ఆ పెళ్ళి కావల్సిన పిల్లలు. .వాళ్ళంతా ఏమైపోవాలి. (అంత పెద్దవాడు ఒక్కసారి గొల్లుమన్నాడు)

లత: (పూర్తిగా నీరయ్యాడు... ఏం చెయ్యాలో ఏం చెప్పాలో తెలియదు)

మేనే: (నోట్లో గుడ్డకుక్కుకొని వచ్చే దుఃఖాన్ని ఆపుకొని) ఇంట్లో ఏడవలేను. పిల్లలు చూస్తారని భయం. ..బైట ఏడవలేను. అందరూ నవ్వుతారని భయం.. ఎన్నాళ్ళ దుఃఖమో ఈనాడు నీ ఎదుట బైటపడింది. ఏమీ అనుకోకు నాయనా! ఆవేశంకలవాడివి నీ కర్థమవుతుందిలే. ..నామాట విను. పట్టింపులకు పోవద్దు. పనిచేయి. . నీ బిడ్డలు నా బిడ్డలూ బతకటానికి పని చేయి. నువ్వు పనిచేయకపోతే నా వుద్యోగం పోతుంది. నాయనా! మనం

బతకలేం.. ఎక్కువెక్కువైనా ఎంతే....ఇదే బతుకు....లాభంలేదు....పోరాడి లాభంలేదు .. చాకిరీకోసం పుట్టాం, చాకిరిచేసి చస్తాం. .అంతే....నా మాట విని .. ఆ పని పూర్తిచేయి....(ఇంతలో ఇంట్లోనుంచి 'ఏమండీ, ఏమండీ. ఇంతలో ఎక్కడికెళ్ళారు' అని మేనేజరు భార్య అరుపు) వస్తా నాయనా! వస్తా! జబ్బుమనిషి. నా పెళ్ళాం.. లేచి వస్తుందేమో ..(వెళ్ళాడు)

అతడు శిలావిగ్రహంలా నిలబడి పోయాడు. కొద్ది ముందే ముసలయ్య ప్రొప్రయిటరు గదిలోనుంచి బైటికొచ్చి నిలబడి యీ మాటలు వింటున్నాడు. మేనేజరు వెళ్ళిపోగానే, అకౌంటెంటు అలా నిలబడి వుండగానే ముసలయ్య మెల్లగా తల వంచుకొని వాకిలివైపు వెళుతున్నాడు.

అకౌంటెంటు జాగ్రదవస్థకు వచ్చి,

అత: ముసలయ్యా!

ముస: అయ్యా.

అత: అరకప్పు కాఫీ పట్టుకురా ముసలయ్యా. బుర్ర వేడెక్కిపోయింది.

ముస: అట్టాగేయ్యా. (వెళ్ళాడు)

అత: (పెద్ద నిట్టూర్పు, బాధతో) అబ్బ! (అని అక్కడున్న కుర్చీలో కూలబడ్డాడు.) అందరూ ఏడుస్తున్నారు ...అందరూ బాధపడుతున్నారు....అందరి బతుకులూ యింతే! ఈ ప్రపంచమంతా యింతే. నే నొక్కణ్ణే కాదు. నా లా లక్షలూ కోట్లూ వున్నారు. నాకన్నా హీనంగా వుండే వాళ్ళూ వున్నారు....అయినా వాళ్ళను గురించి నే నెందు కాలోచించాలి - నన్ను గురించి వాళ్ళనుకుంటున్నారు గనుకనా! ఎవరి బతుకు వాళ్ళది. అంతే. ..

అయినా నాలాంటి వెధవ బతుకు ఎవ్వరికీ వుండదు. నాలాంటి దౌర్భాగ్యుడెవ్వడూ వుండడు. ఎంతకాలం ఈ బతుకు! ఎవడో సంపాయించి ఎవరో అనుభవించే యీ ఐశ్వర్యానికి ఖర్చూ జమా రాస్తూ ఎంతకాలం? అందులో అన్నీ తప్పుడులెక్కలు. అంతా మోసం! ఏమిటీ పాపం! ఎవరిదీ పాపం! నాదేనా! నాదెందుకౌవాలి. నే నేమన్నా అనుభవిస్తున్నానా యీ డబ్బు. అనుభవించకపోతే మాత్రం పాపం పాపమే. నేను చేస్తున్నదంతా పాపమే, ఈ బతుకంతా మోసం పాపం. నావల్లకాదు. ఈ బతుకు నా కక్కర్లేదు. నేను పడలేనీ బాధ. ఊపిరాట్టం లేదు. నేను చచ్చిపోతాను.... నే నిక్కడ బతకలేను ...నన్ను వెళ్ళనీండి .నన్ను వెళ్ళనీండి... నా కీ జీవితం అక్కర్లేదు.... నా కీ జీవితం అక్కర్లేదు... వెళ్ళనీండి....

అకౌంటెంటు ఎప్పుడు కళ్ళు మూశాడో తెలీదు. మాట్లాడుతూ అలాగే నిద్ర పోయాడు - కాదు...నిద్రపోతూ మాటాడుతున్నాడు.

ఎవరు నువ్వు! పెళ్ళానివా! నా పెళ్ళానివా! పాపిష్టిదానా! ఎందు కింకా అడ్డుపడతావు! ఎందుకింకా ఆపుతావు! నీవల్లే యీ వూబిలో దిగాను. దిగిపోతు న్నాను. నీవల్లే యీ బాధలన్నీ పడుతున్నాను. నువ్వు లేకుంటే యీ సంసారం లేదు. బాధ్యతల్లేవు. ఇంత నావల్లకాదు. నే న్నలిగి చావలేను.... నన్ను వెళ్ళనీ....మీరు మీరు ఎట్లాగైనా పొండి....పిల్లలా! చావనీ! చావరా, మనమే చంపేస్తాం...గంగలో పారేస్తాం...గొంతు నులిమి చంపేస్తాం.... పిల్లలూ రండి....చంపర్రా రండి. అందరూ రండి. నేను మిమ్మల్నింక పోషించలేను....అందరూ చావండి.

చిట్టీ! బాబూ! అమ్మాయీ! నాన్నా! నాన్నా! మిమ్మల్నా! మిమ్మల్నా! చంపనమ్మా! చంపనురా! నా చిట్టి తల్లుల్ని. నా బుల్లిబాబుల్ని చంపనురా.... మిమ్మల్నింకా చదివిస్తాను....మీ కందరికి పెళ్ళిళ్ళు చేస్తాను. మీరు నా బంగారు పాపలు ..మిమ్మల్ని చంపుతానా? ఏడవకండి ఏడవకండి...

ఎందుకు నవ్వుతారు! నా పిల్లలేం వీధుల్లో అడుక్కుతినరు...వాళ్ళెప్ప టికీ అనాథలు కారు....

ఎవరు: పోలీస్! పోలీస్! నా పిల్లల్ని నేను చంపానా! లేదండి! చంప లేదండీ! ఇదుగో అందరూ వున్నారు....నా బిడ్డల్ని నే నెందుకు చంపు కుంటాను. చంపలేదండీ! చంపలేదు. చంపను....చంపాలనుకున్నాను. నిజమే....కానీ ఇంక చంపను....నన్ను జైలుకు తీసుకెళ్తారా....ఎందుకు! నే నీ గుమాస్తా వుద్యోగం చేసుకుంటాను....నన్ను వదిలేయండి....నే నా గుమాస్తా పని చేసుకుంటాను....నేను జైలు కెళ్తే నా పిల్ల లేమైపోతారు. వదలండి....వదలండి....

ఒక అమ్మాయి సన్నగా, నాజూకుగా వుంది. ఎప్పుడొచ్చిందో వచ్చింది. వచ్చి నిలబడి అకౌంటెంటు కలవరింత వింటూంది కాస్సేపు. మరీ అతను ఊపి రాడని అవస్థలో కుర్చీలో కొట్టుకొంటూంటె ఇక భరించలేక అతన్ని సమీ పించింది. అతన్ని తడుతూ లేపింది.

అమ్మా: ఏమండీ! ఏమండీ!

అత: శారదా! నేను జైలు కెళ్ళను శారదా! వెళ్ళను. ఆఫీసు కెళ్తాను....ఆ స్టేటు మెంట్లు అరగంటలో తయారుచేసి వుంచాలి. లేకుంటే ఉద్యోగం పోతుంది.

ఉన్న ఉద్యోగం పోతే ఇక బతకలేం... నేనాఫీసు కెళ్తాను - ఇంటి కెళ్ళను.

అమ్మా: ఏమండీ! ఏమండీ!

అత: (ఉలిక్కిపడి లేచి ఆ అమ్మాయి భుజాలు పట్టుకొని) శారదా! పోలీసు... వెళ్ళిపోయారా: వెళ్ళిపోయారు కదూ పోలీసులు...

అమ్మా: అకౌంటెంటుగారూ! నేనండీ. టైపిస్టుని.

అత: (కలవరింత తొలగి) ఓ....మీరా...క్షమించండి. ఏదో కలవరించాను రాత్రంతా నిద్దరలేదు. మనసు బాగులేదు... ఏమీ అనుకోకండి ...

అమ్మా: అబ్బే! అనుకునేదేముందండీ...మీ రింత పెందరాళే వచ్చారేం ఆఫీసుకి?

అత: ఆఫీసుకు నిన్ననే వచ్చా. ఇంకా ఇంటి కెళ్ళలా ..

అమ్మా: రాత్రంతా పనిచేశారా?

అత: ఇంకా యీ రోజంతా చేస్తాను.

అమ్మా: ఇంటి కెళ్ళరూ?

అత: వెళ్ళటానికి వీల్లేదు. ఇంకా పనుంది. వెళ్తే వుద్యోగం పోతుంది. పోతే ఇక బతకలేం....

అమ్మా: ఎదేమిటండీ! ఇంటికెళ్ళిరాండి ఫర్వాలేదు.

అత: ఫర్వాలేదు. నీ కేం! నా వుద్యోగంపోతే నీ కేం? నా బిడ్డలు వీధుల్లో అడుక్కుతింటే నీ కేం... ఫర్వాలేదట ..ఫర్వాలేదు....నీ పనంతా నేను చేసిపెడుతూన్నప్పుడు నీకు ఫర్వాలేకుండా మరేమవుతుంది?

అమ్మా: నా పనా! మీరెందుకు చేస్తున్నారు?

అత: ఎందుకా? చేస్తూన్న పనులన్నీ ఎందుకు చేస్తున్నాం...బతకాలి గనక చేయకపోతే బతకలేం గనక. ఇదిగో యీ స్టేట్ మెంట్లన్నీ తయారుచేశాను. ఈ లక్షలు కోట్లూ రూపాయలు అణాలు పైసలూ కూడాను... అంతా నా అబ్బసొమ్మైనట్టు జాగ్రత్తగా చూడాను. నా సొమ్మైనా పోతే పోయిందనుకునే వాణ్ణి....దమ్మిడీ తేడా రానివ్వకుండా చూచాను....చూశావా, ఎంతెంత చిన్న అంకెలో. కళ్ళు! గుచ్చుకుంటే గాని కనపడవు....యిప్పుడు....ఇదంతా యిప్పుడు అరగంటలోగా టైపుచేయాలట టైపు! ఎవరు చేయాల్సిన పని! నీ పని! కాని నువ్వు రాణీవట, ఆడదానివట. ఆడవాళ్ళు ఉద్యోగాలకు వస్తారే గాని మగాళ్ళలా కష్టపడలేరట — కాదు — కష్టపెట్టకూడదట. ఆడవాళ్ళ భారమంతా మగాళ్ళే మోయాలట.. నా పెళ్ళాంకూడా ఆడదే. అది వుద్యోగం

చేయలేకపోయినా ఇంట్లో ఇరవైనాలుగ్గంటలూ పని చేస్తూంది. ఇప్పుడు గర్భవతి. ప్రసవం ఏ నిమిషాన్నయినా రావొచ్చు. నిన్ననగా వచ్చాను ఇంటి నుంచి. అదేమైపోయిందో తెలీదు... అయినా యీ పని ముగించి పోవాల్సిందే....లేకుంటే బతకలేం___కాదు ___ బతకలేమని భయం....

ఒక్కబిగిని వూపిరి తిప్పకుండా మాట్లాడేశాడు. ఆ అమ్మాయి నివ్వెరపోయింది. అకౌంటెంటు అలసిపోయి కూలబడ్డాడు. అసలతను ఇంతవరకూ ఆమెను చూచిగాని, ఆమెకొరకనిగానీ మాట్లాడలేదు. ఆమె అతన్ని చాలా జాలిగా చూచింది; చాలా ఆప్యాయంగా అతన్ని సమీపించింది.

అమ్మా: చూడండీ. నాకోసం మీరు బాధపడకండి. నా పని నేనే చేస్తాను... మీరింటికెళ్ళండి.

అత: ఎందుకులే, చెప్పినపని చేయలేదని మేనేజరు మండిపడతాడు.

అమ్మా: అదంతా నేను చూసుకుంటాను లెండి.

అత: ఎందుకమ్మా! అరగంటలో వస్తారు అయ్యగారు. అప్పటికి తయారుకాలేదంటే బైటికి తరుముతారు. ఇంతదూరం చేశాను. ఇది చేసిపోతే పోతుంది. (ఇంతకు పూర్వమే ముసలయ్య కాఫీ పట్టుకొచ్చి నిలబడి వున్నాడు) ముసలయ్యా, కాఫీ తెచ్చావా? ఇట్లా యిచ్చి ఆ టైపురైటర్ తెచ్చి ఇక్కడ తగలెయ్యి.

అమ్మా: ముందు కాఫీ తాగండి..

అత: (కాఫీ తాగాడు)

అమ్మా: అక్కర్లేదులే ముసలయ్యా. మీరు నా మాట విని ఇంటికి వెళ్ళండి. మీ కే బాధ రాకుండా నేను చూసుకుంటాను. వెళ్ళండి. నా మాట నమ్మరూ....

అత: వెళ్ళమంటావా?

అమ్మా: తప్పకుండా వెళ్ళండి.

అత: ఏమిటో తల్లీ. మతిచెడి ఏదో మాట్లాడాను. మనసులో వుంచుకోకు.

అమ్మా: అబ్బె....

అత: (వెళ్ళాడు)

ముస: (చాలా జాలిగా) పాపం! మనిషి నలిగిపోయాడమ్మా.

అమ్మా: (నిట్టూర్చి) ఏమిటో పాపం! (బల్లమీద వున్న కాగితాలు తీసుకొని టైప్రైటర్ గదిలోకి వెళ్ళబోతూ) ముసలయ్యా!

ముస: అమ్మా!

అమ్మా: నాకోసం ఒకాయన వస్తారు

ముస: తెలుసమ్మా!

అమ్మా: ఏమిటి తెలుసు?

ముస: మీకోసం ఒకాయన వస్తారని!

అమ్మా: నీకెలా తెలుసు?

ముస: ఈ రోజు కొత్తగా వుద్యోగంలో చేరబోతారు కదమ్మా!

అమ్మా: ఆయన్ను నీకు తెలుసా?

ముస: తెలుసులేమ్మా! తల్లీ! ఇంత వయసయి ఆమాత్రం తెలీదంటావా! తెలుసు లేమ్మా! తెలుసు. మిమ్మల్నిద్దరినీ .

అమ్మా: ఇద్దరినీ?

ముస: అవునులేమ్మా. ఎందుకట్టా కంగారుపడతావ్? ముసలయ్యకు తెలిస్తే ముంచుకు పోయేదేమీ లేదులే

అమ్మా: మమ్మల్నిద్దరినీ చూశావా ముసలయ్యా!!

ముస: ఎన్నోసార్లు. ఈడూ జోడూ చిలకాగోరంకల్లా నడిచివెళ్తూవుంటె - చూశాను లేమ్మా. కళ్ళకు ఎంత సల్లగుండేదనీ - చూస్తూ వుంటే

అమ్మా: ముసలయ్యా!

ముస: ఏంటమ్మా?

అమ్మా: ఈ విషయం, ఇంకెవరికైనా .

ముస: ఎవ్వరికీ నేను సెప్పలేదమ్మా.

అమ్మా: మన ఆఫీసులో ఎవరికన్నా. .

ముస: తెలుసేమో, నాకు తెలవదు,గాని నేనుగా ఎవరికీ చెప్పలేదమ్మా! నాకు తెల వదూ యిక్కడ శెప్తే కొంపలంటుకుంటాయని....

అమ్మా: అదికూడా తెలుసా నీకు?

ముస: తెలుసులేమ్మా! ముసలయ్య అంత మొద్దు ఎదవనుకున్నా. నా ముందు ఎందరు మైవమ్మలు వచ్చారు - పోయారు. ఆళ్ళందరూ ఎందుకెళ్ళారో గూడా తెలుసమ్మా! కాని తల్లీ, ఒక్క మాట శెప్తాను. కోప్పడవుకదా.

అమ్మా: చెప్పు ముసలయ్యా.

ముస: అయ్యగారి యవ్వారాలన్నీ అదొకమాదిరి. ..ఆయన్నట్టా దూరం దూరంగా పెట్టున్నావంటె నీ కే పనులు రావాలన్నా అవుతయి.

అమ్మా: ఏమిటి ముసలయ్యా నువ్వనేది?

ముస: ఏం లేదమ్మా! కొందరు కోరుకున్నది చేతి కందేదాకా అల్లాడతారు. అందిందా 'ఉస్' మంటేనా? అని ముసరిగొడతారు. అంతేనమ్మా.

అమ్మా: ముసలయ్యా! (ముసలయ్య చేయి పట్టుకుంది) ఒక్క సహాయం చేస్తావా?

ముస: ఏంటమ్మా. నే న్చేసేదేంటమ్మా.

అమ్మా: ఈ విషయా లేవిగాని ఎవరితోనూ పొక్కనీకు. ఆఫీసులో విషయాలు ఆయనకు తెలిస్తే చాల బాధపడతారు. ఆయన విషయం అయ్యగారికి తెలిసినా కొంప మునుగుతుంది. అన్నీ కడుపులో దాచుకో ముసలయ్యా.

ముస: అట్టాగేనమ్మా. కడుపు చించిచూచినా కనపడకుండా దాస్తానమ్మా! నువ్వేం భయపడకమ్మ. ఎల్లి పని చూసుకో తల్లి! (బైటికి వెళ్ళబోతున్నాడు. ఆ అమ్మాయి ప్రొప్రయిటర్ గదిలోకి వెళ్ళబోతుంది. ఇంతలో వాకిటినుంచి ఒక కుఱ్రాడు వచ్చాడు.)

అమ్మా: (లోపలికి వెళ్తూన్నదల్లా తిరిగిచూచి) రండి. కూర్చోండి.

ముస: (చిరునవ్వుతో వెళ్ళాడు.)

కుఱ్రా: ఏమిటీ కొత్త మర్యాదలేవో చేస్తున్నావు. రండీ గిండీ అని.

అమ్మా: కొత్త జీవితంలోకి దిగుతున్నారుగా!

కుఱ్రా: ఏమిటీ! గుమాస్తా జీవితమా?

అమ్మా: కాదు. గృహస్థు జీవితమేలెండి.

కుఱ్రా: ఇదుగో, ఆ అండీలు మానేస్తావా లేదా?

అమ్మా: ఇది ఆఫీసు.

కుఱ్రా: అయితే?

అమ్మా: ఇల్లనుకుంటున్నారేమోనని.

కుఱ్రా: ఆమాత్రం తెలుసులే.

అమ్మా: మీతో కొన్ని విషయాలు చెప్పాలని మిమ్మల్ని కొంచెం ముందుగా రమ్మన్నాను ఏమీ అనుకోరు కదా!

కుఱ్రా: ఏం చెప్తావో తెలీకుండానే!

అమ్మా: ఏది చెప్పినా మనమంచికే.

కుఱ్రా: మంచైతే మంచనే అనుకుంటాగా!

అమ్మా: చూడండీ.

కుమ్రా: ఏమిటి చూడమంటావు?

అమ్మా: అబ్బ. ఆ అల్లరే వద్దంటా.

కుమ్రా: అంతేనా?

అమ్మా: అంతేకాదు. మనం త్వరలో పెళ్ళిచేసుకోబోతాం.

కుమ్రా: మీ అమ్మా నాన్నా ఒప్పుకోవాలిగా.

అమ్మా: మీ రుద్యోగంలో చేరారుగా. ఇంకేం, ఒప్పుకుంటారు. నేను ఒప్పిస్తాను.

కుమ్రా: పిచ్చిదానా! ప్రేమను ఒప్పుకోని మనుష్యులు ఎప్పటికీ మారరు.

అమ్మా: పోనీండి. మీరుమాత్రం మనపెళ్ళి అయ్యేదాకా జాగ్రత్తగా వుండాలి.

కుమ్రా: అంటె?

అమ్మా: అంటె....ఆఫీసులో మనిద్దరి సంబంధం బయట పడడం మంచిదికాదు. పొరపాటున మీరు నన్ను పేరుపెట్టి పిలుస్తారేమో, నా సీటు ఆలోపలుంటుంది!

కుమ్రా: అదేమిటది?

అమ్మా: అది ప్రొప్రయిటర్ గది.

కుమ్రా: ఓ. తమ సీ టక్కడా?

అమ్మా: అవును. మీరు ఒళ్ళుమరిచి ఎప్పుడైనా గబగబా లోపలికి వచ్చేకండి. ఆ లోపలికి - పిలిస్తేగాని ఎవ్వరూ రావటానికి వీల్లేదు.

కుమ్రా: ఓ ....

అమ్మా: ముఖ్యంగా ప్రొప్రయిటరుకు మనిద్దరి విషయం ఏమాత్రం తెలియకూడదు.

కుమ్రా: ఏం?

అమ్మా: అదంతా తరవాత చెప్తాను.

కుమ్రా: ఊ.

అమ్మా: కొద్దికాలం జాగ్రత్తగా మసలుకోండి. ఏమిటిదంతా!

కుమ్రా: నిన్ను పేరుపెట్టి పిలవటానికి వీల్లేదు. ఆ గదిలోకి రావటానికి వీల్లేదు. మనిద్దరి సంబంధాలు ఎవ్వరికీ తెలియటానికి వీల్లేదు. ఏమి టీ భయం! ఎందుకీ భయం. నాకేమీ అర్థంకావటంలేదు.

లోపల్నుంచి 'ముసలయ్యా' అని మేనేజరుగొంతు.

అమ్మా: మానేజరు వస్తున్నారు. (వెళ్ళింది)

కుమ్రా: (ఏమీ అర్థంకాక నించున్నాడు.)

మేనేజరు వచ్చాడు.

మేనే: ఎవరు నాయనా?

కుర్రా: (పలక్కుండా తన జేబులోవున్న అపాయింటుమెంటు ఆర్డరు చూపెంచాడు.)

మేనే: ఓ. నువ్వేనా. రా. నాయనా ఇలారా. ఇదుగో....ఇది నీ సీటు.

కుర్రా: అసలు ఏం సీటండీ ఇది?

మేనే: ఆఁ. ఏం సీటు! మనం వేసుకుంటే అదే. గుమాస్తా నెంబరు రెండు అనుకుందాం.

కుర్రా: ఓ.... నేను చెయ్యాల్సిన పని?

మేనే: అట్టాంటివేం లేదు నాయనా యీ ఆఫీసులో. ఏ పని చేతికొస్తే. ఏ పని చెయ్యాల్సివస్తే అది చెయ్యాల్సిందే. చూడావూ

కుర్రా: అదేమిటండీ అన్యాయం.

మేనే: అన్నావూ ఆ ముక్క. ఇదుగో నాయనా, ఆ మాట యీ ఆఫీసులోకి వచ్చే ముందు ఆ వాకిట్లోనే వదిలిరా. అన్యాయమనే మాటకు యిక్కడ అర్ధంలేదు.

కుర్రా: చాల సంతోషం. అన్యాయమనే మాటేలేని చోటు ఇన్నాళ్ళకు చూచాను.

మేనే: వళ్ళు చూడు! అదేమాట. కుర్రాడివిగా వున్నావు గనక చెప్తున్నా విను. ఇక్కడ కాదు. నువ్వెక్కడి కెళ్ళినా అన్యాయం వుంది. అన్యాయంలేని అంగుళం లేదు. అలాంటప్పుడు మనం వూర్కే అన్యాయం అన్యాయ మని అరచుకోవటం దేనికి చెప్పు. ఏం లాభం. అందుకని అంతా న్యాయమను కుంటేనే ఆనందం - కనీసం బాధ తప్పుతుంది. ఏమంటావు?

కుర్రా: అది కాదండీ. అలా అన్యాయాన్ని ఎదుర్కోకుండా —

మేనే: ఇదుగో. నీతో వాదించాలనికాదు యింతాచెప్పింది. నా అభిప్రాయం చెప్పాను. అంతే.... కానీ నీ పని చూచుకో.

కుర్రా: నా పనేమిటో తెలియందే!

మేనే: పనా: చెప్తా! అందాకా ఆ ఫైళ్ళు, అందులో వున్న వుత్తరప్రత్యుత్తరాలు తేదీలవారీ సక్రమంగా వున్నాయా చూడు. ఏమయ్యా! అకౌంటెంటు. ఆ గదిలోనే చేరా! ఆ టైపురైటరు తెచ్చి ఇక్కడ పెట్టుకో కూడదూ. అయ్యగారొచ్చారంటే నీకూ నాకూ తల వాస్తుంది. రావయ్యా. రా.

అమ్మాయి వచ్చింది.

మేనే: నువ్వామ్మా! అకౌంటెంటు ఏడీ?

అమ్మా: ఇంటి కెళ్ళారు.

మేనే: వెళ్లావూ!

అమ్మా. నేనే వెళ్తున్నాను.

మేనే: నువ్వు వెళ్తమంటే వెళ్ళడమేనంటావు. నాతో చెప్పక్కర్లే దంటావు. నేనేంమి కిక్కడే ఇల్లూ పిల్లల్నూ పెట్టుకొని ఇరవైనాలుగ్గంటలూ వున్నది గాదనుకు నాయనా! సరే.. రానీ విచారిద్దాం.

అమ్మా: అది కాదండీ. ఆయనపని పూర్తి చేశారు. తైపు చేయాల్సింది నా పని.

మేనే. నీ పని అని ఎక్కడైన రాసుందేం. నీ పని ఆయనచేస్తే అరిగిపోతావా. అదే నాకు గిట్టదు. ఎవరిపనైనా సరే చెయ్యాల్సివస్తే చెయ్యాల్సిందే. అందుకే చెప్తాంటా రోజూ "పని చెయ్యండయ్యా పనిచెయ్యండి - పైకొస్తారు" అని.

అమ్మా: (నవ్వి) మీరు చెప్తానే వున్నారు. కానీ ఒక్కరూ పైకి రాలేదండి.

మేనే: రాకేం - నా విషయం చూడు!

అమ్మా: మీరు రావల్సినంతపైకి వచ్చారని మీకు నమ్మకమేనా!

మేనే: రావల్సినంత అనటానికి ఎక్కడలే అంతూ. ఏదో యీ మాత్రం పైకొచ్చానంటే ఏమిటంటావు? కేవలం పనిచేయటం. అంతే. ఇంత వయసయినా ఇంకా మమ్మల్ని వుద్యోగాలలో వుంచుకున్నారంటే అదే కారణం. ఈ కాలం కుర్రోళ్లున్నారే ఏంచేస్తారువని! గంటసేపు గట్టిగా కూచొని పని చేశారంటే తోటకూరకాడలా వాడిపోతారు. అసలు వాళ్ళకు పనిమీద దృష్టి లేదు. నమ్మకమూ లేదు. ఎంతసేపూ 'ఇది మా హక్కు. ఇవి మా కనీసపు కోర్కెలు' అని అరిచి అల్లరిచేయటం మీదనే నమ్మకం వాళ్ళకు. నేనూ చూస్తూనేవున్నా యీ మధ్య పేపర్లలో. అందుకే మన ఆఫీసులో నేనెప్పుడూ పాతకాలం ముసలాళ్ళనే వుద్యోగాల్లో వుంచుతుంటా.

కుర్రా: మరి నాకెలా ఇచ్చారండీ ఉద్యోగం?

మేనే: నీకా! నీ వుద్యోగం నాదాకా రాకుండానే జరిగిపోయిందనుకో. ఎందుచేతనో అయ్యగారు ఎప్పుడూ నన్నడిగేవారు. నీ వుద్యోగం విషయంలో అడగలా. ఏదో కారణముంటుంది!

అమ్మా: మీరయితే యిచ్చేవాళ్లు కాదన్నమాట.

మేనే: ఇవ్వనని కాదు. ఇస్తాను. కానీ గట్టిగా చెప్తాను. "పని చెయ్యండయ్యా పని చెయ్యండి, పైకొస్తారు" అని. నువ్వెళ్ళమ్మా పనిచూడు.

అమ్మాయి వెళ్ళింది. ఇంతలో శాస్త్రిల్లాంటి ఒక బ్రాహ్మణపుజాపడు విభూతి పెండికట్లు, పలక, పాతకోటు, గొడుగు, సంచితో వచ్చాడు.

మేనే: ఓ జాషియర్ గారూ! రండి రండి. మీకోసమే ఎదురుచూస్తున్నా.

జాషి: నమస్కారం. ఈ అబ్బాయి ఎవరు?

మేనే: మన ఓ. సి. టు.

కుర్రా: ఓ. సి. టు. అంటే ఏమిటండీ!

మేనే: అంటే ఆఫీస్ క్లర్కు నంబరు రెండూ అని.

కుర్రా: నాకు పేరుందండీ.

మేనే: నాకూ వుందేవిలే నాయనా ఆఫీసులో పేర్లతో పనేముంది — జీతం బట్వాడా అప్పుడు తప్ప. మా పేర్లు మేం పూర్తిగా మరిచిపోయాం.

జాషి: ఎప్పుడు ఛార్జి పుచ్చుకున్నావు నాయనా!

కుర్రా: ఇప్పుడేనండీ.

జాషి: అంటె గంట ఎంత వుంటుంది.

కుర్రా: ఏమో తెలీదు.

మేనే: తొమ్మిది వుంటుందండి.

జాషి: అదేమిటి నాయనా ఎందుకు తొందరపడ్డావు? సరిగ్గా మంచి రాహుకాలంలో ఛార్జి పుచ్చుకున్నావే! నీ లగ్నం ఏమిటో తెలుసా?

కుర్రా: తెలీదు.

మేనే: జాషియర్‌గారు. మరచా మా ఆవిడ జాతకం కాస్త చూడాలి మీరు.

జాషి: ఏం? ఎలాగుంది?

మేనే: ఏమో అది ఒకలాగు తయారవుతూందండి. కాస్త చూచి చెప్పండి.

జాషి: చూస్తా. చూస్తా. ఏం నాయనా. నీకు నక్షత్రమన్నా తెలుసా?

కుర్రా: అదీ తెలీదు

మేనే: అయితే జాతకమే లేదన్నమాట!

కుర్రా: అన్నమాటే.

మేనే: మునలయ్యా. మునలయ్యా. (మునలయ్య వచ్చాడు) మా యింట్లోకెళ్ళి మా ఆవిడ జాతకం అలమారాలో పై సొరుగులో వుంది. మా అమ్మాయి నడుగు - ఇస్తుంది. పట్టా పో.

మున: (వెళ్ళాడు)

జాషి: ఏదీ చెయ్యిలా యివ్వు నాయనా. చూద్దాం.

మేనే: ఇవ్వావయ్యా ఇవ్వు. మా రాపియర్‌గారు జ్యోతిషం చెప్పారంటే ఖచ్చితంగా జరిగి తీరాల్సిందే.

కుమ్రా: (పెద్దగా యిష్టంలేకపోయినా చేయి యిచ్చాడు.)

రాషి: (చేయి చూస్తున్నాడు)

అమ్మా: (వచ్చి నిలబడ్డది)

రాషి: అదృష్ట జాతకమే! ఒక్క విషయం మాత్రం గట్టిగా చెప్పొచ్చు నాయనా నువ్వు భయం అన్నది ఎరగవు.

మేనే: ఆఁ, ఈకాలం కుర్రాళ్లే అంతరెండి. భయం భక్తులెక్కడుంటాయి?

రాషి: ఆ భయంకాదు. ఇప్పుడు మనందరికి బతకలేమన్న భయం. నిజం చెప్పాలంటె భయం. చావంటె భయం. ఇలాంటి వున్నాయి చూచారూ. అవేవీ వుండవు ఇతనికి.... నీకు పెళ్ళయిందా బాబూ?

కుమ్రా: మీరే చెప్పండి?

రాషి: అయింది. అయుండాలి. ఏం?

కుమ్రా: నాకు తెలిసి కాలా.

రాషి: ఇదుగో అబద్ధం చెప్పకు. అసలు నీకు వీటిలో నమ్మకమే వున్నట్టు లేదు చూస్తే....అందుకే అపహాస్యం చేస్తున్నావ్. నీకు ఘంటాపధంగా పెళ్ళయింది. ఇంకా చెప్తే ఒకపిల్లాడు పుట్టివుండాలి. లేదా త్వరలో పుట్టాలి. అంటె నీ భార్య కనీసం గర్భంగా వుండాలి.

అమ్మా: (కొంచం తెల్లబోయింది.)

రాషి: ఏం? నిజమేనా?

కుమ్రా: పచ్చిఅబద్ధం.

రాషి: ఇదిగో....జ్యోతిషాన్ని అబద్ధం అనకు.

కుమ్రా: మరేమనమంటారు! నాకు పెళ్ళికాందే....

రాషి: నీకు అయిందంటాను.

కుమ్రా: నాకు కాలేదంటాను.

రాషి: పెళ్ళంటే ఏమిటని నీ అభిప్రాయం?

కుమ్రా: మీ అభిప్రాయం ఏమిటి?

రాషి: పెళ్ళంటే తాళిబొట్టు కట్టటమేనా. పెళ్ళిళ్ళలో ఎన్నో రకాలున్నాయి. శాస్త్ర ప్రకారం, గాంధర్వం, రాక్షసం, స్వయంవరం అని ఎన్నో పెళ్ళిళ్ళు. అందులో ఏదో ఒకటి కావచ్చు. ఏం?

సుబ్రా: (తెల్లబోయాడు)

అమ్మా: ('అయిందా శాస్తి' అన్నట్టు సుబ్రాడి వంక చూచింది.)

రాఘు: నీ భార్య గర్భవతి. రావాలంటే అడిగి తెలుసుకో. జ్యోతిషమా - మజాకానా!

ఇంతలో మానేజరు ఇంట్లోనుంచి మానేజరు భార్య వస్తుంది.

భార్య: జ్యోతిషం. ఎవడు వాడు జ్యోతిషం చెప్పేవాడు. ఇటు రమ్మను నేను చెప్తా.

లోపలి కొచ్చింది. ముసలయ్య వెంబడించాడు.

మేనే: (గడగడలాడిపోతున్నాడు) నువ్వొచ్చావా?

భార్య: ఏమండీ జాతకం రావాలా? ఎందుకూ? ఎవరిక్కడ జ్యోతిషం చెప్పేవాళ్ళు.

మేనే: ఊ....నేనే ...ఈయనే....నువ్వింట్లో కెళ్ళు...నేనంతా తెలుసుకొస్తా.... పద....నా మాట విను. ఇది ఆఫీసు.

భార్య: ఆఫీసయితే ఏం భయమా! ఆఫీసు, ఆఫీసు — అని ఇన్నాళ్ళూ మమ్మల్నంతా ఈ గతి పట్టించారు. ఇంకా ఏ మాఫీసు, చాల్లెండి — మీ ఆఫీసు, మీ ఉద్యోగం. ఏమయ్యా, నువ్వు జ్యోతిషం చెప్తా. ఏమిటి నువ్వు చెప్పేది. మా జాతకాలు నువ్వు చెప్పేదేమిటయ్యా. ఆయన 75 ఏళ్ళు, నేను 65 ఏళ్ళు మా బతుకులు బతికాం. మా జాతకాలు మాకు తెలవంది నీకేనా తెలిసేది, జాతకమట, జ్యోతిషమట, అరవై అయిదేళ్ళుగా లేంది — ఇంకేం రాబోతూంది మాకు? ఇప్పటికి అరడజనుమంది పిల్లల్ని కన్నాను. ఇక చచ్చినా కనను. అసలు నేను బతికుంటేగా కనటానికి. ఇంకో అయిదు నిమిషాల్లో చావబోతాను. నా కెందుకయ్యా జాతకం. చెప్పు. నేను చస్తానా లేదా? చెప్పు.

మేనే: ఇదుగో చూడు చూసి అంతా చెప్తారు. నువ్వింట్లోకి పో. రావాలంటె ఆయ నొస్తారు. పద. నామాట విను.

భార్య: వినివినే ఈ దశపట్టింది. ఇంకా వినటం దేనికి, నువ్వు చెప్పటం దేనికి. అసలు నాకెవ్వరూ చెప్పక్కర్లా. ఎవరు చెప్పినా చెప్పకున్నా నేనింక అయిదు నిమిషాల్లో చస్తాను. తప్పదు. చచ్చిపోతాను. నా పిల్లలు - కడుపుచించుకొని కన్నానే ఆ పిల్లలంతా నడివీధుల్లో అడుక్కుతింటారు. అంతే. (భోరుమని ఏడుస్తున్నది.)

కాషి: అమ్మా. అమ్మా అలాంటి దేమీలేదు. మీకు గట్టి ఆయుస్సుంది.

భార్య: ఎందుకు. యీ మొగుణ్ణి, యీ పిల్లల్ని, యీ ఆఫీసుని కట్టుకొని యీడవ టానికా; ఇంకా పిల్లల్ని కనటానికా. ఎందుకయ్యా ఆయుస్సు. నువ్వు వెయ్యి చెప్పు, నేను చస్తాను.

కాషి: లేదమ్మా, మీరు ఇప్పుడల్లా పోరు.

భార్య: పోతాను.

మేనే: ఏమే! పూర్ణోపే, రా, యింటికిపోదాం రావే.

భార్య: ఇల్లు. మన మొఖానికి ఇల్లుకూడానా. ఏదో మహా ఇల్లున్నట్టు పిలుస్తున్నారు. నేను యీ ఆఫీసులోనే చస్తాను.

మేనే: రావే. నా మాట వినవే, రా.

కాషి: పదండమ్మా, పదండీ.

భార్య: నేను చచ్చిపోతాను. అదిగో యమదూతలు. అదిగో వస్తున్నారు. నన్నేనా, నన్నేనా, రమ్మంటున్నారు! వస్తున్నా, వస్తున్నా.

మేనే: (పట్టరాని దుఃఖాన్ని ఆపుకుంటూ) పదవే,

ఆమెను బలవంతాన తీసుకొని వెళుతున్నాడు.

మేనే: కాషియర్‌గారూ ___ ఒకసారి యిలా రండి.

కాషి: (వెంబడించాడు)

కుర్రాడు, అమ్మాయి తెల్లబోయి నుంచున్నారు.

కుర్రా: ఏమిటది?

అమ్మా: పాపం, మతి చలించింది. చచ్చిపోతుందన్న భయం పట్టుకుంది.

కుర్రా: చావు భయం. (ఒక్కక్షణం నిశ్శబ్దం) సరేగాని, ఆ శాస్త్రుల్లేమిటి అలా చెప్పారు?

అమ్మా: ఏమని?

కుర్రా: నా భార్య గర్భమట!

అమ్మా: నిజమే.

కుర్రా: ఏమిటీ నీకు గర్భమా!

అమ్మా: (తలవంచింది)

కుర్రా: నాతో చెప్పలేదేం!

బయట చెప్పుల చప్పుడు

అమ్మా: ప్రొప్రయిటర్! (నమ్రతగా పి.యస్. రూములోకి పారిపోయి తన సీటులో కూర్చుంది. టైపు చేస్తోంది. ప్రొప్రయిటర్. పి.యస్. వచ్చారు. ఇద్దరి వాడు నమస్కార మన్నారు. (ప్రొప్రయిటర్ గమనించనట్టే వెళ్లాడు.)

పి.యస్: ఏమిటబ్బాయి నువ్వు. కొత్త గుమాస్తా కదూ! అవున్లే. నాకు తెలుసు. కూచో. కూచో. పనిచూసుకో.

అని ప్రొప్రయిటర్ గదిలోకి వెళ్ళాడు.

ప్రొప్ర: ఆఫీసులో ఎవరూ లేరేం?

అమ్మా: మేనేజరుగారు ఇప్పుడే యింట్లో కెళ్ళారు.

పి.యస్: (వస్తూ) వెళ్ళాడూ. వెళ్తాడు. నాకు తెలీదూ. ఆయన చెప్పుడూ ఇల్లే. అసలు ఆఫీసులోనే కాపురం పెట్టటంలో వచ్చిందండీ ఈ గొడవంతాను.

ప్రొప్ర: ముసలయ్యా!

అమ్మా: ముసలయ్యకూడా మేనేజరుగారింటికే వెళ్ళాడు.

పి.యస్: వాడూ వెళ్ళాడూ. వెళ్తాడు. నాకు తెలీదూ! కాషియర్ ఏమైనాడో....

అమ్మా: ఆయనా అక్కడే వున్నారు.

పి.యస్: అందరూ అక్కడే వున్నారు! వుంటారు. వుంటాడు. నాకు తెలీదూ. ఏం విందులు చేస్తున్నాడూ - యింటికి తీసుకెళ్ళి.

అమ్మా: కాదండీ. ఆయన భార్యకు చాల జబ్బుచేసింది.

పి.యస్: జబ్బు చేసిందీ! చేస్తుంది, నాకు తెలీదు!

ప్రొప్ర: నీ కన్నీ తెలుసులేవోయ్. వెళ్ళి వాళ్ళను పిలువు.

పి.యస్: చిత్తం....(అంటూ వెళ్ళాడు)

ప్రొప్ర: అకౌంటెంటు ఏమైనాడు?

అమ్మా: ఇంటికి వెళ్ళారు.

ప్రొప్ర: ఆ స్టేటుమెంట్లు తయారైనాయా!

అమ్మా: ఇంకా కాలేదండి.

ప్రొప్ర: కాకుండా ఎందు కింటికెళ్ళాడు?

అమ్మా: నేనే వెళ్ళమన్నాను.

ప్రొప్ర: ఓహో!

అమ్మా: ఆ స్టేటుమెంట్లు నేను టైపు చేస్తున్నాను.

ప్రొప్ర: ఉహూం.

మేనేజరు, ఏ. యస్. వచ్చారు.

మేనే: నమస్కారం సార్!

ప్రొప్ర: ఏమయ్యా! నువ్వెప్పుడూ ఇంట్లోనే కూచుంటావా? ఆఫీసుకొచ్చేదంటూ ఎప్పుడైనా వుందా?

మేనే: లేదండీ ...

ప్రొప్ర: ఏమిటీ! ఆఫీసుకు రానంటావ్

మేనే: అదికాదండీ.

ప్రొప్ర: ఏది కాదండీ. ఏమిటయ్యా నీ నిర్వాకం. ఎవరికి వాళ్ళు యిళ్ళకు పోతున్నారు; వస్తున్నారు. అకౌంటెంటుకు నే నంత ఖచ్చితంగా చెప్పివెళ్ళాను - స్టేటుమెంట్లు టైపుచేసి పెట్టమని. ఇంటికెళ్ళి కూర్చున్నాడు.

మేనే: టైపు అవుతున్నాయండీ.

ప్రొప్ర: అరె. నే నెవరితో చెప్పాను, ఎవరు చేస్తున్నారు?

మేనే: ఆమే తను చేస్తానని ఆయన్ను వెళ్ళమన్నది.

ప్రొప్ర: ఆమె వెళ్ళమన్నది - ఆయన వెళ్ళాడు. మధ్యన నువ్వెందుకూ, నువ్వూ వెళ్ళు. ఇదుగో చెప్తున్నా - ఇరవై నాలుగ్గంటలూ నువ్వు యింట్లో కూర్చునే పక్షంలో ఇల్లు వెంటనే ఖాళీచెయ్యి. ఆఫీసు చూచుకుంటావని ఇల్లు దగ్గరగా యిచ్చానుకాని, ఇల్లు చూచుకుంటావని ఆఫీసుకు దగ్గరగా పెట్టలేదు నిన్ను. వెళ్ళి ఆ ఇన్‌కంటాక్సు ఆఫీసర్ను చూచిరా. ఆ కేసు వాయిదావుంది.

మేనే: చిత్తం.

ప్రొప్ర: చిత్తమని నిలబడతావేం. వెళ్ళవయ్యా, వెళ్ళు. కాషియర్‌ను యిటు రమ్మను.

మేనేజరు వెళ్ళాడు; కాషియర్ వచ్చాడు.

కాషి: వచ్చాను సార్.

ప్రొప్ర: ఏమయ్యా కూలీలకు ఈ వారం జీతం బట్వాడా చెయ్యొద్దూ.

కాషి: చెయ్యాలి సార్.

ప్రొప్ర: చెయ్యాలి సార్ అని నిలబడతావేం?

కాషి: పదిన్నరదాకా రాహుకాలమండీ.... అందుకనీ....

ప్రొప్ర: నీకు పోయ్యేకాలం రాకుండా చూచుకో. వెళ్ళవయ్యా వెళ్ళు. ఇదుగో ఈ వారం - సగం జీతాలే బట్వాడా చెయ్యి.

కాషియర్ వెళ్ళాడు.

ప్రొప్రై: ఛీ ఛీ ఛీ. వ్యాపారమంటేనే భయమైపోతుంది. (అంటూ తలపట్టుకు కూర్చుంటాడు)

పి.యస్: భయమేనండీ. నాకు తెలీదు! మీరు కాస్త రెస్టు తీసుకోండి. అమ్మాయ్! అదంతా తర్వాత చూద్దువుగాని ముందు అయ్యగారికి కాస్త పక్క అదీ వేసి చెయ్యి.

అమ్మాయి పడకగదిలోకి వెళ్ళింది. పి.యస్. ఆఫీసు గదిలోకొచ్చి కుర్రాడితో,

పి.యస్: ఇదుగో అబ్బాయ్! వేరే ఏమీ అనుకోకు. ఈ ఆఫీసులో ఉంటేలే. నువ్వో - సైకిల్ వేసుకొని వెళ్ళి మంచి ష్ట్రాంగు కాఫీ ఒక కప్పు - కాదు - రెండు కప్పులు తీసుకరా.

కుర్రా: (అదోరకంగా చూస్తాడు.)

కుర: ఎందుకు బాబూ. వేసున్నానుగా. వెళ్తాస్తాను.

పి.యస్: నువ్వెళ్ళొస్తావు. నాకు తెలీదు....నీతో ఇక్కడ పనుందిలే....నువ్వెళ్ళరా నాయనా.

కుర్రా: ఇప్పుడు చెప్తే చెప్పారుగాని ఇకమీదట చెప్పకండి. (అంటూ వెళ్ళాడు)

పి.యస్: (కొంచెం దెబ్బతిన్నాడు) ఉహూ. అబ్బాయ్ బిర్రులో వున్నాడే. చూసుకుంటాలే. నాకు తెలీదు!

ఇంతవరకూ కాషియర్ కాష్‌బాక్సులో నుంచి డబ్బుతీసి లెక్కపెట్టుకుంటున్నాడు. లోపల్నుంచి "కాషియర్" అని ప్రొప్రయిటర్ కేక. "అయ్యా" అంటూ కాషియర్ పరుగెత్తాడు.

ప్రొప్ర: ఏమయ్యా ఈ ఏడు పత్తిధరలు ఎలా వుంటాయ్?

కాషి: ఈ ఏడా అండీ!

ప్రొప్ర: ఆఁ. ఈ ఏడే.

కాషి: పత్తికధిపతి బుధుడు....బుధుడు ఉచ్చంలో వున్నాడు. కనుక గ్రహచారరీత్యా పత్తికి ఈఏడు విపరీతమైన ధర ఏర్పడాలి.

పి.యస్: (లోపల్నించి వస్తూ) ఏర్పడుతుంది. ఏర్పడుతుంది నాకు తెలవదు! అయితే క్యాషియర్‌గారు, డబ్బు పరిస్థితి ఎలాగుంటుందో!

కాషి: డబ్బా! ధనాధిపతి కుజుడు. వాడు కొంచెం వక్రంలో వున్నాడు. ఈ ఏడు ప్రథమభాగం కొంచెం కష్టంగా వున్నా రానురాను పరిస్థితులు బాగుపడి పోతాయి.

ప్రొప్ర: ఏమిటయ్యా బాగుపడతాయి. రెండు సంవత్సరాలుగా యిదేమాట చెప్తున్నావ్. రాను రాను రాజు గుర్రం గాడిదవుతున్నది. ఎక్కడికక్కడ బిగుసుకు పోయి వూపిరాడక చస్తున్నాం. డబ్బేమో కరువైపోయింది. ఏ వ్యాపారంలో చెయి పెడదామన్నా భయమైపోయింది. ఎట్లాగయ్యా బితకడం, గుండెల్లో గాపిదలు తంతుంటే.

పాపి: అది అంతేనండి. ఈ సంవత్సరం భయాధిపతి యముడు. అందుచేత అందరికీ భయం భయంగానే వుంటుంది. అందాకా ఎందుకు? అమెరికావాడు హైడ్రోజన్ బాంబు కనిపెట్టాడా! దానికి భయపడి రష్యావాడు నైట్రోజన్ బాంబు కనిపెట్టాలని అనుకుంటున్నాడా! అంతే అనుకోండి. ఎక్కడికక్కడ ఎవరికి వాళ్ళకు ఏదో ఒక భయం వుండి తీరుతుంది. అసలీ యుగాన్నే భయం యుగమన్నారు లెండి.

పి.యస్: అన్నారూ! అంటారు. నాకు తెలీదు....అంతా భయమే! ఇన్‌కంటాక్సు భయం, కమ్యూనిష్టుల భయం, స్ట్రయికుల భయం, ఈ గొడవల్లో ఎవడెప్పుడు ఏ బాంబు విసిరేస్తాడోనని భయం. ఈమధ్య గుండె లాగిపోవటాలు ఎక్కువై ఎప్పుడు గుండాగిపోయి మనమూ చస్తామని భయం, ఏ క్షణంలోనైనా ఉన్న ఉద్యోగాల్లోంచి వూడదెరికేస్తారని భయం....

ప్రొప్ర: చాల్లేవోయ్. మహాపట్టుకున్నారు భయాన్ని, నువ్వెళ్ళి రావయ్యా.

పాపి: చిత్తం (అంటూ వెళ్ళిపోయాడు. అదే సమయానికి అమ్మాయి పదికగది లోంచి ప్రొప్రయిటర్ గదిలోకి వచ్చింది)

పి.యస్: ఏ భయంలేని మనిషిని ఒకర్నే చూశానండి.

ప్రొప్ర: ఎవరయ్యా?

పి.యస్: ఇంకెవరూ. మన టైపిస్టే.

అమ్మా: ఊ. (అని జాలిగా నవ్వి తనసీటులో కూర్చొని పని మొదలెట్టబోయింది)

ప్రొప్ర: ఇదుగో! ఇప్పుడెందుకా గొడవ. తర్వాత చేసుకోవచ్చులే.

అమ్మా: అర్జెంటన్నారు!

పి.యస్: అర్జెంటే. నాకు తెలీదూ. అర్జంటైతే ఇంకెవరన్నా చేసి పెడతారు.

ప్రొప్ర: ఇలా రా.

అమ్మా: (వచ్చి టేబుల్‌దగ్గర నిలబడ్డది)

ప్రొప్ర: కూచో.

అమ్మా: చెప్పండి.

ప్రొప్రై: ఏం చెప్పమంటావ్?

అమ్మా: (తను నిలబడటం తనకే బాగుండలేదు. అందువల్ల) నేనటు వెళ్ళి పని చూసుకుంటాను.

పి.యస్: అదెందుకూ. ఇటు వెళ్ళరాదూ. (అని పడకగది చూపిస్తాడు)

అమ్మా: (అతన్ని ఉరిమి చూస్తుంది.)

ప్రొప్రై: (గుర్తించి) ఏమిటోయ్. అంత మొరటుగా మాట్లాడతావ్....మాట్లాడటం చేతగాకపోతే సరి.

పి.యస్: వాడికాదు లెండి. నాకు తెలీదు!

అమ్మా: (పక్కుమని నవ్వింది)

ప్రొప్రై: (ఆ అదును చూసుకొని) చాల కమ్మగా నవ్వుతావే.

అమ్మా: (మొహం ముడుచుకుంది)

ప్రొప్రై: పోనీలే....నీ కిప్పటికి తృప్తేనా.

అమ్మా: (కంగారుగా) ఏమిటండీ!

ప్రొప్రై: ఇంతలో మరిచిపోయావన్నమాట.

అమ్మా: (అర్థం కాలేదు)

ప్రొప్రై: ఏం లేదులే, కంగారుపడకు. నువ్వు సిఫారసు చేసిన అబ్బాయికీ .... ....

అమ్మా: ఓ అదా. చాల థ్యాంక్స్.

ప్రొప్రై: ఊరికే థ్యాంక్స్ అనకపోతే ఆ చేతులతో ఒక చల్లని డ్రింకు ఇవ్వకూడదూ.

పి.యస్: ఎందుకివ్వకూడదూ. ఇస్తుంది. నాకు తెలీదు!

అమ్మా: (అతన్ని అసహ్యంగాచూసి పడకగదిలోకి వెళ్ళింది.)

పి.యస్. లోపలి కెళ్ళండని సైగచేశాడు. ప్రొప్రయిటరు లేచాడు. వాకిలిదాకా వెళ్ళాడు. పి. యస్. వెనకాలే వెళ్ళి తొందర చేశాడు. ప్రొప్రయిటరు, 'వుండవోయ్' అన్నట్టు కసరుకొని బయట ఎవరూ లేరా, అని సైగతోనే అడిగాడు.

పి.యస్: (రహస్యంగా) పంపించేశా. నాకు తెలీదు!

ప్రొప్రయిటర్ ఒక్క అడుగు వేసేలోగా ఆ అమ్మాయ్ డ్రింకుపట్టుక వచ్చింది. పి.యస్. ఛాన్సు జారవిడిచారన్నట్టు వెధవముఖ మేశాడు. అమ్మాయి డ్రింకు అందించింది. ప్రొప్రయిటరు అందుకుంటూ ఆమెచేతికి తనచేయి తగిలించ

తానికి ప్రయత్నిస్తున్నాడు., ఆమె వేళ్ళు తప్పించుకుంటున్నది. సరిగ్గా ఈ సమయానికి కుర్రాడొచ్చాడు కాఫీతో. అమ్మాయి గ్లాసు జార విడిచింది. గ్లాసు కిందపడిపోయి ముక్కలయి పోయింది. ప్రొప్రయిటరు బట్టలన్నీ ఖరాబైనాయి.

పి.యస్: ఏమిటమ్మా అది. ఏమిటలా పడేశావ్! బట్టలన్నీ పాడైపోయాయ్. ఛ్ఛ. ఛ్ఛ. ఛ్ఛ.

ప్రొప్ర: ఫరవాలేదు లేవోయ్. ఫరవాలేదు.

కుర్రవాడు, అమ్మాయ్ అలాగే స్తబ్ధులై ఒకరి మొఖాలు ఒకరు చూసుకుంటున్నారు.

పి.యస్: ఏమిటోయ్. అలా కళ్ళప్పగించి చూస్తూ నిలుచుంటావ్, కాఫీ అక్కడ పెట్టి వెళ్ళు.

కుర్రా: తీసుకరమ్మంటె తీసుకొచ్చాను. ఏమిటా కేకలు!

ప్రొప్ర: (పి.యస్.ను) నువ్వేమిటోయ్ అందర్నీ కేకలేస్తావ్. వాళ్ళిద్దరూ ఒకరి నొకరు తెలిసినవారు. చూచుకున్నారు. నీ దేం పోయింది. కదబ్బాయ్. మా సెక్రెటరీ నీకు బాగా తెలుసుకదూ?

కుర్రా: నాకా!

ప్రొప్ర: ఆఁ. నీకే. తెలియబట్టేగా అంతగట్టిగా సిఫారసు చేసి నీకు ఉద్యోగ మిప్పించింది!

కుర్రా: నాకా!

ప్రొప్ర: (కుర్రాడి వీపుతట్టి) ఏం ఫర్వాలేదులే.

నవ్వి పక్కగదిలోకి వెళ్ళాడు.

పి.యస్: ముసలయ్యా! అదంతా తర్వాత చూద్దువుగాని ముం దీగ్లాసుముక్కలూ అవీ తీసి అవతలపారెయ్యి.

అంటూ పడకగదిలో వెళ్ళాడు. ఒక్క క్షణం నిశ్శబ్దం. ముసలయ్య వచ్చాడు. గ్లాసుపెంకు లేరుతున్నాడు.

కుర్రా: ఏమి టిదంతా!

అమ్మా: గ్లాసు చెయ్యిజారి పడిపోయింది.

కుర్రా: ఎందుకలా భయపడ్డావ్?

అమ్మా: ఏం లేదే!

కుర్రా: కళ్ళారా చూసిందాన్నికూడా లేదంటున్నావే!

అమ్మా: మీరు పొరబడ్డారు.

కుర్రా: ఓహో అయితే అయ్యగారి దగ్గర నీకున్న పలుకుబడి నుపయోగించి నాకు ఉద్యోగ మిప్పించావన్నమాట.

అమ్మా: దాన్ని మీరు అపార్థం చేసుకుంటున్నారన్నమాట.

కుర్రా: దాని అర్థం చేసుకోటానికే ప్రయత్నించటం లేదు.

అమ్మా: మరి?

కుర్రా: ఆడదాని ద్వారా ఉద్యోగం సంపాయించి బతకటం నా కిష్టంలేదు.

ముసలయ్య పగిలిన గ్లాసుముక్కలతో బయటి కెళ్ళాడు.

అమ్మా: ఆఁ అయితే ఇప్పుడేం చెయ్యాలను కున్నారు?

కుర్రా: ఇష్టంలేని పని ఎప్పుడూ చేయనని నీకు బాగా తెలుసు.

అమ్మా: తొందరపడకండి. నా మాట వినండి. నేను మీకిదంతా తర్వాత చెప్తాను. నామీది ఆగ్రహం కొద్దీ ఉద్యోగం వదిలేయకండి. నాకోసం కాకున్నా మీ....

పొంగి వస్తున్న దుఃఖాన్ని ఆపుకొన్నది. పి.యస్. వచ్చాడు.

పి.యస్: అమ్మాయ్, అదంతా తర్వాత చూద్దువుగాని ముందు అయ్యగారు పిలుస్తున్నారు వెళ్ళు. ఆ షార్టుహాండు పుస్తకం తీసుకెళ్ళు. ఉత్తరాలేవో చెపుతారట.

అమ్మా: (కళ్ళనీళ్ళు తుడుచుకొని లోపలి కెళుతుంది. పి.యస్. ఆమెను గమనించాడు. కుర్రవాడు అలాగే నిలబడి వున్నాడు)

పి.యస్: అబ్బాయ్, నువ్విప్పుడేం చేస్తున్నావ్?

కుర్రా: నిలబడున్నా.

పి.యస్: ఓహో. సరే, వెళ్ళి నీ సీట్లో కూర్చొని ఈ స్టేటుమెంట్లన్నీ ఈ రాత్రి లోగా టైపుచేసి పొద్దున ఆరుగంటలకల్లా అయ్యగారి బల్లమీద టంచనుగా పెట్టేసెయ్యి - చూద్దాం.

కుర్రా: అది ఆమె చెయ్యాల్సిన పని. నే నెందుకు చేస్తాను!

పి.యస్: అదుగో అదే అధిక ప్రసంగం.

కుర్రా: అధిక ప్రసంగ మేమిటండీ. నన్ను మీరు టైపిస్టుగా కాదు అపాయింటు చేసుకుంది.

పి.యస్: నిన్ను ఏ యిస్టుగాను అపాయింటు చేసుకోలేదు. ఇప్పుడు టైపిస్టుగానే చేస్తున్నాం. ఏమంటావ్?

కుర్రా: మరి ఆమె ఏమౌతుంది?

పి.యస్: అది నీ కెందుకూ.

కుర్రా: ఒకరి నోడదెరికి ఆ ఉద్యోగంలో చేరటం నా కిష్టంలేదు.

పి.యస్: నీ కిష్టంలేనివి ఎన్నో వుంటాయ్. నాకు తెలీదు. ఇది మా ఇష్టం...... ముసలయ్యా! (ముసలయ్య వచ్చాడు) అదంతా తరువాత చూద్దువుగాని ముందీ టైపుమిషన్ తీసుకెళ్ళి ఆఫీసులో పెట్టు.

ముసలయ్య టైపు మిషన్ తీసుకెళుతున్నాడు.

పి.యస్: (కుర్రాడిని వీపుమీద తట్టి) వెళ్ళబ్బాయ్, బుద్ధిమంతుడులాగా పనిచేసుకో.

కుర్రాడు మింగలేక కక్కలేక ఏదో రుసరుసలాడుతున్నాడు. ఏదో చెప్ప దోయాడు. ఇంతలో ఆ అమ్మాయి వచ్చింది.

అమ్మా: (కాగితం కుర్రాడి చేతులోపెట్టి) ఈ లెటరు వెంటనే టైపుచేసి పెట్టండి.

కుర్రాడు ఆమెను ఎర్రగా చూచాడు. ఆమె వెళ్ళిపోయింది. ఆ కాగితాన్ని అటూ యిటూ తిప్పి చదువుకున్నాడు. విసుగుతో నలిపి కింద పారేశాడు. టైప్‌రైటర్ గదిలోంచి ఆఫీసు గదిలో కొచ్చి నిలబడ్డాడు. పి. యస్. దాన్ని అందుకొని, చదువుకొని ఆఫీసుగదిలో కొచ్చాడు. కుర్రాడ్ని చూచాడు.

పి.యస్: అబ్బాయ్!

కుర్రా: అబ్బాయ్ ఏమిటండీ! ఎవరికబ్బాయ్? నాకు పేరుంది పిలవటానికి.

పి.యస్: ఓహో. ఏమిటో నీ పేరు.

కుర్రా: మీ కెందుకు?

పి.యస్: అదేమిటయ్యా. పేరుపెట్టి పిలవమంటావు అడిగితే పేరు చెప్పనంటావ్.

కుర్రా: మీరు పిలవాల్సిన అవసరం లేదులెండి.

పి.యస్: ఓహో! సరే అయితే....ఈ ఉత్తరం ఏమిటంటావ్.

కుర్రా: మీరు పెద్ద మనుషులనుకున్నా.

పి.ఎస్: కాదని ఎవరన్నారు.

కుర్రా: ఏమిటి మీ పెద్దమనిషితనం. ఇతరుల ఉత్తరాలు చదవటమేనా!

పి.ఎస్: పెద్దమనిషిని గనకనే నీకు బుద్ధి చెప్పటానికి వచ్చాను.

కుర్రా: ఇలాంటి బుద్ధితక్కువ పనులు ఇంకెప్పుడూ చేయకండి!

పి.ఎస్: (పెద్దగా) అబ్బాయ్!

కు|రా: ఏమిటి నీ దబాయింపు — నువ్వేమిటి నాకు బుద్ధి చెప్పేది. నువ్వేపనో ఏమిటో నాకు బాగ తెలుసు!

పి.ఎస్: నువ్వేపనోకూడ నాకు బాగ తెలుసు. రెండు సంవత్సరాలు ఉద్యోగం లేకుండా తిరిగి ఈనాడు ఆ అమ్మాయి దయవల్ల ఉద్యోగం సంపాదించు కున్నావ్.

కు|రా: Nonsense ఆ అమ్మాయి దయేమిటి? మీకు అవసరముంటే ఇచ్చారు.

పి.ఎస్: అవసరమున్నా నీకే ఇవ్వాలన్న అగత్యంలేదు.

కు|రా: లేకపోతే మీ ముండమోపి ఉద్యోగం నాకక్కర్లేదు.

పి.ఎస్: అబ్బాయ్. ఆ ఆవేశమే వద్దంటాను. ముందు ముందు ఎన్నో మంచి అవకాశాలున్నాయ్. అనవసరంగా చేతులారా చెడగొట్టుకోకు. ఆ అమ్మాయి జీవితాన్ని పాడుచెయ్యొద్దు. ఆవిడ చాలా తెలివైంది. అయ్యగారి అభిమానాన్ని సంపాదించుకుంది.

కు|రా: ఏమిటా అభిమానం. మేకపిల్లమీద కసాయివాడికున్న అభిమానమేనా!

పి. ఎస్: నువ్వో...కమ్యూనిష్టులాగున్నావ్. డబ్బుగల వాళ్ళను ద్వేషించటం నీకు స్వభావమైపోయింది. పోనీలే. అయ్యగారిని నువ్వెరగవ్. ఆయన అనుకుంటె నిన్ను అందల మెక్కిస్తాడు.

కు|రా: అక్కర్లేదు. ఆ అందలమేదో మీరే యెక్కండి.

పి. ఎస్: నువ్వక్కర్లేదంటే సరిపోతుందా. ఆ అమ్మాయి కావాలనుకుంటున్నది.

అదే సమయానికి అమ్మాయి ప్రొప్రయిటర్ గదిలోకొచ్చింది.

కు|రా: ఆఁ.

పి. ఎస్: అయ్యగారికి తనమీద వున్న అభిమానాన్ని ఉపయోగించుకొని తను పైకి రావాలనీ, నిన్నూ ఏదో గొప్పవాడిని చేయాలనీ, ఆశపడుతున్నది....ఆశ లందరికీ వుంటాయి. అవకాశాలు కొందరికే వస్తాయి. పనికిరాని ప్రేమను అడ్డుపెట్టి మీ భవిష్యత్తును పాడుచేసుకోవద్దు.

కు|రా: ఊఁ. కానీ. మాట్లాడండి!

పి. ఎస్: అయ్యగారికి ఆ అమ్మాయిమీద మోజున్నది. ఆ మోజుకొద్దీ ఆయన ఏమైనా చేస్తాడు - అమ్మాయికి. నువ్వో ఆ అమ్మాయిని అనుసరించి పో. మీ అన్యోన్య ప్రేమకు యిదేమీ అడ్డురాదు....ప్రపంచంలో చాలామంది

ఆడవాళ్ళ ద్వారా పైకొచ్చినవాళ్ళే. నా మాట విను. వాళ్ళిద్దరి మధ్య నువ్వు తల దూర్చకు. చూచీ చూడనట్టు పోతూవుండు.

కుర్రా: ఏయ్. డాఫర్, ఏం కూశావ్. (పి. ఎస్. మీదికి దూకి పీకపట్టుకున్నాడు. పి. ఎస్. వెర్రికేకలు వేశాడు. యీ కేకలు విని అమ్మాయి పరుగెత్తుకొచ్చింది. 'ఏమండీ, ఏమండీ' అంటూ వాళ్ళిద్దరినీ విడదీయటానికి ప్రయత్నిస్తున్నది. ఇంతలో వెలుపలనుంచి ముసలయ్యా. పడక గదిలోంచి ప్రొప్రయిటర్ వచ్చారు)

ప్రొప్ర: ఏమిటయ్యా, ఏమిటది!

పి. ఎస్: చూడండి సార్. వీడూ....వీడు.

కుర్రా: నుయ్‌నోర్. ఏమన్నా కూశావా పండ్లు రాలగొడ్తాను.

ప్రొప్ర: (ఏదో గొడవుందని అర్థం చేసుకున్నాడు) ఏమిటబ్బాయ్, ఏం జరిగింది?

కుర్రా: ఆయన్నే అడగండి చెబుతాడు. (అంటూ వెళ్ళిపొయ్యాడు. అతనివెంట ముసలయ్య వెళ్ళాడు. అమ్మాయి అతని వెంబడి వెళ్ళలేక వుండలేక కంగారు పడుతున్నది. ప్రొప్రయిటర్ గమనించాడు.)

ప్రొప్ర: ఇలా రావోయ్ నువ్వు.

అంటూ తన గదిలోకి వెళ్ళాడు. పి. ఎస్. వెంబడించాడు. ఈ అవకాశాన్ని చూచుకొని ఆ అమ్మాయి బయటికెళ్ళింది. ప్రొప్రయిటరు తన గదిలోంచే ఆ అమ్మాయి వెళ్ళటం గమనించాడు.

ప్రొప్ర: (పి. ఎస్.తో) ఏమిటోయ్ ఈ గల్లంతు?

పి. ఎస్: వాడు పరమ కమ్యూనిష్టండీ, వెంటనే డిస్‌మిస్ చేయాలి.

ప్రొప్ర: ఏచ్చావ్. అసలెందుకొచ్చింది తగాదా?

పి. ఎస్: తగాదా యేమిటండీ, అస లీ వుత్తరం చూడండి.

ప్రొప్ర: (తీసి చూచుకొని) ఏముందోయ్ యీ వుత్తరంలో!

పి. ఎస్: ఏముంది? నాకు తెలీదు. వాళ్ళిద్దరూ ప్రేమించుకుంటున్నారు.

ప్రొప్ర: అయితే....నువ్వేం చేశావ్? ప్రేమించుకోకూడదని ఆర్డరు వేశావా?

పి. ఎస్: అబ్బే నే నెందుకంటానండీ, నాకు తెలీదు? నీ ప్రేమ నీ వరకే వుంచుకో; అయ్యగారి విషయంలో అడ్డురాకు. యేదో చూచీ చూడనట్టుపో అని యేదో పెద్దవాడిని గనుక బుద్ధిమతి చెప్పాను.

ప్రొప్ర: ఏడవలేకపోయావు. యేమిటో ఆ పిల్లంటే మనకేమన్నా ప్రేమా, పెండ్లి చేసుకోబోతామా?

పి. ఎస్: మోజేననుకోండి, నాకు తెలీదా!

ప్రొప్ర: మరి ఆ మాత్రానికి వాళ్ళు ప్రేమించుకుంటే మనకు పోయేదేముంది?

పి. ఎస్: మీ రేమన్నా చెప్పండి. మన మోజు తీరేదాకా వా ఉద్యోగంలో ఉంచటానికి వీల్లేదు. వెంటనే డిస్మిస్ చేయాల్సిందే.

ప్రొప్ర: ఊర్కోవోయ్ idiot తెలిసీ తెలియకుండా మాట్లాడకు. ఆ అబ్బాయితో మనకు చాలా పనుంది.

పి.ఎస్: వాడితోనా?

ప్రొప్ర: ఆ లేకుంటే యేం ఆ అమ్మాయిమీది అభిమానంతో ఇచ్చాననుకుంటున్నావా ఉద్యోగం. అవన్నీ రాజకీయాల్లే. రాజకీయాలు నీ కర్థంకావు. (ఫోన్‌కాల్. ప్రొప్రయిటర్ ఫోన్ అందుకొని) ఆ. Yes నేనే, ఎవరూ, ఆడిటర్‌గారా, యేమిటి....అరెరె, కొంప మునిగింది. దానికి దారి లేదంటారా........ఆ ఆ వస్తాను. ఇదుగో, ఇప్పుడే వస్తున్నా. (ఫోన్ పెట్టేసి) రావయ్యా రా. ఇన్‌కంటాక్సు యేదో కొంప ముంచేసింది.

ప్రొప్రయిటర్, పర్సనల్ శెక్రటరీ వెళ్ళిపోయారు. రంగస్థలంమీద యెవ్వరూ లేరు. ఒక్కక్షణం తర్వాత కుర్రవాడు నెమ్మదిగా లోపలికొస్తున్నాడు. వెనకాలే ఆ అమ్మాయి పిలుస్తూంది.. ...

అమ్మా: శంకర్. ..శంకర్.

కుర్రవాడు ఆ పిలుపును లక్ష్యంచేయక తన సీటులో కూర్చొని కాయితం తీసుకొని యేదో రాస్తున్నాడు. ఆ అమ్మాయి వచ్చింది.

కుర్రా: (రాసిన కాగితం ఆమె చేతికిస్తూ) ఇదుగో!

అమ్మా: ఏమిటది?

కుర్రా: రాజీనామా.

అమ్మా: వెళుతున్నావా!

కుర్రా: నా కీ ఉద్యోగం అక్కర్లేదు.

అమ్మా: నేనూ అక్కర్లేదా?

కుర్రా: నీకోసం నే నీ ఆత్మవంచన చేసుకోలేను.

అమ్మా: ఇందులో ఆత్మవంచ నేముంది!

కుర్రా: లేకుంటే ఏమిటిది? నిన్ను తార్చి బతకమంటావా నన్ను!

అమ్మా: శంకర్ (ఒక్కక్షణం నిశ్శబ్దం) సరే వెళ్ళు.

కుర్రా: వెళుతున్నాను. కాని వెళ్ళేముందు ఒక విషయం తెలుసుకొని వెళ్ళాలను కున్నాను. నాతో నువ్వెందుకు అబద్ధం చెప్పావ్....

అమ్మా: నేనేమీ అబద్ధం చెప్పలేదు.

కుర్రా: చెప్పలేదూ....నా కీ ఉద్యోగం సంపాయించి పెట్టిం దెవరు?

అమ్మా: నేనే.

కుర్రా: మరావిషయం నాతో ఎందుకు చెప్పలేదు?

అమ్మా: చెప్పాల్సిన అవసరం లేదుగనక చెప్పలేదు.

కుర్రా: అవసరం లేకగాదు. నిజం బైటపడుతుందని.

అమ్మా: ఏమిటా నిజం?

కుర్రా: మీ ప్రొప్రయిటరుకు నీమీద మోజుండడం.

అమ్మా: వాడికుంటే....

కుర్రా: నీకు లేదని నమ్మకమేమిటి?

అమ్మా: శంకర్....ఇదన్నమాట నువ్వు నన్ను అర్థం చేసుకుంది! చాలు, ఇక నువ్వెళ్ళొచ్చు.

కుర్రా: నువ్వీ ఉద్యోగంలోనే హాయిగా వుండొచ్చు. (వెళుతున్నాడు)

అమ్మా: శంకర్.

కుర్రా: (ఆగాడు.)

అమ్మా: (దగ్గిర కెళ్ళింది) నేను గర్భిణిని. జ్ఞాపకముందా?

కుర్రా: ఆఁ.

అమ్మా: నా కింకా పెళ్ళికాలేదు.

కుర్రా: తెలుసు.

అమ్మా: నా కడుపులో బిడ్డ నీదేనన్న నమ్మకమన్నా నీకుందా?

కుర్రా: (ఏం మాట్లాడలేదు)

అమ్మా: నా గతేమవుతుందో ఆలోచించి మరీ వెళుతున్నావా?

కుర్రా: నన్నేడిపించటానికి ప్రయత్నం చేయనక్కర్లేదు.

అమ్మా: నిన్నేడిపించదలుచుకోలేదు. నీవు ఏడ్వవని కూడా తెలుసు. నువ్వు రాటు తేలిన రాజకీయ నాయకుడివి. నీకు యేడుపురాదు. ఎదటివాళ్ళ ఏడుపు అంత కన్నా అర్థంకాదు. నీకు తెలిసిందల్లా రాజకీయవాదనలే. జీవితాన్ని వున్న దున్నట్లు అర్థంచేసుకుంటావనుకున్నా. మంచీ చెడ్డా విచక్షణజ్ఞాన ముందను

ఉన్నా. తాత్కాలిక బాధల్ని తెలివితేటల్తో తప్పుకోటానికి ఒప్పుకుంటా ననుకున్నా. ఇంత మూర్ఖపుపట్టు పట్టుతావనుకోలేదు.

కు|రా: ఏమిటి ఉపన్యాసం దంచేస్తున్నావ్! ఎవరిది మూర్ఖత్వం? మానాభిమానాలు అమ్ముకొని బతకటం తెలివితేట లనుకుంటున్నావా?

అమ్మా: శంకర్! మళ్ళా ఆ మాటనొద్దు. ఇక్కడెవరూ మానాభిమానాలు అమ్ముకోటంలేదు.

కు|రా: ఇప్పు డమ్ముకోకపోతే యింక రెండు రోజుల్లో అమ్ముకుంటావు. ఒక్కసారి మనిషి నాటకం ఆడ్డానికి అలవాటుపడ్డ తర్వాత ఎంత నీచానికైనా దిగటానికి వీలుంది.

అమ్మా: నాటకం కాదు.

కు|రా: మరేమిటంటావు దీన్ని?

అమ్మా: అవును. నాటకమే.

కు|రా: ఎందు కాడాల్సివచ్చిం దీ నాటకం?



అమ్మా: భయం.

కు|రా: ఏమిటా భయం?



అమ్మా: నీకు తెలుసు నిన్ను ప్రేమించాను. పెండ్లి చేసుకోవాలనుకున్నా.... మేము బీదవాళ్ళం. నేను ఉద్యోగం చేస్తేగాని యింట్లో గడవదు. అలాంటి పరిస్థితుల్లో పెద్దవాళ్ళ మన స్తత్వం ఎలావుంటుందో నీ కర్థమవుతుందనుకుంటా. నన్ను యే డబ్బుకలవాడికో, కనీసం మంచి వుద్యోగంలో వున్నవాడికో యివ్వాలని ఆశపడటంలో వాళ్ళ తప్పులేదు. నీకు ఉద్యోగంలేదు. చాలీ చాలనిదానికి నాకు ఇదొకటి. ఈ పరిస్థితులలో నే నేమైపోతానన్న భయం.... మా నాన్నా అమ్మా పండుముసళ్ళు. చాదస్తులు. నేను పెండ్లికాని పిల్లను. పెండ్లికాకుండా బిడ్డను కంటున్నానంటే వాళ్ళు గుండెపగిలి చస్తారని భయం. కాబట్టి మన పెళ్ళయితీరాలి. పెళ్ళి కావాలంటె నీవు తప్పకుండా ఉద్యోగంలో చేరాలి. అందుకే నీ కీ ఉద్యోగంకోసం నేను ప్రయత్నం చేశాను. నిజమే. అతనికి నామీద మోజున్నదని తెలుసు. ఆ మోజును ఉపయోగించా లనుకున్నాను. నటించాను. అలా నటించటం నీచమని నాకు తెలుసు. కాని యేం చెయ్యను? నీ కెలాగైనా ఉద్యోగం సంపాయించాలి — మనిద్దరి సంబంధం బయటపడితే ఉద్యోగం నుంచి ఊడబెరుకుతారని భయం. అంతే కాదు. ఆయన చేతుల్లో మా సంసారమంతా చిక్కుకొని వుంది. ఆయన మమ్మల్ని

యేం చేసినా చెయ్యొచ్చు. ఆ భయంతో నిన్నూ నటించమన్నాను. నాలుగే నాలుగు రోజులు నటించమన్నా. ఇంతలో మన పెండ్లవుతుంది. పెండ్లయిన తర్వాత యేమయినా నాకు భయంలేదు. కాని నీవల్ల కాదన్నావు. నీ ఆత్మను చంపుకోలేనన్నావ్. సరే, నీ యిష్టప్రకారం వెళ్ళు. ఆత్మను బతికించుకో, నా గతేదో నేను పట్టిపోతాను. (అని వెళ్ళబోతూంది)

కుర్రా: పార్వతీ! (ఆపాడు) ఎంత పిచ్చిదానివి? పెళ్ళయిన తర్వాత మాత్రం ఆయన భయం మనకు తప్పుతుందా! ఈ డబ్బుగలవాళ్ళ భయం మనకు ఎప్పుడూ వుంది.

అమ్మా: ఏమో. అదంతా నే నాలోచించలేదు. ఇప్పుడు నా పరిస్థితిలో పెండ్లికావట మొకటే నాకు ముఖ్యం. అదొక్కటే నే నాలోచించా....శంకర్, తర్వాతి విషయం తర్వాత చూద్దాం, నా మాట విను, ఉద్యోగం వదలిపెట్టకు. నా కోసం కాకున్నా నా కడుపులో పెరుగుతున్న నీ బిడ్డకోసం....

కుర్రా: పార్వతీ! (కూలబడ్డాడు) పరిస్థితులకు బానిసలం. భయానికి దాసులం అయి పోతున్నాం.

అమ్మాయి అతని బాధను గ్రహించింది. అతని తలమీద చేయివేసి అలా నిమురుతూంది. సరిగా యీ సమయానికి వాకిటినుంచి ప్రొప్రయిటర్, పి. ఎస్. అతని వెనకాలే మేనేజరు, అతని వెనకాలే ముసలయ్యా వచ్చారు. పార్వతి గబగబా లోపలికెళ్ళింది, శంకరం ఏదో పని చేసుకుంటున్నట్టు నటిస్తున్నాడు. ప్రొప్రయిటర్ చాల కంగారుగా వున్నాడు. ఎప్పుడూ తిన్నగా తన గదిలోకి వెళ్లేవాడు. ఈసారి కంగారుగా ఆఫీసుగదిలోనే యిటటు చూచి తిరుగుతూ

ప్రొప్ర: అకౌంటెంటు ఎక్కడ? ఇంకా రాలేదేమో. ముసలయ్యా! వెళ్ళి ఆయన్ను లాక్కురావయ్యా! కాషియర్ ఎక్కడ....ఆయనా రాలేదేమో....ఎందు కొస్తారు. వెళ్ళినచోట వెయ్యేళ్లు కూచుంటారు. ఛీ! ఛీ! దరిద్రులు. ఆ కాషి యర్‌ను వెంటనే రమ్మని ఫోన్ చెయ్యవయ్యా!

కాషి: (ఇంతలో వస్తూ) ఇదుగో వచ్చాను సార్.

ప్రొప్ర: ఏమయ్యా! ఎక్కడికైనా వెళ్తే అంతేనా?

కాషి: రాహుకాలంలో వెళ్ళాను. పని కాలేదండి.

ప్రొప్ర: ఏం, ఏమైంది?

కాషి: సగం కూలీ బట్వాడాకు వాళ్లు ఒప్పుకోలేదు సార్!

ప్రొప్ర: ఒప్పుకోలేదా! ఒప్పుకోకపోతే సగం మంది కూలీలను తీసేస్తామని చెప్పలేక పోయారూ?

నాపి: నాకు తోచలేదు సార్!

ప్రొప్ర: మీ కెందుకు తోస్తుంది? సరే. వెళ్ళి ఫ్యాక్టరీ కూలీల జీతం బట్వాడా చేసి వెంటనే రాండి - పనుంది.

నాపి: చిత్తం.

ప్రొప్ర: అక్కడే జ్యోతిష్యాలు చెప్తూ కూచోకండి.

నాపి: చిత్తం.

ఇంతలో అకౌంటెంటు వచ్చాడు.

ప్రొప్ర: ఏమయ్యా — వచ్చావూ? ఇప్పటికైనా ఆఫీసు కనిపించిందా?

అకౌ: నే నసలు ఎనిమిది గంటల కెళ్ళానండి.

ప్రొప్ర: వెళ్తే - నువ్వు ఎనిమిది గంటలకు వెళ్ళావని ఆఫీసు పన్నెండు గంటల కవుతుందటయ్యా?

అకౌ: ఇంకా పన్నెండు గంటలు కాలేదండి!

ప్రొప్ర: ఏమిటయ్యా, మాటకు మాట జవాబు చెప్తున్నావే! ఏం తల తిరుగుతోందా? ఆఫీసుకు ఆలస్యంగా రావటం కాక సంజాయిషీ కూడానా!

అకౌ: చెప్తే చెప్పానంటారు; చెప్పలేదంటే తిట్తారు ఎలాగండీ?

ప్రొప్ర: ఏలాగో తర్వాత చెప్తాను. ముందా స్టేట్‌మెంట్లన్నీ తగలేసి వేరే తయారు చేయి.

అకౌ: వేరేనా?

ప్రొప్ర: అవునయ్యా — వేరేనే! అన్నీ మేనేజరు చెప్తారు. ఆ ప్రకారం తయారు చేయి. మేనేజరుగారూ! మీరిలా రాండి.

తన గదిలోకి వెళ్ళాడు.

మేనే: (అతన్ని వెంబడించాడు)

ప్రొప్ర: ఏమయ్యా! చెప్పినవన్నీ జ్ఞాపకమున్నాయా? ఆడిటర్ సలహాలన్నీ గుర్తు రాసుకొన్నావా?

మేనే: రాసుకొన్నానండి.

ప్రొప్ర: ఊఁ....ఇక - మన గుమాస్తాలందరికిగ్గర రెండునెల్ల బోనసు ఇచ్చినట్టు రసీదులు తీసుకో. ఫ్యాక్టరీలో కూలీలు - గుమాస్తాలు అందరికీ కూడా రెండు నెల్ల బోనసు ఇచ్చినట్టు రసీదులు పుచ్చుకో - ఏం?

మేనే: పోయిన సంవత్సరం కూడా అలాగే పుచ్చుకొన్నామండి.

పి.ఎస్: పుచ్చుకొన్నాం. నాకు తెలీదూ! అందుకనే యీ సంవత్సరం అదే పని చేయమంటున్నాం.

మేనే: పోయిన సంవత్సరం తరువాత ఇస్తామని నచ్చజెప్పి రసీదులు తీసుకున్నాం.

ప్రొప్ర: ఈ సంవత్సరమూ అదే చేయండి.

మేనే: మరి....

ప్రొప్ర: మరి - గిరీ ఏం లేదు ——

మేనే: చిత్తం.

ప్రొప్ర: ఆ అకౌంటెంటుకు అన్ని వివరాలు చెప్పి ఆ స్టేటుమెంట్లు తొందరగా తయారుచేయించాలి. కావాలంటే, ఆ కొత్తగా వచ్చిన కుర్రాణ్ణి....అక్కర్లేదు —— అకౌంట్ల విషయం మన కాషియరుకు బాగా తెలుసు. ఆయన్ను అకౌంటెంటుకు సహాయం వుండమనండి. తెల్లారికంతా అవి తయారుకావాలి. (అని తన గదిలోంచి ఆఫీసుగదిలోకి వచ్చాడు. పి.ఎస్. కూడా.) ఏమయ్యా అకౌంటెంటూ! నిద్రపోకుండా ఆ పని కానీ. తరువాత హాయిగా ఎన్ని రోజులు కావాలన్నా నిద్రపోదువులే....ఏమయ్యా మేనేజరూ....నే నిప్పుడే వస్తా. ఆ రసీదులు తీసుంచు. ఇంట్లోకెళ్ళి పెళ్ళాంతో కబుర్లు చెప్తూ కూచు నేవు! (అని ప్రొప్రయిటరు వెళ్ళబోతూండగా మేనేజరు భార్య వరసరా వచ్చింది.)

భార్య: ఏడీ ఈయన! ఎక్కడున్నాడు? పొద్దునననగా యింటినుంచి వచ్చేశాడే, ఆఫీసు లోనే చస్తే, ఇంట్లోవాళ్ళంతా ఏంకావాలి!

ఆవిడ రావటం చూచి ప్రొప్రయిటర్ ఆగాడు.

భార్య: (ప్రొప్రయిటరును చూచింది) ఉన్నావా నాయనా ఉన్నావ్! ఇందాక నీకోసం వచ్చి వెతికిపోయా....లేవన్నారు. ఇప్పుడు దొరికావు —— రా....రా నాయనా రా చెప్తా.

ప్రొప్ర: మేనేజర్! ఏమిటయ్యా ఈ అల్లరి!

మేనే: దానికి....దానికి....మతి చలించిందండి....ఇంకేంలేదు. రావే....రావే నువ్వు-

భార్య: నువ్వుండు.

ప్రొఫె: మతిచలిస్తే ఆస్పత్రిలో తీసుకెళ్ళి పడేసి.... ఇక్కడేమిటి గోల! (లేచి పోబోయాడు)

భార్య: ఆగు...ఎక్కడికి పోతావ్! (ప్రొఫెసరు చొక్కా పట్టుకుంది)

ప్రొఫె: ఏయ్ యేమిటిది?

ఎ. ఎస్: వదులు ...వదులు ..చొక్కా పట్టుకుంటావేం...

భార్య: నువ్వుండవోయ్ మహా ___

మేనే: యేమే ___ నా మాట విను ...

భార్య: మీరు నోరు మూస్తారా లేదా?

ప్రొఫె: యేయ్ తీయ్ చెయ్యి!

భార్య: తీస్తానుండు. ఏమన్నావ్ ___ ? పిచ్చాస్పత్రిలో చేర్చాలా? నన్ను? నన్నేం చేయాలని? ___ నిన్ను కసాయి దుకాణానికి పంపించాలి.

ఎ. ఎస్: ఇదుగో ___ యేమిటా మాటలు....! నీకు మతిపోయినట్టుంది. నాకు తెలీదూ...పో అవతలకి!

భార్య: నువ్వే పోవోయ్ పుస్కి...! ఇదుగో ___ మర్యాదగా రా ___ కూచో ___ నేను చెప్పేదంతా వినిపో....నేను పిచ్చిదాన్నే. కానీ మంచివాళ్ళకు మంచిదాన్నే! కాదు కూడదన్నావా, కరుస్తా ___ ఏమనుకున్నావో! కరుస్తా.

ప్రొఫె: (నిజంగానే భయపడ్డాడు.) ఆఁ - ఆఁ - చూస్తూ నిలుచుంటారేమయ్యా ___ లాగేయండి లాగేయండి.

మేనే: ఏమే ___ ఏమే.

భార్య: ఏం లాభంలేదు. ఎవరన్నా దగ్గర కొచ్చారా ___ చంపేస్తా, లాగేయ్యాలా నాయనా లాగేయ్యాలా! ఎవరిని? నిన్ను, నిన్ను. ఈ ప్రపంచంనుంచే లాగేయాలి. నేను అయిదు నిముషాల్లో చచ్చిపోతా ___ చచ్చిపోయిన వెంటనే యముడితో చెప్తా ___ నిన్ను కూడా లాగేయమని. నేను చస్తే చస్తా. మిగతావాళ్ళయినా సుఖపడ్తారు. ఏమండీ! మీరందరూ పెద్దమనుషులు కదా ___ చూడండి. ఈయన ఒక పెద్దమనిషి. నన్నందరూ పిచ్చిదంటారు. వినండి. నేను చెప్పేదానిలో పిచ్చేముందో...

మేనే: ఏమే ___ నా మాట వినవే ___ రావే....

భార్య: ఆఁ....మీరూ వినండి. చూచారాఅండి ___ ఈ పెద్దమనిషికి, ఈ గాడిద ముప్పయి అయిదు సంవత్సరాలు చాకిరి చేసింది. ఈ గాడిదకు నేను యాభై

యేళ్ళ చాకిరిచేశా. .ఈయనకు. ఈయన లక్షలు సంపాయించి పెట్టాడు. ఈయనకు నేను ఆరుగురు పిల్లల్ని కన్నాను. ఇరవై నాలుగు గంటలూ చాకిరి చేశాం. చివరకి చూస్తున్నారుగా స్వరూపాలు ఎట్లా తయారయ్యాయో! రెండవపిల్ల పుట్టగానే, నా ఒంట్లో నెత్తురు లేదన్నాడు డాక్టరు. మూడో ప్రసవానికి నరాలు చచ్చుపడ్డాయన్నాడు. నాలుగో కాన్పుకు అన్ని వ్యాధులూ నాకే వచ్చాయి. ఎందుకురావూ. ..ఈ రోగాలు తెచ్చుకోడానికే ఈయన ఇరవైనాలుగు గంటలూ చాకిరి చేశాడు. ఏమయ్యా అంటే —— అయ్యగారు నాకు ఒరగబెట్తారని ఆశ చూపెంచాడు. .యేమయ్యా అన్నావా లేదా చెప్పు.

మేనే: నువ్వు రావే ...

భార్య: అసలీ మనిషికి నిజం చెప్పాలంటే భయం. లోపల్లోపల కుమిలి చస్తాడు.. ఈ బతుకే అంత. అందుకే ఇట్లా వున్నాడు.

ఆమె మాట్లాడుతూండగా ప్రొప్రయిటరు ఆమెను మెల్లగా పట్టి లాక్కుపొమ్మని పి.ఎస్. కు సైగచేసాడు. పి.ఎస్. మెల్లగా బిక్కుబిక్కుమంటూ ఆమెను సమీపిస్తున్నాడు, పట్టుకోబోయాడు. చేయి తగిలిందో లేదో, ఒక్కసారి ఆమె విసిరింది. పి.ఎస్. అంత దూరాన పడ్డాడు.

భార్య: ఏంరా! నన్ను పట్టుకుంటావా! పట్టుకోరా చూద్దాం. పళ్లూడగొడతాను. ఏమనుకున్నావు —— నేను రాక్షసిని. చంపేస్తా —— రా!

పి. ఎస్: అబ్బెబ్బె ... నిన్ను పట్టుకుంటానా! నాకు తెలీదూ... అయ్యగారే.... అయ్యగారే....

భార్య: (అమాంతం ప్రొప్రయిటర్ మీద దూకి) ఏంరా! నన్ను పట్టుకోమన్నావురా. పాపిష్టివాడా! నే నిట్టా వుండటంకూడా నీ కిష్టంలేదురా. నీవు నాశనంకానూ నిన్ను కాకులకూ గద్దలకూ వేయ. మమ్మల్ని పిండిపిప్పి చేశావు గదరా. ఆశ చూపి మోసంచేశావు గదరా. నీ గోడుకు పిల్లలు అల్లాడిపోతున్నారు గదరా! ...నా పిల్లలు. బంగారంవంటి పిల్లలు. రారా. రా చూద్దువు రా ఆ పిల్లల్ని. వాళ్ళందరూ నిన్ను శపిస్తారురా. నిన్న పుట్టిన బిడ్డకుకూడా నేర్పి పెట్టానులే, నిన్నెలా శపించాలో. బాలవాక్కు బ్రహ్మవాక్కన్నారు! వాళ్ళు తిడితే ఫలిస్తుంది. రారా —— రా. (ప్రొప్రయిటరును లాగుతుంది.)

ప్రొప్ర: ఛీ —— పో అవతలికి....

అని గెంటాడు. ఆమె కేకేసి విసురుగా వెళ్ళి అక్కడున్న బల్లమీద పడబోయింది. పార్వతి ఆమెను పట్టుకుంది.

ప్రొప్రై: మేనేజర్! ఆఫీసు పెద్దాసుపత్రి రాజవానికి వీల్లేదు. వెంటనే. ఖాళీచెయ్యిల్లు.

ప్రొప్రయిటర్ వెళ్ళాడు, పి. ఎస్. వెంబడించాడు.

మేనే: ఆఁ!

భార్య: ఏమిటీ! ఇల్లు ఖాళీ చెయ్యాలా? మేము నడివీధుల్లో వుండాలా? మీమ్మ బంగళాల్లో దొర్లాలా! ఖాళీచేస్తాం....చేస్తాం ...చూస్తావుగా! అంతా ఖాళీ చేస్తాం. .

ఆమె వెళ్ళింది. మేనేజరు వెంబడించాడు.

ఒక్క క్షణం నిశ్శబ్దం

శంక: (నిట్టూర్చి) ఊఁ....పిచ్చిదైనా నిజం మాట్లాడింది పాపం!

పార్వ: నిజం మాట్లాడింది గనకే పిచ్చిదన్నారు.

అకౌ: మనకూ యేనాడో ఒకనాడు ఆ గతి పట్టుంది.

మున: ఏందో తలరాత! (అంటూ వెళ్ళబోతున్నాడు)

శంక: ఆగు. (అతన్ని నిలబెట్టి చాలా సీరియస్‌గా) ఇంకెప్పుడూ ఆమాటనకు — వెళ్ళు....

మున: (నిర్ఘాంతపోయి తెప్పరిల్లి యేదో చెప్పబోయాడు. ఇంతలో మేనేజరు వచ్చాడు)

పార్వ: ఎలాగుందండి?

మేనే: ఉండేదేముందమ్మా — అంతే!

శంక: నిద్రయినా వుంటుందా ఆవిడకి?

మేనే: ఇట్లా అరిచి అరిచి ఎప్పుడో నిద్రపోతుంది నాయనా! ఊఁ....అవన్నీ అనుకోడానికికూడా మనకు తీరికలేదు — అయ్యా, అకౌంటెంటూ!

అకౌ: ఏమండీ? మళ్ళా ఆ స్టేట్‌మెంట్లన్నీ తిప్పి రాయాల్సిందేనా?

మేనే: అవునయ్యా అవును. అయ్యగారికి కొంపమునిగే ఆపద వచ్చిపడింది.

శంక: ఏమిటో ఆ ఆపద?

మేనే: ఏముందీ — ఇన్‌కంటాక్సు వాళ్ళు పీక పట్టుకుంటున్నారు. అయ్యగారికి ఊపిరి ఆడటంలేదు.

అకౌ: అయినా ఈ రాత్రిలోగా ఆ స్టేటుమెంట్లన్నీ ఎలా అవుతాయండీ!

మేనే: రావాలయ్యా రావాలి. రాకుంటే ఎలా! ఒక్క స్టేట్‌మెంట్లే కాదు. ఇదుగో- ఇవన్నీ రావాలి! ఈ అంటుడు లన్నీ మార్చాలి. (అని ఒక కాగితం ఇచ్చాడు.)

అకౌ: (చూచి) ఏమిటీ! ఏమిటండీ ఇది? లెడ్జెర్లు కూడా కొత్తవి రాయాలే!

మేనే: ఆఁ. అవును. రాయాలి మరి. ఆడిటరు రాయమంటె రాయాల్సిందే.

శంక: రాయాలి మరి. ఇన్‌కంటాక్సు ఎగ్గొట్టనానికి రాయాలి మరి. ఇనప్పెట్టెలో డబ్బు కదక్కుండా వుండటానికి రాయాలి మరి.

అకౌ: రాయాల్సిందే? సెలవు పెట్టి పోదామనివస్తే అస లీ రాత్రికైనా ఇంటికిపోయే అదృష్టం వుండేట్టులేదు.

మేనే: ఎందుకూ సెలవు. నిన్నంతా కష్టపడ్డావనా? ఇదిగో యీ పని ముగించు. నీ కెన్నిరోజులు సెలవు కావాలన్నా యిస్తాను.

అకౌ: ఈరోజు లేకుంటె ఇంకెందుకండీ నాకు సెలవు ఏడవనా. అక్కడ నా పెళ్ళాం చావు బతుకుల్లో వుంది. ఏ క్షణం ప్రసవిస్తుందో తెలీదు. ఇంటిదగ్గర యేం వచ్చినా పలికే దిక్కులేదు.

మేనే: అరరే! అలాగా....ఇదిగో నాయనా! నేను కావాలంటే ముసలయ్యను ఇంటి దగ్గరుండమంటాను....ముసలయ్యా!

ముస: అయ్యా!

మేనే: మన అకౌంటెంటుగా రింటికెళ్ళి వుండు అమ్మగారికి ప్రసవం సమయమట. ఏదైనా అవసరమొస్తే వచ్చి చెప్పు. ఏం?

ముస: అలాగేయ్యా....(వెళ్ళాడు)

మేనే: ఇంకేం... అలాంటి సర్దుబాట్లు చేయటానికి మనం ఎప్పుడూ తయారే.... ఇదిగో అబ్బాయ్! అంతా మన కెందుకు. వాళ్ళు రాయమన్నారు. రాస్తాం. అంతే.

శంక: అంతేనండి.

పార్వ: ఏమండీ! ('మనకెందుకు' అన్నట్లు సైగచేస్తుంది.)

శంక: ఊఁ.

మేనే: ఆ స్టేటుమెంట్ల విషయం తరువాత చూద్దువుగాని ముందు ఒక రసీదు రాసిచ్చి పో.

అకౌ: దేనికండీ రసీదు?

మేనే: దేనికేముంది. మామూలే. రెండునెల్ల బోనస్సు యిచ్చినట్టు రసీదు.

ఉరా: ఇవ్వరండే.

మేనే: ఇస్తారులేవయ్యా.

ఉరా: ఆఁ. ఇస్తారు. పోయిన సంవత్సరం కూడా ఇలా చెప్పి రసీదులు పుచ్చుకున్నారు. ఇంతవరకు చిల్లిగవ్వ ఎరగం.

శంక: అందుకే అది మామూలైపోయింది.

మేనే: ఇస్తారులేవయ్యా ఎక్కడికి పోతుంది. వ్యాపారంలో కొంచెం నష్టం ఏర్పడింది. అయ్యగారు చెప్తున్నారు.

శంక: అప్పనప్పుడు. లెక్కలు చూస్తే నష్టం తెలుస్తుంది. ఎందుకయ్యా మన లాయన ఇట్లా ఆత్మవంచన చేసుకుంటావు. నిజం చెప్పు .. నష్టం వచ్చిందా?

మేనే: అబ్బాయ్ అవన్నీ మనకెందుకు?

శంక: మనక్కాకపోతే మరెవరికయ్యా! లక్షలు లక్షలు లాభాలొస్తే అవి కనబరిస్తే సూపర్ టాక్సులు కట్టాల్సి వస్తుందని యీ నాటకం ఆడవారా! ఇటు పనిచేసిన వాళ్ళకూ యివ్వటం ఇష్టంలేదు - అటు ప్రభుత్వాని కివ్వాలంటే కష్టం. ఇద్దరికీ ఎగగొట్టి ఆయనొక్కడే తినాలనా! అందుకు మీరు మద్దత్తా

మేనే: అబ్బాయ్! అదంతా మాట్లాడి ప్రయోజనం లేదు. మాటలే మిగిలిపోతాయ్. అయ్యా అకౌంటెంటు! నువ్వు రాసేవయ్యా రాసీ ... ఆ కాషియర్ యింకా రాలేదే

కాషి: (వస్తూ) వచ్చానండీ, వచ్చాను.

మేనే: వచ్చారూ! ఏదీ మీరూ ఒక రసీదు రాసిపడేయండి.

కాషి: దేనికి రసీదు?

మేనే: రెండు నెల్ల బోనస్.

కాషి: ఇస్తున్నారా?

శంక: ఆఁ. మీరు రసీదు ఇస్తున్నారు.

కాషి: అంతేనన్నమాట. ..సరే. ఏమండీ అకౌంటెంటుగారు! మీరు ఇచ్చేశారా?

శంక: ఎవ్వరూ ఇవ్వరు. ఉంటున్నవాళ్ళు ఎవ్వరూ ఇవ్వరు.

మేనే: అబ్బాయ్! ముందు నువ్విలారా. నువ్వొక రసీదు రాయి.

శంక: నే నీ రోజే ఉద్యోగంలో చేరాను. నాకూ బోనస్ యిచ్చినట్టె....

మేనే: కాదులేవయ్యా! నీ సీటు ఆరునెల్లగా ఖాళీగా వుంది. ఆరునెల్లకు పూర్వమే నిన్ను అపాయింటు చేసినట్టు, జీతాలు యిచ్చినట్టు రసీదు లివ్వు.

శంక: ఇదుగో, మేనేజరుగారు. మంచిగా చెపుతున్నా. మన దగ్గర మాత్రం ఇట్టాటి పిచ్చిపిచ్చి వేషాలు వెయ్యకండి.

మేనే: ఏమిటబ్బాయ్. ఏమిటిది. మర్యాద తెలీకుండా మాట్లాడుతున్నావు.

శంక: మనం అంతేలెండి. ఇటువంటి విషయాల్లో మనకు మర్యాదలూ మొహమాటాలూ వుండవు.

మేనే: అలాగేం, చూస్తాగా. ఎలా రాసివ్వవో చూస్తాగా.

శంక: నేను రాసివ్వకపోవటం కాదుగదా ఎవ్వరినీ రాసివ్వనీను. ఎవ్వరూ రాసివ్వరు. ఇదుగో, మీరందరూ మనుష్యులైతే, ఏ కోశాన్నైనా మీలో మగతనముంటే రాసీయకండి.

కాషి: నాయనా! అనటానికి పెద్దమాటలే అన్నావుగాని అనుభవించేవాళ్ళం మేము. మేం రాసివ్వక తప్పదులే.

శంక: ఏం? ఏమవుతుందేం?

కాషి: ఏమీకాదు, బ్రతకలేం. అంతే.

శంక: ఏదీ రాసివ్వకండి - చచ్చిపోలారేమో చూస్తాం.

కాషి: చూస్తావులే, దానికేం.

మేనే: అవ అబ్బాయ్, ఇవి ఆఫీసు వ్యవహారాలు. ఇందులో నువ్వు తల దూర్చకు.

శంక: ఏం ఆఫీసండీ. ఇదీ ఒక ఆఫీసే. సిగ్గులేకపోతే సరి.

మేనే: అబ్బాయ్.

పార్వ: ఏమండీ ఊర్కోండి. మీ కెందుకు!

శంక: పార్వతీ! మనకెందుకూ మనకెందుకూ అని ఎవరికి వారు వూర్కోంటేనే ఇవి ఇలా సాగుతున్నాయ్. అన్యాయాన్ని అన్యాయమని చెప్పే ధైర్యమే మనకుంటే ఇవి ఏనాడో అడుగంటి పోయేవి.

కాషి: నిజమే నాయనా! నీకన్నా వుడుకు నెత్తురుతోనే మేమందరం ఆఫీసులో అడుగుపెట్టాం. ఆరునెలల్లో అంతా చల్లారిపోయింది. నీకు జీవితానుభవం తక్కువ. సంసారం, పిల్లలూ, బాధ్యతలూ, బాధలు నెత్తిన పడితే అన్నీ చప్పచల్లారి కూచుంటాయ్.

శంక: ఏ మనుభవమండీ. మీరందరూ బతకలేమనే భయం కొద్దీ ఇలా అయ్యారు. భయం మిమ్మల్ని బానిసలను చేసింది. భయం మిమ్మల్ని పిండి పీనుగుల్ని చేసింది. నిజంగా మీరలా భయపడాల్సింది లేదు. బతకలేంది మీరు కాదు. ఇంకెంతో కాలం బతకలేంది యీ పెద్దవాళ్ళే. మీరు లేకపోతే బతకలేంది యీ

కలిగిన వాళ్ళే. అది మీరు గుర్తించాలంటే భయం పటాపంచలై పోవాలి. మీలో వున్న బలాన్ని మీరు తెలుసుకుంటారు. జీవితంలో ఒక్కసారి భయాన్ని వదిలి చూడండి. న్యాయంవైపు నిలబడి చూడండి. నైతికంగా మీకెంత బలం ఏర్పడుతుందో చూడండి.

మేనే: భేష్. భేష్. (చప్పట్లు కొట్టాడు)

కాషి: నీచేయి చూసినప్పుడే అనుకున్నా నాయనా. నువు గొప్ప రాజకీయ నాయకుడ వవుతావని! చెప్పానుగా నీకు భయమన్నది వుండదని! నువ్వు చెప్పిందంతా న్యాయమే. కాని.... మాట తప్పుతుందా నాయనా. ఈ వయసులో మే మింకేం విప్లవాలు చేపోతాం. అదేదో మీరే చేయండి నమ్మల్ని ఇట్లా పోనీండి. ఇదంతా మాకు మామూలేలే.

అకౌ: ఏం మామూలండీ. ఈ ఆఫీసులో అన్నీ మామూళ్ళే. శని, ఆదివారా ల్లేకుండా పనిచేయడం మామూలు. రాత్రి పగలని లేకుండా పనిచేయడం మామూలు. ఏమీ పనిలేకపోతే అయ్యగారికి వాళ్ళు విసకడం కూడ మామూలే. ఏం మామూళ్ళండీ? ఎంతకాలం యీ మామూళ్ళు. అర్థం వుండాలి.

మేనే: అకౌంటెంటుగారూ, మీరూ వుపన్యాసాలిస్తారే.

అకౌ: కడుపు నిండితే అన్నీ యిస్తాం. లేకుంటే ఏమిటండి! ఇది ఆఫీసేనా. తాగ టానికి నీళ్ళులేవు. అయ్యగారికి అందుసువాటరు. మనకు ఆ పుప్పునీళ్ళు. ఫానువున్నా వేసుకోటానికి వీల్లేదు. వుడికి చావాల్సిందే. జీతాలు పెరగట మంటూలేదు. మనం మనుష్యులన్న దృష్టి యజమాన్లకులేదు. మర్యాది లేదు. ఎందుకండీ, మనం మాత్రం అయ్యగారిని ఆపదల్లో ఆదుకోవాలి?

మేనే: అయితే ఏమంటావయ్యా. నువ్వు పసీదు యిస్తావా; యివ్వవా?

అకౌ: ఇచ్చినవి చాల్లెండి.

మేనే: ఓ. అంతదూరం వచ్చిందీ. కాషియర్‌గారూ! మీరైనా రాసివ్వండి.

కాషి: రాసిస్తా. దానికేం. కాని ఆఫీసులో ఇద్దరం వుంటె ఒకరిచ్చి ఒకరివ్వకుండా వుంటె బాగుండదు చూడండి. ఎందులో గానీ ఐకమత్యం వుండాలి. ఏమంటారు?

శంక: (కాషియర్‌ను వీపుతట్టి) భలే! భలేమాట అన్నాడయ్యా.

మేనే: అబ్బాయి మూయ్‌నోరు. యీ అరాచకత్వానికంతా నువ్వే కారణం. నువ్వే వీళ్ళందరినీ రెచ్చగొట్టావు. అయ్యగారొస్తే....

శంక: ఇదిగో ఇవి ఇవ్వండి (అని కాగితం ఇచ్చాడు)

మేనే: యేమిటీ రాజీనామా?

పార్వ: ఆం. ఏమండీ! రాజీనామా!!

శంక: పార్వతీ ఇంక లాభంలేదు. ఇంకెంతో కాలం యీ భయంలో బతకలేం. భయాన్ని ఏనాటికైనా జయించాలి. ఈ పక్కింటలోనే నాకిలా ఊపిరి తిరక్క ఉక్కిరి బిక్కిరి అయిపోయింది. పాపం. వీళ్ళంతా ఇంతకాలంగా ఎలాగున్నారో యేమో. పార్వతీ! నన్ను వెళ్ళనీ........ఏమండీ! మేనేజరు గారు, కూలీల దగ్గర కూడా రసీదులు తీసుకోబోతారు కదూ?

మేనే: ఏం. అక్కడికి వెళ్ళి చెప్పగొడతావా?

శం: లేదు లెండి. పార్వతీ! ఇప్పటికైనా నన్ను పోనిస్తావా? నా పని యిక్కడ కాదు. అక్కడ.

పార్వ: వెళ్ళండి....మరి నా గతి?

శంక: ఏం భయంలేదు. నేనన్ని యేర్పాట్లూ చేస్తా. వూరొక్క, అందరిలా మనమూ భయానికి బానిసలమైతే యెలా. వస్తా. మేనేజరుగారూ! యింత వయసయింది. ఇంకా యెందుకండీ మీ కీ పాడుబుద్ధి? మీసాటివాళ్ళ పొట్టలు కొట్టి యెందుకండీ ఈ యినప్పెట్టెలు నింపడానికి చూస్తారు. ఇంతాచేస్తే మీకొచ్చే కితాబేమిటో చూచారూ. మీ భార్య పిచ్చిది కావటం అంతేనా. అందరి భార్యలూ అలా అయిపోవాలనా మీ అభిప్రాయం. ఏం? ఇకనైనా మాను కోండీ వెధవ భయం. వస్తా....మీరు తల్లకిందులుగా తపస్సు చేసినా వర్కర్సు దగ్గర మాత్రం రసీదులు పుచ్చుకోలేరు. ముందుగా చెపుతున్నా. సెలవు, పార్వతీ! మళ్ళా కలుసుకుంటా. భయపడకు. నీ మీద ఒత్తిడి వస్తుంది. నాకు తెలుసు. తయారుగా వుండు. దిగజారకు.

ఆమెను వీపుమీద తట్టి వెళ్ళిపోయాడు.

మేనే: ఎవరమ్మాయ్ అతను?

పార్వ: (పలక లేదు)

కాషి: భర్తయి వుంటాడు.

మేనే: నీకు పెళ్ళయిందా?

కాషి: అతని కైందని నేను చెప్పానుగా....

మేనే: అయితే గర్భంకూడా నిజమే నంటారా?

రాషి: జ్యోతిష్యం ప్రకారం నిజం కావాలి.

మేనే: ఏమమ్మాయ్!

పార్వ: (ఇక నిలువలేక ప్రొప్రయిటరు గదిలోకి వెళ్ళిపోయింది)

రాషి: చూశారా!

మేనే: పెళ్ళి కాలేదని చెప్పింది.

రాషి: నే చెప్పలా పెండ్లంటె ఎన్నో రకాలు వున్నాయని.

మేనే: అయినా పెళ్ళి కాకుండానే గర్భవతి కావడం ఏమిటండీ?

రాషి: గర్భవతి కావడానికి పెళ్ళెందుకండీ?

మేనే: అదిసరే ..అయ్యగారితో కూడా శాస్త్ర శృంగారం చేస్తూండేది!

రాషి: దేని కదేనేమో!

మేనే: ఈ పుట్టే బిడ్డ ఎవరిదని అప్పుడు?

ఆ అమ్మాయి యిదంతా వింటూంది, గొల్లుమన్నది.

అరా: ఎవరిదైతే మీకెందుకండి. మీకు పుట్టిన బిడ్డలు మీవేనా. ఊరుకోరాదూ?

మేనే: ఏమిటయ్యా. మహా పైనేసు కొస్తున్నావ్ ఆ అమ్మాయిని. నేనన్నదా ఏమన్నా...

అకౌ: (ఒళ్ళు తెలియని ఆవేశంలో) నోరుముయ్యండి.

మేనే: ఏమన్నావు?

అకౌ: (తెప్పరిల్లి) ఎందుకండీ. అభం శుభం ఎరుగని ఆ అమ్మాయిని - ఏ తల్లి కన్న బిడ్డో పాపం! ఆవిడ నలా ఆడి పోసుకుంటారు. దొరికింది కదా అని కవిత్వ మల్లడమేనా? మనకూ ఆడకూతుళ్ళు వున్నారు! వాళ్ళా రేపు....

రాషి: ఏమండీ అకౌంటెంటుగారూ. మీ కీమధ్య నిజంచెప్పే ధైర్యం కలిగినట్టుందే!

మేనే: కలుగుతుంది. ఎందుక్కలగదూ! కూసే గాడిదను చూసి మేసే గాడిద కూడ చెడిందట. ఇదిగో యెందుకు చెడిపోతావు. మంచితనంగా రసీదులు రాసివ్వు.

అకౌ: ఇవ్వకపోతే ఏం చేస్తారు?

మేనే: ఏం చేస్తారా? ఏం చేస్తారో అయ్యగారొస్తే తెలుస్తుంది.

అకౌ: రానీండి తెలుసుకుంటాం. మీ అబ్బ గంటయినట్లు అల్లాడుతున్నారు.

మేనే: ఏమయ్యో మాటలు జాగ్రత్తగా రానీ.

సరిగ్గా ఆ సమయానికి ప్రొప్రయిటరు, పి. యస్. వచ్చారు.

ప్రొప్ర: ఏమిటయ్యా. ఏమిటా కేకలు?

మేనే: ఏం లేదండీ.
ప్రొప్ర: ఆ రసీదులన్నీ తీసుకున్నావా?
మేనే: లేదండీ.
ప్రొప్ర: ఏం. ఏం చేస్తున్నావ్?
మేనే: వీళ్ళు....
ప్రొప్ర: చెప్పవయ్యా. మిడుకుతావేం?
మేనే: ఇవ్వటానికి ఒప్పుకోటం లేదండీ.
ప్రొప్ర: ఓహో! ఎవరా ఒప్పుకోంది. ఏమయ్యా!

అని కాషియర్ వైపు తిరిగాడు

కాషి: ఆఁ. నేను ఇచ్చేస్తానండీ. కాకుంటే ఇప్పుడు యమగండమని ఆగా.
ప్రొప్ర: ఊ....నువ్వయ్యా. (అని అకౌంటెంటును చూచాడు)
అకౌ: (పూరుకున్నాడు)
మేనే: ఆయనేనండీ రూల్సు మాట్లాడుతున్నాడు.
ప్రొప్ర: ఓహో, సరే. ఆయనకు ఒక నెల నోటీసుతో టర్మినేషన్ ఆర్డరు తయారు చేయండి. నెల జీతమిచ్చి వెంటనే పంపించండి. ఆ రూల్సేవో అప్పుడు కనపడతయ్. ఏం! ఏమయ్యా ఉత్తరసీదివ్వటానికేం? ఈనాడున్న పరిస్థితుల్లో మిమ్మల్నందర్నీ ఇండ్లకు పంపకుండా పెట్టుకు మేపుతున్నాం మేం? అందు కివ్వచ్చు కదయ్యా రసీదు! మార్కెట్ ఎట్లాగుందో తెలుసా? వెళ్ళు తెలుస్తుంది! ఎక్కడికక్కడ మనుషుల్ని పీకవతల పారేస్తున్నారు. పోవయ్యా! సంపాదించుకో వుద్యోగం - బోనసు లిచ్చే ఉద్యోగం సంపాదించుకో —— (అంటూ లోపలి కెళ్ళాడు - గదిలో అమ్మాయి కళ్ళనీళ్ళు తుడుచుకుని నిలబడ్డది. ఆమెతో కాస్త డ్రింక్ తయారుచేయమని చెప్పి పడకగదిలోకి వెళ్ళాడు. ఆమె ఆ ఆర్డరుకు స్తంభించింది. లోపలికి వెళ్ళలేదు....)
మేనే: ఎందుకయ్యా చెడిపోతావ్! నామాట విను. అయ్యగారు అన్నారంటే అన్నంత పనీ చేస్తారు.
కాషి: ఇదిగో నాయనా! చేతుల్లో వున్నది పోగొట్టుకుని చింతిస్తే లాభంలేదు. పెద్దవాణ్ణి నామాట విను. రాసిచ్చేయ్. ఈనాడు కాకపోయినా ఇంకోనాటికి అయ్యగారిస్తారు.
అకౌ: (పలక్కుండా నిలబడ్డాడు)

మేనే: పిల్లా మేకా గలవాడివి. జీతాలు వస్తుండగానే మన బతుకులిలా వున్నాయ్. ఒక నెల కూలీరాళ్ళు రాకపోతే గిజగిజలాడిపోతాం. నా మాటవిను. నీకోసం కాదు. నీ పెళ్ళాంబిడ్డలకోసం రాసివ్వు - యేం

సిరా: (పలకకుండా యమయాతన పడుతున్నాడు. పెళ్ళాం బిడ్డలు కళ్ళకు కనపడు తున్నారు.)

మేనే: పది సంవత్సరాల సర్వీసు యీ పాడు రసీదుకోసం నాశనం చేసుకోకు నాయనా! పైగా ఇప్పుడు నీ భార్యకు ప్రసవం రోజులు. అన్యాయంగా అల్లాడిపోతావు.

ప్రొప్రయిటర్ వచ్చాడు. పార్వతి పడకగదిలోకి వెళ్ళింది.

ప్రొప్ర: ఏమయ్యా! ఆయనకా నెల జీతమిచ్చి పంపలే ఇంకా?

మేనే: లేదండి, ఆలోచిస్తున్నాడు.

ప్రొప్ర: ఇంక మనం ఆలోచించేదేమీ లేదు.

కాషి: తమరలా అంటే ఎలా? ఏదో మన్నించండి.

ప్రొ.ప్ర: ఇంతకూ ఇప్పుడేమంటాడు?

మేనే: ఇస్తాడు లెండి.

ప్రొప్ర: ఎందుకులేవయ్యా ఆయన్ను బాధపెట్టడం.

మేనే: ఆc, అదేంలేదు (అంటూ కాగితం అకౌంటెంటు కిచ్చి,) ఏదీ సంతకం చేయ వయ్యా పిచ్చోడా!

అకౌ: (నిర్జీవంగా సంతకం చేశాడు)

మేనే: ఈమాత్రం అప్పుడే చేసుంటే ఇంత గొడవ వుండేది కాదుగదా? ఇదంతా అసలాయనకు స్వతాహా కలిగిన బుద్ధి కాదండి. ఆ అబ్బాయి వున్నాడే - వాడు రెచ్చకొట్టి పురెక్కించి పోయాడు.

ప్రొప్ర: ఏ అబ్బాయ్!

మేనే: అతడే! మన కొత్త గుమాస్తా.

పి.యస్: వాడా! వాడు చేస్తాడు. నాకు తెలీదూ? నేను అప్పుడేచెప్పా వాడు పరమ కమ్యూనిష్టని.

ప్రొప్ర: ఇప్పు డా అబ్బాయి ఎక్కడ?

మేనే: వెళ్ళిపోయాడండి.

ప్రొప్ర: ఇంటికా?

రాషి: ఆఁ ఇంటికే. ఒకేసారి వెళ్ళాడు.

మేనే: రాజీనామా దాఖలు చేశాడండి (కాగితం ఇచ్చాడు)

ప్రొప్ర: రాజీనామా ఇచ్చాడా? ఉఁ, అస లేం జరిగింది?

మేనే: ఏమీ లేదండి. రసీదు లిస్తామని వీళ్ళనడుగుతుంటే - తనుగా కలగచేసుకుని వాగాడు. పైగా వెళుతూవెళ్తూ బెదిరించి పోయాడు.

పి.యస్: బెదిరించాడూ! వాడందర్నీ బెదిరిస్తాడు. నాకు తెలీదూ?

ప్రొప్ర: ఉండవోయ్, నీకన్నీ తెలుసు-ఏమని బెదిరించాడు?

మేనే: మీరు వచ్చినా ఫ్యాక్టరీ వర్కర్ల దగ్గర రసీదులు తీసుకోలేరని బెదిరించాడండి.

ప్రొప్ర: ఊఁ. మేనేజరుగారూ! మీకు బుద్ధిలేదండి.

మేనే: చిత్తం.

ప్రొప్ర: ఆ అబ్బాయిని ఎట్టాగో పట్టుకొచ్చుకున్నాను. మీరు వెళ్ళగొట్టారు. కొరివితో తలగోక్కున్నట్టయింది. నా కొంప ముంచటానికి చేరతారు గదయ్యా మీరంతా! సరే! మీరు ఫ్యాక్టరీకెళ్ళి ఆ పని చూడండి. కాషియర్‌గారూ. మీరు బాంక్‌కెళ్ళి ఈ చెక్కు కట్టేరండి. ఏమయ్యా అక్కౌంటెంటు, నువ్వు ఆడిటర్‌గారి దగ్గరకెళ్ళి, ఆ స్టేటుమెంట్లు రేపు సాయంత్రానికిస్తే ఫర్వాలేదా అని తెలుసుకురా! అయినా రేపు తెల్లవారేకల్లా ఎలా తయారుచేస్తావు పాపం!

అందరూ వెళ్ళారు, అకౌంటెంటు నిర్జీవంగా వెళ్ళాడు

ప్రొప్ర: (తన గదిలోకి వెళుతున్నాడు)

పి.యస్: అయ్యా! నేను?

ప్రొప్ర: ఏం జేస్తావ్?

పి.యస్: వెళ్ళి ఆ అబ్బాయిని పట్టుకురానా?

ప్రొప్ర: నీవు పట్టుకు రాగలిగినంత తేలికవాడు గాదులే ఆ అబ్బాయి.

పి.యస్: కాదులేండి నాకు తెలియదూ. అయినా ఆ అబ్బాయిని చూచి తమరింత భయపట్టం....

ప్రొప్ర: ఆ అబ్బాయిని చూచి కాదోయ్. ఆ అబ్బాయి వెనకాలవున్న బలాన్ని చూచి. వాడు కూలీల సంఘంలో పెద్ద నాయకుడు.

పి.యస్: అట్టాగయ్యా! నాయకుడిలాగే వున్నాడు. నాకు తెలియదూ! అందుకే ___ వాడు పరమ కమ్యూనిష్టని అప్పుడే అన్నాను.

ప్రొప్ర: ఏడ్చావులే నువ్వెళ్ళి కాస్త కాఫీ తాగిరా!

పి.యస్: చిత్రం. (వెళ్ళాడు)

ప్రొప్ర: (తన గదిలో కొచ్చాడు. పార్వతి లేదు.) పార్వతీ!

పార్వతి: (ట్రంకుతో వచ్చింది. పడకగదిలోనుంచి. టేబులు మీదపెట్టి) నన్ను మీరు టైపిస్టనే పిలవండి.

ప్రొప్ర: ఓ, అది ఆ అబ్బాయి పెట్టుకున్న ముద్దుపేరేమోకదూ!

పార్వ: (ఊరుకుంటుంది)

ప్రొప్ర: యేం? అతను రాజీనామా యిచ్చాట్ట....

పార్వ: ఏమో నాకు తెలియదు.

ప్రొప్ర: రాజీనామా యిచ్చాడని తెలియదా? ఎందుకిచ్చాడో తెలియదా?

పార్వ: ఎందుకిచ్చాడో తెలియదు.

ప్రొప్ర: నీతో చెప్పలేదూ?

పార్వ: (పలకలేదు)

ప్రొప్ర: అంత సిఫారసుచేసి ఇప్పించావే, నీతో చెప్పకుండా వెళ్ళాడా?

పార్వ: (సమాధానం లేదు)

ప్రొప్ర: ఈ కాలం కుర్రాళ్ళంతా అంతే. కృతఘ్నులు.

పార్వ: (కొంచెం బాధపడ్డది)

ప్రొప్ర: నువ్వెంత అభిమానంతో అతనికి ఉద్యోగం ఇప్పించావు. అతను కాలదన్ని నిన్ను అవమానించాడు.

పార్వ: నాకేం అవమానం లేదు.

ప్రొప్ర: అవమానం లేకున్నా ఆ బాధ వుంటుందిగా.

పార్వ: అతనికి లేనిబాధ నా కేమిటిలెండి.

ప్రొప్ర: నువ్వు నన్ను చాలా అపార్థం చేసుకున్నావు.

పార్వ: నేనా?

ప్రొప్ర: అవును.

పార్వ: అలాంటి దేమీలేదు.

ప్రొప్ర: లేకుంటే నా ఎదుట నువ్విలా దాస్తావ్!

పార్వ: ఏమిటి దాచాను?

ప్రొప్ర: (నవ్వి) మీ రిద్దరూ ప్రేమించుకుంటున్నారన్న విషయం దాచాలని చూచావు. అది నాకు తెలిస్తే నేనేదో నీకు అపకారం చేస్తానని భయపడ్డావు. అవునా?

పార్వ: (పలకలేదు)

ప్రొప్ర: అవును. రాణీ. నిజంలో మీ యిద్దరికీ నేనెంతో సహాయం చేయాలను కున్నాను. మిమ్మల్నిద్దర్నీ చూస్తూవుంటే నాకెంతో ముచ్చటగా వుండేది.

పార్వ: మిమ్మల్నిద్దర్నీ చూచారా?

ప్రొప్ర: ఎన్నోసార్లు చూచాను. మీ అమ్మా నాన్నతో చెప్పి - మీ ఇద్దరి పెళ్ళి త్వరలో జరిపించా లనుకున్నాను కూడా.

పార్వ: (ఆశ్చర్యబోయింది)

ప్రొప్ర: ఏం ఆశ్చర్యపోతున్నావు. నేనలా చేస్తానని నమ్మకం లేదా? నే నెప్పుడూ మీకు ఏ సహాయం చేయలేదా?

పార్వ: చెయ్యకేమండి. మా కుటుంబాని కెంతో సహాయం చేశారు.

ప్రొప్ర: అదేం సహాయంలే. ఆ అబ్బాయి విషయమే నాకు చాలా బాధగా వుంది. మీ అమ్మా నాన్నా చాలా సంతోషించారు—ఇక్కడ వుద్యోగంలో చేరాడని. సరే పెళ్ళి చేసేద్దామనికూడా అనుకున్నాను. ఇప్పుడు వెళ్ళిపోయాడంటే— వాళ్ళకు నేనేం చెప్పాలీ అని ఆలోచిస్తున్నా.

పార్వ: (డోకు వచ్చింది)

ప్రొప్ర: ఏమిటిది? డోకు వస్తోందా?

పార్వ: ఏం లేదు, (అంటూనే ప్రొప్రయిటరు పడకగదిలో కెళ్ళింది)

ప్రొప్రయిటరు ఆలోచనలో పడ్డాడు—ఇలా అలా పచారు చేస్తున్నాడు—లోపల పార్వతి వాంతిచేసుకోటం వినిపిస్తుంది. ప్రొప్రయిటరు దీర్ఘాలోచనలో పడ్డాడు.. పార్వతి వచ్చింది.

ప్రొప్ర: ఏం? ఏంటది? వంట్లో బాగోలేదా?

పార్వ: అబ్బే ఏమీలేదు.

ప్రొప్ర: (ఫోను తీసుకుని) డాక్టర్‌ను పిలవనా?

పార్వ: (అక్కర్లేదు. కంగారు పడుతుంది)

ప్రొప్ర: (అంతా గమనించాడు) ఓ( అదా.......శలవు పెట్టకపోయావా?

పార్వ: ఎందుకు?

ప్రొప్ర: గర్భిణీస్త్రీలు పనిచేయటం నాకిష్టంలేదు. అందులో నీవు....

పార్వతి: (షాక్ తిన్నది)

ప్రొప్ర: ఆ అబ్బాయిని వెళ్ళి పిలుచుకు రాగలవా?

పార్వ: ఎందుకూ?

ప్రొ॥ప్ర: అతను ఉద్యోగం చేయనక్కర్లేదులే—నిన్ను పెళ్ళిచేసుకుని హాయిగా వుంటే చాలు. మీ అమ్మా — నాన్నా యీ వయసులో కష్టపడకుండా గడిచిపోతే చాలు. చూచావ్—అందులో ఇప్పుడు - నీకు ఏర్పడ్డ యీ పరిస్థితిలో వాళ్ళకు తెలిస్తే గుండె పగిలి చస్తారు. మీ అమ్మా - నాన్నాకు, అతన్ని గురించి నేను పూచీ ఇస్తా. అతనితో మాట్లాడి అంతా సెటిల్ చేద్దాం - వెళ్ళి పిలుచుకురా!

పార్వ: ఒక్క మాటడుగుతాను - కోపం చేసుకోరుగదా?

ప్రొ॥ప్ర: అడుగూ!

పార్వ: మామీద ఎందుకు యీ అభిమానం.

ప్రొ॥ప్ర: (కొంచెం దెబ్బతిన్నాడు)—ఇన్నాళ్ళూ ఎందుకున్నది అభిమానం?

పార్వ: ఏమో!

ప్రొ॥ప్ర: ఇప్పుడూ అదే.

పార్వ: ఆయనవల్ల కావలసిన పనేదయినా వుంటే స్పష్టంగా చెప్పేయండి.

ప్రొ॥ప్ర: (పూర్తిగా దెబ్బతిన్నాడు) ఊఁ, చెప్పమన్నావా?

పార్వ: చెప్పండి.

ప్రొ॥ప్ర: అతను మా ఆఫీసు విషయాలలో—ఫ్యాక్టరీ కూలీల విషయాలలో జోక్యం కలగజేసుకోకుండా వుండాలి — అంతే.

పార్వ: అంతేనా?

ప్రొ॥ప్ర: అంతే. అదొక్కటి చేశాడంటే చాలు.

పార్వ: అదొక్కటే ఆయన చేయరు.

ప్రొ॥ప్ర: అతను చేయడు. నాకు తెలుసు. అతను జీవితంలో అనుభవంలేని మూర్ఖుడు. నువ్వు తెలివయిందానివి. బాధ్యతలు తెలిసినదానివి. అతని భార్యవు. అతన్ని దారిలో పెట్టాల్సినదానివి. అందువల్ల నువ్వు చెప్పి చేయించాలి.

పార్వ: నేను చెప్పినా లాభంలేదు.

ప్రొ॥ప్ర: అలా ఎందుకనుకోవాలి. ప్రయత్నించరాదూ?

పార్వ: నేను చెప్పలేను.

ప్రొ॥ప్ర: చెప్పలేవా? చెప్పవా?

పార్వ: చెప్పను. (నావల్లకాదు)

ప్రొప్ర: చెప్పవూ?

పార్వ: అది ఆయన స్వంత విషయం. ఆయన అంతరాత్మకి సంబంధించిన విషయం. అందులో నేను జోక్యం కలుగచేసుకోలేను.

ప్రొప్ర: అంతేనా!—ఆలోచించు. అతనిలాగే నువ్వూ ఆవేశంలో పడకు. నువ్వు ఆడదానివి. గర్భిణివి.

పార్వ: మీరు పదే పదే జ్ఞాపకం చెయ్యక్కర్లేదు.

ప్రొప్ర: అదేకాదు. ఇంకా చాలా విషయాలు జ్ఞాపకం చేయాలి. మీకు వున్నది ఆ యిల్లు వక్కటే - మీరు నాకు ఇవ్వాల్సిన అప్పు - ఆ యింటిని మించి వుంది - అదంతా ఎందుకు - నీ పరిస్థితి ఇప్పుడు బైటపడితే - మీ అమ్మా - నాన్నా ఏమవుతారో తెలుసా? అసలే గుండెజబ్బు మనిషి మీ నాన్న - ఆలోచించు. పోనీ వాళ్లు చావకపోయినా - మీ బతుకేమవుతుంది? ఏమీ కాకున్నా నువ్వు బ్రతికేం ప్రయోజనం - అన్నీ ఆలోచించు, ఆలోచించి నిర్ణయించు.

పార్వ: (నిజంగా ఆలోచనలో పడ్డది. ఆందోళనపడుతోంది)

ప్రొప్ర: దేశంలో కొంపలు లేనివాళ్ళు చాలమందున్నారు. కాని వాళ్ళు కొంపల్లో వుండే అవకాశం వుండీ పోగొట్టుకొన్నవాళ్ళు కారు. రోజూ గుండెలు ఆగి చచ్చేవాళ్ళు ఎందరో వున్నారు. కాని వాళ్ళందరూ కూతుళ్ళు తెచ్చిన అవమానం భరించలేక చచ్చేవాళ్ళు కారు. ఉద్యోగాల్లోంచి వూడిపోయేవాళ్ళు దినానికి కొన్నిపేలమందున్నారు. కాని వాళ్ళంతా వుద్రేకంవల్ల వుద్యోగాలు పోగొట్టుకునేవారు కారు. నువ్వూ మీ నాన్నా అమ్మా ప్రత్యేకంగా నిలుస్తారు చరిత్రలో - అన్ని అవకాశాలూ వుండీ ...

పార్వ: (గొల్లుమన్నది)

ప్రొప్ర: ఏడవకు .... నిన్నేడిపించాలనా నే నింతా చెప్పింది. నువ్వు హాయిగా కమ్మగా నవ్వుతూండాలనేగా ... ఆలోచించు. చేయగలననుకుంటే కాదు, చేయాలనుకుంటే! కారుంది తీసుకెళ్ళు. (అని తన పడకగదిలో కెళ్ళాడు)

పార్వ: (అలాగే కూచుంది. ఆమెలో అనంతమైన సంక్షోభం కళ్ళల్లో కనిపిస్తూంది)

శంక: (గబ గబా వచ్చాడు. ఇటటు చూచాడు) పారూ!

పార్వ: (తన చెవులను నమ్మలేకపోయింది)

శంక: పారూ! పారూ! (ప్రొప్రయిటర్ గదివైపు వెళుతున్నాడు)

పార్వ: (లేచి గబగబా పరుగెత్తింది) శంకర్....శంకర్....

ప్రొప్రయిటర్ ఇదంతా గమనిస్తున్నాడు. ఇద్దరూ ఆఫీసు గదిలో కలుసుకున్నారు.

శంక: ఏమిటలా వున్నావ్?

పార్వ: ఏంలేదు. (నవ్వుపుచ్చుకోటానికి ప్రయత్నిస్తుంది)

శంక: నేను చెప్పినంతా అయినట్టుందే!

పార్వ: ఏమిటి?

శంక: ప్రొప్రయిటర్ నీమీద ఒత్తిడిచేశాడా!

పార్వ: తెచ్చాడు.

శంక: బెదిరించాడా?

పార్వ: ఆఁ. భయపెట్టాడు. నన్ను పెళ్ళి చేసుకుంటున్నాడుట. నీకు చెప్పి ఒప్పించమన్నాడు.

శంక: ఏమిటి?

పార్వ: ఆఫీసు విషయాల్లో. కూలీల గొడవల్లో కలగజేసుకోవద్దని.

శంక: సరే... చెప్పు మరి.

పార్వ: శంకర్!

శంక: అతను అన్నంతపని చేస్తాడన్న భయం వుందా నీకు?

పార్వ: చెయ్యగలడు.

శంక: ఏచ్చాడు.

పార్వ: అంత తేలిగ్గా తీసేయకు శంకర్!

శంక: అయితే ఏమంటావ్? అతను చెప్పిందాన్ని ఒప్పుకోమంటావా! నా ఆత్మను చంపుకోమంటావా! నన్ను నమ్ముకున్న ఆ కూలీలనంతా ఆ గంగలో కలపమన్నావా! అంతేనా!

పార్వ: శంకర్! నే నేమీ అనలేను. నీ కేమీ చెప్పను. చెప్పనని ఆయనతోనే చెప్పేశాను.

శంక: ఏమన్నాడు?

పార్వ: ఏమంటే ఏం? ఒక్కటి మాత్రం తెలిసింది.

శంక: ఏమిటది?

పార్వ: నామీద అభిమానంకొద్దీ మీకు ఉద్యోగం ఇచ్చాడని మనం అనుకున్నాం. అందువల్ల కాదని తెలిసింది.

శంక: మరెందుకు?

పార్వ: మీరంటే ఆయనకు భయం.

శంక: భయమా!

పార్వ: అవును. మీ వెనకాల పెద్ద బలం వుందని, మీరు కూలీలలో పలుకుబడి ఉన్న వారని, మిమ్మల్నెలాగైనా బుట్టలో వేసుకోవాలని చెప్పాడు.

శంక: ఇప్పుడు తెలిసిందా వీళ్ళ అభిమానాల విషయం. సరే నువ్వు జాగ్రత్తగా ఇక్కడే వుండు.

పార్వ: ఇంకెందు కిక్కడ?

శంక: నాకు కొంచెం పనుంది. ఈ ఫోను నెంబరు ఏమిటి?

పార్వ: 12345.

శంక: సరే! అవసరమైతే ఫోను చేస్తా. ఏం?

పార్వ: వెళ్ళిరా.

శంక: ఏమిటి అదోలా వున్నావు?

పార్వ: ఏం లేదు.

శంక: వస్తా.

పార్వ: (తలాడించింది)

శంక: (వెళ్ళాడు)

పార్వ: (అలాగే నిలబడి వుంది)

ప్రొప్ర: (ఇంతవరకు యీ సంభాషణ తన గదిలోంచి వింటున్నాడు. ఉగ్రుడయ్యాడు. విసురుగా ఆఫీసు గదిలోకి వెళ్ళబోయాడు. ఇంతలో ఫోను మోగింది. (ఫోనందుకొని) ఎవరు మేనేజరా! ఆఁ. ఏమయ్యా! రసీదు ఇవ్వటానికి ఒప్పుకోలేదా! ఆ అబ్బాయి అక్కడ చేరాడా .. ఆఁ....వాడేనా ఇంత రెచ్చగొట్టింది? సరే...రేపు ఫ్యాక్టరీ అసలు మూసేస్తామని భయపెట్టకపోయావా! ఏం లాభంలేదా ...మనవైపు ఎవ్వరూ లేరా....ఒకరిద్దరుంటే ఇంకేమయ్యా ...వాళ్ళు భయపడుతున్నారా? వాళ్ళను మెల్లగా అవతలకు పిలిచి డబ్బు ఆశ చూపండయ్యా....ఆఁ....అంతే....అన్నివిధాలా ప్రయత్నించండి. తరువాత వుండనే వుంది - ఆఁ...ఆఁ!....సరే .... (ఫోను పెట్టేసి సర్రుమని ఆఫీసులోకి వచ్చాడు) అంతా విన్నాను.

పార్వ: నేనూ విన్నాను.

ప్రొప్ర: అయితే మీ రిద్దరూ నిర్ణయించుకున్నారన్నమాట.

పార్వ: అవును.

ప్రొప్ర: ఇక మీకూ నాకూ ఏమీ మొహమాటం లేదు. సరేనా?

పార్వ: మీ యిష్టం. మీరేమైనా చేయండి.

ప్రొప్ర: తెగించావన్నమాట.

పార్వ: భయంలేదు.

ప్రొప్ర: సరే . .మీ అమ్మానాన్నలతో ఒక్కమాట మాట్లాడి మరీ వస్తా. (వెళ్ళాడు)

పార్వతి అక్కడున్న కుర్చీలో కూలబడింది. ఒక్కక్షణకాలం అలాగే నిశ్చలంగా వుంది. తరువాత లేచింది. ఇటటు పచార్లు చేసింది. ఆమె మనసులో రేగుతున్న తుపానును తెలియచేయటానికి నేపథ్యంలో ఒక పాటవున్నా వుండొచ్చు. మేనేజరు ఇంట్లో పెద్ద గందరగోళం - తపేలలు, ప్లేట్లూ, అవీ పడేయటం. పిల్లల ఏడుపు - ముఖ్యంగా ఒక పసిపిల్ల ఏడుపు. ఇలాంటివి వినపడతాయి. ఆ అమ్మాయి అలాగే నిలబడి వుంది -

మేనేజరు భార్య వచ్చింది.

భార్య: ఏదీ? ఏడీ యీయన! ఎక్కడికి వెళ్ళాడు! లేడూ?

పార్వ: లేడమ్మా.

భార్య: లేడూ? ఎవ్వరూ లేరా ఆఫీసులో?

పార్వ: లేరు.

భార్య: పోనీలే. ఎవ్వరూ లేకుండానే పోతారు. నాకు తెలుసు. ఈ ఆఫీసు నేల మట్టి పేలపిండి అయిపోయిందిలే - కాకుంటే నన్ను మంచానికేసి కట్టేశారా. నేను పిచ్చిదాన్ననీ అందరినీ కరుస్తాననీ భయమట. వీళ్ళ భయం మండిపోనూ. అసలు వీళ్ళందరూ అంటె నాకు భయం. ఆ భయంలో నేనే ప్రపంచాన్ని వదిలి వెళ్ళాలనుకుంటున్నాను. ఇంక అయిదు నిమిషాల్లో వెళతాను. అంటె చస్తాను. ఈ మాటంటె - నాకు చస్తానన్న భయమని వీళ్ళంటారు. పోనీ అమ్మాయి, నేనంటే నీకూ భయమేనా?

పార్వ: నాకేం భయం లేదమ్మా.

భార్య: నేను కరుస్తానని భయంలేదు?

పార్వ: మీరెందుకు కరుస్తారు?

భార్య: అదేకదా. మనిషిని చూచి మనిషికేం భయం! కాకుంటే - వాణ్ణి - ఎవరు - యీ పప్పురయిటరైౖ గాడున్నాడే - వాణ్ణి కరుస్తానన్నాను. ఎందుకంటె వాడు పాము....వా డెందరినో కరిచాడు. పామును మనం కరిస్తే అది చచ్చి

పోతుంది. (నవ్వి) నా తెలివిమండ. పాము కరిస్తే మనం చస్తాం. అంతే కదూ?

పార్వ: అంతే.

భార్య: నువ్వు మంచిదానివిగా వున్నావు. కూచోమ్మా. కథ చెప్తా - వింటావా?

పార్వ: చెప్పండి.

భార్య: నీకు పెళ్ళయిందీ?

పార్వ: లేదు.

భార్య: నువెప్పుడైనా పిల్లల్ని కన్నావ్. (నవ్వి) నా తెలివి మండా. పెళ్ళి కాకుండా పిల్లల్ని ఎలా కంటారు? (ఆలోచించి) ఏం? ఎందుక్కనకూడదు? ఈ కాలం పిల్లలు చాలామంది కంటున్నారు. పాడుపిల్లలు - వాళ్ళ బతుకులు మండా.

పార్వ: (కలతపడింది)

భార్య: ఇదుగోమ్మా! నువ్వు మాత్రం పెళ్ళి చేసుకున్నా పిల్లల్ని కనకు. నా మాట విను. ఈ మగాళ్ళకేం? కనమంటారు. వాళ్ళ మాటలు నమ్మకు. నేను ఆరుగురు పిల్లల్ని కన్న అనుభవం మీద చెప్తున్నాను. ప్రతి ప్రసవానికి నా మొగుడు అనేవాడు ఇంతటితో ఆపేద్దామని....కానీ ఆయనెందుకాపుతాడు? ఆరునెల్లు కాకముందే మళ్ళా తయారు. అందుకే మగాళ్ళను ఎప్పుడూ నమ్మకు. వాళ్ళు ఆశ చూపి మోసం చేస్తారు. ఇంతెందుకు? అసలు నువ్వు మగాణ్ణి పెండ్లి చేసుకోవద్దు (నవ్వి) నా తెలివిమండా. మగాణ్ని కాకుంటే ఆడదాన్ని చేసుకుంటావా?

పార్వ: (మెల్లగా నవ్వింది)

భార్య: సరేగాని నువ్విక్కడ వుద్యోగం చేస్తున్నావా?

పార్వ: ఆఁ.

భార్య: అయితే ఒక్కపని చేస్తావ్.

పార్వ: ఏమిటండీ?

భార్య: నువ్వు వాణ్ణి కత్తితో పొడిచి చంపేయ్. ఇదుగో! (ఒక కత్తి నడుం నుంచి తీసియిచ్చింది)

పార్వ: (తెల్లపోయింది)

భార్య: నువ్వు వాణ్ణి చంపేయ్. నేను వాడి కొంపలన్నిటికీ అగ్గి పెట్టేస్తా. తగలబెట్టేస్తా. ఏం? బలే! బలే! (నవ్వింది)

పార్వ: (కంగారుపడింది)

భార్య: ఏం? నీకు భయమా? చంపలేవా? చంపలేకపోతే ఆ కత్తితో నువ్వే పొడుచుకొని చావు. అంతే. మనల్ని చంపేవాళ్ళను మనం చంపలేకపోతే మనమే చావటం మంచిది. అసలు భయపడేవాళ్ళు బ్రతకటం అనవసరం. వాణ్ణి చంపలేకపోతే నువ్వు చావు. అంతే. (నవ్వుతూ వెళ్ళింది)

పార్వ: (ఆ కత్తి చూచింది. వళ్ళు జలదరించింది. మనిషి ఏదో నిర్ణయానికి వస్తూన్నట్లు కనిపిస్తూంది.)

ఇంతలో అకౌంటెంటు వచ్చాడు. వీళ్ళిలా మాట్లాడుతూ వుండగా
ప్రొప్రయిటర్, ఇంకో ముసలాయనా వచ్చారు.

ప్రొప్ర: పార్వతీ! మీ నాన్న వచ్చారు.

పార్వ: ఆఁ. (పరుగెత్తుకు ఆఫీసుగది కొచ్చింది) నాన్నా!

ప్రొప్ర: మీరు మాట్లాడండి. ఇప్పుడే వస్తా. (తన పడకగదిలోకి వెళ్ళాడు)

పార్వ: ఏమిటి నాన్నా ఇలా వచ్చారు!

నాన్న: ఏమీ లేదమ్మా. చూచో....ఏమిటీ గల్లంతు!

పార్వ: గల్లంతేముంది?

నాన్న: ఆ అబ్బాయి వుద్యోగం రాజీనామా చేశాట్టగా!

పార్వ: ఆయన చెప్పారా మీకు?

నాన్న: పొద్దున వచ్చి అయ్యగారు చెప్పారు; ఉద్యోగంలో చేరాడని. ఇప్పుడు వదిలేశారన్నారు. ఏమిటిది - పిల్లచేష్టలు కాకపోతే?

పార్వ: ఏమిటో ఆయనకు నచ్చలేదు నాన్నా!

నాన్న: నచ్చడం ఏమిటమ్మా! బతకాలి. ఆ మాత్రం తెలుసుకోవద్దా అతను. అది పోతే పోయింది - అయ్యగారితో కయ్యం పెట్టుకున్నాట్ట!

పార్వ: కయ్యమేముంది నాన్నా! ఎప్పుడూ ఆయన చేస్తున్న పనే.

నాన్న: కాలం ఎప్పుడూ ఒకేలాగుండదమ్మా, నా మాట వినమ్మా. ఆ అబ్బాయిని పిలిచి గట్టిగా చెప్పు తల్లీ. ఆయనకోసం కాదు - మనకోసం.

పార్వ: ఆయన వినరు నాన్నా.

నాన్న: వినడూ? అంటే ఏమిటి వాడు నిన్ను ప్రేమిస్తున్నది? ఏమిటా ప్రేమ? నువ్వూ, నీ నాన్నా, అమ్మా నాశనమైపోతున్నా ఆమాత్రం సహాయం చేయలేనివాడు ఏమిటి నిన్ను ప్రేమించేది? మనల్ని వాడు కాపాడకుంటెపోయె. ఇట్టా ప్రాణాలు తీస్తాడా? ఇదేనా వాడి ప్రేమ! చెప్పమ్మా - వాడితో చెప్పు....

కడుపో కాలో పట్టుకో తల్లీ. ఈ వయసులో-మమ్మల్ని నడివీధిలో పారేయ కమ్మా. ఆ వున్న ఒక్క కొంపా పోతే; నీ కున్న యీ వుద్యోగమూ పోతే

పార్వ: నాన్నా. ..

నాన్న: చెప్తావా, నీ చిట్టితమ్ముల్నీ - నీ చెల్లెల్నీ కాపాడతావా?

పార్వ: నాన్నా! ఆయన నా మాట వినరు.

నాన్న: వినడూ, అసలు నువ్వు మా మాటవింటేగా? నువ్వే చెప్పనన్నావట!

పార్వ: నేనా?

నాన్న: అవును. నువ్వే. అయ్యగారినే ఎదిరించి చెప్పావటగా!

పార్వ: చెప్పాను.

నాన్న: చెప్పావు? చెప్తావు. నీకేం నిన్ను కని పెంచి పెద్ద చేసినందుకు ఆమాత్రం చేయవూ....చేస్తావ్. సంపాయించిందంతా నీకుపోసి నిన్ను చదివించాను. దాని కిదే ఫలితం....ఇంతకన్నా మాకు అంతవిషం యిచ్చి చంపేయరాదు?

పార్వ: నాన్నా! నన్ను ఆత్మను అమ్ముకోమంటారా! చంపుకోమంటారా?

నాన్న: ఆత్మ! ఎక్కడుంది ఆత్మ. ఏదీ వాస్త చూపించు. నిన్ను పెంచడానికీ నీకు చదువు చెప్పించటానికీ మేమెంత చంపుకున్నామో తెలుసా ఆత్మలని. ఆత్మను అమ్ముకోలేదట! చంపుకోలేదట!

ప్రొప్ర: (వచ్చి) అవును మరి. ఎలా చంపుకుంటుంది. వంశం పేరు ప్రతిష్ఠలు కావాలంటె చంపుతుంది. పెళ్ళికాకుండా పిల్లల్ని కంటుంది.

నాన్న: ఆఁ, ఏమిటండీ!

ప్రొప్ర: మీకు తెలవదూ....పార్వతి గర్భవతి.

నాన్న: ఆఁ, గర్భవతా. ఏమే నిజమేనా! నిజమేనటనే....చెప్పు....చెప్పమ్మా. అబద్ధమని చెప్పు - మమ్మల్ని చంపకు. అబద్ధం కదూ! నా చిట్టితల్లి అంత అవమానప్పని చెయ్యదు....చెప్పు....అబద్ధం కదూ!

పార్వ: నాన్నా!

ప్రొప్ర: అబద్ధమని ఎలా చెపుతుంది....ఏం చెప్పు భయమెందుకు. .నిజాన్ని చెప్ప టానికి భయపడనివాళ్ళుగా మీరు....చెప్పు.

నాన్న: నిజమా; చెప్పుతల్లీ! చెప్పు.

పార్వ: నిజమే నాన్నా.

నాన్న: ఆఁ-ఆఁ (మనిషి నిలువునా కూలిపోయాడు)

పార్వ: నాన్నా: నాన్నా! (పైనపడి ఏడుస్తున్నది. అతనెప్పుడో కళ్ళుమూశాడు)

ప్రొప్ర: ఇంకెక్కడి నాన్న - ఎప్పుడో పోయాడు.

పార్వ: నాన్నా! నాన్నా!

ప్రొప్ర: ఇప్పుడు ఏడిస్తే వస్తాడా నాన్న! నాన్న ఏడ్చినప్పుడు నువ్వేం చేశావు? వూర్కోలేవూ అంటే; బతికుండగా సులభంగా చంపగలిగావు. కానీ, చచ్చిం తరువాత బతికించగలవా? ఇప్పుడు తెలిసిందా చావడం అంటే ఏమిటో....

పార్వతి ఏడుస్తుంది. ప్రొప్రయిటర్ నవ్వుతున్నాడు. అకౌంటెంటు సహించలేక పోయాడు. గబగబా ఫోను తీసి,

అకౌ: హల్లో.... హల్లో...

ప్రొప్ర: (గమనించాడు) ఆగు. ఎవరి కా ఫోన్ చేయడం?

అకౌ: నీ పాలిట యముడికి.

ప్రొప్ర: ఎవర్రా ఆ యముడు! (అని పైకి దూకబోయాడు)

పార్వ: (సర్రుమని బొడ్డులోంచి కత్తిదూసి) నిలు .. .... చంపేస్తా.

ప్రొప్ర: (ఆగాడు) ఆఁ....

పార్వ: కదిలావా కత్తి దింపేస్తా. రాక్షసుడా నవ్వుతావా! అమాయకుల్ని చంపి నవ్వుతావూ!

అకౌ: (తొందరగా) హల్లో - నేనే అకౌంటెంటును. ఆఁ.... ఆ రాక్షసు డిక్కడే వున్నాడు. పార్వతి నాన్నగారు చనిపోయారు.... రండి వెంటనే రండి.

పార్వ: (అకౌంటెంటు ఫోనులో మాట్లాడి ముగిసేదాకా ప్రొప్రయిటర్ని అలా నిలబెట్టింది)

ప్రొప్ర: (పార్వతి దృష్టి మరల్చాలని ఫోన్ పేసి - వాకిలివైపు చూచి) హల్లో .... శంకర్.... (అన్నాడు)

పార్వ: (వెనక్కు తిరిగి చూసింది)

ప్రొప్ర: (అమాంతం ఆమె చేయి పట్టుకొని బాకు లాక్కున్నాడు. మెరుపుతీగలా జరిగిపోయిం దీ పని. అందువల్ల అకౌంటెంటు నిస్సహాయుడై పోయాడు. ప్రొప్రయిటర్ విరగబడి నవ్వి) ఇప్పుడు చెప్పండి....ఎవరికి మీరు ఫోన్ చేసింది....శంకర్ కేనా! ఊఁ చెప్పండి?

అకౌ: అవును. శంకర్ కే.

ప్రొప్ర: మంచి పనిచేశారు. ఇక కానీ, చెప్పు. ఇప్పుడా అబ్బాయి వస్తాడు. ఏం! అతన్ని ఒప్పిస్తావా? చెప్పు.

పార్వ: ఎందుకు? చచ్చినవాళ్ళను బతికిస్తావా?

ప్రొప్ర: బతికున్నవాళ్లు చావకుండా చూస్తాను....అకౌంటెంట్! అడుగు కదిపావా...! జాగ్రత్త....చెప్పు....పార్వతీ....మీ నాన్న చచ్చాడు....ఈ విషయం తెలియగానే మీ అమ్మ చస్తుంది....యిక నువ్వు! నిన్ను చంపడం చాలా సులభం. నీ కున్న ధైర్యం శంకరుడున్నాడనేగా. వాడు నీకు దక్కకుండా చిటికలో విరిచేస్తా ...నువ్వు గర్భవతివి....నీ కడుపులోవున్న బిడ్డ వాడిబిడ్డేనని యేం నమ్మకం? నువ్వు నాతోకూడా అనురాగం నటించావని అందరికీ తెలుసు. ఆ బిడ్డ నా బిడ్డ ఎందుక్కాగూడదు? (మాటలమధ్య డ్రాయర్‌లోవున్న పిస్టల్ కూడా తీసుకున్నాడు)

పార్వ: (పిడుగుపడ్డట్టు) ఆ...

ప్రొప్ర: నాదే నంటాను. ఎవరు కాదంటారు? నువ్వు కాదంటే నమ్మేదెవరు? లోకం నిన్ను పొడిచి పొడిచి చంపుతుంది. లేదా నువ్వే యే నుయ్యో గొయ్యో చూచుకుంటావు....అంతే....ఏం...చెప్పు....

పార్వతి చెక్కుచెదరకుండా అలాగే నిలబడివుంది. అకౌంటెంట్ ఆవేశంతో రొప్పుతున్నాడేగాని యేంచేయాలో తోచక అవస్థపడుతున్నాడు. మేనేజరు ఇంట్లోంచి మేనేజరు భార్య పరుగెత్తుకొచ్చింది....

భార్య: ఏదీ! ఏదీవీడు....వీడిగొంతు! వినిపించిందే.... ఎక్కడున్నాడు యీ రాక్షసుడు .... (వచ్చి ఆ దృశ్యాన్ని చూచి) ఓసి పిచ్చిపిల్లా .... పిరికిదానా! వాణ్ని చంపమని కత్తి యిచ్చిపోతే వాడిచేతి కా కత్తి యిచ్చి వెర్రిముఖం వేసుకొని కూచున్నావేమే....నేను చెప్పలేదూ వాణ్ని చంపలేకపోతే నిన్ను చావమని....చావు....నువ్వే చావు-నాకేం....

ప్రొప్ర: ఏయ్! పో అవతలకి. లేదా....

భార్య: పోతున్నారా.... పోతున్నా.... ఇదిగో ఆ పిల్ల పిరికిదైతే నేనూ అంతే అనుకున్నావా....పిచ్చివాళ్ళ ధైర్యం నువ్వెరగవు....ఉండు. నా పని నేను చేసేస్తా. ఇక్కడేవుండు యిప్పుడే వొస్తా....నీ కొంపకు అగ్గిపెట్టి మరీ వస్తా వుండు ... ఒక్క అగ్గిపుల్ల చాలు .... గీచిపెడితే యిక చూస్కో నా రంగా....

నవ్వుతూ వెళ్తుంది.

ప్రొప్ర: (నిజంగానే కంగారుపడి) ఏయ్....ఆగు....యెక్కడికి పోతావ్ (అని ఆఫీసు గదిలోకి వెంబడించాడు. ఆమె వెళ్ళింది. అకౌంటెంటు ప్రొప్రయిటర్‌పైకి వురికాడు)

ప్రొప్ర: పోలీస్, పోలీస్! (అని కేకలు వేశాడు.)

సరిగ్గా సమయానికి పోలీస్, సి.ఐ., శంకరం గబగబా వచ్చారు.

ప్రొప్ర: వచ్చారా! వీళ్ళందరినీ అరెస్టు చేయండి. వీళ్ళు నన్ను చంపడానికి చూస్తున్నారు. ఇదిగో కత్తి - ఇదిగో పిస్టల్.

సి.ఐ: ఇప్పుడు మిమ్మల్ని అరెస్టు చేయడానికి వచ్చాం...

ప్రొప్ర: నన్నా! ఎందుకు?

సి.ఐ: కోర్టుకు వస్తే తెలుస్తుంది.

శంక: కోర్టుదాకా యెందుకు....నేను చెప్తాను. తప్పుడు లెక్కలు తయారుచేసి ఇన్‌కంటాక్సు ఎగ్గొట్టి ప్రభుత్వాన్ని మోసం చేసినందుకు. కూలీలకు గుమాస్తాలకు న్యాయంగా యివ్వాల్సిన బోనసు యివ్వకుండా భయపెట్టి, యిచ్చినట్లు రసీదులు తీసుకున్నందుకు, ఇప్పుడు యీ ముసలాయన్ను చంపినందుకు....

ప్రొప్ర: ఇదంతా....ఇదంతా మీ కెవరు చెప్పారు?

అకౌం: నేనే....నేనే చెప్పాను. నేనే యీ సంవత్సరం, నిరుడు సంవత్సరం లెక్కలు లెడ్జర్లు అన్నీ పోలీసుల కిచ్చాను.

ప్రొప్ర: ఆఁ. కాదు....వాడు చెప్పినంత మాత్రాన నమ్మటమేనా!

సి.ఐ: కావలసినన్ని సాక్ష్యాలున్నాయి - కదలండి.

మేనేజరు లోపలికి వురుకుతూ వచ్చాడు; బైట జనం గోల

మేనే: అయ్యా! అయ్యా! కూలీలు....కూలీలు ఆఫీసు మీది కొస్తున్నారు....రసీదులివ్వమని బెదిరించాను....తన్నటాని కొస్తున్నారు....

పి.యస్: సార్! సార్! తన్నారు. తన్నారు. నాకు తెలీదూ!

ముసలయ్య గబగబ వచ్చాడు

ముస: అయ్యా, అయ్యా! ఆఫీసు నిప్పంటుకుంది. మేనేజరు గారింట్లో మంటలు రేగినయి...

అంద: ఆఁ!

మేనేజరు భార్య వెర్రిగా నవ్వుతూ గంతుతూ వచ్చింది.

భార్య: అయిపోయింది. అంతా ఖాళీ అయిపోయింది. ఒక్క అగ్గిపుల్లతో అంతా బుగ్గి అయిపోయింది. తగలబెట్టేశా....ఇంకేమీ మిగలదు.... బూడిద తప్ప ఇంకేమీ మిగలదు....

నిజంగా మంటలు

మున: అయ్యా! అవిగో మంటలు. ఇంట్లో పిల్లాపాప వుండారయ్యా....

పార్వ: శంకర్........

శంక: (ఒక్క వురుకున మేనేజరింట్లోకి వెళ్ళాడు. మంటలు పెద్దవవుతున్నాయి.)

భార్య: వెళ్ళండి. అందరూ వెళ్ళండి. చావంటే భయపడే వాళ్ళందరూ వెళ్ళండి. నాకింక ఏ భయమూలేదు.

సి.ఐ: పదండి పదండి, మంటలు చుట్టుకొంటున్నాయి.

భార్య: అందరూ వెళ్ళండి. వీడు మాత్రం ఇక్కడేవుండాలి. ఇక్కడే చావాలి. ఈ మంటల్లో చావాలి. అసలు వీడుచస్తే అన్ని భయాలూ పోతాయి. వుండరా వుండు, నువ్వెక్కడికి పోతావు? నీకు చితిపేర్చాను.

సి.ఐ: (ప్రొప్రయిటర్‌ను తీసుకొని బైటికి వెళ్తున్నాడు)

భార్య: (ప్రొప్రయిటరు ఇంతకు పూర్వం ఎప్పుడో జారవిడిచిన కత్తి చూచింది. దాన్ని అందుకొని) అది పట్టి పిచ్చిపిల్ల. వీణ్ణి చంపమని కత్తి ఇచ్చినా చంప లేదు. పోనీలే అంతా నేనే చేసేస్తా....

అని కత్తి విసిరింది. ప్రొప్రయిటర్ ఆఁ. అన్నాడు. సి. ఐ. అతన్ని పడకుండా పట్టుకోబోయాడు కానీ అతను పడిపోయాడు.

భార్య: (గంతుతూ నవ్వుతూ విలయనృత్యం చేస్తూ) అయిపోయింది. అంతా ఖాళీ అయిపోయింది. ఇంక భయమే లేదు....ఎవ్వరికీ ఏ భయమూ లేదు....నాకు చస్తానన్న భయమూలేదు....నేనెందుకు చస్తాను. చావను....చావను....

తెర జరజర జారింది.

---

# మనసూ - వయసు




'మనసూ - వయసు'కు మరో పేరు [illegible]. 1968 లో ప్రతిభ సచిత్ర వారపత్రికలో ధారావాహికంగా ప్రచురింపబడిన యీ నాటకానికి మూలం - 'సిడ్నీ హావర్డ్' రాసిన 'దే న్యూ వాట్ దే వాంటెడ్' అనే నాటకం. ఇది ఆత్రేయ పూర్తిగా రాసిన నాటకాల్లో చివరిది.

# పాత్రలు

శివయ్య
తిరుపతి
పంతులు
నాయరు
డాక్టరు
అంజయ్య
ఆయా
లిల్లీ

# దృశ్యం ఒకటి

## పాత్రధారుల సామగ్రి

పంతులు: చేతిలో న్యూసుపేపరు.

శివుడు: తాళాల గుత్తి.

ఆయా: ట్రే - బ్రాందిసీసా - గ్లాసులు ——

తిరుపతి: డ్రాయర్లో లిల్లీ వుత్తరాలు - ఫోటో ——

లిల్లీ: ప్రయాణం సామాన్లు - హేండుబ్యాగ్ - చీర - తిరుపతి ఫోటో.

ఊరి వెలుపల పెద్ద తోట. తోటలో బంగళా. చాలా అందంగా వుంది. బంగళా కింది భాగం - ఒక పెద్ద హాలు, ఎదురుగా తలవాకిలి కనిపిస్తుంది. దాని కిరువైపులా రెండు కిటికీలు - వాటికి కొత్త తెరలు. గుమ్మం దాటి రాగానే ఎడమచేతివేపు మేడపైకి మెట్లు. వాటిముందు శివయ్య గది. కుడిచేతి వైపు పడకగది. దాని ముందుగా వంటింటిలోకి వెళ్ళే దారి. —— అన్ని గుమ్మాలకు అందమైన తెరలున్నవి. తలవాకిలిగుండా పెద్ద తోట కనిపిస్తోంది.

పోర్టికో వుంది. అందులో పెద్ద కారు. హాలులో మంచి సోఫాసెట్టు. ఒకవైపు పెద్ద అద్దం అమర్చిన డ్రెస్సింగ్ టేబుల్ లాటిది. దానికి సొరుగులు కూడా వున్నవి. మరొకవైపు హేట్స్ తగిలించుకునే స్టాండు. దానిమీద ఒక జోడు గుళ్ళ తుపాకీ, తూటాలు దట్టించిన బెల్టు. గోడలకు మంచి ప్రకృతి దృశ్యాలు - శృంగార చిత్రాలు కొన్ని —— ఇంటికి అప్పుడే రంగు వేసినట్లుంది. అంతా తీర్చిదిద్దినట్లు ——

తిరుపతి, నాయర్ హాల్లో వున్నారు. తిరుపతి మంచి అందగాడు. కండలు తిరి గిన దేహం. అలాగని మొరటువాడు కాదు. మగసిరి కలవాడు. అతని కళ్ళు ఎలాంటి ఆడదాన్నయినా అట్టే ఒకక్షణ కాలమైనా ఆకర్షించి నిలవేయగలవు. అలాగని పెద్దవీ కావు. అదొక ప్రత్యేకత. మనిషి చాలా నీట్‌గా దుస్తులు వేసుకున్నాడు.

నాయర్ వయసు మళ్ళినవాడు. ఎప్పుడూ చిరునవ్వు. సూక్ష్మగ్రాహి. తెల్లటి బట్టలు వేసుకొన్నాడు. చెప్తేగాని వంటవాడని తెలియదు. తిరుపతి, నాయర్ హాల్లో కింద కూర్చొని స్వాగతం బోర్డుకు బల్బులు తగిలిస్తున్నారు. కాస్సేపటి కల్లా పంతులు వీధి మెట్లెక్కి వచ్చాడు. పాత కాలం ఆఫీసర్‌లా వుంటాడు.

తలపాగా - పిలకజుట్టు - పాతకాలం కోటు - పంచకట్టు మీసాలు - కళ్ళజోడు-
చేతిలో వార్తాపత్రిక పాతకాలం వేషం. కొత్తకాలానికి ఎగబడే ధోరణి. గుమ్మం
దాటివచ్చి తిరుపతి, నాయర్లవంక నిదానించి చూచాడు.

పంతులు: ఏమోయ్ తిరుపతీ!

తిరుపతి: ఓ పంతులుగారా! దయచేయండి, దయచేయండి, ఊఁ. ఎలా వున్నాయి పెళ్ళి ఏర్పాట్లు? చూశారా! - ఆయాను పురమాయించి యిల్లంతా రంగు రంగు ముగ్గులు పెట్టించేశాను. ఎలక్ట్రిక్ బల్బుల తోరణాలు కట్టించాను. ఇల్లంతా నీట్‌గా....ఊఁ! చేసుకునేది రిజిష్టరు పెళ్ళేకదా - ఇదంతా ఎందుకంటారేమో. దేనికదే ఎక్కడి కక్కడే - ఏమంటారు?

పంతులు: (ఏఁవీ అనడం యిష్టంలేక నవ్వి - వూరుకున్నాడు)

తిరుపతి: చూశారా! స్వాగతం బోర్డు! ఈ బల్బులు వాటంతటవే యిలా యిలా అంటూ వుంటాయి. మంచి అందమైన ఆడది - కన్ను గీటినట్టే వుంటుంది సుమండీ!

పంతులు: ఆహాఁ!

తిరుపతి: ఊఁ! కావాలంటే ఓ మాటు చూడండి - నాయర్! ఏదీ స్విచ్ వెయ్యి! (నాయర్ స్విచ్ వేశాడు) ఆఁ చూశారా! ఎలా ఉందంటారు?

పంతులు: భేషుగ్గా వుంది. రాజు తలుచుకుంటే దెబ్బలకేం తక్కువోయ్... ఆఁ యింతకూ శివు డెక్కడ?

తిరుపతి: (ఎదురుగా ఉన్న గదిని తలవూపుతో చూపిస్తూ) లోపలున్నాడు పెళ్ళి కొడుకు. తస్సదియ్యా! పూసింది పూసిందే స్నో పౌడరు. రాసింది రాసిందే సెంటు - తెమల్లా ఆ ముస్తాబు. (స్వాగతం బోర్డు అందించాడు. నాయర్ తీసుకొని బయటికి వెళ్ళాడు.)

పంతులు: శివుడితో మాట్లాడాలని వచ్చాను.

తిరుపతి: అర్జంటా?

పంతులు: చాలా సీరియస్ ___

తిరుపతి: సీరియస్సే! పంతులుగారూ! కొంపతీసి అతణ్ణి ఇప్పుడేం ప్రాణాలు తీయకండి. అసలే గాబరాలో వున్నాడు.

పంతులు: గాబరానా! ఎందుకు?

తిరుపతి: పెళ్ళికూతురు పదిగంటల బండికి దిగుతోంది.

పంతులు: అయితే?

తిరుపతి: స్టేషనుకు వెళ్ళి తీసుకురావాలి.

పంతులు: ఎవరు? శివుడే?

తిరుపతి: అవును.

పంతులు: అప్పాయ్! ఏమిటీ పెళ్ళిళ్ళు? ఏమిటీ సాంప్రదాయ విరుద్ధమయిన పనులు? ఛీ! ఛీ! నాకేం నచ్చలేదు.

తిరుపతి: ఏం - ఏమండీ?

పంతులు: ఏం ఏమిటి? పెళ్ళి కావల్సిన పిల్ల. పెళ్ళికూతురు పంటరిగా ఏ వూరి నుంచో యీ బండికి దిగటం ఏమిటి? పెళ్ళికొడుకే స్వయంగా వెళ్ళి పిల్లను తీసుకురావడ మేమిటి? ఈ పెళ్ళేమిటి? ఏవన్నా అర్థం పర్థం వుందా?

తిరుపతి: రిజిష్టరు పెళ్ళంటే ఏమనుకున్నారు మరి?

పంతులు: ఏం నువ్వా ఆయా వెళ్ళి తీసుకురారాదూ?

తిరుపతి: తానే వెళ్ళాలట మొండిపట్టు పట్టాడు ——

పంతులు: బావుంది. ఆ అమ్మాయికి ఎవరూ లేరా?

తిరుపతి: ఉహూఁ! ఎవరూ లేరు.

పంతులు: తగ్గట్టే దొరికింది గంతకుతగ్గ బొంత.

తిరుపతి: అదుగో అదే - ఆ అమ్మాయి నేమన్నా అన్నారా నే నొప్పుకోను. అమ్మాయి కేమండీ; బాగా చదువుకుంది. అందం, అందానికి తగ్గ గుణం.

పంతులు: ఏమిటో నా కిలాంటి పెళ్ళిళ్ళంటేనే గిట్టదు ——

తిరుపతి: అయితే మీరు పెళ్ళిళ్ళ రిజిష్ట్రారుగా వుండకూడదూ?

పంతులు: బాగుంది. ఆ వుద్యోగంలో వున్నంత మాత్రాన ఈ అనాచారాన్ని వప్పుకోవాలా?

తిరుపతి: అంతేలెండి. ప్రొహిబిషన్ మంత్రిగా వున్నంత మాత్రాన తాగకూడదని ఎక్కడుంది. దేనికదే ——

పంతులు: సరేగాని నువ్వు వూరికి వెళ్తావన్నాడు శివుడు.

తిరుపతి: వెళ్ళాలనే పంతులుగారూ! నిజంగా నాకు ఒకేచోట యిన్నాళ్ళుండటమంటే నచ్చదు. మూడు రోజులకే మొహంమొత్తినట్టవుతుంది. మనం శివుడి కోసం పుట్టాం. గాలిపటాల జాతకాలు మనవి. కానీ అదేమిటో ఇక్కడిన్నాళ్ళు వుండిపోయాను. ఈ మూడు నెలల్లో శివుడికీ నాకూ అలా కలిసింది. శివుడు నా కంటె ఎంత పెద్దవాడో ——

పంతులు: పది పదిహేనేళ్ళయినా పెద్దయి వుంటాడు.

తిరుపతి: అయినా 'శివుడు, శివుడూ' అని అలవాటయిపోయింది - పాడలవాటు. కనీసం రేపటి నుంచీ ఆ అమ్మాయి ఎదటయినా 'శివయ్యగారూ' అని పిలవాలి. ప్రయత్నిస్తే పిలవగలను. కానీ మా శివుడొప్పుకోడు. సీనా నాకూ మధ్య గౌరవాలు, మర్యాదలు ఏమిటని కోప్పడతాడు. ఎందుకు చెప్పొచ్చానంటే యీ మూడు నెలల్లో మా స్నేహం అంత గట్టిపడిపోయింది. నేను సామాన్యంగా ఇలాంటి బంధాలు, అనుబంధాలు అట్టే పెట్టుకోను. కాని శివుడి విషయంలో తెంచుకుందామన్నా తెగని బంధం ఏర్పడిపోయింది.

పంతులు: ఏమైనా నువ్వు వెళ్ళడం చాలా మంచిదనుకుంటాను.

తిరుపతి: ఏం?

పంతులు: వెళ్ళడం అన్నివిధాల మంచిదని నా కనిపించింది అన్నాను. అంతే!

తిరుపతి: మీ అభిప్రాయం?

శివుడు: (గదిలోనుంచి) తిరుపతీ! తిరుపతీ! గంట-గంట ఎంతయింది?

తిరుపతి: తొమ్మిదింపావు. కానీ శివుడూ - కానీ మరి.

శివుడు: ఇదిగో అయిపోయింది. ఏదీ నా జేబురుమాలు - జేబురుమాలు. ఆఁ....ఆఁ దొరికింది___

తిరుపతి: చూశారా ఆ కంగారు! మతిపోయిందంటే నమ్మండి....

శివుడు: (హాలులోకి వస్తూ) నమస్తే! నమస్తే పంతులుగారూ....నమస్తే. (కాస్త ముదురు మనిషే. ముఖంలో వృద్ధాప్య చిహ్నాలు లీలగా కనిపిస్తున్నాయి. కొత్త సూటు తొడుక్కున్నాడు. అతి కంగారుగా వున్నాడు. మనిషిలో ఉత్సాహంకన్నా వుద్రేకం - పిచ్చి చూపులు, ఏదో పెద్ద అవాంతరం నెత్తిన పడబోతున్నట్లు భయం.)

పంతులు: నమస్తే! (ఎగాదిగా చూశాడు.)

తిరుపతి: (మెచ్చుకున్నట్లు ఆనందంగా చూశాడు.)

శివుడు: (ఇద్దరి చూపులు అతన్ని ఒకేలా కంగారు పెట్టాయి. తన దుస్తులు సర్దుకుంటూ) ఎలా వుంది సూటు - అయిదు వందలైంది. అయిదు వందలు.

పంతులు: శివుడూ! నీతో చాలా అర్జంటుగా ఒక విషయం మాట్లాడాలని వచ్చాను.

శివుడు: మాట్లాడదాం పంతులుగారూ, మాట్లాడదాం - ఇదిగో! యీ పెళ్ళికాస్తా అయిపోనివ్వండి.

పంతులు: ఈ పెళ్ళిని గురించే మాట్లాడాలని వచ్చాను.

శివుడు: పెళ్ళిని గురించా! ఇక మాట్లాడేదేముంది. ఏం లేదు - అంతా రెడీ - పెళ్ళి కూతురు పదిగంటల బండికి దిగుతుంది. పదకొండుకల్లా మీ ఆఫీసుకొచ్చేస్తాం పంతులుగారూ - మన కేసు కాస్త తొందరగా.

పంతులు: శివుడూ! నువ్విలా మాట్లాడుతూ కూర్చుంటే లాభంలేదు. తొమ్మిదే యిరవై.

పంతులు: సరేలే! మన రైళ్ళు మహా కరెక్టుగా వచ్చేయిస్తున్నట్లు -

శివుడు: అదేమిటి పంతులుగారూ! రైలు లేటుగా వస్తుందని మనమూ లేటుగా పోతామా? 'లిల్లీ' ఏమనుకుంటుంది ___

పంతులు: లిల్లీనా! అదెవరు?

తిరుపతి: పెళ్ళికూతురు....

పంతులు: కిరస్తానే ..

తిరుపతి: కాదండి స్వామి! అసలు పేరు లీల శివుడు ముద్దుగా పిలిచేది లిల్లీ.

పంతులు: అబ్బో! పెళ్ళికాక ముందే ముద్దుల ముచ్చటలు. సరేగాని శివుడూ నువ్వు స్టేషన్‌కు వెళ్ళేముందు నీతో కొన్ని విషయాలు మాట్లాడాలి!

శివుడు: ఓ మైగాడ్! తొమ్మిదీ యిరవై అయిదు. పంతులుగారూ! క్షమించండి. ఎన్నిప్పుడేం పలకరించకండి. తర్వాత అంతా మాట్లాడుకుందాం. తిరుపతీ! కార్, కార్, కారెక్కడోయ్! (ఇటూ అటూ తనచుట్టూ వెతుకుతున్నాడు.)

తిరుపతి: శివుడూ! ఏమిటీ కంగారు. కారు ఇక్కడెందుకుంటుందీ. బయట వుంటుంది కాని. ..

శివుడు: ఓ. ..కారు కాదోయ్! కారు తాళాలు. తాళాలు.

తిరుపతి: (ఎదురుగా బల్లమీద ఉన్న తాళాలు తీసియిచ్చి) ఇవిగో!

శివుడు: థాంక్స్.

పంతులు: తిరుపతీ! నువ్వు కాస్త....

తిరుపతి: వెళ్తాను - కానీ శివుణ్ణి మీరు అనవసరంగా కంగారు పెట్టకండి. అట్టే కాలయాపన చెయ్యకండి. (వెళ్లాడు)

శివుడు: (కూర్చుని) పంతులుగారూ! ఏమిటో కంగారు, ఎందుకో మతి. ..పోయినట్లుంది.

పంతులు: కారణం లేకపోలేదు శివుడూ - నాకూ తెలుసు.

శివుడు: తెలియదు. మీ కెవ్వరికి తెలియదు.

పంతులు: నాకు తెలుసు.

శివుడు: ఏమిటి మీకు తెలిసింది.

పంతులు: తిరుపతి వూరికి వెళ్తే యీ కంగారు గింగారు అంతా సర్దుకుంటుంది. అవునా?

శివుడు: అవును పంతులుగారూ అవును - అది నిజమే - తిరుపతి వెళ్తే అంతా సర్దుకుంటుంది. కాదు ప్రమాదం తప్పిపోతుంది.

పంతులు: తిరుపతి వుంటే నీకేదో ప్రమాదం జరుగుతుంది. అంతేనా?

శివుడు: అంతేమరి అంతే - కాని పంతులుగారూ అందుకు తిరుపతి కాదు కారణం. తిరుపతి చాలా మంచివాడు నా బిడ్డలాంటివాడు. నాకెన్నడూ ఏ ద్రోహం చెయ్యడు. నాకు తెలుసు. ఏం చేసుకున్నా నేనే - నేనే చేసుకున్నా ——

పంతులు: శివుడూ! ఒక్కటే మాట చెప్తున్నా - నాకీ పెళ్ళంటే ఇష్టంలేదు.

శివుడు: (లేచి) ఏమిటీ! నేను పెళ్ళిచేసుకోవడం మీ కిష్టంలేదు. నేనొక సంసారిని కావడం. నాకూ వంశాన్ని నిలబెట్టే సంతానం కలగడం మీకు ఇష్టంలేదు. నేను చచ్చింతర్వాత - ఈ తోట - ఈ బంగళా - ఈ ఆస్తి - ఈ డబ్బు అంతా ఎవరో వూళ్ళోవాళ్ళు తినిపోవడం మీ కిష్టం. అంతేనా?

పంతులు: అదంతా నేను చెప్పలేదు. నాకు యీ పెళ్ళి యిష్టం లేదంటున్నా, అంతే!

శివుడు: ఏం - ఎందుచేత?

పంతులు: కారణాలు చాలా వున్నాయ్ ——

శివుడు: ఏవీ! ఒకటి రెండు సెలవీయండి.

పంతులు: నామీద నువ్వు కోప్పడ్డాసరే - చెప్తాను. మొదటి కారణం - నువ్వు ఆ పిల్లను ముక్కూ మొహం ఎరగవ్!

శివుడు: ఎంతకావాలేం? మెతుకు పట్టిచూస్తే చాలదూ - అన్నమంతా చూడాలా.

పంతులు: (నవ్వి) శివుడూ - ఆడదాని మనసు అన్నంకుండ కాదు. అందులో బియ్యం అంతా ఒకటే రకమని. ఒకటేరకంగా ఉడుకుతుందని అనుకోవడం పొరబాటు.

శివుడు: మీరు ఆడవాళ్ళను అవమానిస్తున్నారు.

పంతులు: అభిప్రాయం చెప్పాను - సరే - పోనీ రెండవది ఆ అమ్మాయి నీ కులం కాదు.

శివుడు: పంతులుగారూ! కులం మాటెత్తకండి! ఇది ఇరవయ్యో శతాబ్దం రెండవ భాగం. ఇంకా కులం ఏమిటండీ కులం-!

పంతులు: అప్పన్లే - ఇప్పుడంతా కులం పోయి - దాని స్థానం ధనం ఆక్రమించు కుంటూందిగా. సరే మూడవకారణం. ఈ పెళ్ళి రిజిష్టరు పెళ్ళి కావడం నాకు సుతరామూ యిష్టంలేదు. రిజిష్ట్రారుగా యీలాంటి పెళ్ళిళ్లు ఎన్ని చూశాను, లక్షయాభై, నామాట నమ్మ. ఒక్క దాంపత్యమైనా సక్రమంగా నాలుగు రోజులుపాటు జరగలేదు. అన్నీ మళ్ళీ రిజిష్టరు నోటీసులు దాకా వచ్చినవే - ప్రేమ వివాహాలన్నీ వట్టి భ్రమ వివాహాలైనయి తెలుసా?

శివుడు: ఓ! మై గాడ్!

పంతులు: ఇంతకూ నేనడిగేదేమిటంటే, నీవూళ్ళో నీ కులంలో పిల్లలులేకపోయారా- దేశంకాని దేశంపోయి యీ పిల్లను ఎందుకు తెచ్చుకోవాలి అని.

శివుడు: పంతులుగారూ! అందుకు వెయ్యి కారణా లున్నాయ్! అవన్నీ యిప్పుడన వసరం. మీకు నచ్చినా నచ్చకున్నా - నేను చేసుకునేవాణ్ణి, చేసుకుని తీర్తాను.

పంతులు: సరే నీ యిష్టం - ఏదో శ్రేయోభిలాషిగా, స్నేహితునిగా, చెప్పాల్సింది చెప్పాను.

శివుడు: అయిపోయిందా?

పంతులు: మరొక్క పాయింటు.

శివుడు: ఓ! మై గాడ్! చెప్పండి బాబూ! తొందరగా చెప్పండి. లిల్లీ కాచుకుంయుంది పాపం -

పంతులు: చెప్పమన్నావా?

శివుడు: అబ్బబ్బా! చెప్పవయ్యా!

పంతులు: నీ అంత ముసలాడు అంత చిన్నపిల్లను చేసుకోవడం ఏమీ బాగాలేదు.

శివుడు: (నవ్వి) అయితే! ముసలిపిల్ల నెవరైనా చేసుకుంటారటయ్యా - పిచ్చి బాపనయ్యా!

పంతులు: శివుడూ! నీలాగే నా స్నేహితు డొకడు పండు ముసలితనంలో పదహారేళ్ళ పిల్లను చేసుకున్నాడు.

శివుడు: మంచిపని చేశాడు.

పంతులు: ఆ అమ్మాయి కూడా అంతకంటే మంచిపనే చేసింది.

శివుడు: ఏమిటీ?

పంతులు: నాలుగో రోజున పక్కింటి కుర్రాడితో పారిపోయింది.

శివుడు: నో! నో! నా లిల్లీ ఎన్నడూ అలాచేయదు. నా లిల్లీమీద నా కలాటి అనుమానం లేదు, భయమూలేదు—పంతులుగారూ! మీరు....మీరు....

పంతులు: శివుడూ! నువ్వింతకు ముందేమన్నావ్?

శివుడు: ఏమన్నాను?

పంతులు: తిరుపతి వుంటే నాకేదో ప్రమాదం జరుగుతుందన్నావా?

శివుడు: అంటే?

పంతులు: ఈ వూళ్ళో తిరుపతి ఒక్కడేకాదు మగాడు.

శివుడు: ఓ! మైగాడ్! పంతులుగారూ! కాదు - కానేకాదు - మగాళ్ళంటే నాకేం భయమా! నేనేం పెళ్ళాన్నేలుకోలేనంత ముసలాణ్ణనుకున్నారా ....? నో! అదికాదు. కాని - తిరుపతే! ఒక్క తిరుపతే వెళ్ళాలి. అందుక్కారణం. మీరనుకునేది కానేకాదు. వేరేవుంది, అది నాకు తప్ప మరెవ్వరికీ తెలియదు.

పంతులు: పోనీ తెలియకపోనీ! ఒక్కమాట అడుగుతాను చెప్పు. నువ్వు పాతికేళ్ళకి ముందే ఎందుకు పెళ్ళిచేసుకోలేదు?

శివుడు: నేను పట్టి వెధవను కాను గనక.

పంతులు: ఆఁ!

శివుడు: అవును - నేను వెర్రి వెధవను కాను - అందుకే అప్పుడు పెళ్ళిచేసుకోలేదు. అప్పుడు నాకే తిండిలేదు. పెళ్ళాన్ని ఎలా పోషించను? అప్పుడు నేనే చెట్ల నీడలలో కాపురమున్నాను. పెళ్ళాన్ని ఎక్కడ పెట్టుకోను? ఎందుకప్పుడు పెళ్ళాం - నాతోపాటు - ఎండలో వానలో పస్తులు పడటానికా? ఎందుకంట పెళ్ళాం?

పంతులు: మరిప్పు డెందుకు?

శివుడు: ఎందుకా? ఇప్పుడు నాకేం? బంగళా - కారు - తోట - బ్యాంకులెక్క - చెక్కు పుస్తకం - అన్నీ వున్నాయ్! ఇప్పుడు పెళ్ళిచేసుకుంటాం - పెళ్ళాన్ని, పిల్లల్ని దర్జాగా - మహారాజులా పోషిస్తాం.

పంతులు: పిల్లలా?

శివుడు: మరేమిటనుకున్నారు - పెళ్ళిచేసుకోవడం దేని కనుకున్నారు. పెళ్ళాంతో హాయిగా - తీయగా సంసారం చేయడానికి - చక్కని పిల్లల్ని. నా వంశానికి వారసుల్ని కనడానికి.

పంతులు: (నవ్వి) బలేవాడివోయ్!

శివుడు: ఏం?

పంతులు: నీ కీ వయస్సులో పిల్లలు పుడతారని ఎవరు చెప్పారు?

శివుడు: పంతులుగారూ! ఆ మాటే - ఆ మాటే అనవద్దంటాను. నాకు పిల్లలు పుట్టరని కదూ...నేను ముసలాణ్ణని కదూ...ఇదిగో చెప్తున్నా - శివుడికి ఒకడుకాదు ఇద్దరుకాదు - ఇరవై మంది పిల్లలు పుడతారు. ఇప్పుడే కాదు, శివుడికి నూరేళ్ళయినా పిల్లలు పుడతారు - పుడతారు - పుడతారు.

రైలుకూత వినిపించింది.

తిరుపతి: (గదిలోనుంచివస్తూ) శివుడూ! ఏమిటి ఆలస్యం - రైలుకూత విన్నావా.

శివుడు: ఓ! మైగాడ్! రైలుకూత. రైలు వచ్చేసింది. లిల్లీ వచ్చేవుంటుంది. లిల్లీ! లిల్లీ! (అని ఇటూ అటూ కంగారుగా తారట్లాడతాడు.)

తిరుపతి: శివుడూ! బయల్దేరు!

శివుడు: బయల్దేరుతా! బయల్దేరుతున్నా! ఆయా! ఆయా!! నాయర్!!!

తిరుపతి: 'టై' బాగా కట్టుకో.

శివుడు: కట్టుకుంటా! కట్టుకుంటా! తిరుపతీ! తిరుపతీ!!

తిరుపతి: ఏమిటి శివుడూ?

శివుడు: ఏంలేదు. నాకు - నాకు మతిపోతోంది. మతిపోతుంది తిరుపతీ!

ఆయా: (వచ్చింది. పంతులు ఆదోరకంగా చూశాడు. కాని - ఆమె మాత్రం అతన్ని చూడలేదు.)

శివుడు: ఆయా! ఏదీ ఒక గ్లాసు - ఒక్క పెగ్గు తీసుకురా!

ఆయా: (వెళ్ళింది.)

పంతులు: శివుడూ! తాగుతావా!

శివుడు: నాకు పర్మిట్ వుంది. (ఆయా బాటిల్. గ్లాస్ ఒక ట్రేలో తెచ్చింది.) ఒక పెగ్గు తీసుకుంటే నరాలకు బలం - (అని గటగట తాగి) ఆఁ ఇంకేం ఫర్వాలేదు వెళ్ళొస్తా! ఫోర్డ్ కార్ - పందకూడా పోతుంది. (ద్వారం దాకా వెళ్ళి - మళ్ళా తటాలున వెనుతిరిగి వచ్చి) ఓ! తిరుపతీ! తిరుపతి, నేను వెళ్ళలేను తిరుపతీ! వెళ్ళలేను.

తిరుపతి: పోనీ నేను వెళ్ళిరానా. -

శివుడు: నువ్వా!? వద్దు తిరుపతీ! వద్దు. నువ్వు వద్దు - నేనే వెళ్తాను. కానీ - కానీ - తిరుపతీ!

తిరుపతి: ఏమిటి శివుడూ!!

శివుడు: ఒక్కమాట చెప్తాను, ఏమీ అనుకోవు కదూ!

తిరుపతి: చెప్పు శివుడూ!

శివుడు: ఏమీ లేదు - నువ్వు - నువ్వు....

తిరుపతి: నేను?

శివుడు: నువ్వు కాదు నేను. నేను వెళ్తాను - లిల్లీని పిల్చుకువస్తాను. ఏం?

తిరుపతి: వెళ్ళిరా మరి.

శివుడు: వెళ్తాను గాని తిరుపతీ! నువ్వు దయచేసి —

తిరుపతి: ఏమిటో చెప్పు శివుడూ!

శివుడు: దయచేసి....నువ్వు లిల్లీ వచ్చేలోగా ఎక్కడికన్నా వెళ్ళు....నీ క్కావలసి నంత డబ్బిస్తాను, నువ్వు ఎక్కడున్నా కావలసినంత డబ్బు పంపిస్తాను.

తిరుపతి: శివుడూ!

శివుడు: ఏం లేదు తిరుపతీ! లిల్లీ వచ్చేటప్పటికి నువ్విక్కడ వుండకూడదు. ఈ ఇంట్లో వుండకూడదు....అంతే. వెళ్తావా తిరుపతీ!

తిరుపతి: (ఏమీ పలుకలేదు.)

శివుడు: ఏం తిరుపతీ! కోపం వచ్చిందా? వద్దులే తిరుపతీ. నిన్ను వెళ్ళమనడానికి నువ్వు కాదు కారణం. నీ తప్పేమీ లేదు. అంతా నాదే - నేను చేసిందే....

తిరుపతి: వెళ్తాను శివుడూ—!

శివుడు: వద్దు - తిరుపతీ వద్దు - నువ్వెళ్ళొద్దు, నా తప్పుకోసం నిన్ను వెళ్ళగొట్టడం అన్యాయం....ఒద్దు. జరిగేదేదో జరగనీ....

తిరుపతి: ఏం జరుగుతుంది శివుడూ!

శివుడు: ఏం జరిగినా జరగనీ అంతే - తిరుపతీ అంతే .... జరగనీ .. (అంటూ వెళ్ళాడు)

తిరుపతి: (అలా రాతిబొమ్మలా నిలబడి చూస్తున్నాడు.)

పంతులు: [తిరుపతిని గమనిస్తున్నాడు - కారు మంచి స్పీడులో వెళ్ళిన శబ్దం - తాపీగా] మతిపోయిన స్థితిలో కారు అంత వేగంగా నడుపుతున్నాడు. ప్రమాదం ఏదన్నా!

తిరుపతి: (తిరిగి చూడకనే) శివుడు నిద్రపోతూనూ అంత వేగంగా వెళ్ళగలడు. (సర్రున తిరిగి) మీకు నేను ముందుగానే చెప్పాను. అతన్ని అనవసరంగా కంగారు పెట్టారు మీరు (సీరియస్‌గా అన్నాడు)

పంతులు: (తాపీగా) చెప్పదలుచుకున్నది చెప్పాను —

తిరుపతి: నేను చెప్పేదికూడా వినండి.

పంతులు: ఏం లాభం?

తిరుపతి: మీరు చెప్పిందానివల్ల ఏం లాభం? లాభంలేని పనులు చాలా చేస్తూ వుంటాం మనం - చెప్పేది వినండి. (గదమాయించి అన్నాడు. పంతులు కిక్కురుమనకుండా వింటున్నాడు—) ఇదివరకే చెప్పాను- నేను దేశదిమ్మరిని- నాలుగు రోజులపాటు ఎక్కడా నిలకడగా వుండలేను. వుండలేదు.

పంతులు: మరిక్కడెందుకున్నావో?

తిరుపతి: ఒక్కపూట భోజనానికని వచ్చాను రిపుడింటికి - మూణ్ణెల్లయింది. వున్నాను, ఇక్కడే వున్నాను. అందుక్కారణం రిపుడు. రిపుడి మనస్సు నామీద చూపిన అభిమానం....ఆదరణ. .మూడునెలల్లో మేం ఒకరి కొకరం తోడునీడయి పోయాం - ఒక క్షణం ఒకరినొకరు విడిచి వుండలేం - కాని యీనాడు నేను వెళ్తున్నాను. రిపుడు వెళ్ళమన్నాడు.

పంతులు: నేనింతకుముందే చెప్పాను.

తిరుపతి: మీలాటివాళ్ళు లక్షమంది చెప్పినా వెళ్ళను-రిపుడే చెప్పాడు, వెళ్తున్నాను.

పంతులు: ఎందుకు వెళ్ళమన్నాడో తెలుసా?

తిరుపతి: కారణం అనవసరం.

పంతులు: నేను చెప్తాను విను — నువ్వు కుర్రాడివి — రిపుడు దాదాపు వృద్ధుడు, రాబోయే అతని భార్య కుర్రది.

తిరుపతి: పంతులూ! (ఉగ్రుడైనాడు - కాని - ఆవేశాన్నంతా అణుచుకొన్నాడు —. అది ఆవేదనైంది. కన్నీరుగా మారింది. మనిషి నలిగిపోయాడు. కన్నీరు తుడుచుకున్నాడు.) పంతులుగారూ! నేను మీరనుకున్నంత నీచుణ్ణి కాదు — కానేకాదు - (మళ్ళా ఆవేశం) ఈరోజు రిపుడి పెళ్ళిరోజు. ఈ శుభదినంలో ఏ అశుభం జరక్కూడదని వూరుకున్నాను. లేకుంటే మీరు చూసిన — (మింగాడు)

పంతులు: (జడిసి పిల్లిలా పలాయనం పట్టాడు.)

తిరుపతి: పంతులూ!

పంతులు: (గుండె ఆగిపోయినంత పనయింది)

తిరుపతి: మీరిప్పుడు అవమానించింది నన్నుకాదు. రిపుడి యిల్లాల్ని. అన్నెం పున్నెం ఎరుగని ఆ అమ్మాయిని - ఎన్నో ఆశలతో యిప్పుడే యీ గడపలో కాలు పెట్టబోయే కన్నెపిల్లను, ఆ అమాయకురాల్ని. పంతులూ....లిల్లీని మీ రెరుగరు —

పంతులు: (గుండె జారుట పడింది.) నీకు బాగా తెలుసా?

తిరుపతి: తెలుసు - శివుడికంటే బాగా తెలుసు. శివుడిపేర లిల్లీకి అన్ని ఉత్తరాలూ నేనే వ్రాశాను. ఆమె వ్రాసిన ఉత్తరాలన్నీ శివుడికి నేనే చదివి వినిపించాను.

పంతులు: ఏం. శివుడికి చదువు రాదనా?

తిరుపతి: కాదు. శివుడికి మనోబలం తక్కువ. ఆడవాళ్ళతో మాట్లాడలేడు కనీసం ఉత్తరంకూడా వ్రాయలేడు - అందుకే నాచేత వ్రాయించాడు. మా స్నేహం అలాంటిది.

పంతులు: బావుంది.

తిరుపతి: ఆమె వ్రాసిన ఉత్తరాలన్నీ మరొకసారి చదివారంటే లిల్లీ ఎంత మంచి మ్మాయో మీ కర్థమవుతుంది. (అక్కడున్న వ్రాయరు సొరుగు నుంచి ఉత్తరాల కట్టతీసి పంతులు ముందు పడేసి.) చదివి చూడండి. మీకే తెలుస్తుంది. నేనూ శివుడూ బొంబే వెళ్ళాం, ఏదో వ్యాపారం పనిమీద. అదొక పెద్ద కంపెనీ. ఆ కంపెనీలో టైపిస్టు లిల్లీ - శివుడు చూశాడు - ఎప్పుడు చూశాడో నాకు తెలీదు. అక్కడ ఒక్కమాటన్నా చెప్పలేదు. ఇంటి కొచ్చాం - ఆ రాత్రి లిల్లీ అడ్రసు నా ముందు పెట్టి ఉత్తరం వ్రాయ మన్నాడు శివుడు. నేను తెల్లబోయాను. లిల్లీ అతణ్ణి ఆకర్షించింది. అతనికి లిల్లీ కావాలని అర్థమయింది. ఉత్తరం వ్రాశాను ___ శివుడు వ్రాసినట్టే వ్రాశాను. ఇదిగో ఆమె జవాబు ___ చూడండి.

పంతులు: అరే! తెలుగులో వ్రాసిందే!

తిరుపతి: లిల్లీ తెలుగుపిల్లే...

పంతులు: ఆc? రాత బాగానే వుంది.

తిరుపతి: రాతకన్నా మంచి మనస్సు ప్రతిమాటలో వినిపిస్తుంది. పంతులుగారూ! బాగా చూడండి. శివుడి ఆస్తిపాస్తిని గురించి సరిగ్గా వ్రాయలేదు. డబ్బును చూసి ఆశపడిందనడానికి వీల్లేదు.

పంతులు: ఫోటో పంపమన్నట్టుంది.

తిరుపతి: అవును - అబ్బ! అదొక యాగం - శివుడికి యింతవరకూ ఫోటోలే లేవు - ఒక్క ఫోటో తీయించేలోగా నా తలప్రాణం తోక్కొచ్చింది.

పంతులు: ఏం?

తిరుపతి: కెమేరా ముందుకు వెళ్ళాలంటే శివుడికి దడ - వణికిపోయేవాడు - చివరికి మురిమె నేను ఫోటోదిగి అతని ఫోటో తీయాల్సి వచ్చింది. ఎలాగైతేనేం ఫోటో పంపాం. లిల్లీ వెంటనే తన ఫోటో పంపింది. ఇదిగో!

పంతులు: (చాలాసేపు నిదానించి చూచి) బాగానే వుంది.

తిరుపతి: మీ అభిప్రాయం అనవసరం. ఇంతవరకూ నేను చెప్పదలచిందొక్కటే- ఈ పెళ్ళి సంగతి 'అ' మొదలు 'క్ష' వరకు నాకు తెలుసు - అంతా నా చేతులమీదుగా జరిగింది పంతులుగారూ? మీరనుకున్నట్టు ద్రోహం చెయ్యాల నుకుంటే... లోకంలో ఎవరికైనా ద్రోహం చెయ్యగలను కానీ శివుడి క్కాదు.

(బయటనుంచి ''శివయ్యగారూ!'' అని కేక)

ఎవరూ?

(తపాలా బంట్రోతు తలవాకిలి దగ్గరకు వచ్చి నిలబడ్డాడు)

త. బం: శివయ్యగారు లేరండి.

పంతులు: ఇప్పుడే బయటకు వెళ్ళాడు. ఏం?

త. బం: రిజిష్టరు నోటీసు వచ్చిందండి.

పంతులు: రిజిష్టరు నోటీసా?

తిరుపతి: నోటీసా? ఎక్కణ్ణుంచి? ఎవరిచ్చారు?

త. బం: ఎవరో కాదండి. ఆయనకాబోయే భార్యగారు.

పంతులు: ఆఁ?

తిరుపతి: లిల్లీ రిజిష్టరు నోటీసిచ్చిందా?

త. బం: ఇప్పుడేం చేస్తారండి పాపం. స్టేషన్‌కు వస్తామని రిసీవు చేసుకుంటామని చెప్పి ఎవరూ రాకపోతే - ఒంటరిగా ఆడబడుచు ముక్కూ మొహం ఎరగని యీ వూళ్ళో ఏం చేస్తుంది? స్టేషన్‌లో కళ్ళనీళ్ళు పెట్టుకు కూర్చుంది. ఆడవాళ్ళు ఏడిస్తే నేను చూడలేనుస్మా!

తిరుపతి: ఇంతకూ ఏం జరిగిందో చెప్పవయ్యా?

త. బం: నేనే పలకరించి ఎవరూ - ఏమిటని విచారించాను. విషయం తెలిసింది. సరే రావమ్మా అని నేనే నోటీసు వ్రాసి తీసుకొచ్చా. ఊఁ....ఊఁ ... సంతకం చేయండి... ఆమె బయట టాక్సీలో కూచుంది.

తిరుపతి: లిల్లీ బయట టాక్సీలో వుందా? అరే శివుడు స్టేషన్‌కు రాలేదూ?

త. బం: వత్తాలే డాసామి! స్టేషనంతా గాలించాను.

పంతులు: చాలాసేపయిందే వెళ్ళి.

తిరుపతి: ఏమయ్యాడు చెప్మా!

త. బం: ఆయన యేమవుతాడు. తిరిగొస్తాడు. ముందామె సంగతి చూడండి.

తిరుపతి: ఇప్పుడేం చెయ్యాలి?

త. బం: ఏం చెయ్యాలంటా వేమిటయ్యా? పెళ్ళికూతుర్ని వాకిట నిలబెట్టి, లోపలికి రమ్మను.

తిరుపతి: ఆయా!... ఆయా... (అంటూ వంటింటి వైపు పరుగెత్తాడు - ఆయా పరుగున వచ్చింది.) ఆయా! పెళ్ళికూతురు లిల్లీ బయట టాక్సీలో వుంది. వెళ్ళి లోపలికి తీసుకురా.... వెళ్ళు.

ఆయా: అమ్మగారే! (వెళ్ళింది.)

నాయరు, పంతులు ఆత్రుతతోటి కిటికీలోంచి చూస్తున్నారు - తిరుపతి శివుడు ఏమయ్యాడా అని ఆందోళనలో వున్నాడు.

(బయట)

లిల్లీ: ఎక్కడ మీ అయ్యగారు?

ఆయా: ఉన్నారమ్మగారూ - రండి - దయచేయండి.

లిల్లీ: టాక్సీవాడికి డబ్బివ్వాలి ——

ఆయా: నేను తెచ్చిస్తాలెండి....మీరు రాండి....

లిల్లీ: నే నిస్తాలే - సామానంతా జాగ్రత్తగా దింపించండి - (అంటూ వాకిలిదాకా వచ్చి వెనుతిరిగి) ఆ ట్రంకు జాగ్రత్త తలక్రిందుగా తీయకండి. (లోపలికి వచ్చింది. మంచి రంగు - మరీ కురచకాదు - మరీ పొడవూ కాదు. బండి చక్రాల్లాంటి కళ్ళు - చీర నాజూగ్గా కట్టింది. చాలా నిరాడంబరంగా వుంది. కాళ్ళకేగాని కళ్ళకులేవు జోళ్ళు - జుట్టు కత్తిరింపు లేదు - ఏదో గమ్మత్తుగా ముడివేసింది. నుదుట చిన్న తిలకం - మనిషి చాలా సీరియస్‌గా వుంది. చేతిలో హేన్డ్‌బ్యాగ్ రిస్టువాచీ - మరో చేతికి రెండే రెండు గాజులు - మెడలో సన్నటి గొలుసు - ఆమె లోపలికి రాగానే - నాయరు చాలా మర్యాదగా చేతులు కట్టుకుని నిలుచున్నాడు. పంతులు కళ్ళు పెద్దవిచేసి చూస్తున్నాడు. తిరుపతి ఒకక్షణం ఆమెవంక చూసి తల వంచేశాడు. ఆమె కూడా మొదట తిరుపతిని - తరువాత మిగతావారిని ఆ తరువాత యిల్లంతా చూస్తోంది. హాల్లోకి నడుస్తూ సోఫాలవద్దకు వచ్చి హేన్డ్‌బ్యాగ్ విసరివేస్తూ)

లిల్లీ: ఏమిటీ అన్యాయం? ముక్కూ మొహం ఎరగనిదాన్ని - ఆడదాన్ని - ఒంటరి దాన్ని రమ్మనిచెప్పి స్టేషనుకు ఎవరూ రాకపోతే నే నేమైపోవాలి?

తిరుపతి: పొరబాటు జరిగిపోయింది.

ఆయా: కూర్చోండి అమ్మగారూ ..(పంతులు రెప్పలార్పకుండా లిల్లీవంక చూస్తు న్నాడు)

తిరుపతి: వీరు పంతులుగారని మనవూళ్ళో రిజిష్టారు.

లిల్లీ: నమస్తే.

పంతులు: నమస్తే!

తిరుపతి: ఇతను నాయర్ మనింట్లో వంటవాడు.

లిల్లీ: ఓ ——

తిరుపతి: ఆమె ఆయా! ఇంటికి పెద్దదిక్కు.

లిల్లీ: అంటే నాకు అత్తగారన్నమాట.

ఆయా: అలా ఎందుకనుకోవాలమ్మా! నీ తల్లిననుకో ——

లిల్లీ: (నవ్వి ద్వారంవైపు చూసింది.) ఇదిగో! ఆ ట్రంకు - కాస్త వుండండి. (గబగబా వెళ్ళింది.)

అందరూ ఒక్కక్షణం అలా 'లిల్లీ'ని చూస్తున్నారు - ఆయా లిల్లీలో కూడా వెళ్ళింది.

పంతులు: చురుకైన అమ్మాయే!

తిరుపతి: శివ దేమయ్యాడో యింకా రాలేదు?

పంతులు: శివుడు నిజంగా అదృష్టవంతుడే.

తిరుపతి: ఏం?

పంతులు: ఇంతకాలం వుండి వుండి చక్కనమ్మాయినే సంపాదించాడు.

తిరుపతి: ఇంతకూ శివుడేమయ్యాడో - వెళ్ళి అలా చూసివస్తే ——

పంతులు: అవునవును. అందులో ఆ స్థితిలో వెళ్ళాడు. ఏమైనా జరగవచ్చు. పద నాకూ ఆఫీసు టైమయింది.

తిరుపతి: దయచేసి యీ సంగతులేవీ ఆవిడతో చెప్పకండి.

పంతులు: ఆఁ ఇదేనా నాకు పని! అయినా నాకు టైమెక్కడిది?

ఇద్దరూ కదిలారు. లిల్లీ లోపలికొచ్చింది. ఆయా ఆమెతోపాటు ఏదో సామాన్లు పట్టుకొచ్చి శివయ్య గదిలోకి వెళ్ళింది.

పంతులు: అమ్మా! నాకు ఆఫీసు టైమవుతుంది వెళ్ళొస్తా. సరిగ్గా పదకొండు, పన్నెండు మధ్య మీ వివాహం. ఏమోయ్ టైము కొచ్చేయండి. (త. బం. వచ్చాడు)

త. బం: అమ్మా నేనూ శలవు తీసుకుంటాను.

లిల్లీ: చాలా చాలా థాంక్స్! సాయంత్రం విందుకు తప్పక వస్తారుగా

త. బం. ఏదీ మా శివయ్యగారు పిలవండే .

లిల్లీ: నేను పిలుస్తున్నానుగా!

పంతులు: ఇదిగో అమ్మా ఆ రిజిస్ట్రేషన్ అయ్యేదాకా నీకే యింట్లో ఎలాటి అధికారాలూ లేవు.

లిల్లీ: (నవ్వి) పోనీండి. (తిరుపతివంక చూసి) మీరే పిలవండి.

తిరుపతి: అంజయ్యా! నిన్ను పిలవాలటయ్యా! రావయ్యా రా - తప్పకుండా రా ...

పంతులు: అప్పను నువ్వేకదయ్యా మూలపురుషుడి వీ పెళ్ళికి?

అంజయ్య: అదేంటి పంతులుగారూ?

పంతులు: ఇంతవరకూ యీ పెళ్ళి తతంగం అంతా తపాలామీద జరిగిందేకదయ్యా!

అంజయ్య: ఓ....అదా అమ్మా! మా శివయ్యగారింటి విందుకు పిలవకపోయినా వస్తాను - వస్తానమ్మా! శలవు.

పంతులు: మరి నేనూ!

తిరుపతి: నేనూ అందాకా వెళ్ళివస్తాను.

లిల్లీ: త్వరగా రండి.

తిరుపతి: ఇప్పుడే వచ్చేస్తాను - (ఇద్దరూ వెళ్ళారు)

లిల్లీ: (ఇల్లంతా చూస్తోంది. అంతా అందంగా వున్నట్టు సంతృప్తి. ఆనందం. అలా చూస్తూండగానే - డబల్‌బారెల్ గన్ కనిపించింది. ఆమె వళ్ళు జలదరించింది. కళ్ళు గట్టిగా మూసుకుంది. ఇంతలో ఆయా, శివయ్య గదిలోంచి వచ్చింది)

ఆయా: అమ్మగారూ! స్నానానికి నీళ్ళు.

లిల్లీ: ఆయా! ఇదెవరిది?

ఆయా: అయ్యగారిదే, అమ్మా!

లిల్లీ: ఇక్కడెందుకు పెట్టారు?

ఆయా: అదెప్పుడూ అక్కడే వుంటుందమ్మా!

లిల్లీ: ఈరోజు కూడానా....వద్దాయా - ఇక్కణ్ణుంచి తీసెయ్యి, నే చెప్తున్నాగా, తీసెయ్యి - నాకెందుకో తుపాకీ చూస్తే వళ్ళు జలదరిస్తుంది.

ఆయా: తీసేస్తాలేమ్మా! స్నానానికి రండి.

లిల్లీ: ఆయా! కాసేపు కూర్చో. పోదాంలే - (సోఫాలో కూర్చుంది.) ఆయా! ఈ అలంకారాలన్నీ ఎవరు చేశారు?

ఆయా: అయ్యగారేనమ్మా!

లిల్లీ: ఆయా! ఒక్కమాట అడుగుతాను నిజం చెప్తావా?

ఆయా: ఏమిటమ్మా?

లిల్లీ: ఈ పెళ్ళిని గురించి మీ వాళ్ళో ఏమనుకుంటున్నారు?

ఆయా: నాకేం తెలుసమ్మా!

లిల్లీ: అబద్ధం___

ఆయా: నిజం తల్లీ! నేనసలు యిల్లు విడిచి ఎక్కడికీ వెళ్ళను.

లిల్లీ: ఆయా! నిజంగా నా జీవితంలో నేను పెళ్ళంటూ చేసుకుంటాననుకోలేదు. నా చేయి చూసి ఒక జోస్యుడు నీకు మంచి భర్త వస్తాడు. మహారాణీలా గుంటావు అన్నాడు. పోరాపో నీ సుఖం అనుకున్నాను. కాని యీనాడు అదే జరుగుతూంది. ఏమిటో యీ జీవితం.

ఆయా: మీకేమమ్మా! అయ్యగారు బంగారంలాంటి వారు.

లిల్లీ: ఆయా! నేను నా జీవితంతో జూదం ఆడాను. మీ అయ్యగారిని నేను చూసిందల్లా ఒక్కసారే. అదీ సరిగ్గా చూడలేదు. తరువాత ఫోటో చూశాను. పెళ్ళికి ఒప్పుకున్నాను. లాటరీ వేశాననుకో. అదృష్టం వుంటే మంచిది, లేకుంటే లేదూ అనుకున్నాను.

ఆయా: మీకు నిజంగా అదృష్టమేనమ్మా!

లిల్లీ: (ఉత్సాహంగా లేచి వెళ్ళబోయి ఆగి) ఈ యిల్లు సొంతమేనా ఆయా!

ఆయా: అవునమ్మా! అయ్యగారిది గొప్ప ఆస్తి, కారుంది, వ్యాపారం వుంది. యీ యింటికింకేమీ తక్కువలేదమ్మా! అన్ని ఐశ్వర్యాలూ వున్నాయి. ఇక మీరు చిలకా గోరింకల్లా సంసారం చేస్తూ మీ కడుపున ఒక కాయ కాస్తే చాలు. అయ్యగారు కోరేదీ అదే.

లిల్లీ: (ఒకవేపు సిగ్గు, మరోవైపు ఆనందం)

ఆయా: అయ్యగారు మిమ్మల్ని పూలల్లో పెట్టి చూసుకుంటారు. ఆయన మనస్సెంతో మంచిది. పట్టి పసిబిడ్డలాంటి వారు పాపం.

లిల్లీ: (ఏదో వూహా ప్రపంచంలో వుంది)

ఆయా: స్నానానికి నీళ్ళు తోడనా అమ్మా!

లిల్లీ: అయ్యగారింకా రాలేదేం?
ఆయా: వస్తుంటారమ్మా.
లిల్లీ: సరే. నీళ్ళు తోడావా.
ఆయా: బాగా వేడిగా వుండాలా, గోరు వెచ్చగా వుండే చాలా?
లిల్లీ: బాగా వేడిగా వుండనీ.
ఆయా: అలాగే అమ్మా? (వంటింటివైపు వెళ్ళింది)
లిల్లీ: (ఆనందం పట్టలేక కూనిరాగం - కూనిరాగం కాస్సేపటికి పాటగా మారింది. పాడుతూ పాడుతూ గదిలోకి వెళ్ళింది. మరుక్షణంలో కొత్త చీర జాకెట్టు తీసుకొని వచ్చింది.

నిలువు టద్దం దగ్గరకు వెళ్ళి ఆ చీర వంటిమీద వేసుకుని అందం చూసుకుంటోంది. జుట్టు ముడి విప్పింది. చాలా పెద్ద జుట్టు. పిరుదులు దాటుతున్నవి. ఇంకా పాడుతూనే వుంది ___

చెక్కిలి ఎరుపెక్కును,
సిగ్గు మొగ్గ వేయును,
చిరునవ్వు పూయును,
చిరు చెమటలు పోయును.

'ఎప్పుడు?'

ఎదురుచూచు ప్రియుడు, కనుల
ఎదురు నిలిచినప్పుడు!!!

తనువు పులకరించును,
తలపులు పురివిప్పును,
తత్తరపడి బిత్తరపడి
అడుగులు తడబడును.

'ఎప్పుడు?'

ఎదురుచూచు ప్రియుడు, కనుల
ఎదుట నిలిచినప్పుడు!!

కన్నులు బరువెక్కును,
వెన్నెల వేడెక్కును,

కన్నెమనసు వెన్నవలె
కరిగి కరిగి పోవుసు.

' ఎప్పుడు ? '

ఎదురుచూచు ప్రియుడు కనుల
ఎదుట నిలిచి నప్పుడు ! !

తిరుపతి వచ్చాడు - చూసింది. సిగ్గుపడి పాట ఆపేసింది. తిరుపతి తిన్నగా సోఫాల వైపు వెడుతున్నాడు.

లిల్లీ: ఈ చీర చూశారా?

తిరుపతి: (ఆగి యిటు తిరిగాడు)

లిల్లీ: (చీరను పంటిమీద వేసుకుని చూపుతూ) ఎలా వుంది. బాగులేదుకదూ?

తిరుపతి: చాలా బాగుంది.

లిల్లీ: ఈరోజు కట్టుకొందామని కొన్నాను. అస లేవీ కొనదలచుకోలేదు. కాని - యెందుకో తీరా రైలెక్కబోయే ముందు అనిపించింది. 'జీవితంలో యిలాంటి రోజు యిదొక్కటే కదా! మళ్ళీ మళ్ళీ రాదు కదా' అని కొనేశాను. నా దగ్గరున్న డబ్బంతాపెట్టి కొనేశాను.

తిరుపతి: (చిన్ననవ్వు నవ్వాడు)

లిల్లీ: ఎందుకు నవ్వారు? పెళ్ళికూతురు సిగ్గుపడి పారిపోకుండా పిచ్చిదానిలా ఇలా వాగుతుం దేమిటనే కదూ - పోనీండి - నేనేం మాట్లాడను. (అని అటు తిరిగింది. తుపాకీ కనిపించింది) ఏమండీ! ఈ తుపాకీ ఎందుకు నట్టింట్లో, తీసేయండి.

తిరుపతి: ఏం!

లిల్లీ: తుపాకంటేనే నాకు భయం.

తిరుపతి: ఎందుకు?

లిల్లీ: ప్రపంచంలో తుపాకీ లేకుండాపోవాలి - అలాంటి రోజు వస్తే ఎంత బావుం టుంది. తుపాకీని చూస్తే నాకు యుద్ధం జ్ఞాపకం వస్తుంది. మా అమ్మా, నాన్నా. పాపిష్టి యుద్ధానికి - నన్నుగురించి మీకేమీ తెలియదుకదూ - చెప్తాను వింటారా....

తిరుపతి: ఇప్పుడెందుకు?

లిల్లీ: కాదు వినండి - నా కెవ్వరూ లేరు.

తిరుపతి: తెలుసు.

లిల్లీ: అమ్మా నాన్న పోయారు. జీవితం పెద్ద సమస్యగా మారింది. స్వతంత్రంగా బ్రతకటానికి ప్రయత్నించాను. నానా అగచాట్లు పడ్డాను. ఎన్నో వూళ్ళు తిరిగాను. వుద్యోగాలు చేశాను. మానాను. విసుగేసిపోయింది. అలసిపోయాను. ప్రపంచం అంటేనే అసహ్యం కలిగింది ఆడదాన్ని పంటరిగా నీతిగా నిజాయితీగా బ్రతకనివ్వ దీ ప్రపంచం. ఎంతకాలం యిలా పరుగెత్త గలను. వయసుతోపాటు మనసూ ముసలిదై పోతూందన్న భయం పట్టుకుంది. ఎక్కడన్నా నిలకడగా అంత నీడ దొరికితే. ఏ మనసుగల మగాడన్నా చేరదీస్తే. వుండిపోదామనిపించింది. తపించాను. తపస్సు చేశాను - నా తపస్సు ఫలించింది.

తిరుపతి: (సానుభూతితో చూస్తున్నాడు. అప్పటికే సోఫాలో కూర్చున్నాడు.)

లిల్లీ: నేను అదృష్టవంతురాల్ని - ఈనాటికి నాకొక ఇల్లు దొరికింది. నేనొక ఇల్లాలి నవుతున్నాను. (సర్రున తిరుపతి పక్కన వెళ్ళి కూచుంది. అతను తెల్ల బోయాడు. ఆమె అమిత వుత్సాహంతో) మీరెంత మంచివారు. నేనిదంతా ఉత్తరాల్లో రాయలేదు. నన్నుగురించి ఏమీ అడక్కుండా, ఏమీ తెలియకుండా ఎలా పెళ్ళి చేసుకుంటానన్నారు. నామీద మీకెందుకింత దయ? (గబగబా చెబుతూ తిరుపతి మెడచుట్టూ చేతులువేసి గట్టిగా కౌగలించుకుంది పసి బిడ్డలా. తిరుపతికి వూపిరి ఆడలా. అతను కంగారుపడి లేవడం - వాకట కారు హారన్ - వంటింటినుంచి ఆయా, నాయర్ రావడం - ఒక్కసారి జరిగినయ్)

డాక్టర్: నాయర్! నాయర్!! తిరుపతీ! తిరుపతీ!!

నాయరు ముందు వెళ్లాడు. తిరుపతి రెండడుగులు వేసి ఆగాడు.

మెల్లిగా ...మెల్లిగా ....జాగ్రత్త ——

తిరుపతి: శివుడూ (అని రివ్వున పరుగెత్తాడు)

ఆయా: అయ్యగారు! (పరుగెత్తింది)

లిల్లీ: (ఏమీ పాలుపోక నిలబడ్డది)

తిరుపతి: ఏం జరిగింది డాక్టర్? ఏం జరిగింది?

డాక్టర్: యాక్సిడెంటు. రెండు కాళ్లు బాగా దెబ్బతిన్నాయ్. డిస్‌లొకేషన్ కాదు ఫ్రాక్చర్!

తిరుపతి: ఫ్రాక్చర్!

స్ట్రెచర్‌మీద శివుణ్ణి మోసుకొస్తున్నారు. హాలులోకి వచ్చారు. లిల్లీ రాతి బొమ్మలా నిలబడి చూస్తోంది. గదిలోకి తీసుకెళ్తున్నారు.

శివుడు: తిరుపతీ!

తిరుపతి: శివుడూ!

శివుడు: లిల్లీ ఏమైంది?

తిరుపతి: వచ్చింది శివుడూ.

శివుడు: వచ్చిందా! ఏదీ? లిల్లీ ఏదీ?

డాక్టరు: నో! నో! అదంతా తర్వాత. ముందు లోపలికి తీసుకువెళ్ళండి కమాన్ ——

శివుడు: ఉండండి డాక్టర్ - తిరుపతీ లిల్లీతో చెప్పు - అన్నీ అనుకున్నట్టు జరిగి పోతాయని చెప్పు - ఏదీ ఆగదు ఏదీ ఆపవద్దు - ఏం ఫర్వాలేదని చెప్పు.

లోపలికి తీసుకెళ్ళారు. తిరుపతి కూడా వెళ్ళబోతుండగా - ఎవరో పీక పిసికేస్తున్నట్టు అరిచింది లిల్లీ. తిరుపతి గబగబా ఆమె వద్దకు వెళ్ళాడు.

తిరుపతి: లిల్లీ!

లిల్లీ: ఆయ నెవరు?

తిరుపతి: ఆయనే శివయ్య.

లిల్లీ: (క్షణంలో ముఖం కళ్ళు ఎర్రబడ్డాయి. మనిషి వణికిపోతూంది.) మీరు మనుష్యులేనా? మీరు మగాళ్ళేనా? ఏమిటీ మోసం, ఎందుకీ మోసం? ఆడదాన్ని యిలా మోసం చేస్తారా? ఇంతకన్నా నీచం యింకేమన్నా వుందా?

తిరుపతి: లిల్లీ!

లిల్లీ: చెప్పండి. ఎందుకాడారీ నాటకం? మోసంచేసి పెళ్ళి చేసుకుందామని ఎలా అనుకున్నారు? నీచులు - రోగ్స్ - స్కౌండ్రల్స్ - ఇడియట్స్ ——

తిరుపతి: లిల్లీ! లిల్లీ! ఏమిటిదంతా!

లిల్లీ: ఏమిటా? మీకు తెలియదూ ఇంకా? నాటకం ఆడతారా? ఎలా కప్పిపుచ్చుదా మనుకున్నారు? యీ మోసం ఎలా తెలియదనుకున్నారు?

తిరుపతి: లిల్లీ! ఇందులో మోసం ఏమీలేదు. ఇంతవరకూ శివుడు బాగానే వున్నాడు. నీకోసం స్టేషన్‌కు వెళ్తూ యీ ప్రమాదం జరిగింది - ఇప్పుడే!

లిల్లీ: షటప్! ఆయన కాళ్ళు ఇప్పుడు విరిగితే ఏం - ఎప్పుడు విరిగితే నాకేం —— ఎవరిదీ ఫోటో (హేన్డ్‌బ్యాగ్‌లోంచి ఫోటో తీసిచ్చింది.)

తిరుపతి: (చూసి తెల్లబోయాడు.)

లిల్లీ: ఎవరి దా ఫోటో?

తిరుపతి: నాది.

లిల్లీ: ఇది మోసం కాదా? ఒకరి ఫోటో పంపి ఇంకొకరి పేరు చెప్తారా? ఇంకొకరు పెళ్ళాడాలని చూస్తారా? ఎలా జరుగుతుందనుకున్నారు? మీ మతులు ఏమయి పోయినయి? మనుష్యులు చేయాల్సిన పనా యిది?

తిరుపతి: లిల్లీ ఇదేదో పొరపాటు - మాలో ఎవ్వరికీ నిన్ను మోసం చేయాలనే ఉద్దేశ్యంలేదు. నా మాట నమ్ము. శివుడు తన ఫోటోకు బదులు పొరబాటున నా ఫోటో పంపివుంటాడు - కాని మోసం చేయాలని కానేకాదు.

లిల్లీ: న్యూసెన్స్ (గదిలోకి వెళ్ళబోయింది.)

తిరుపతి: ఇప్పుడెందుకీ అల్లరి. వూర్కో లిల్లీ!

లిల్లీ: నా పెట్టే బేడా నాక్కావాలి.

తిరుపతి: ఎందుకు లిల్లీ!

లిల్లీ: ఇంకో క్షణం ఇక్కడ వుండను. వెళ్లాలి.

తిరుపతి: లిల్లీ! పొరపాటు క్షమించు.

లిల్లీ: క్షమించడం కాదు. వీలైతే మిమ్మల్నందర్నీ కోర్టు కెక్కిస్తాను. నా సామాన్లు తెచ్చి పెడతారా లేదా?

తిరుపతి: తెస్తాను.

ఒక క్షణం అలాగే బిగుసుకు నిలబడ్డది. వున్నట్టుండి దుఃఖం పొంగి వచ్చింది. గొల్లుమని ఏడుస్తూ కూలబడ్డది.

శివుడు: (గదిలోపల) తిరుపతీ! లిల్లీకి నామీద కోపం వచ్చి వుంటుంది. కోపంకాదు అసహ్యంచేసి వుంటుంది నాకు తెలుసు. కాని లిల్లీతో చెప్పు తిరుపతీ! ఏంచేసినా లిల్లీమీద ప్రేమకొద్దీ చేశానని చెప్పు. అంతా మరిచిపొమ్మని చెప్పు తిరుపతీ!

లిల్లీ: (హాల్లో యీపయి మాటలు వినిపిస్తున్నాయ్! మెల్లిగా తలెత్తింది. కన్నీళ్ళు తుడుచుకుంది. వింటుంది.)

శివుడు: తిరుపతీ! ఎవరివివన్నీ? లిల్లీవా?

తిరుపతి: అవును.

శివుడు: ఏం తిరుపతీ లిల్లీ వెళ్ళిపోతోందా? చెప్పు తిరుపతీ! లిల్లీ వెళ్తూందా! చెప్పు తిరుపతీ! లిల్లీతో చెప్పు. యిన్నాళ్ళూ యీ వూళ్ళో పరువు ప్రతిష్ఠలతో బతికాను. అదంతా గంగపాలుచేసి పోతుందా? శివయ్య మోసగాడని

వూరంతా చాటిపోతుందా? ప్రేమకొద్దీ చేసిన పాపానికి ఇంత పెద్ద శిక్ష విధిస్తుందా - అదేనా లిల్లీకి అభిమతం? అదేనా లిల్లీకి ఆనందం. వద్దని చెప్పు తిరుపతీ! లిల్లీకి యిష్టంలేకపోతే యీ పెళ్ళి మానేస్తాను. కాని లిల్లీని వెళ్ళవద్దని చెప్పు. ఈ యిల్లు యీ ఆస్తి - యీ నా సర్వస్వం లిల్లీదే - ఇక్కడే వుండమను. అంతా తనదేనని చెప్పు. వెళ్ళవద్దని చెప్పు తిరుపతీ!

తిరుపతి: వెళ్ళటం లేదు శివుడూ. ఆమెకు ఆ గది ఏర్పాటుచేస్తున్నా.

శివుడు: చెయ్యి. అన్ని సౌకర్యాలు ఏర్పాటుచెయ్యి. ఏదేం కావాలో అన్నీ చూసుకో తిరుపతీ! లిల్లీ నడుగు మధ్యాహ్నం అనుకున్న ప్రకారం రిజిస్ట్రేషన్ జరిపించేద్దామా అని అడుగు - లిల్లీ యిష్టపడితేనే సుమా - బలవంతం పెట్టకు ఏం?

తిరుపతి: ఇప్పుడేం తొందర శివుడూ!

శివుడు: అంతా లిల్లీ యిష్టం - లిల్లీ జరగాలంటే జరగాల్సిందే.

తిరుపతి: అలాగే — (కదిలాడు)

లిల్లీ: (శివుడు మాటలన్నీ విన్నది. ఆమెలో మెనుతుఫాను. అటు యిటూ వూగిసలాడింది. ఇల్లంతా కలయచూసింది. ఏదో ఆలోచన తిరుపతితో తను అన్న మాటలు గుర్తుకొచ్చాయ్ - "ఎక్కడన్నా నిలకడగా అంత నీడ దొరికితే" కాదని - అవునని సతమతమవుతోంది. తిరుపతి వచ్చాడు.)

తిరుపతి: (సామాన్లు ఆమె ముందు పెట్టి) లిల్లీ మరొక్కమారు ఆలోచించు. శివుడి ప్రాణాలు నీ చేతుల్లో వున్నాయి. నీవు వెళ్ళావంటే శివుడు బతకడు. ఆలోచించు.

లిల్లీ: ఆలోచించాను.

తిరుపతి: (ఒక్క క్షణం ఆగి) టాక్సీ తీసుకురానా —

లిల్లీ: అక్కర్లేదు.

తిరుపతి: స్టేషన్ చాలా దూరం వుంది.

లిల్లీ: నేను వెళ్ళటంలేదు.

తిరుపతి: లిల్లీ!

తెర జరజరా జారింది ఆనందంగా



# దృశ్యం రెండు

## పాత్రధారుల సామాగ్రి

శివుడు : కమ్మల పెట్టె——!

డాక్టరు : స్టెతస్కోపు, బ్యాగ్, థర్మామీటరు.

పంతులు : అక్షతలు...వక్కపొడీ. .సున్నం. . ఆకులు.

నాయరు : పరుపు, మడత మంచం, పక్క.

ఆయా : లిల్లీ అమ్మా నాన్నా ఫోటో.

అదే హాలు - రాత్రి - హాల్లో మంచంమీద శివుడు పడుకున్నాడు. కాళ్ళకు పట్లు కట్టి వున్నాయి. ప్రక్కనే కుర్చీమీద డాక్టరు కూర్చున్నాడు. ఇంటా బయటా అంతా రంగు రంగుల దీపాలు వెలుగుతున్నాయి. ఆ దీపాల కాంతిలో, కాస్తున్న వెన్నెల కనిపించటంలేదు. విందు అప్పుడే అయిపోయినట్లుంది. కొందరు వెళ్ళారు. కొందరు వెళ్తున్నారు. అప్పుడప్పుడు బాణ సంచాలు కాలుస్తున్నారు. శివుడు ఎత్తుగా తలగడలు వేసుకుని యీ వేడుకంతా చూస్తున్నాడు, రేడియో సన్నగా పాడుతోంది.

డాక్టర్: బలేవాడివోయే నువ్వు —— కాళ్ళు విరిగి మూలబడ్డా, పెళ్ళిమాత్రం యథా ప్రకారం జరిపించేస్తున్నావు.

శివుడు: అదంతా లిల్లీ యిష్టం డాక్టర్ - జరగాలి అన్నది, జరిపించేశాం. (బైట జనం గలగలా నవ్వినట్లుంది.)

డాక్టర్! ఒక్కసారి చూడండి, లిల్లీ ఎలా వుందో, ఏం చేస్తోందో ఒక్కసారి అలా చూసి చెప్పండి ప్లీజ్.

డాక్టర్: చూస్తాలే - నువ్వు కదలకుండా పడుకో (వాకిలి దాకా వెళ్ళి నిలబడి చూస్తూ) ఈ యిల్లు పట్టి బ్రహ్మచారి కొంపగా నే వుండిపోతుందనుకున్నాను. ఇలా ఒక చక్కని అమ్మాయి యిల్లాలై కళకళ లాడుతూ వుంటుందనుకోలేదు.

శివుడు: నిజంగానా డాక్టర్? నా యిల్లు కళకళలాడుతోందా?

డాక్టర్: లిల్లీ నీ యింటికి ఎన్నడూలేని కళ తెచ్చిందోయి.

శివుడు: డాక్టర్! డాక్టర్? ఇలారండి ఒక్కమాట.

డాక్టరు: ఏం?

శివుడు: నాకు అయిదారు రోజుల్లో నయమైపోతుందికదూ?

డాక్టరు: నో! (నవ్వుతాడు) మళ్ళీ యిప్పుడే వస్తా. కదలకుండా పడుకో.

శివుడు: డాక్టర్!

డాక్టర్: నో!

శివుడు: (డాక్టరు వెళ్ళాడు తిరుపతి వచ్చాడు.) తిరుపతీ? యిలారా - ఎలాగుంది లిల్లీ! సంతోషంగా వుందా? అందరినీ పరిచయం చేశావా? నవ్వుతూ మాట్లాడుతూందా?

తిరుపతి: అంతా బాగానే జరిగిపోయింది శివుడూ! లిల్లీ సరదాగానే వుంది.

శివుడు: అబద్ధం లిల్లీకి నామీద యింకా కోపంగానే వుంటుంది. లిల్లీని నేను మోసం చేశాను. పచ్చిమోసం చేశాను.

తిరుపతి: అదంతా మర్చిపో శివుడూ!

శివుడు: నేను మరచినా లిల్లీ మరుస్తుందా? మరవదు. మరచిపోవడానికి వీల్లేని ద్రోహం చేశాను. బుద్ధిపూర్వకంగా చేశాను.

తిరుపతి: ఎందుకు చేశావు చెప్పు?

శివుడు: ఏమిటో తిరుపతీ? మతిపోయి చేశాను. నా ఫొటో చాల వికారంగా వుంది. నాకే వికారంగా వుంది. అది చూస్తే లిల్లీ నిరాకరిస్తుందని భయపడ్డాను. లిల్లీ కాదంటే నేను బతకలేననిపించింది. నాకు లిల్లీ కావాలి. అందుకే ముందూ వెనకా ఆలోచించకుండా ఆ ఫొటో పంపేశాను.

తిరుపతి: ఎంత పిచ్చిపని చేశావు? ఎలా తెలియదనుకున్నావు?

శివుడు: అప్పుడిదింకా ఆలోచించలేదు. తరువాత ఆలోచించాను. మతిపోయింది. తల బాదుకున్నాను. తప్పించుకోడానికి మార్గం ఒక్కటే అనిపించింది. నిన్నెలాగయినా ఇక్కణ్ణుంచి పంపించేయాలి. నువ్వొస్తే అంతా సర్దుకుంటుంది. లిల్లీతో ఏదో చెప్పి ఒప్పించవచ్చనుకున్నాను. కానీ - తిరుపతీ! లిల్లీ నన్ను క్షమించిందంటావా?

తిరుపతి: ఒక్క రహస్యం చెబుతాను విను! ఆడవాళ్లు పొరబాట్లను, మోసాలను మగవాళ్ళకన్నా సానుభూతితో, సహృదయంతో చూస్తారు. సులభంగా మన్నిస్తారు. మర్చిపోతారు. క్షమ వాళ్ళ స్వభావానికి చాలా సన్నిహితం. వాళ్ళకు కావలసిందల్లా మనం వాళ్ళ ప్రాముఖ్యతను గుర్తించడమే —

శివుడు: తిరుపతీ! ఎలా అయినా లిల్లీ అభిమానాన్ని సంపాదించాలి.

తిరుపతి. అది చాలా సులభం. లిల్లీ జీవితంలో చాలా బాధపడ్డ పసిది. పరుగెత్తి పరుగెత్తి అలసిపోయిన మనిషి తాటిచెట్టు నీడనైనా ఆశ్రయిస్తాడు. అదే లిల్లీ పరిస్థితి. అడుగడుగునా అఘాతా లనుభవించిన ఆడది. కోరుకొనేది చూసుకొనేది ఆర్థిక భద్రత, ఒక నిలకడైన జీవితం. అవి రెండూ యిచ్చావు లిల్లీకి. ఇక నువ్వు చేయాల్సిందల్లా ఏమీలేదు. ఆమె అడిగి అడక్కముందే ఆమెకు కావలసిందల్లా యివ్వు. ఇనప్పెట్టి తాళంచెవు లామెదగ్గర అప్పగించు. ఆమెను బుజ్జగించు. లాలించు. సులభంగా నీ దాన్ని చేసుకోవచ్చు.

శివుడు: ఏమిటోయ్ నువ్వనేది? ఆడవాళ్ళు కేవలం డబ్బు చూసి ప్రేమిస్తారంటావా?

తిరుపతి: మగవాడికి ఆడది కావాలి. ఆడదానికి డబ్బు కావాలి. ఇది కేవలం నా అభిప్రాయం.

శివుడు: అలా అనుకున్నా లిల్లీ కేం తక్కువోయ్? నే నేది కాదంటాను. ఇలా చూడు (తలగడ కింద నుంచి ఒక నగలపెట్టి తీసి చూపుతూ) లిల్లీకని కొన్నాను. తెరిచిచూడు.

తిరుపతి: (చూచి) అబ్బా! కళ్ళు జిగేలుమంటున్నాయి.

శివుడు: ఎంతో తెలుసా? ఆరువేలు!

తిరుపతి: అయితే అయిందిలే, మంచిపని చేశావు. వుండు లిల్లీని పిలుస్తాను.

శివుడు: ఇప్పుడే?

తిరుపతి: ఆఁ! ఈ వేడిలోనే యివ్వాలి. ఆయా! ఆయా! (ఆయా వచ్చింది) అమ్మగార్ని అయ్యగారు పిలుస్తున్నారని చెప్పు.

ఆయా: అలాగే బాబూ!

వెళ్ళింది.

శివుడు: తిరుపతీ! లిల్లీ వస్తుందంటావా?

తిరుపతి: తప్పకుండా వస్తుంది.

శివుడు: ఇప్పుడేం చేస్తోంది లిల్లీ?

తిరుపతి: పిల్లల్తో ఆడుకుంటోంది.

శివుడు: తిరుపతీ! లిల్లీకి కూడా నాలాగే పిల్లలంటే చాలా యిష్టంలా వుంది కదూ!

తిరుపతి: ఔను.

శివుడు: తిరుపతీ! డాక్టరు చెప్పాడు, నాకు పిల్లలు పుడతారని. ఆ పంతులున్నాడే పంతులు, ఆయన నా కేదో పెద్ద వయస్సయిపోయిందని ఇక పిల్లలే పుట్టరని

అన్నాడు. నాకు వళ్ళు మండుకొచ్చింది. పిల్లలు పుట్టరనుకుంటే నేను పెళ్ళెందుకు చేసుకుంటాను? నేనేం పిచ్చివాణ్ణా? పోనీగాని తిరుపతీ! నువ్వే మంటావు! నాకు పిల్లలు పుడతారా పుట్టరా?

తిరుపతి: లిల్లీ వస్తూంది.

శివుడు: వస్తూందా?

తిరుపతి: అదుగో అప్పుడే ఒంగారు. ఏం మునిగిపోలా తాపీగా వుండు.

లిల్లీ వచ్చింది.

లిల్లీ: (వాకిలి దగ్గరే నిలబడి) ఏం?

తిరుపతి: శివయ్య పిలుస్తున్నాడు.

లిల్లీ: అడిగిందాయిన్నే మిమ్మల్నికాదు.

శివుడు: లిల్లీ యిలారా!

లిల్లీ: (దగ్గరకొచ్చింది.)

శివుడు: చూచో లిల్లీ!

లిల్లీ: ఫరవాలేదు చెప్పండి.

శివుడు: బాగా అలసిపోయావు కదూ?

లిల్లీ: ఏంలేదు. నాకుంటే పిల్లలతో ఒకటే గొడవయిపోయింది. మనవాళ్ళకు పిల్లలను కనడమేగాని పెంచడం చేతకాదు. ఛే - ఛీ...

శివుడు: నువ్వు పిల్లల్ని పెంచడాన్ని గురించి చదివావా?

లిల్లీ: చదవాలా? నేను చాలా బాగా పెంచుతాను. పెంచానుకూడా.

శివుడు: (ఒకవైపు పిచ్చి ఆనందం. మరోవైపు ఏదో తెలియని అనుమానంతో కూడిన కలవరపాటు) విన్నావా తిరుపతీ విన్నావా?

లిల్లీ: మధ్య ఆయనెందుకు? అయినా వినకుండా ఆయనకేం చెవుడా? (లేచి కిటికీ దగ్గరకు వెళ్ళింది.)

శివుడు: లిల్లీ!

లిల్లీ: ఏం?

శివుడు: నీకు కమ్మలంటే యిష్టమేనా?

లిల్లీ: ఏం? నేనూ ఆడదాన్నే —

శివుడు: మరిలా రా చెప్తా.

లిల్లీ: ఇక్కడుంటే చెప్పకూడదా?

శివుడు: చెప్పడంటాడు నీకోతాయం యివ్వాలి ——

లిల్లీ: తాయమా?

శివుడు: ఆఁ. రా మరి తీసుకొని చూడు.

లిల్లీ: (వచ్చింది.)

శివుడు: (నగలపెట్టె యిచ్చి) చూడు! ఏమిటో చూడు ——

లిల్లీ: (పెట్టె తెరిచి చూసింది. ఆమె కళ్ళు జిగేలుమన్నాయి) ఓ!

శివుడు: బాగున్నాయా లిల్లీ? నీకు నచ్చాయా? నిజం చెప్పు - లేకుంటే వెంటనే తిప్పి యిచ్చేసి వేరే చేయిస్తాను - చెప్పు లిల్లీ.

లిల్లీ: ఇవెంత?

శివుడు: ఎంతయితే ఏంలే, నీకు నచ్చాయా?

లిల్లీ: చెప్పండి - ఎంతయింది?

శివుడు: ఆరువేలు ——

లిల్లీ: ఆరువేలు!!

శివుడు: ఏం! ఎక్కువా లిల్లీ? అంత చెయ్యదంటావా?

లిల్లీ ఎక్కువే - నా కంతా ఎక్కువే - ఆరువేలు కాదు ఆరువందలు కాదు. అరవై రూపాయలు కూడా ఎక్కువే? నగ కాదు - నా జీవితం అంత చెయ్యదు. నే నింత విలువైన నగలు వేసుకోడానికి పుట్టలేదు.

శివుడు: లిల్లీ! ఏమిటా మాటలు?

లిల్లీ: నేను తగను. ఇంత ఐశ్వర్యానికి, ఆనందానికి నేను తగను. నా జీవితమంతా గిల్టు నగలతో, చాలీచాలని జీతంతో, చాకిరితో గడిచిపోతుందనుకున్నాను. కాని....కాని....మీరు నన్నొక పాతాళం నుంచి పైకి లాగారు. నన్నూ ఒక ఆడదాన్ని చేశారు. చాలు, ఆ కృతజ్ఞతతోనే కృంగిపోతున్నాను. ఇంకా ఎత్తయిన శిఖరాలకు తీసుకొని వెళ్ళకండి. నన్నిలాగే వుండనివ్వండి. ఇలాగే బతకనివ్వండి.

శివుడు: లిల్లీ! లిల్లీ! ఈ ఆస్తి - ఈ ఐశ్వర్యం అంతా నీదే - నీ కాక మరెవరి కిస్తాను? నా కింకెవరున్నారు లిల్లీ!

లిల్లీ: ఒద్దు - నాకేమీ వద్దు: నన్నెక్కడికో తీసుకెళ్ళకండి. అక్కణ్ణుంచి పడిపోతే నే నేమవుతాను? కాదు - నా వల్లకాదు. నే నీ అభిమానం భరించలేను. ఈ కృతజ్ఞత మోయలేను. (గొల్లున ఏడుస్తుంది.)

శివుడు: లిల్లీ లిల్లీ! ఏడుస్తున్నావా - ఒద్దు లిల్లీ. ఏడవకు లిల్లీ - ఏడవటానికా నే నిదిచ్చింది? నువ్వు నిండుగా నవ్వుతావని, నీ నవ్వు చూచి యీ బాధంతా మరిచిపోదామని, నిన్నిలా నవ్విస్తూనే వుందామని యిచ్చాను. ఏడవకు లిల్లీ - నా మీద ఒట్టు —

లిల్లీ: లేదు. ఏడవటంలేదు.

శివుడు: మరి నవ్వు - ఒక్కసారి నవ్వు లిల్లీ.

లిల్లీ: (నవ్వింది.)

శివుడు: బాగా! నిండుగా పండువెన్నెల్లాగ.

లిల్లీ: (నిండుగా నవ్వింది.)

శివుడు: (ఆ వేగంతో) లిల్లీ! (అని దగ్గరకు లాక్కోబోయాడు.)

లిల్లీ: (తిరుపతి వున్న సంగతి గుర్తుచేస్తున్నట్టు అటు తిరిగిచూసింది)

తిరుపతి: (ఆమె చూడకముందే అర్థంచేసుకు వెళ్తున్నాడు.)

శివుడు: తిరుపతీ!

తిరుపతి: విందైపోయింది శివుడూ —

లిల్లీ: అయిపోయిందిగా - ఇక మీరు వెళ్ళవచ్చు.

తిరుపతి: వెళ్తున్నాను.

శివుడు: తిరుపతీ! ఎక్కడికి?

తిరుపతి: ఎక్కడికి ఏముంది శివుడూ - తెగిన గాలిపటానికి —

శివుడు: అదేమిటి తిరుపతీ! నన్నీ స్థితిలో వదలి వెళ్తావా?

లిల్లీ: వెళ్ళనీయండి.

శివుడు: నీకు తెలియదు లిల్లీ - తిరుపతి వుండాలి - తిరుపతి లేకుంటే ఇక్కడి పనులన్నీ ఎవరు చూసుకుంటారు?

లిల్లీ: ఏం పనులు మహా-నేను చూసుకుంటాను లెండి.

తిరుపతి: నన్ను వెళ్ళనీ శివుడూ.

శివుడు: తిరుపతీ! నా మాట వినవ్ —

తిరుపతి: శివుడూ! నన్ను వెళ్ళనీ.

శివుడు: లిల్లీ వెళ్ళమన్నదని కోపమా తిరుపతీ! లిల్లీకేం తెలుసు పాపం! మన స్నేహం ఎలాంటిదో, ఎలా కలిశామో - ఎలా వున్నామో అదంతా తనకేం తెలుసు? లిల్లీ! వుండమను. లిల్లీ! తిరుపతిని నాకోసం వుండమను.

లిల్లీ: (అకస్మాత్తుగా అక్కడ టేబుల్ మీద పడివున్న తిరుపతి ఫొటోమీద పడింది ఆమె దృష్టి - దాన్ని తీసి అతనిమీదకు విసిరింది.) ఇదిగో మీ ఫొటో.

తిరుపతి: (అందుకోడానికి కూడా ప్రయత్నించలేదు. అది కింద పడింది.)

శివుడు: ఏమిటా ఫొటో? అదా! తిరుపతిదా? చింపేయవోయి. ఆ పాడు ఫొటో చింపెయ్ (అనుకోకుండా యిద్దరి చూపులు కలిశాయి - ఆ చూపులు శివుడి హృదయాన్ని కదిలించాయి.)

తిరుపతి: (ఫొటో తీసుకొని చింపి దగ్గరేవున్న చెత్తకాగితాల బుట్టలో పారేశాడు ఏమీ చెప్పుడు కాకుండ.)

శివుడు: పోయింది పో. అంతా తీరిపోయింది - కదూ లిల్లీ ___

లిల్లీ: తీరిపోక ఏముంది.

శివుడు: అంతా మరచిపో లిల్లీ ___

లిల్లీ: మరచిపోవడమే నా కిష్టం. నా స్వభావం కూడా.

శివుడు: మరింకేం, తిరుపతి - వుండవచ్చుగా?

లిల్లీ: మీ యిష్టం.

శివుడు: విన్నారా తిరుపతీ! లిల్లీ పుంచమంటోంది. సరేనా? వెళ్ళావా, నా మీద ఒట్టు.

తిరుపతి: (ఏమీ అనకుండానే వెళ్ళాడు. తిరుపతి వెళ్తూండగానే పంతులు వచ్చాడు)

పంతులు: ఆఁ శివయ్యా! బ్రహ్మాండం - బ్రహ్మాండంగా జరిగింది. భేష్!

శివుడు: రండి - రండి ___

పంతులు: నూతన దంపతులను ఆశీర్వదించి పోదామని వచ్చాను.

శివుడు: లిల్లీ! పంతులుగార్కి నమస్కారం చెయ్యి -

పంతులు: (సద్దుకున్నాడు)

లిల్లీ: (దండం పెట్టింది.)

పంతులు: (బొడ్డులోంచి అక్షింతలు తీసి) శతమానం భవతి శతాయుః పురుష శతేంద్రియే ఆయుష్యేవేంద్రియే ప్రతితిష్టతి.... .... శీఘ్రమేవ....

శివుడు: సుపుత్ర ప్రాప్తిరస్తు అని దీవించండి పంతులుగారూ....

పంతులు: ఆఁ ఆఁ (అన్నాడు)

అంజయ్య: (వచ్చాడు) అమ్మా! అయ్యా! నాకు శలవిస్తారా. పెళ్ళి వప్పుడు అన్నం పెట్టారు. ఏదో భగవంతుడి దయవల్ల పై యేడుకు బారసాల వప్పుడు అన్నం పెట్టాలి. ఏవమ్మా ఏం? పెడతావాలేదా?

లిల్లీ: (సిగ్గుపడింది.)

పంతులు: నీ వాలకంచూస్తే ఆ గ్యారంటీ యిచ్చేదాకా కదిలేట్టు లేదే. (శివయ్య, పంతులు విరగబడి నవ్వుతున్నారు - డాక్టరు వచ్చాడు.)

డాక్టరు: నొ - నొ - నొ - నొ. ఇదేం లాభంలేదు. ఇలాగైతే నా పూచీ ఏమాత్రం లేదు చెప్తున్నా - ఎంత సీరియస్ కేసో మీకు తెలియదు. ఏదీ యీ మంచం కాస్త ఆ గదిలోకి పట్టండి. పట్టండి చెప్తా.

శివుడు: ఉండండి డాక్టర్ - విందుకువచ్చిన వాళ్ళంతా -

డాక్టరు: వెళ్ళేదాకా నువ్విలా మాట్లాడుతూ కూచుంటావా? నొ, నొ. విశ్రాంతి తీసుకోవాలి. రెస్టు - రెస్టు కావాలి. అమ్మా! యిక బాధ్యత నీది. నువ్వే నర్సువు- ఆరు నెలలపాటు శివయ్యను కంటికి రెప్పలా కాపాడాలి.

లిల్లీ: ఆరునెలలా డాక్టర్!

డాక్టరు: ఆఁ, అదీ జాగ్రత్తగా నర్సుచేస్తే -

శివుడు: ఏమిటి డాక్టర్ - మూడు నెలల్లో పరుగెడతాను చూడండి కావాలంటే -

లిల్లీ: ('ఆరు నెలలు, ఆరు నెలలు' అని తనలో అనుకుంటుంది.)

శివుడు: డాక్టర్! లిల్లీ ఎందుకు? ఒక నర్సునే పంపండి.

లిల్లీ: ఎందుకు, నేనే చూసుకుంటా.

డాక్టర్: వెరీగుడ్! అదే సగంబలం శివుడూ! ఆఁ ఆఁ ఏదీ యీ మంచం పట్టండి. (మంచాన్ని పట్టి గదిలోకి తీసుకెళ్ళారు.)

హాల్లో ఎవరూ లేరు.

గదిలో

డాక్టర్: స్లీపింగ్ డోసిస్తాను. వెంటనే నిద్ర పడుతుంది.

శివుడు: ఒద్దు డాక్టర్.

లిల్లీ: తీసుకోండి, రాత్రిపూట బాధ ఎక్కువవుతుంది.

శివుడు: సరే యివ్వండి డాక్టర్!

డాక్టర్: ఈ మాత్ర యిప్పుడివ్వండి. అంతగా ఇంకా నిద్ర పట్టకపోతే ఒక గంట తర్వాత యిందులో సగం యివ్వండి.

ముందు పంతులు వచ్చాడు హాల్లోకి. ఆయా అతనికి ఎదురైంది. పంతులామెను చూస్తూ నిలబడ్డాడు దారికడ్డంగా - ఆమె ఆగక తప్పింది కాదు.

పంతులు: ఇలా చూడు.

ఆయా: (చూసింది.)

పంతులు: ఖులాసాగా వున్నావా?

ఆయా: మీ దయ.

పంతులు: నువ్వీ ఇంట్లో వుండటం నా పదోవిధంగా తృప్తి.

ఆయా: సంతోషం.

పంతులు: ఎన్నిసార్లు వచ్చా నీ యింటికి? ఎప్పుడూ తలెత్తి నా కేసి చూడవేం! నా మొఖం చూడ్డం అసహ్యమా?

ఆయా: కాదు. యిచ్చినమాట తప్పుతానేమోనని భయం.

పంతులు: ఇన్నేళ్ళు కాపాడావు ఇంకేవుంది. బతికినంతకాలం బతకటం -

ఆయా: చచ్చేదాకా బతక్క తప్పదు. బతికున్నంతవరకూ నా కా బాధ్యత తప్పదు.

పంతులు: నువ్వు దేవతవు. (ఆనందంలో తాకబోతాడు.)

ఆయా: కాదు - బతికున్న శవాన్ని - తప్పుకోండి ఎవరన్నా చూస్తారు. (అని వెళ్ళింది. ఇంతలో అంజయ్య వచ్చాడు)

అంజయ్య: పంతులుగారూ? పోదామా?

పంతులు: ఆహాఁ!

వెళ్ళారు. ఆయా తన గదిలోకి వెళ్ళింది - కాస్సేపు హాలంతా నిశ్శబ్దం. బైట జనం వెళ్ళారు. లిల్లీ మెల్లగా గదిలోంచి హాల్లోకి వచ్చింది. వాకిలి దాకా వెళ్ళింది. అలా కాస్సేపు నిలబడింది. వెనుదిరిగి హాల్లోకి వచ్చింది. అద్దం ముందు నిలబడింది. తన్ను తాను చూసుకుని నీరసంగా నవ్వింది. మెల్లగా సోఫాల వద్దకు వచ్చింది. ఒక క్షణం ఆలోచించి కూచుంది. రేడియోలో సంగీతం వినిపిస్తూనేవుంది. నాయరు వచ్చాడు. లిల్లీని చూశాడు. శివయ్య గదిలోకి వెళ్ళాడు. మరుక్షణంలో ఒక పరుపు తీసుకుని ఎదురుగా వున్న గదిలోకి వెళ్తున్నాడు.

లిల్లీ: నాయర్! ఎవరికా పక్క?

నాయర్: తిరుపతయ్య కమ్మా!

లిల్లీ: ఎక్కడ వేస్తున్నావు?

నాయరు: ఈ గదిలో అమ్మా!

లిల్లీ: సరే.

నాయరు వెళ్ళాడు. లిల్లీ ఏదో ఆలోచిస్తోంది. లేచింది. మనశ్శాంతి కోసం రేడియో ఆన్ చేసింది. లిల్లీ ఛాయామాత్రం కనిపిస్తోంది. కాంతి రేడియోను మాత్రం చూపిస్తోంది. ఆలాపన -

ఇదే కదా తొలిరేయి
ఏది చెలీ! మధుపాయి

లిల్లీ మనసున 'పుష్ప - భ్రమర' సంయోగలీల కనిపిస్తోంది. గుమ్మం నుంచి తోట చూస్తోంది. తోటను చూస్తున్న లిల్లీ బిరువుగా యిటు తిరిగింది.

వెన్నెలలోన వెలవెలపోయి
వెతికెను కనుదోయి -
ఇప్పుడిప్పుడే విరిసిన విరిలో
మధువులు ఒలికినవి,
మధువులు ఒలికినవి.

గుమ్మంనుండి విసురుగా వెళ్ళబోయింది. ఎక్కడికో - అక్కడ 'రతీమన్మధుల రాసలీల' శిలాస్ఫటికం కనిపించింది.

రెప్పలు అరమూసిన కన్నులు
ఆ మత్తును తెలిపినవి,
ఆ మత్తును తెలిపినవి.

ఆమె ఎన్నాళ్ళనుంచో కన్న కలలు తీయని కోర్కెలై మత్తుగా కళ్ళలో కదులాడుతున్నాయి. బిరువుగా, మత్తుగా సోఫాల వద్దకు వచ్చింది. కూచుంది.

వయసూ సొగసూ వంతులేసుకొని
మనసును తరిమినవి,
మనసును తరిమినవి.

పాట ఆమెను కలత పెడుతోంది. మనసు మత్తుమచ్చులో వడిపోతోంది. ఆమెలో అణిగి మణిగివున్న ఆవేశాలను రేపుతోంది. లిల్లీ వళ్ళు విరిచింది, ఆపులించింది.

తోడులేని ఆ దోర మనసులో
వేడివూర్పు లెగిసినవి,
వేడివూర్పు లెగిసినవి.

భరించలేక రేడియో ఆపివేయాలని ప్రయత్నించింది. వెళ్ళింది. ఆపలేకపోయింది. పాట బాగుంది.

దిన దినాల ని తీయని కోర్కెలు
నర నరాలను నులిమినవి.
క్షణ క్షణానికీ జారిపోవు యీ
కాలం నిసుగని నవ్వినది.

మత్తుగా సోఫాలమీద వాలి - వెనక్కు జారుతోంది. ఆమెలో సంక్షోభం -

ఏదీ ఏదీ ఎదురుచూసిన
నవజీవన నందనము

బరువుగా అటు తిరిగి చూసింది. ఆమె మనసుకు పచ్చని ఆతోట చెట్లు. ఎండిన మోడుల్లా కన్పించాయి.

ఎందుకు ఎందుకు ఎవరి కొరకు
నీ యెడారి యవ్వనమూ -
నీ యెడారి యవ్వనమూ -

ఇటు తిరిగి విసురుగా సోఫాలో కూలబడింది. సోఫాలో కూచున్న ఆమెకు చెత్త కాగితాల బుట్టలో చించిన తిరుపతి ఫొటో ముక్కలు కనిపించాయి. తీసింది. ఆ ముక్కలన్నీ క్రమంగా టేబుల్‌మీద పెట్టి చూస్తోంది. ఇంతలో నాయరు వచ్చాడు.

నాయర్: (వెడుతున్నాడు)
లిల్లీ: నాయర్!
నాయర్: అమ్మా!
లిల్లీ: నా పక్క ఎక్కడేస్తున్నావు?
నాయర్: ఎక్కడ వేయమంటారమ్మా?
లిల్లీ: హాల్లో వెయ్యి.
నాయర్: అలాగే అమ్మా! (వెళ్ళాడు)
లిల్లీ: (ఏదో ఆందోళన లేచింది. ఇటూ అటూ తిరిగింది. ఏం తోచిందో మేడమీదకు వెళ్ళింది.)
నాయర్: (గదిలోంచి మడతమంచం తెచ్చి వేశాడు. పక్క కోసం గదిలోకి వెళ్తూ బల్లమీద వున్న ఫొటో ముక్కలు చూశాడు. ఏదో ఆలోచన. ఇంతలో తిరుపతి వచ్చాడు.)

తిరుపతి: నాయర్! ఏమిటది?
నాయర్: మీ ఫోటో అండి.
తిరుపతి: అవన్నీ ఎందుకు తీశావు?
నాయర్: నేను తియ్యలేదండి - అమ్మగారే తీసి బల్లమీద పెట్టి వెళ్లారండి.
తిరుపతి: అమ్మగారా?
నాయర్: అవునండి.
తిరుపతి: (ఒక్క క్షణం ఆలోచించి) అమ్మగారెక్కడ?
నాయర్: ఏమోనండి. యిందాక యిక్కడే వున్నారు.
తిరుపతి: ఆ గదిలో లేదూ?
నాయర్: లేరండి.
తిరుపతి: ఊఁ సరే నీ పని చూసుకో.

నాయర్ వెళ్ళాడు. తిరుపతి యిటూ అటూ పచారు చేస్తున్నాడు. నాయరే వచ్చి మంచం మీద పక్క వేశాడు.

తిరుపతి: నాయర్! అయ్యగారు నిద్రపోయారా?
నాయర్: ఇప్పుడే కునుకు పట్టినట్టుందయ్యా.
తిరుపతి: ఊఁ.
నాయర్: అయ్యా! మీరు వూరు వెళ్తారని విన్నాను. నిజమేనా?
తిరుపతి: ఏం నాయర్ ఎందుకు?
నాయర్: ఏం లేదయ్యా ఎప్పుడెళ్తారని?
తిరుపతి: వెళ్ళాలనుకుంటున్నాను నాయర్! కాని శివుడు వెళ్ళనివ్వటం లేదు.
నాయర్: అయ్యా! ఒక్క మాట చెబుతాను - ఏమీ అనుకోరు కదా!
తిరుపతి: చెప్పు నాయర్!
నాయర్: ఏం లేదు - ఏదో పెద్దోణ్ణి. నాకు తోచినది చెప్తున్నా - మనం మంచి వాళ్ళం కావచ్చు. మనలాగే అందరూ మంచివాళ్ళుగా వుంటారనీ, మనలాగే అందరూ ఆలోచిస్తారనుకోవడం తప్పు. అదీగాక లోకులు పలు కాకులన్నారు. ఏదో యిన్నాళ్ళు వున్నాం. అయ్యగారి వుప్పు తిన్నాం - ఆయన కెలాంటి బాధ కలగనివ్వకూడదు.
తిరుపతి: ఇదంతా ఎందుకు నాయర్? చెప్పదలచుకొన్నది చెప్పు.
నాయర్: చూడండయ్యా! మీ రిక్కడ వున్నందువల్ల నాకు కష్టంగాని నష్టంగాని లేదు. అయినా నే నీమాట చెప్తున్నానంటే ఎందుకు చెబుతున్నానో?

తిరుపతి: నాయర్!

నాయర్: మీ కర్తవ్యం గుర్తుంచుకుంటాను.

తిరుపతి: నాయర్! నన్ను వెళ్ళమంటావు అంటేగా వెళ్తాను. తప్పకుండా వెళ్తాను. మొదట నీవుడే వెళ్ళమన్నావు. తర్వాత పంతులు, తరువాత అమ్మగారు - ఇప్పుడు నువ్వూ అదే మాట అంటున్నారు. ఇందరు నన్ను వెళ్ళమనడానికి ఏదో బలమైన కారణమే వుండాలి. వెళ్తాను నాయర్! కాని....కాని....

నాయర్: అయ్యా! అమ్మగారు!! మిమ్మల్ని!!! వెళ్ళమన్నారా!!!?

తిరుపతి: అవును.

నాయర్: మీతోనే అన్నారా?

తిరుపతి: అవును ఏం?

నాయర్: ఏం లేదయ్యా! ఏం లేదు. అమ్మగారు మిమ్మల్ని వెళ్ళమన్నారా! (అను కుంటూ వెళ్ళాడు.)

తిరుపతి: (ఏమీ అర్థంకాక నిల్చున్నాడు - ఆయా వచ్చింది.)

ఆయా: అమ్మగారెక్కడ బాబూ?

తిరుపతి: ఏమో!

ఆయా: పడుకున్నారా?

తిరుపతి: ఏమో!

ఆయా: (గదివేపు వెళ్తూ బల్లమీద వున్న ఫోటో చూసింది) ఇదేమిటి బాబు! మీ ఫోటో ఎవరో చించేశారు.

తిరుపతి: ఏమో!

ఆయా: ఈ ఫోటో అమ్మగారి దగ్గరుండేది.

తిరుపతి: అమ్మగారే చించేశారు.

ఆయా: అమ్మగారా?

తిరుపతి: కాదు. నన్ను చించేమన్నారు చించేశాను.

ఆయా: అమ్మగారు మీ ఫోటో చించేమన్నారా? (వెళ్తుంది)

తిరుపతి: ఆయా!

ఆయా: బాబు!

తిరుపతి: ఇలారా!

ఆయా: (వచ్చింది)

తిరుపతి: చెప్పు - నిజం చెప్పు ఎందుకలా అన్నావు?

ఆయా: ఏమన్నారు బాబు?

తిరుపతి: అమ్మగారు మీ ఫొటో చించేస్తున్నారా అని నొక్కి పలికాడు. ఏమిటి నీ అభిప్రాయం చెప్పు.

ఆయా: ఏముంది బాబూ! మీకు తెలియందే.

తిరుపతి: నాకేమీ తెలియదు. నిజంగా తెలియదు.

ఆయా: నాకు మాత్రం ఏం తెలుసు?

తిరుపతి: తెలుసు - నీకే తెలుసు. పోనీ ఆయా! అమ్మగారి దగ్గర నా ఫొటో వుందని నీకెలా తెలుసు?

ఆయా: అమ్మగారే చూపించారు.

తిరుపతి: ఎందుకు చూపించారు? చూపించి ఏం చెప్పారు?

ఆయా: ఏముంది బాబూ చెప్పడానికి?

తిరుపతి: ఆయా! (గట్టిగా గదమాయించాడు) భయపడకు. నిజం చెప్పు. నేను వెళ్తున్నాను, మళ్ళా రాను. నాతో చెప్తే ప్రమాదం లేదు చెప్పు.

ఆయా: మీరు వూరు వెళ్తున్నారా?

తిరుపతి: అవును.

ఆయా: ఎప్పుడు?

తిరుపతి: రైలుంటే ఇప్పుడే. ఈ క్షణమే వెడతాను. రైలుండాలి కూడా. వెళ్తాను. త్వరగా చెప్పు.

ఆయా: అమ్మగారికి తెలుసా?

తిరుపతి: అమ్మగారే వెళ్ళమన్నారు.

ఆయా: ఆఁ.

తిరుపతి: అయినా, అమ్మగారి కెందుకు తెలియాలి? తెలియాల్సింది నీవుదికి. అమ్మగారెవరు? ఆయా ఎందుకలా అడిగావు? నీ మాటల్లో ఏదో అంతరార్థం వుంది? చెప్పు నిజం చెప్పు. మీ రంతా నన్ను గురించి ఏమనుకుంటున్నారు? చెప్పు చెప్తావా లేదా? (అని బుజాలు పట్టుకొని వూపాడు, గద్దించాడు)

ఆయా: (మెల్లిగా అతని చేతులు తీసేసింది) బాబూ! నేను చెప్పేముందు నిన్ను కొన్ని సంగతులు అడుగుతాను చెప్తావా?

తిరుపతి: అడుగు.

ఆయా: బొంబాయిలో మిమ్మల్ని యిద్దర్నీ చూశారా అమ్మగారు?

తిరుపతి: అవును.

ఆయా: ఆమెతో మీరేమన్నా మాట్లాడారా?

తిరుపతి: లేదు.

ఆయా: ఇక్కడకు వచ్చి ఉత్తరాయి వ్రాశారా?

తిరుపతి: అవును.

ఆయా: ఎవరి పేర వ్రాశారు?

తిరుపతి: అస్నీ శివయ్య పేరనే వ్రాశాను.

ఆయా: అయ్యగారి ఆస్తి, ఐశ్వర్యం సంగతి వ్రాశారా?

తిరుపతి: లేదు. సరిగ్గా వ్రాయలేదు.

ఆయా: అలాంటప్పుడు ఆ అమ్మాయి దేన్ని చూచి పెళ్ళికి వప్పుకుందంటారు?

తిరుపతి: ఏమో!

ఆయా: పోనీ అయ్యగారి ఫోటో పంపమని వ్రాసిందా?

తిరుపతి: అవును.

ఆయా: ఎవరి ఫోటో పంపారు?

తిరుపతి: అక్కడే పొరపాటు జరిగిపోయిందాయా.

ఆయా: పొరపాటంటారా అది?

తిరుపతి: కాదు. శివయ్య బుద్ధిపూర్వకంగానే పంపాడట. నాకు తెలియదు. తెలిస్తే అలా జరిగేది కాదు.

ఆయా: ఎవరికి తెలిసినా తెలియకున్నా జరిగిందది. ఆమె చూచింది మిమ్మల్ని. ఆమెకు అందింది మీ ఫోటో - ఆమె ప్రేమించిందీ మిమ్మల్నే.

తిరుపతి: ఆయా!

ఆయా: ఆమె యిక్కడికొచ్చింది మిమ్మల్ని పెళ్ళి చేసుకోవాలనే. మిమ్మల్ని పెళ్ళి చేసుకుని సుఖపడాలని.... కాని....

తిరుపతి: లిల్లీ అభిప్రాయం ఏమిటి? అయ్యగార్ని చేసుకుంది. ఎందుకు చేసుకోవాలి? ఎవరు బలవంత పెట్టారు?

ఆయా: ఎవరి బలవంతమూ కాదు. ఆవిడ బలహీనత. ఆ పరిస్థితిలో అయ్యగారి పరువు ప్రతిష్ఠ కాపాడ్డంకోసం చేసుకుంది.

తిరుపతి: అంతేనా - అయితే లిల్లీ వుద్దేశ్యం ఏమిటి? మోసం చెయ్యాలనా? మోసంతో బతకాలనా? మోసానికి మోసమే సమాధానమని శివుడి బ్రతుకు నాశనం చేయాలని నిశ్చయించుకుందా ఆయా?!

ఆయా: లేదు బాబూ! ఆమె మనసులో అలాంటి ఆలోచనే లేదు. అయ్యగారికి ద్రోహం చేయాలని ఆమె కే కోశానా లేదు. పాపం నరకయాతన పడుతోంది. నలిగి పోతోంది.

మనసు రాయి చేసుకోవాలని ప్రయత్నిస్తూంది. నీతిగా నిజాయితీగా కష్టమో నిష్టూరమో అయ్యగారితోనే కాలం గడపాలని గట్టిగా నిశ్చయించుకుంది. కాని....

తిరుపతి: కాని.

ఆయా: మనుష్యులు మారినంత సులభంగా మనసు మారుతుందా బాబు! అందుకు తగ్గట్టే పరిస్థితులూ యిలా ఏర్పడ్డాయి. పెళ్ళి పెళ్ళిలా జరిగిందా పాపం! అయ్యగారు మూలపడ్డారు. ఇంకా ఆరునెలలు పడుతుందట. ఆలోచించు బాబు! ఆడదాని మనస్సు ఎలా వుంటుందో - అందులో లేత మనస్సు - పొంగి పొరలుతున్న ప్రాయం. పెళ్ళయిన మొదటి రాత్రి.

తిరుపతి: ఆయా! అర్థమయిందాయా! లిల్లీ బాధ నా కర్థమయింది. కాని ఆయా! నువ్వే ఆమెను కాపాడాలి. నిలబెట్టాలి.

ఆయా: ఆమె కూడా తన శాయశక్తులా ప్రయత్నిస్తూంది. అన్నీ మరిచిపోవాలని. ఆరు నెలలు కళ్ళు మూసుకుని ఎలాగో అయ్యగారి సేవలో కాలం గడిపేయాలని ప్రయత్నిస్తూంది. కాని అంత సులభమా? ఎటు తిరిగినా మీరు కనబడుతున్నారు. అడుగడుగునా మీ ఆలోచన. మీ అందం.

తిరుపతి: ఆయా! నా అందమా? నా అందాన్ని చూచా!

ఆయా: అందం ఒక్కొక్కరి కళ్ళకు ఒక్కొక్కలా ఉంటుంది. ఎవరికి నచ్చింది వారికే అందం. దానికి కారణాలు కొలతబద్దలు వుండవు బాబూ!

తిరుపతి: అయ్యయ్యో! ఆయా! ఇంతకూ నువ్వనే దేమిటి? నాకే తెలియకుండా నా తప్పేమీ లేకుండా నేను ఒకయ్య సంసారానికి చిచ్చుపెట్టానా? ఎంత ఘోరం! నేను కలలో కూడా అనుకోలేదే! నా జీవితమంతా పాపాల పుట్టయి పోయినా బాధలేదు. కాని యీ పాపం ఏమిటాయా? నన్ను దహించివేస్తోంది. (మనసు మెలికలు తిరిగి పోతోంది. మనిషి తట్టుకోలేకున్నాడా బాధ) ఆయా! అందం....నా అందం.... (జేబులోంచి అగ్గిపెట్టె తీశాడు. ఎందుకో పిచ్చిగా ఒక అగ్గిపుల్ల గీశాడు. ఆ వెలుగులో బల్లమీద వున్న తన ఫోటో కనిపించింది. తీశాడు ముక్కలను.)

అందం వాడిది అగ్నిగుండం. ఆయా అగ్నిగుండం. మైత్రిని మానవత్వాన్ని కృతజ్ఞతను ధర్మాన్ని దహించే అగ్నిగుండం.

(మాట్లాడుతూ ఆ ఫోటో ముక్కల కిగ్గి పెడుతున్నాడు.)

నాలో ఏం చూచి ప్రేమించింది లిల్లీ? శివుడు నాకన్న మంచివాడే. అందమైన మనసు గలవాడే ప్రేమపాత్రుడే అమాయకుడే.

ఆయా: ఇదంతా ఆమెకేం తెలుసు బాబు!

తిరుపతి: నేను పట్టి కిరాతకుణ్ణి ఆయా!

ఆయా: మీరంటే యేం బాధం! ఆమెకు మీరలా కనిపించటం లేదేమో? పైగా ఆమెకు మీ కళ్ళు ...

తిరుపతి: నే నెప్పుడూ ఆమెను కన్నెత్తి చూడలే దాయా!

ఆయా: ఆమె చూసిందేమో - మీ కళ్ళు ఆమెను కట్టేసినవట.

తిరుపతి: అబ్బా! ఆయా! ఈ కళ్ళా ఆమెను కట్టేసినవి! పొడిచెయ్యి ఆయా ఈ కళ్ళు పొడిచెయ్యి. ఈ గుడ్లు పెకలించెయ్యి. నాకు శక్తి చాలదు. నేను బలహీనుణ్ణి. లేకుంటే నాకు నేనే పొడిచేసుకునేవాణ్ణి. ఆయా! నేను వెళ్ళాలి. వెంటనే వెళ్ళాలి.

ఆయా: బాబు!

తిరుపతి: తక్షణం వెళ్ళాలి - నేనుంటే ఏదో ఘోరం జరిగిపోతుంది. జరగరాని ద్రోహం జరిగిపోతుంది.

ఆయా: బాబూ! ఈ చలిలో!

తిరుపతి: ఒదు లాయా? పదుల నన్ను వెళ్ళనీ నిప్పుకన్న చలే మేలు నన్ను వెళ్ళనీ.

మ్యూజిక్ ఆగిపోతుంది. పెనుతుఫానులో కొట్టుకుపోయే రెమ్మలా వెళ్ళాడు.

ఆయా! (అలాగే చూస్తూ నిలబడి ఉంది. లిల్లీ మేడమీద నుంచి దిగి వస్తోంది.)

లిల్లీ: ఆయా! ఇంకా మేలుకున్నావా?

ఆయా: మీ కోసమే చూస్తున్నానమ్మా.

లిల్లీ: పైకి రాకూడదూ?

ఆయా: అయ్యగారి గదిలో వున్నారనుకున్నానమ్మా.

లిల్లీ: (ఏదో వెక్కిరింతలా వినిపించిందామెకు) హుం. ఆయా! దీపాలన్నీ ఆర్పేయ్.

ఆయా: అలాగేనమ్మా! పడుకోరూ?

లిల్లీ: పడుకుంటాలే - నిద్ర రాలేదు.

ఆయా: (బైట దీపాలు లోపల దీపాలు కొన్ని ఆర్పేసింది.)

లిల్లీ: (అనుకోకుండా లిల్లీ చూపు బల్లమీదకు పోయింది) ఇక్కడున్న ఫోటో ఎక్కడాయా?

ఆయా: తిరపతయ్యగారు కాల్చేశారమ్మా!

లిల్లీ: కాల్చేశారా! ఎందుకు?

ఆయా: ఏమో!

లిల్లీ: (తనకే తెలియకుండా ఓ క్షణం బాధపడి తమాయించుకుని) ఆయా! బయట వెన్నెల చాలా బాగున్నట్లుంది. ఈ దీపాల వెల్తురులో ఇంతసేపు కనబడ లేదు కదూ!?

ఆయా: అవునమ్మా!

లిల్లీ: ఆయా! (ఏదో అడగాలనుకుంది - కాని ఆగింది)

ఆయా: ఏమిటమ్మా!?

లిల్లీ: ఏం లేదాయా! అయ్యగారి ఫోటో ఏదన్నా వుందా!

ఆయా: లేదమ్మా!

లిల్లీ: చిన్నప్పటి ఫోటో అయినా సరే.

ఆయా: లేదమ్మా!

లిల్లీ: ఉంటుందాయా! ఏదో ఒకటి వుంటుంది వెతుకు.

ఆయా: లేదమ్మా! నాకు బాగా తెలుసు. ఏదీ లేదనే మొన్న మీకు పంపడానికి ఫోటో తీయించారు.

లిల్లీ: మొన్న తీయించారా? అదెక్కడుందాయా?

ఆయా: ఉంటే ఇక్కడే యీ సొరుగుల్లో ఎక్కడో వుండాలమ్మా.

లిల్లీ: చాలాయా! అది చాలు (ఉత్సాహంగా వెళ్ళి ఆ సొరుగులన్నీ వెదికి ఒక ఫోటో తీసి చూసింది. చూస్తూ అలాగే వచ్చి సోఫాలో కూచుంది. చాలాసేపు అలాగే చూసింది. ఏదో బాధతో) అమ్మా!

ఆయా: అమ్మా!

లిల్లీ: ఆయా! ఇలా రా...దగ్గరకు రా...ఇంకా దగ్గరకు రా ఆయా... (గట్టిగా కౌగలించుకొని, పసిపిల్లలా ఏడుస్తోంది.) అలాగే ఉండాయా! వెళ్ళొద్దు నీ వళ్ళోనే నిద్రపోతాను. చిన్నప్పు డెప్పుడో ఏడ్చి ఏడ్చి మా అమ్మ వళ్ళో ఇలా నిద్రపోయేదాన్ని. మా అమ్మ, నాన్న పోయారు. ఏడ్చి ఏడ్చి మా అమ్మ కళ్ళు పోయినాయి. నే నప్పుడు చదువుతున్నాను. ఉద్యోగం చేయటం ఇష్టం

లేదు. ఎగురున్నవాళ్ళ దగ్గరకల్లా వెళ్ళాను. ఇచ్చిందల్లా తీసుకున్నాను. అలాగే చదివాను. పొద్దున్నే పొయ్యి రాజేసేదాన్ని. పొయ్యిముందే పుస్తకాలు పెట్టుకొని చదువుకొంటూ వంటచేసి అమ్మకింత పెట్టి, నేనింత తిని స్కూలుకు వెళ్లేదాన్ని - కొద్దికాలానికి కుట్టుపని నేర్చుకున్నాను. తలగడ గలీబులు, జేబు రుమాళ్ళు. అవీ. ఇవీ కుట్టి, అమ్మేదాన్ని; ఎందుకో, చిన్నతనం నుంచి నిజాయితీగా బతకాలని పట్టుదల. ఇన్నాళ్లూ అలాగే బతికాను; కాని. ఈనాడు...

ఆయా: ఈనాడు నీకేమమ్మా!?

లిల్లీ: లేదాయా! నా కా శక్తి లేదు. నాలో శక్తంతా చచ్చింది. నేను నిలబడలేకున్నానాయా! నా కాళ్ళకింద నేల కృంగిపోతోంది. ఎప్పుడు పడిపోతానో ఏమైపోతానో అని భయం.

ఆయా: అదంతా భ్రమమ్మా! - నీకేం ఫర్వాలేదు. నెమ్మది చేసుకుని పడుకో - నిద్రపోయి లేస్తే బరువు బాధ తగ్గుతుంది. పడుకోమ్మా!

లిల్లీ: పడుకుంటాను ఆయా! అయ్యగారికి నయం కావటానికి ఆరు నెలలు పడుతుందట.

ఆయా: ఎవరన్నారమ్మా?

లిల్లీ: డాక్టరు.

ఆయా: ఆరు నెలలా!!

లిల్లీ: ఊఁ...పోనీలే ఆయా! ఆరు నెలలెంత గడిచిపోతుందిలే. నువ్వెళ్ళి పడుకో ఆయా! - నేనూ పడుకుంటాను.

ఆయా: ఎక్కడ పడుకుంటావమ్మా?

లిల్లీ: ఎక్కడో ఒకచోట వెళ్ళాయా వెళ్ళు.

ఆయా: (ఒక్క క్షణం ఆగి వెళ్ళిపోయింది.)

లిల్లీ: ఆయా!

ఆయా: అమ్మా! (ఆగింది)

లిల్లీ: చిన్నపని చేస్తావా?

ఆయా: చెప్పమ్మా!

లిల్లీ: అక్కడ నా పెద్ద పెట్టెలో మా అమ్మా, నాన్నా ఫొటో వుంది యిలా తీసుకొస్తావా?

ఆయా: అలాగే అమ్మా! (వెళ్ళింది)

ల్లీ: నడకా నడత నేర్పిన అమ్మా నాన్నే నన్నిప్పుడు కాపాడాలి.

ఆయా: అమ్మా! వీళ్లేనా మీ అమ్మా నాన్నా? వీళ్ళేనా?

ల్లీ: అవును వీళ్లే! ఏం?

ఆయా: ఏం ఏదమ్మా! మీరు.. మీరెప్పుడన్నా బెజవాడలో వుండేవారా?

ల్లీ: అవునాయా! నా చిన్నతనమంతా అక్కడే గడిచింది. ఏం ఆయా!? మా అమ్మా నాన్నా నీకు తెలుసా?

ఆయా: తెలుసమ్మా తెలుసు! (అని చరచరా వెళ్ళింది.)

ల్లీ: (ఏమీ అర్థంకాలేదు. ఏమిటో అని నిట్టూర్చింది. వాకిలివైపు తిరిగింది. అలాగే కాస్సేపు బయట వెన్నెల చూస్తూ నిలబడింది. ఏమీ తోచనట్టు పిచ్చిగా వెనక్కి తిరిగింది. మెల్లిగా శివయ్య గదివైపు వెడుతూంది. అడుగుల చప్పుడు విని - ఆగి తిరిగి చూసింది. తిరుపతి వచ్చాడు. లిల్లీని చూసి అతనూ వాకిలివద్దే ఆగాడు - మనిషి పిచ్చివాడులా వున్నాడు.)

తిరుపతి: క్షమించండి! వూరుకు వెళ్ళాలనే వెళ్ళాను. రైలులేదు. స్టేషన్‌లో పడుకో నివ్వలేదు. ఎక్కడో ఏ అరుగు మీదనో పడుకునేవాణ్ణి. కాని శివయ్య ఒట్టు వేసుకున్నాడు. చెప్పకుండా వెళ్తున్నామనే బాధ వెనక్కి లాక్కొచ్చింది. రాక తప్పలేదు. తెల్లవారి మీరు లేవకముందే వెడతాను. (గబ గబా చెప్పేశాడు)

లిల్లీ: అసలు మిమ్మల్ని ఎవరు వెళ్ళమన్నారు?

తిరుపతి: నేను చేయని పాపం.

లిల్లీ: (ఏమీ మాట్లాడలేదు. చరచరా గదిలోకి వెళ్ళింది.)

తిరుపతి: (వాకిలి తలుపులు వేశాడు. మంచం దగ్గరకు వచ్చాడు. దుప్పటి ఆపాద మస్తకం కప్పుకు పడుకున్నాడు. ఒక్క క్షణం —— —— ఆయా వచ్చింది. మంచం వైపు చూసింది. తిరుపతి దుప్పటికాస్త తొలగించి చూశాడు. ఆయా అతన్ని చూసీ చూడనట్టే వున్న ఒకటీ రెండు దీపాలు ఆర్పేసి వెళ్ళింది.)

లిల్లీ: (గదిలోంచి హాల్లోకి వచ్చింది. లైటువేసింది. పడుకున్న తిరుపతిని చూసింది. లైటు వేయగానే తిరుపతి ముసుగు తొలగించి చూశాడు. లిల్లీ అని తెలియ గానే కళ్ళు గట్టిగా మూసుకుని కదలకుండా పడుకున్నాడు. లిల్లీ మెల్లగా తనకే తెలియకుండా అతని మంచంవైపు నడిచింది. ఒక క్షణం అలాగే చూసింది. నిట్టూర్పు, వెనుతిరిగింది. తన ప్రతిబింబం అద్దంలో కనిపించింది. మెల్లగా అద్దంవైపు వెళ్ళింది. అద్దంలో తన్నుతాను చూసుకుంది. శివుడిచ్చిన కమ్మలు

జిగేలుమన్నాయి. కళ్ళు జలదరించింది. తన బింబం తనను పరిహసిస్తున్నట్టు ఉంది. గబగబా ఆ కిన్నరు తీసివేసింది. బయట పెనుగాలి. చెట్లు వూగి పోతున్నాయి. పెనురొద ప్రకృతంతా - మనిషి వణికిపోతోంది. చెమటలు పోస్తున్నాయి. ఆమెలో పెనుతుఫాను. వాకిలిదాకా వెళ్ళింది - వెన్నెలను మబ్బు - కారుమబ్బు కమ్మేస్తోంది. ఇంక అక్కడ నిలవలేక వెనుతిరిగింది. తుపాకి కనిపించింది. ఆగింది. మెల్లగా తుపాకీవైపు వెళ్ళింది. సంక్షోభం. నఖశిఖపర్యంతము వణికిపోతోంది. నిలదొక్కుకోటానికి ప్రయత్నించి మెల్లగా ఒక తూటా తీసింది. నిదానించి చూసింది. తుపాకి తీసుకుంది. తూటా పట్టించింది. అతి కష్టంమీద - తుపాకి జారిపోయేటట్టు వుంది. బలమంతాన పట్టుకుంది. పైకెత్తింది - కళ్ళు గట్టిగా మూసుకుని. ఇదంతా ఓరకంట కనిపెడుతున్నాడు తిరుపతి. గాబరాపడ్డాడు - గబాలున లేచాడు.)

తిరుపతి: లిల్లీ! (ఆమెవైపు పరుగెత్తాడు. ఇంతలో ఆమె చేతినుండి తుపాకీ పడిపోయింది. అతను దగ్గరకు వెళ్ళాడు పడిపోబోతున్న ఆమెను ఆదుకున్నాడు.)

లిల్లీ: ఏమిటీ పని?

లిల్లీ: పిరికితనం. నేను పిరికిదాన్ని. చావడానికి కూడా ధైర్యం లేనిదాన్ని.

తిరుపతి: లిల్లీ!

లిల్లీ: ఈ ప్రపంచం. ఈ ప్రపంచంలో అనుభవాలు నన్నింత పిరికిదాన్ని చేశాయి. లేకుంటే నాకెందుకీ వెధవాశ! ఇంకా బతకాలని చచ్చేదాకా బతకాలనే ఆశ. చావడానికి యింతకన్న సులభమార్గాల్లేవూ. నాకు చావడానికైనా మార్గంలేదు. (ఉరుములు మెరుపులు - దీపాలు ఒక్కసారి ఆరి వెలిగినయ్) ఉన్నాయ్! ఎన్నో మార్గాలున్నాయ్! ఉన్నాయ్! నేను చావడానికే వున్నాయి. (అని గొల్లున ఏడుస్తూ సర్రున మరో గదిలోకి వెళ్ళిపోయింది.)

తిరుపతి: (కంగారుగా ఏమీ తోచక 'లిల్లీ' 'లిల్లీ' అంటూ ఆమెవెంట పరిగెత్తాడు. క్షణం తరువాత - ఆయా వచ్చింది. తిరుపతి పక్కవైపు చూసింది. గదివైపు చూసింది. గదిలోంచి లిల్లీ ఏడుపు. తిరుపతి 'లిల్లీ ఊరుకో - ఊరుకో లిల్లీ' అని ఓదార్చడం వినిపించింది. కంగారు పడ్డది. ఏంచేయాలో తోచలేదు. గదిలోకి వెళ్ళాలనిపించింది. కాని వెళ్ళాడలేదు. ఏదో ఆందోళన. చివరికి లైట్లు ఆర్పి వెళ్ళిపోయింది. గోడనున్న గడియారం రెండు కొట్టింది ... అంతా చీకటి....అలా కొంతసేపు ... గడియారం ఐదుకొట్టింది. లైట్లు

వెలిగినయ్. నాయర్ హాల్లో వున్నాడు. తిరుపతి పక్కవైపు గదివైపు గడియారం వైపు చూశాడు. తలపంకించాడు. అలాగే నిలబడ్డాడు. మనిషి వుద్రిక్తుడవుతాడు. కళ్ళు ఎర్రబడుతున్నాయ్. పెదిమి కొరికాడు. గది తలుపులు తెరుచుకున్నాయి. తిరుపతి నాయర్‌ను చూశాడు. ఒక్కక్షణం ఆగి ముందుకు నడిచాడు. నాయర్ రెండు అడుగులు ముందుకు వేశాడు. ఇద్దరూ దగ్గరకు వచ్చారు. తిరుపతి తలెత్తి చూశాడు. నాయరూ అతని మొఖంలోకి చూశాడు. ఎవరూ పలుకలేదు. ఉన్నట్టుండి తిరుపతి గూబ గుయ్‌మంది. గది తలుపులు విభేయమన్నాయ్: మూయబడ్డాయి. ఆయా ఒక వైపునుంచి పరుగెత్తుకొచ్చింది.

తెర సరసర దిగింది.

—oo✽oo—

# దృశ్యం మూడు

పాత్రధారుల సామగ్రి

లిల్లీ: పేపరు
డాక్టర్: మెడికల్ బ్యాగ్
ఎల్లీ: పుస్తకాలు
పంతులు: వీణ నామా

ఆరునెలలు కాదు. మూడునెలలు తరువాత. అదే హాలు. కానీ అన్నీ మారినవి - ఇల్లాలు ఏర్పడ్డ యింటికళ ఏర్పడుతుంది. సోఫాలకు చక్కని అల్లిక పని చేసిన ముసుగులు - కిటికీలకు, గుమ్మాలకు కొత్తరకం తెరలు - నాజూకైన పూలతొట్లు తీగలు - హాలంతా కొత్త శోభతో వెలుగుతూంది. తుపాకీ స్థలం మారింది. కాని హాల్లోనే వుంది. నాయకుల ఫొటోలకు బదులు ప్రకృతి దృశ్యాలు. హాలుమధ్య వున్న బల్లమీద తెల్లని కుక్కపిల్ల బొమ్మ. ఒక వేపు మంచం. మంచం తలవైపు స్టాండు దీపం - చిన్న ఫేను. బుక్ షెల్ఫు. పుస్తకాలు. మంచందగ్గరే రెండుమూడు మడత కుర్చీలు. మంచాని కానుకొని కుంటివా డుపయోగించే వూతకర్రలు వున్నాయి. తెర ఎత్తేసరికి హాలులో వుంది ఆయా. బల్లలపై సర్దుతూ తుడుస్తూ వుంది. పంతులు వచ్చాడు.

పంతులు: ఆయా!

ఆయా: (చిరునవ్వు నవ్వి) మీక్కూడా ఆయానా నేను!

పంతులు: కాదనుకో అలాగని పేరుపెట్టి పిలవనా?

ఆయా: ఎందుకులెండి. మీరేదో గౌరవంగా బ్రతుకుతున్నారు.

పంతులు: చెప్పుతున్నావు - సరే యింతకూ చెప్పొచ్చేదేమిటంటే రేపు శనివారం మా పెద్దమ్మాయి పెళ్ళి.

ఆయా: మీ పెద్దమ్మాయికి ఎప్పుడో పెళ్ళయిపోయింది. హాయిగా సంసారం చేస్తోంది కూడా.

పంతులు: బలే - బలేదానివే.

ఆయా: మూణ్ణెళ్ళయింది పెళ్ళయి.

పంతులు: ఏమిటీ! నువ్వనేది?

ఆయా: పాపం! ఎలా అర్థమవుతుంది? ఈ వున్న పిల్లలందరికంటె పెద్దపిల్ల - మొట్ట మొదటి పిల్లా ఒకటి వుండాలన్నది మీకు గుర్తుందేనా?

పంతులు: అదా! అవును ఆ అమ్మాయి ఎక్కడుంది!

ఆయా: మనకు చాలా దగ్గరే వుంది.

పంతులు: ఎక్కడా? యీ వూళ్ళోనేనా?

ఆయా: ఎక్కడైతే యేం? నా బిడ్డని మీరుగాని. నేనుగాని చెప్పుకోలేం.

పంతులు: నీకేం కన్నతల్లివి.

ఆయా: మీరు కన్నతండ్రి కాదా?

పంతులు: నా పరిస్థితులు వేరు.

ఆయా: అందరూ పరిస్థితులకు దాసులమే.

పంతులు: ఇంతకూ ఆ అమ్మాయి ఎక్కడ? ఏమైంది చెప్పరాదు - ఒక్కసారి కళ్లారా ___

ఆయా: చూస్తారా? ఆ అవసరం అవకాశం ఏర్పడ్డప్పుడు చెప్తాలెండి.

పంతులు: సరే! నీ యిష్టం - తిరుపతెక్కడ?

ఆయా: ఆయ నిక్కడెందుకుంటారు?

పంతులు: నాకు తెలుసులే - మూణ్ణెల్లుగా వూరి వెలుపల శివయ్య తోటలోనే వుంటున్నాడు. కాని యీ రోజు యిక్కడకు వస్తానన్నాడే.

ఆయా: ఏమో - రాలేదు.

పంతులు: సరేగాని....తిరుపతి....ఈ మూణ్ణెల్లు అక్కడే వుండడానికి కారణం ఏమిటంటావు?

ఆయా: ఏముంది. అక్కడే వుండి వ్యవసాయం - వ్యాపారం చూసుకుంటున్నారు.

పంతులు: కాదులే! ఏదో వుంటుంది.

ఆయా: హుం! పెద్దవాళ్ళయ్యారే కాని మీ కింకా పెద్ద బుద్ధులు రాలేదు.

పంతులు: అంతేలే! - మన కెందుకు - వస్తా చాలా పనులున్నాయి.

ఆయా: (అలాగే నిలబడి చూచి కన్నీళ్ళు తుడుచుకుంది. ఇంతలో ఎల్లీ శివయ్యను తోపుడుబండిలో కూచోబెట్టి హాలులోకి తీసుకువచ్చింది. ఆమెలో యీ మూడునెలల్లో పెద్ద మార్పు ఏర్పడ్డది. ఎన్నో ఏళ్ళుగా సంసారభారం మోస్తూ యీదుకొస్తున్న యిల్లాలులా వుంది. నడక చూపు మాట అంతా మారింది. ఒక విధమైన గాంభీర్యం కనపడుతూంది. చాలా నిరాడంబరంగా సాదా చీర జాకెట్టు తొడిగివుంది. తలంటుకొని యింకా నూనెపెట్టి దువ్వని జుట్టు

ఉంగురులు ఏ మాత్రం గాలికైనా నుదుటిమీద తమాషాగా ఆడుకొంటున్నాయి. నుదుట చిన్న బొట్టు ఎర్రది. కాళ్ళకు ఆకు చెప్పులు. నగలాట్టే లేవు. ఒయ్యాలో పెద్ద మార్పేం లేదు. మనిషి చాలా హుషారుగా వున్నాడు. గెడ్డం కొద్దిగా రెండు మూడు రోజుల మోతాదు పెరిగి వుంది. మూడు నెలలు మంచాన పడిన మనిషిలా కనిపించటంలేదు.)

లిల్లీ: (మంచందగ్గర కొచ్చి) పడుకుంటారా?

శివుడు: ఆఁ ఏం పడక లిల్లీ! మూడు నెలలుగా ఒకటే పడక.

లిల్లీ: పోనీ పేపరు చదివి వినిపించనా?

శివుడు: ఆఁ అందులో మాత్రం ఏముంటున్నాయి చదవటానికి? ఎక్కడ చూచినా చావులూ, హత్యలు, దొంగతనాలు. చిన్నచిన్న దేశాల్లో అంతఃకలహాలు, పెద్ద దేశాల్లో యుద్ధాలు, హైడ్రోజన్ బాంబు పరీక్షలు, అంతరిక్షయాత్రలు, శాంతి ఉపన్యాసాలు ఏముంది నా తలకాయ.

లిల్లీ: ఆంధ్రజ్యోతి అప్పు డప్పుడు మంచి వార్తలే వేస్తూ వుంటుందండి. ఇది వినండి. ఎక్కడో దేవాలయంలో 25 అడుగుల పొడవు, 3 అంగుళాల వెడల్పు గల నాగుపాము కనిపించిందట! దాన్ని చూచి అందరూ భయపడుతూంటే ఆ గుడి ధర్మకర్త వచ్చి ఆ పాము వీపు తట్టి సుబ్బడూ! శాంతంగా పో నాయనా! అన్నాట్ట. వెంటనే ఆ పాము ప్రశాంతంగా వెళ్ళిపోయిందట.

శివుడు: బలే బలే!! బావుంది. ఈ కలికాలంలో కూడానా?

లిల్లీ: ఇంకో వార్త వినండి. భూపాల్ అడవుల్లో ఒక పులి వుందిట. దాన్ని ఎవరన్నా కాల్చబోతే అది రెండు కాళ్ళు పైకెత్తి దండంపెట్టి "నన్ను కాల్చకు నాయనా!" అన్నట్టు ప్రార్థిస్తుందట. ఈ వింత చూడ్డానికి జనం తండోపతండాలుగా పోతున్నారుట.

శివుడు: బలే! ఆ పులి పూర్వజన్మలో ఏ మహాత్ముడో అయివుంటుంది. ఇక చాలు గాని లిల్లీ! ఆ పత్రిక అక్కడ పారేసి ఒక్క పాట పాడు.

లిల్లీ: మాటలు మాత్రం ఏమున్నాయి? అన్నీ పాడి పాడి పాతపడ్డవేగా ——.

శివుడు: అదీ నిజమే. ఈ మూణ్ణెల్లలో ఒక సినిమాకన్న వెళ్ళలేదు కదూ?——నీకోసం కొత్త రికార్డులైనా కొనుక్కోలేదు. నాకు చాకిరీ చేయడంతోనే సరిపోతోంది కాలం. లిల్లీ! నీతో చాకిరీ చేయించుకోకూడదనుకున్నాను. నిన్ను పూలల్లో

పెట్టి పూజించాలనుకున్నాను. కాని నా కర్మ ఇలా కూలపడ్డాను. (గద్గదం-కన్నీళ్ళు) లిల్లీ! నన్ను క్షమిస్తావా?

లిల్లీ: అబ్బ! ఏమిటా మాటలు ఇలా అయితే.

శివుడు: లేదు లిల్లీ! లిల్లీ పాడు. ఏదో ఒక పాట పాడు ఎంత పాత పాటయినా నీ గొంతులో కొత్తగానే వుంటుంది. నువ్వు నాకెప్పుడూ కొత్తగానే వుంటావు. పాడు లిల్లీ!

లిల్లీ: (చిన్న నవ్వు నవ్వి పాట మొదలెట్టింది. చాలా కమ్మగా వుంది పాట. శివయ్య ఆనందిస్తున్నాడు. పరవశుడై పోతున్నాడు. లిల్లీ కూడా చాలా హుషారుగా ఆతని ఆనందమే తన ఆనందంగా పాడుతూంది.)

మనసుకు వయసున్నదా
మంచికి మారున్నదా
మనసు మంచి తెలిసినయపుడు
మనిషికి కొరతున్నదా?

మధువుకు సొగసున్నదా
మమతకు కొలతున్నదా
మధురమైన మమతలు వున్న
మనసుకు కరవున్నదా?

ముదురు మావి వసంతవేళ
మురిసిపోయి చిగురించదా
చిగురులోని వగరునుమేసి
పసి కోయిల పరవశించదా?

తనువుకు స్థిర మున్నదా
తనివికి తుదివున్నదా
తనువు మరచి తనివినిపొందే
తపసికి వ్యథ వున్నదా?

పాట సగంలోనే తిరుపతి, పంతులు వచ్చారు. పాట విని వాకిలివద్ద ఆగి వాళ్లూ ఆనందిస్తున్నారు. లిల్లీ శివయ్య వాళ్ళను చూడ్లేదు. పాటయిపోయింది. శివయ్య

తన్మయత్వంలో లిల్లీని 'లిల్లీ' అంటూ లాక్కున్నాడు. ఆమెకూడా పసిబిడ్డలా అతని చేతుల్లోకి వెళ్ళింది. లిల్లీ ముఖం రెండు చేతులతో దగ్గరకు తీసు కున్నాడు. ఆమె అతని క్రాపు మునివేళ్ళతో దువ్వుతూంది. ఇద్దరూ ఒకరి కళ్ళలోకి ఒకరు చూసుకుంటున్నారు. తిరుపతి, పంతులు యిక అక్కడ వుండ కూడదని ఎంతో నిశ్శబ్దంగా వెనక్కు తిరిగారు. కాని పంతులు చెప్పులు కిర్రు మన్నాయి. వాళ్ళ ఆనందం భగ్నమయింది. ఇద్దరూ తిరిగి చూశారు.

శివుడు: అరే మీరా!? - ఎప్పుడొచ్చారు పిల్లుల్లాగా?

పంతులు: పాలకుండను పలకపోయకూడ దనుకున్నాం కాని వెధవ కిర్రుచెప్పులు పాడుచేశాయి శివుడూ!

శివుడు: సరేలే రండి! రండి!!

పంతులు: ఎందుకు మేం వెళ్తాంలే.

శివుడు: ఫర్వాలేదు రండయ్యా!

పంతులు: ఊఁ సరే శివయ్యా! మొత్తానికి నువ్వు బలే అదృష్టవంతుడివోయ్!

శివుడు: ఎందుచేతనో?

పంతులు: చెప్పమన్నావా? లిల్లీవంటి యిల్లాలు దొరకడంచేత.

శివుడు: (లిల్లీవంక చూశాడు)

లిల్లీ: (చిన్ననవ్వు నవ్వి) డాక్టరుగారు రాలేదేమండి?

శివుడు: ఈ రోజెందుకు వస్తారు?

పంతులు: బుధవారంకదా వస్తానన్నది.

లిల్లీ: (తిరుపతివంక చూడకుండానే) ఈ రోజు ఏం వారం?

పంతులు: అవునులే! మీకు వారాలు గుర్తుంటాయా? యీ రోజు మంగళవారం.

తిరుపతి: బలేవారండీ! యీ రోజు మంగళవారమా?

పంతులు: నిన్న సోమవారం అయితే యీ రోజు మంగళవారం కాదూ?

తిరుపతి: నిన్న సోమవారం అయితే కదా!

పంతులు: అదేమిటోయ్! మనం బజారెళ్ళామా కొట్లన్నీ కట్టేసున్నవా - ఏ రోజు చెప్పు.

తిరుపతి: ఆదివారం.

పంతులు: అది మొన్న - నిన్న సోమవారం (అందరూ నవ్వారు) నవ్వుతారేం! నవ్వితే సరిపోయిందా చెప్పండి కాదని ___

లిల్లీ: పంతులుగారూ! కొట్లు కట్టేసేది ఆదివారం అన్నది నిజమే. ఆదివారం తరువాత సోమవారం - సోమవారం తరువాత - మంగళవారం - అంతా నిజమే-కాని ఆ ఆదివారం ఎప్పుడైందీ తేలందే.

శివుడు: శనివారం తరువాతే! (అందరూ నవ్వారు)

పంతులు: నవ్వేరు సరే. ఇంతకూ యీ రోజు ఏం వారం అంటారు?

తిరుపతి: వారానికేం గాని తేదీ చెప్పండి పోనీ...

పంతులు: ఏమిటోయ్! గవర్నమెంటుద్యోగిని నాకా కీరా పరీక్ష! శనివారం పద్దెని మిది. ఆదివారం పందొమ్మిది. సోమవారం యిరవై - మంగళవారం ఇరవై ఒకటి. ఈ రోజు మంగళవారం ఇరవై ఒకటి.

తిరుపతి: ఏడ్చినట్లుంది.

పంతులు: ఇదిగో అబ్బాయ్! తొందరపడకు. ఈ రోజు ఇరవై ఒకటయితే పద్దెనిమిది ఏ వారం అయిందో చూడు.

లిల్లీ: ఈ రోజు ఏ వారమో తేలందే?

పంతులు: పోనీ పద్దెనిమిది శనివారం అయితే ఈ రోజు ఏం వారమో చూడు!

తిరుపతి: పంతులుగారూ! అన్నీ అయితే అయితే అంటున్నారు. అయితే ఎలా.

పంతులు: అలా అనుకుంటే అన్నీ అంతే. శనివారము శనివారమే ఎందుక్కావాలి. శుక్రవారం అంటే కొడుతుందా? లిడుతుందా? - అందరం ఏదో ఒకటి అను కొని దానిమీద ఆధారపడి జరుపుకుంటాం గాని లేకుంటే వాయిదాలే ఎందు క్కావాలి? చే యెందు కనకూడదు? అంతా వేషాలు వేస్తారు. అందులో నాతో.

బూట్ల చప్పుడు వినిపించింది. తిరిగి చూశారు. డాక్టరు వచ్చాడు.

శివయ్య: రండి! డాక్టరు! రండి!

పంతులు: నమస్కారం సార్!

డాక్టరు: గుడ్‌మార్నింగ్!

లిల్లీ: (ఎదురుగా వెళ్ళి బాగ్ తీసుకొచ్చి బల్లమీద పెట్టింది)

డాక్టరు: ఊ. ఎలా వున్నావ్?

తిరుపతి: కనక యీరోజు బుధవారం ___

పంతులు: ఏం గనక!

తిరుపతి: డాక్టరుగారు వచ్చారు గనక?

పంతులు: డాక్టరుగారు వస్తే మంగళవారం బుధవారం అవుతుందా? ఎవరేమన్నా యీ రోజు మంగళవారమే. మంగళవారమని నేను ఉపవరం కూడా మానేస్తే.

తిరుపతి: మీరు ఉపవరం మానేస్తే మంగళవార మవుతుందా?

డాక్టరు: ఏమిటయ్యా! మీ తగాదా?

పంతులు: డాక్టరుగారూ! ఒక్కటేమాట చెప్పండి. యీ రోజు ఏం వారం?

డాక్టరు: గురువారం.

పంతులు: గురువారం! మీరు ఏ వారం వస్తానన్నది?

డాక్టరు: గురువారమే. (లిల్లీ ఫక్కున నవ్వింది. శివయ్యా నవ్వాడు)

పంతులు: ఏదైతేఏంలే - మనం మనుష్యులం ఏర్పరచుకున్నదేగాని యీ వారాలూ తేదీలు ఏదనుకుంటే అదే -

డాక్టరు: (ఇంతవరకూ శివయ్యను పరీక్ష చేస్తున్నాడు) ఊఁ రైట్! ఈ రోజు శివయ్యని కాస్త నడిపెంచబోతున్నాను.

పంతులు: ఈరోజా!? డాక్టరుగారూ! కాస్త తిధి వారం వర్జం చూసి మరీ.

లిల్లీ: అంతా మనం మనుష్యులం ఏర్పరుచుకొన్నదే వదండీ! ఏదనుకుంటే అదే. (శివయ్య - డాక్టరు - తిరుపతి - నవ్వారు)

డాక్టరు: ఊఁ. ఏం ఫరవాలేదు. శివయ్య అదృష్టవంతుడు. కాకుంటే ఆరు నెలలవుతుందనుకొన్నది. మూడు నెలల్లో యింత బాగైందంటే (లిల్లీ వంక చూశాడు.)

లిల్లీ: డాక్టరుగారి చేతిచలువ.

డాక్టరు: కాదు. నీ నర్సింగు మహిమ.

శివుడు: అవును డాక్టర్! అవును. అంతా లిల్లీ మహిమే.

డాక్టరు: అలాగని నాకు ఫీజెక్కొడతావేమో? (అందరూ నవ్వారు) ఊఁ ఊఁ కాని - ఏదీ శివయ్యా - మెల్లగా లేచి నిలబడు చూద్దాం. (లిల్లీ వూత కఱ్ఱ లిచ్చింది. మెల్లగా లేస్తున్నాడు. లిల్లీ పట్టుకోబోయింది.) నువ్వూరుకో అమ్మా! (శివయ్య లేచి నుంచున్నాడు) ఊఁ ఏదీ కాస్త కాళ్ళు నేలమీద మోపి, రెండడుగులు వెయ్యి.

శివుడు: రెండడుగులే!

డాక్టరు: ట్రైచెయ్యి - లేకుంటే అలాగే కుంటివాడవయిపోతావు. మెల్లిగా అలవాటు చెయ్యాలి. కమాన్!

శివుడు: (రెండడుగులు వేశాడు)

డాక్టరు: ఎలావుంది?

శివుడు: ఓ యస్! ఏం ఫర్వాలేదు డాక్టర్! ఇప్పుడు పరుగెత్తమన్నా సరే.

డాక్టర్: కొంపతీసి అంతపని చేస్తావేమో మళ్లా మొదటికొస్తుంది.

శివుడు: (లిల్లీ వంక చూశాడు. లిల్లీకి పట్టరాని ఆనందం)

డాక్టరు: ఇంతకూ లిల్లీ నా మాట సాధించింది. ఊఁ ఆడవాళ్ళ చెయ్యి ఎంతటి వింతలన్నా చేస్తుంది.

లిల్లీ: అందులో నా చెయ్యి ముఖ్యంగా - నా చేతిలో ఏవో కొండలున్నాయట.

శివుడు: కొండలా!?

లిల్లీ: అవే మౌంట్సు అంటారు, సాముద్రికశాస్త్రంలో అవి.

తిరుపతి: అవి అందరి చేతుల్లోనూ వుంటాయి.

లిల్లీ: అది అందరికీ తెలుసు - మీరేం చెప్పక్కర్లేదు. నా చేతిలో మంచి నర్సయే మౌంట్సు ఏవో వున్నాయట.

డాక్టరు: ఆఁ. ఏదో పారమౌంటు - మనకెందుకులే - ఇప్పుడు మరోపని చెయ్యాలి. ఎండ వుండగానే శివయ్యను కాస్సేపు అలా తోటలోకి తీసుకెళ్ళాలి. ఓ అరగంట తిప్పాలి. ఎండ కన్నెరెక్కుండా మరీ పాలిపోయాడు - ఏదీ తలగడలు మరిరెండు.

లిల్లీ: (తోపుడుబండిలో మరి రెండు తలగడలు వేసింది.)

డాక్టరు: ఊఁ, చాలు - ఇక తీసుకెళ్ళమ్మా! ఆడవాళ్ళచెయ్యి తగిలితే బండి సాఫీగా తాపీగా నడుస్తుంది. గో ఆన్ పంతులుగారూ! మీరూ వెళ్ళండి, శివయ్యకు శాస్త్ర కబుర్లు చెప్పండి.

పంతులు: వాళ్ళిద్దరిమధ్య నేనెందుకు?

డాక్టరు: అవసరం గనకనే చెబుతున్నాను.

తిరుపతి: వెళ్దాం రండి.

డాక్టరు: తిరుపతీ! నువ్వుండు. పంతుల్ని వెళ్ళనీ.

పంతులు: సరే నువ్వుండవోయ్! డాక్టరుకు నీతో ఏదో పనుంది.

డాక్టరు: పంతులుగారూ! ఇంత వయసైనా మీకింకా ఆ వక్రబుద్ధి పోలేదే! వెళ్ళండి. (లిల్లీ బండితోసుకు వెళ్ళింది. పంతులు వెళ్ళాడు. డాక్టరు వాకిలిదాకా వెళ్ళి అలా నిలబడ్డాడు.) తిరుపతీ!

తిరుపతి: డాక్టర్!

డాక్టరు: నువ్వు వూరికి వెళ్తున్నావని విన్నాను.

తిరుపతి: అవును డాక్టర్! శివయ్యకు నయమైపోయింది. ఇక తప్పకవెళ్తాను.

డాక్టరు: లిల్లీని కూడా తీసుకువెళ్ళు.

తిరుపతి: డాక్టరు! ఏమన్నారు?

డాక్టరు: (స్థిరున తిరిగి) లిల్లీనికూడా తీసుకు వెళ్ళమన్నాను.

తిరుపతి: డాక్టర్!

డాక్టరు: తిరుపతి! ఆడదాన్ని మోసం చెయ్యడం సులభం. కాని వైద్యశాస్త్రాన్ని-డాక్టరును మోసం చెయ్యలేవు.

తిరుపతి: డాక్టర్! మీ అభిప్రాయం?

డాక్టరు: లిల్లీ మొన్న నా హాస్పిటల్‌కు వచ్చింది. సుస్తీగావుందని. పరీక్షచేశాను. ఫలితం ఆమెతో చెప్పలేకపోయాను. నీతో చెప్తున్నా ఎందుకంటావా? ఆ బిడ్డ నీ బిడ్డ.

తిరుపతి: ఆ! (భయంకర నిశ్శబ్దం)

డాక్టరు: నేనూహించాను. నిజంకూడా అంతే -

తిరుపతి: డాక్టర్!

డాక్టరు: అప్పటినుంచీ ఆలోచిస్తున్నాను. ఏమిటో తెలుసా? మీరు చేసింది పాపమా? పుణ్యమా? అని కాదు. మిమ్మల్ని ఎలా శిక్షించాలనీ కాదు. శివయ్య ఏమవుతాడని, లిల్లీ ఏం చేసుకుంటుందోనని - యీ ప్రమాదం తప్పించటం ఎలాగా? అని. నా అంతరాత్మ అంగీకరించదు. అందుకే నీతో చెప్తున్నాను. నీ యిష్టం-ఇక అంతా నీ చేతుల్లోవుంది. అటు లిల్లీ యిటు శివయ్య ఇద్దర్నీ కాపాడాలి. ఏంచేస్తావో చెయ్యి. కాని చేసేదేదో త్వరగా చెయ్యాలి.

తిరుపతి: డాక్టర్! డాక్టర్!! (ఏడుస్తున్నాడు.)

డాక్టరు: నువ్వు కాదు ఏడవవలసింది. ఇది ఏనాటికైనా బైటపడవలసిందే. ప్రకృతిని నువ్వాపలేవు. లిల్లీకి యీరోజు మందు వ్రాసిస్తానన్నాను. అడుగుతుంది. అడిగితే ఏం చెప్పమంటావు. ముందు లిల్లీకి చెప్పాలా? శివయ్యకు చెప్పాలా? ఏం చెయ్యమంటావు. నువ్వేం చేస్తావో చెప్పు?

తిరుపతి: డాక్టర్! డాక్టర్! నా కూపిరాట్టంలేదు. నాకాస్త వ్యవధిమివ్వండి. ఆలోచించుకోనివ్వండి.

డాక్టరు: అడ్డుదార్లేవీ ఆలోచించకూ!

తిరుపతి: లేదు డాక్టర్! లేదు. (ఇంతలో లిల్లీ వచ్చింది.)

లిల్లీ: (తిన్నగా శివయ్య గదిలోకి వెళ్ళింది.)

డాక్టరు: ప్రస్తుతానికి నేను తప్పించుకుంటాను. కాని త్వరగా ఈ రోజులోగా తేల్చు. (వీపు తట్టి) ఇలాంటి సమయాల్లోనే గుండె నిబ్బరం కావాలి. (వెళ్ళాడు)

లిల్లీ: (గదిలో దోక్కొంటూంది. అది తిరుపతి గుండెల్లో గునపాల పోటుల్లా గుచ్చుకుంటోంది. కాస్సేపటికి లిల్లీ వచ్చింది. తిన్నగా బైటకువెళ్తూంది.)

తిరుపతి: (గద్గదకంఠంతోనే పొడిదగ్గు దగ్గాడు)

లిల్లీ: (ఆగింది)

తిరుపతి: ఒక్కమాట చాలా ముఖ్యమయింది.

లిల్లీ: ఎవరికి ముఖ్యం?

తిరుపతి: నాకూ మీకూ ఇవయ్యకు -

లిల్లీ: మాకు ముఖ్యమయింది మాకు తెలుసు.

తిరుపతి: తెలియదు. ఇప్పుడే డాక్టరు చెప్పారు.

లిల్లీ: డాక్టరా? వారికేమైనా.........

తిరుపతి: అదేంకాదు, మొన్నమీరు డాక్టరు దగ్గరకు వెళ్ళారట.

లిల్లీ: వెళ్తే?

తిరుపతి: వంట్లో బాగోలేదన్నారట.

లిల్లీ: ఆఁ. ఏదో కాస్త నలతగా వుంటే ___

తిరుపతి: అదే లిల్లీ! అదే! నువ్వు...నువ్వు....తల్లివి కాబోతున్నావు.

లిల్లీ: (ఆఁ వూ. అనలేదు. నోట మాటలేదు. శాపగ్రస్తలాగా రాయయిపోయింది.)

తిరుపతి: (ఆమె అవస్థ గ్రహించాడు. ఏంచెయ్యాలో తోచలేదు. 'లిల్లీ' 'లిల్లీ' అని ఒక్క అడుగు ముందుకు వెళ్ళాడు గాని ఆమెను సమీపించలేక పోయాడు. మనిషి అటూ యిటూ వూగిపోయాడు. కన్నీరు ధారగా ప్రవహిస్తూంది. లిల్లీ చేతుల్లోవున్న పుస్తకాలు జారిపోయాయి. 'అమ్మా!' అంటూ అలాగే నరికిన అరటిచెట్టులా కూలిపోయింది.

తిరుపతి: లిల్లీ! జరిగిందేదో జరిగింది. నాకు తెలుసు నీ బాధ - నీ పరిస్థితి నాకు తెలుసు. కానీ - కానీ - ఇప్పు డేంచెయ్యాలి, ఆలోచించు లిల్లీ - ఏం చెయ్యాలి. ఆలోచించు లిల్లీ - ఏంచెయ్యాలి!

లిల్లీ: ఏంచెయ్యాలి? (తనలోతానే గొణుక్కున్నది)

తిరుపతి: ఏదోఒకటి చేయాలి.

లిల్లీ: మగాళ్ళు పాపాలుచేస్తే ఎప్పుడో అనుభవిస్తారేమో - మా పాపాలు వెంటనే బయటపడతాయి. మమ్మల్ని వెంటాడతాయి.

తిరుపతి: లిల్లీ!

లిల్లీ: నన్నిలా పిలవకు - ఆ పిలుపే యీ పాపానికి కారణం - ఆ పిలుపే నన్నీ ఆవేశానికి బలిచేసింది. ఎంతో ప్రయత్నించాను నిన్ను తప్పించుకోవాలని. నిన్ను తిట్టాను. అకారణంగా కోప్పడ్డాను. అసహ్యించుకొన్నాను. నిన్ను వెళ్ళగొట్టాలనుకున్నాను. కాని వీలుకాలేదు. ఎంతదూరం కావాలను కున్నానో అంత దగ్గర పడుతున్నానని తెలుసుకోలేకపోయాను. అయిపో యింది. జీవితంలో చేయకూడదనుకున్న పని - స్వేచ్ఛగా వున్నపుడే చేయని పని - పెళ్ళయి - ఒకరి పెళ్ళామై చేశాను.

తిరుపతి: జరిగిపోయిందనుకొని ఏం లాభం?

లిల్లీ: జరగాల్సింది అనుకోలేకున్నాను. ఆలోచించలేకున్నాను గనుక జరిగింది. కళ్ళ ఎదుట భయంకరంగా కనిపిస్తూంది కనక! జరిగిందనుకుని ఏడిస్తే బరువు తగ్గుతుందేమోనని....

తిరుపతి: బరువు తగ్గించుకోవడం కాదు. ప్రమాదం తప్పించాలి ఎలా అయినా శివయ్యను కాపాడాలి.

లిల్లీ: ఇది తెలిస్తే ఆయనేమవుతారు?

తిరుపతి: నిన్నేం చేస్తాడో?

లిల్లీ: నన్నేం చేసినా ఫరవాలేదు.

తిరుపతి: నీలో యింకొక ప్రాణం పెరుగుతూంది.

లిల్లీ: ప్రాణం కాదు పాపం.

తిరుపతి: పాపం మనది. ఆ పాపది కాదు.

లిల్లీ: ఎవరిదైతేనేం? పాపం ఎవరిదైతేనేం - పాపం పాపమే! పాపం పాపమే! (బిగ్గరగా అరిచింది)

తిరుపతి: శ్! అరవకు.

లిల్లీ: అరచినా తరుగని పాపం యిది. ఏం చేయాలి! ఏం చేయాలి?? (ఉన్నట్లుండి మనిషి నిశ్చలమైంది) నేను వెళ్తున్నాను.

తిరుపతి: ఎక్కడికి?

లిల్లీ: వెళ్ళలేను! ఎలా వెళ్తాను? నేను వెళ్తే ఆయన కెవరున్నారు? ఆయన్నెవరు చూసుకుంటారు? ఒక్క రాత్రి చేసిన పాపంకోసం మూడు నెలలుగా ముడి వేసుకున్న బంధం ఎలా తెంచుకోను? ఈనాడు నీ మీద నాకే బంధమూ లేదు.

ఏ పాశమూ లేదు. అన్నీ తెంచుకున్నాను. కాని యీ పాపాన్ని తప్పించుకో లేను, ఏం చెయ్యాలి? నేను వెళ్తే ఆయన ఏమవుతారు?

తిరుపతి: ఉంటే ఏమవుతాడు?

లిల్లీ: అవును! అదీ నిజమే!!

తిరుపతి: బయల్దేరు వెళ్దాం.

లిల్లీ! నీతోనా! అసాధ్యం! అసంభవం!! నీమీద నాకెలాంటి మమతా లేదు.

తిరుపతి: ఉందనీ, వుండాలనీ కాదు. నీ కెవరున్నారు?

లిల్లీ: అవును! నా కెవరూ లేరు. నువ్వే మిగిలావు. వద్దనుకున్నా నువ్వే మిగిలావు. ప్రేమపాశం కాకపోయినా యీ పెనుపాపం మనల్ని బంధించేసింది. అబ్బా! నిన్ను ప్రేమించానే అప్పుడా ప్రేమ మనలను బంధించలేక పోయిందే - ఇప్పుడీ పాపమా మనల్ని దంపతుల్ని చేయాలి .. తప్పుచేసి మనం తల్లి దండ్రులం కావాలా? ఇదా యిన్నాళ్ళ నా పవిత్ర జీవితానికి ఫలితం!

తిరుపతి: వేరే గత్యంతరం లేదు లిల్లీ!

లిల్లీ: అవును. నువ్వే నాకు దిక్కు. వెళ్దాం. కాని లోకం ఏమనుకుంటుంది? కాదు. ఆయనేమనుకుంటారు!? ఈ మూడు నెలలు మనం ఆయన కన్ను కప్పి నాటకమాడామనుకుంటారు. ఘోరం! అన్యాయం!! అబద్ధం!!! ఆ ఒక్క రాత్రి చేసిన తప్పు ఎంత కాలం అలముకుంటుంది! ఎంత కాలం అల్లుకుం టోంది! నిజం చెప్పినా ఎవరు నమ్ముతారు? ఈ మూడు నెలలు - నాకు తెలీదు - ఆయన నన్నెలా చూసుకున్నారో - ఎంతగా ప్రేమించారో - ఎంత పవి త్రంగా ప్రశాంతంగా ఈ మూడు నెలలూ గడిపామో! ఆయన నా మనసును కాదు - నన్ను - నా అంతరాత్మను - తనదిగా చేసుకున్నారు. అంత అమా యక అనురాగాన్ని ధ్వంసం చేసి నే నిక్కడ ఉండగలనా? ఉండలేను! వెళ్ళాలి. ఈ యిల్లు అపవిత్రం చేయలేను. వెళ్ళాలి - (తోటలో శివయ్య)

శివయ్య: లిల్లీ! ఏమిటీ ఆలస్యం? ఏం చేస్తున్నావు? లిల్లీ! లిల్లీ!!

తిరుపతి: శివయ్య వస్తున్నాడు.

లిల్లీ: (పలుకలేదు)

శివయ్య: (గబగబా బండి తోసుకుంటూ వచ్చాడు.) లిల్లీ! తిరుపతితో మాట్లాడు తున్నావా? అదేదో అక్కడే మాట్లాడకూడదు. నేనూ వినేవాడిని. ఏమిటి తిరుపతీ! ఏం చేస్తూంది లిల్లీ!?

(తిరుపతి ఏమీ అనలేక వెళ్ళాడు.)

శివుడు: తిరుపతీ! ఏమిటోయ్! - అలా వెళ్తున్నావు? లిల్లీ! తిరుపతేమిటి అలా వెళ్తున్నాడు? నువ్వేమన్నా అన్నావా?

లిల్లీ: వెళ్ళనీయండి.

శివుడు: అదేమిటి లిల్లీ! వాడంటే నాకు ప్రాణం. బిడ్డలా చూసుకుంటున్నానే వాణ్ణి. వాడిలా మాట్లాడకుండా వెళ్తాడా? నేనేం చేశానని! వాడికేమాత్రమన్నా అభిమానం వుందా నా మీద?

లిల్లీ: అభిమానం కృతజ్ఞత లేనివాళ్ళ నలా వదిలేయాలి.

శివుడు: ఇంతకూ ఏం జరిగింది లిల్లీ!?

లిల్లీ: అన్యాయం జరిగింది.

శివుడు: ఎవరికి?

లిల్లీ: సీతకి.

శివుడు: అబ్బ! ఏమిటో చెప్పు లిల్లీ!?

లిల్లీ: చెప్తాను. కానీ అది విని మీ రాగలేరు.

శివుడు: ఏం? ఏమవుతాను!?

లిల్లీ: పిచ్చెత్తిపోతారు.

శివుడు: ఆఁ!!

లిల్లీ: ఆవేశంలో హత్యలు ఆత్మహత్యలు జరగవచ్చు.

శివుడు: లిల్లీ! నన్ను కంగారు పెడుతున్నావు.

లిల్లీ: లేదు. నిజం పిడుగులాంటిది. బలహీనులు అబద్ధాలతో బ్రతకటం మంచిది. నిజం చెప్పటానికి.... చెప్పిన నిజాన్ని స్వీకరించటానికి గుండె నిబ్బరం కావాలి. అదే మీకు కలగజేస్తున్నాను.

శివుడు: లిల్లీ! ఇంతకూ.... ...

లిల్లీ: నన్ను చెప్పనివ్వండి. నా గుండె బరువు తగ్గిపోతుంది. నన్ను గురించి ఆ తరువాత మీ రనుకునేది ఎటూ అనుకుంటారు. దాంతో నాకు ప్రమేయం లేదు - వెళ్ళిపోయేదాన్ని నిజం చెప్పి వెళ్తాను.

శివుడు: లిల్లీ! నువ్వు వెళ్తున్నావా!?

లిల్లీ: అవును. ఇంకెక్కడో సుఖపడటానికి కాదు. ఇక్కడ బాధపడుతున్నానని కాదు. నా జీవితంలో ఎన్నడూ పొందని పొందబోని సుఖం ఆనందం ఇక్కడ పొందాను.

శివుడు: మరెందుకు లిల్లీ వెళ్ళడం!?

లిల్లీ: అదే చెప్పాలని ప్రయత్నిస్తున్నాను. నేను చెప్పకపోయినా మీ కెలాగూ తెలుస్తుంది. కానీ నిజం కొంతవరకే తెలుస్తుంది. అందుకే నేను చెబుతున్నాను. ఇందులో తప్పంతా నాదేనని ఒప్పుకోలేను. ఇతరుల నెత్తిన వేయనూ లేను. ఎవరి తప్పయితేనేం? జరిగిపోయింది.

శివుడు: అబ్బ లిల్లీ! ఎందుకు నన్నిలా చంపుతావు? చెప్పు అదేమిటో చెప్పు త్వరగా చెప్పు.

లిల్లీ: చెప్తాను వినండి! నేను తల్లిని కాబోతున్నాను.

శివుడు: లిల్లీ!

లిల్లీ: ఆ పుట్టబోయే బిడ్డ మీది కాదు.

శివుడు: లిల్లీ! ఎవరిదా బిడ్డ? ఎవరిది!?

లిల్లీ: నా పాపఫలితం.

శివుడు: కాదు - చెప్పు - ఎవడు వాడు? ఎవరిదా బిడ్డ?

లిల్లీ: తిరుపతిది.

శివుడు: ఆఁ లిల్లీ! (వెర్రికేక వేశాడు. పూలకర్ర పైకెత్తాడు. కొట్టబోయాడు. కాని చేతులాడలేదు. "లిల్లీ!" అంటూ దించేశాడు.)

లిల్లీ: మీరు కాబట్టి కొట్టలేకపోయారు - అది మీ మంచితనం!

శివుడు: లిల్లీ! నిజమా!? నువ్వు చెప్పింది నిజమా? అబద్ధం....అబద్ధం కదూ....?. చెప్పు లిల్లీ. ..అబద్ధం అని చెప్పు లిల్లీ!

లిల్లీ: అమాయకమైన మీ అనురాగానికి జోహార్లు. నిజాన్ని అబద్ధంగా చెప్పడం కాదు. అనుకోగలిగినా నా కీ అవస్థ లేదు. నేను చెప్పింది అక్షరాలా నిజం.

శివయ్య: నిజమా! నిజంగా నిజమా!? నువ్వు తిరుపతిని ప్రేమిస్తున్నావా!?

లిల్లీ: లేదు.

శివుడు: తిరుపతి నిన్ను ప్రేమిస్తున్నాడా?

లిల్లీ: లేదు.

శివుడు: మరెలా జరిగిందీ పాపం!?

లిల్లీ: ఆవేశంలో జరిగింది. ఒక సంఘర్షణలో జరిగింది. పెళ్ళికీ ప్రేమకూ మధ్య పెనుగులాడుతున్న బలహీన దశలో జరిగిపోయింది. ఆ రాత్రి - ఆ ఒక్క రాత్రి - నేను యీ యింటి కొచ్చిన రాత్రి - మన పెళ్ళయిన రాత్రి.

శివుడు: ఆ రాత్రా!?—ఆ మొట్టమొదటి రాత్రా!??

లిల్లీ: అప్పను. అదే నా పాలిట కాళరాత్రయింది. ఆ వెన్నెలరాత్రే నన్ను చీకట్లోకి లాగింది. అంతే - ఆ తరువాత నేనేమీ ఎరుగను. అంతా చంపుకున్నాను. మీదాసి నయ్యాను. మీ పరిచర్యలోనే నా సుఖం నా ఆనందం వెతుక్కున్నాను. పశ్చాత్తాపం పాపాన్ని పరిహరిస్తుందనుకున్నాను. కాని కాని....

శివుడు: అబద్ధం! అంతా అబద్ధం!!. నువ్వు నన్ని మూడు నెలలు మోసం చేశావు. నా కళ్ళు కప్పి యీ కుళ్ళులో బిగించావు.

లిల్లీ: లేదు. లేనేలేదు. ఇంత భయంకరమైన నిజం చెప్పి ఆ స్వల్ప అబద్ధం చెప్పాల్సిన అవసరం లేదు. కాకుంటే నేను చేసిన మహాపాపం మరొకటి వుంది. ఇంత ద్రోహం చేసి ఉన్నాన్నా యీ ఇంటి ఇల్లాలుగా వున్నాను. మీ భార్యగా బ్రతికాను. ఏదో పాశం. ఏదో బంధం నన్ను పట్టి ఆపింది. మీ సాన్నిధ్యంలో మీ సేవలో చేసిన పాపం ఖాళన చేసుకోవచ్చునే ఆశేమో బహుశా! ఏదైతేనేం - ఇదంతా ఎవరూ నమ్మరు. పోనీండి! ఇంతకాలం మీకు సేవ చేసింది మీ భార్య కాదు. బ్రతుకుదెరువు కోసం వచ్చిన ఒక నర్సు అనుకోండి మరచిపోండి. వెళ్తున్నాను.

శివుడు: ఎక్కడికి నువ్వు వెళ్ళేది. వాడితో ఆ తిరుపతితోనా!!

లిల్లీ: వేరే గత్యంతరం లేదు. శెలవు. (వెళ్ళబోయింది.)

శివుడు: ఆగు! వ్యభిచారిణీ! రాక్షసీ!! నిన్ను వెళ్ళనివ్వను. నువ్వు వెళ్ళటానికి వీలు లేదు. నువ్వు వాడి బిడ్డ తల్లివి కావచ్చు - కాని నా భార్యవు - నిన్ను ప్రాణాలతో బయటకు పోనివ్వను - ఈ అవమానాన్ని లోకం అంతా చాట నివ్వను. (మొట్టమొదటే లిల్లీని ఒక్క తోపు తోశాడు. లిల్లీ వెళ్ళి తుపాకీ మీద పడింది. ఆ తరువాత ఆవేశంతో అరుస్తూ చూతకర్రల మీద లేచి తడ బడుతూ ఆమె వైపు వస్తున్నాడు.)

లిల్లీ: అయ్యయ్యో! జాగ్రత్త! మీరు జాగ్రత్త. పడిపోతారు.

శివుడు: నిలు. దూరంగా నిలు. నన్ను ముట్టుకోకు. పాపీ! ద్రోహి!! కులటా!!! నిన్ను....

నిన్ను... (తుపాకీ తీశాడు - విరిచాడు. తూటాలు దట్టిస్తూ) వదలకు. కదిలావా తల పగలగొట్టేస్తాను.

లిల్లీ: వద్దండీ! వద్దు. అంత అఘాయిత్యం చెయ్యొద్దు - నా కోసం కాదు. నాలో వున్న పాప కోసమూ కాదు - మీ కోసం - ఈ పతిత కోసం మీరు హంతకులు కావద్దు మీరు చల్లగా ఉండాలి.

శివుడు: నిలు రాక్షసీ! నిలు (తుపాకీ ఎక్కుపెట్టాడు)

లిల్లీ: (ఆగింది. నిశ్చలంగా నిలబడింది) చంపండి! ఒకప్పుడు యిదే తుపాకీతో నన్ను నేను చంపుకోవాలనుకున్నాను కాని నాకు శక్తి చాలలేదు. చంపండి.

శివుడు: (తుపాకీ గురి పెట్టాడు. ట్రిగ్గర్ నొక్కబోతున్నాడు.)

తిరుపతి: శివుడూ! (అమాంతం శివుడి మీదకు దూకాడు. తుపాకీ 'ఢాం' అని పేలింది. కాని గురి తప్పింది. తిరుపతి తుపాకీ లాక్కోవాలని ప్రయత్నించాడు. కాని శివయ్య తప్పించబోయి పడిపోయాడు. తిరుపతి మీదకు వెళ్ళబోగా నాయక్ పట్టుకున్నాడు. 'ద్రోహీ! ముందు నిన్ను....నిన్ను' అంటూ తుపాకీ తిరుపతికి ఎక్కుపెట్టాడు కాని ఆ ప్రయత్నంలో పడిపోయాడు. 'ఏమండీ! - వూర్కోండి!' అంటూ పట్టుకోబోయింది లిల్లీ. పక్కకు తోసేశాడు - 'తిరుపతీ! తిన్న యింటికే కన్నం వేసే కృతఘ్నుడా!' అని పడిపోబోగా లిల్లీ పట్టింది. ఆమెను విదిలిస్తూ)

శివుడు: ఆగు ఘాతకీ ఆగు! దగ్గరకు రాకు. నన్ను తాకకు. నిన్ను చంపి నీ శవాన్ని తాకుతాను. ఉంటే (అంటూ ఆయా సాయంతో లేచాడు. తుపాకీ మళ్ళీ ఎత్తాడు.)



ఆయా: ఆగండి! (అంటూ ముందుకు వచ్చింది. లిల్లీ కడ్డంగా నిలబడింది.)

శివుడు: ఆయా లే, అడ్డులే.

(పంతులు వచ్చాడు. దృశ్యాన్ని చూచి నిలబడిపోయాడు)

ఆయా లే! - అడ్డులే!!

ఆయా: వీల్లేదు!

శివుడు: ఆయా! నువ్వు నా వుప్పు తిన్నావు.

ఆయా: అంతమాత్రాన తప్పు ఒప్పు తెలుసుకోలేనంత మూర్ఖురాలను కానక్కర్లేదు.

శివుడు: ఆయా! లిల్లీ....కాదు ఆ రాక్షసి చేసింది తప్పు. కాదు, పాపం; ద్రోహం.

ఆయా: ఎవరికి ద్రోహం?

శివుడు: కట్టుకున్న భర్తకు నాకు ద్రోహం చేసింది.

ఆయా: మీరామె భర్త కాదు.

శివుడు: ఆయా!

లిల్లీ: ఆయా!

ఆయా: అవును. ఆయన నీ భర్త కాదు.

లిల్లీ: ఆయా! (కోపంతో చెంపమీద కొట్టింది.)

శివుడు: (—ఉన్నట్టుండి 'గొల్లుమన్నాడు' పసిబిడ్డలా భోరుమని ఏడుస్తున్నాడు. అందరూ తెల్లబోయిచూశారు. ఒక్క క్షణంలో ఏడుపాగిపోయింది. కన్నీళ్ళు తుడుచుకున్నాడు. ముఖం ఎర్రబడింది. లేచాడు. ఏదో దృఢనిశ్చయంతో తిరుపతి లిల్లీ వంక వెళ్ళాడు —)

ఆగండి! మీరు వెళ్ళడానికి వీల్లేదు. మిమ్మల్ని వెళ్ళనివ్వను. ఇల్లు కదల నివ్వను. ఉండండి ఇక్కడే ఉండండి. (అంటూ గబగబా తన గదిలోకి వెళ్ళాడు. అందరూ ఏమీ అర్థంగాక అయోమయంగా చూశారు. లిల్లీ కేదో అనుమానంవేసింది! అందరిముఖాలూ ఒక్కసారి చూసింది. ఏం తోచిందో గబగబా శివయ్య గదివైపు వెళ్ళబోయింది.)

తిరుపతి: లిల్లీ! (ఆమె నాపబోయాడు)

లిల్లీ: ఉండండి! (లిల్లీ విదలించుకు వెళ్ళింది. ఆమె గదిలోకి వెళ్ళడమే తడవు "ఢాం" అని శబ్దం. మరుక్షణమే కెవ్వుమని కేక. అందరూ పరుగుగా లోపలికి వెళ్ళారు. ఒక్కసారి గొల్లుమన్నారు. తర్వాత అంతా నిశ్శబ్దం. కాసేపటికి తిరుపతి నోట్లో గుడ్డకుక్కుకొని ఏడుస్తూ వచ్చాడు. గోడకు చారగిలబడి ఏడుస్తున్నాడు. ఇంకాసేపటికి ఆయా లిల్లీని తీసుకొచ్చింది. ఆమె ఏడవటంలేదు; శిలాప్రతిమలావుంది. ఆయా ఆమెను సోఫాలో కూచుండ బెట్టింది. పక్కన తాను కూచుంది. తిరుపతి నిలుచున్న పక్కనే తోపుడుబండి వుంది. తిరుపతి దుఃఖావేశంలో లిల్లీని చూసి అటు తిరగటంలో అతనికాలు తగిలిందాబండికి, బండి కదిలింది. లిల్లీ ముందువెళ్ళి నిలబడింది. లిల్లీ దాన్ని చూసింది. గొల్లుమంది. ఆయా ఆమెను గుండెలకు హత్తుకుంది. పంతులు మెల్లగా వచ్చాడు. చేతిలో కాగితాలున్నాయ్! తిరుపతి దగ్గర కొచ్చాడు -)

పంతులు: తిరుపతీ! ఇదుగో! శివుడు వీలునామా! (తిరుపతి దాన్ని తీసుకోలేదు) (దాన్ని అక్కడే పడేశాడు.)

ఆస్తికి వారసుడు కావాలని కోరుకున్నాట్ట - అతని కోరిక తీరిందట - మనవడికి ఆస్తి అంతా రాసిచ్చాడు పాపం! (పంతులు లాంటివాడు కూడా కన్నీరు పెట్టాడు. కాగితాలు గాలికెగిరి పోతున్నా ఎవరూ గమనించలేదు.)

**తెర జాలిగా జారింది. అంతే!**

**అయిపోయింది**

